# శ్రీలేఖ



శ్రీలేఖ సాహితి

వరంగల్లు

1977-2002

# శ్రీలేఖ

(కథా సంకలనము)

సంపాదకత్వం

డా॥ టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి

సాహిత్య, సాంస్కృతిక సంస్థ

(స్థాపితం : 1977 రి.నెం. 2337/89)

ఇ.నెం. 5-11-481, విద్యారణ్యపురి,

హనుమకొండ, వరంగల్లు - 506 009

రజతోత్సవ ప్రచురణ 1977-2002

**SRILEKHA** *(Collection of Stories)*

*Edited by* **Dr. T. SRIRANGA SWAMY,** M.A., Ph.D.

PUBLICATION No. 32

JANUARY, 2002



**Price Rs. 60/-**

*For Copies :*

SRILEKHA SAHITHI
H.No. 5-11-481, Vidyaranyapuri
HANAMKONDA - 506 009 Dist. Warangal.

VISALAANDHRA PUBLISHING HOUSE, Hyderabad
and its BRANCHES

*Printed at*

SRI SHANTHI Offset Printers, Hanamkonda. Ph. 579541

# శ్రీలేఖ సాహితి

## రజత... వేళ...

రజతోత్సవము... ఒక అనుభూతి... ఈ అనుభూతి ఎప్పుడూ అనుభవైకవేద్యమే. రజతోత్సవ కానుక "శ్రీలేఖ"కథా సంకలనము. ఈ ఇరువదియైదు సంవత్సరాల కాలములో ఎన్నో ఒడిదుడుకులు, అడ్డంకులు, సాహితీమిత్రుల, రచయితల, కవుల చేయూతతో వాటన్నింటిని అధిగమించిన వేళ... మీతో ఈ నాలుగు మాటలు...

శ్రీలేఖ సాహితి గత 25 సంవత్సరాలుగా తనదైన మార్గములో సాహితీసేవను చేస్తూనే ఉంది. సదస్సులు, సమావేశాలు, కవిసమ్మేళనాలు, అష్టావదానాలు (1996లో అష్టావదాన సప్తాహము) మొదలగునవి ఏర్పాటుచేయడంతోనే సరిపుచ్చుకోకుండా 1984లో పుస్తక ప్రచురణలను ప్రారంభించి, ఈ పుస్తకముతో 32 ప్రచురణలను అందించిన ఘనతను ఆపాదించుకొనినది. స్వంత పుస్తకము అచ్చు వేసుకోవడము ఎంతో కష్టతరము అయినది. అందువలన పరస్పర సహకార పద్ధతిని అవలంబించడము తప్పనిసరి. ఇది సమిష్టి కృషికి నిదర్శనం. రచయితలు, కవులు మా మీద ఉంచిన నమ్మకానికి ప్రత్యక్ష స్నేహపరిమళాలు ఈ ప్రచురణలు. లాభాపేక్షలేని కార్యమిది, "స్నేహం నీడనిచ్చే చెట్టులాంటిది" అనేది మా సూక్తి. అలిశెట్టి ప్రభాకర్ కవితాచిత్ర ప్రదర్శన, వరంగల్ జిల్లా కవుల కవితలకు డా॥ మహేశ్ చంద్ర అందించిన కవితాచిత్ర ప్రదర్శనలనుకూడా ఏర్పాటు చేసిందనుటకు మేము ఏ మాత్రము వెనుకకు ఆడుగువేయడం లేదు. శ్రీసాలూరు రాజేశ్వర్‌రావు గారి సంస్మరణ సభ కూడా ఆయన స్వరపరిచిన పాటలతో జరిపాము.

సాహిత్య లక్షణం మార్పు, కదలిక, అది సమాజ మార్పుల ప్రభావంతో కదులుతూ ఉంటుంది, కదిలిస్తూ ఉంటుంది కూడా. అది తనుమారుతూ మార్పులకు దోహదపడుతూ ఉంటుంది. మనిషి జడత్వాన్ని పోగొట్టి చైతన్య స్పందన తీసుకురావాలి. ఆ చైతన్యం ముసు ముందుకు నడిపేదిగా ఉండాలి. ఎవరి అభిప్రాయాలు ఏమైనాకావచ్చు. ఒక్కొక్కరిది ఒక్కో

దృష్టి. ఆ చూపులను సమన్వయపరచడము, వారి వారి భావాలకు ప్రతిబింబాలు ఈ సంకలనాలు. ఈనాడున్న పరిస్థితులలో సాహిత్యము ఆయా పరిస్థితులకు అనుగుణంగానే సృజనీభూతము అవుతుంది. ఈ విభిన్నభావాల సంగమమే, సమిష్టిగా వ్యవకరించడమనేది ఉత్కృష్టమైనదనే ఉద్దేశముతో ఎవరినీ నిర్బంధించడం లేదు. ఆయా కథావస్తువుకు పూర్తి బాధ్యత వారిదే. వారి వస్తువుకు పూర్తిగా స్వేచ్ఛను కల్పించడం, అందువలననే శ్రీలేఖ సాహితి కొత్త రచయితలను, కవులను పరిచయం చేయగలిగినది. ఆయా రచయితలు ఇది మా సంకలనము, మా పుస్తకము అని గర్వంగా చెప్పుకునే విధముగా సహకరిస్తున్నది. వారి పరిణితి, నైపుణ్యముకూడా అభినందనీయమైన స్థాయిలో ఉంటున్నాయి. చెప్పే విధానము *(Presentation)* కూడా మారుతున్నది, లోచూపుకూడా నిశితంగా ఉంటున్నది. ఎవ్వరూ కూడా కలం పట్టగానే ప్రసిద్ధులు కాలేరు కదా ! అందుకు మా ప్రయత్నం ఊతగా నిలుస్తుందని ఆశిస్తున్నాము.

ఈ సందర్భంలో ఒక విషయం మీ దృష్టికి తెస్తున్నాము. శ్రీలేఖ సాహితి వెలువరించిన ప్రచురణలలో **"వరంగల్లుజిల్లా రచయితల వాఙ్మయ జీవితసూచిక, ఏకశిల వైతాళికులు, సుప్రసన్నాచార్యుల వాఙ్మయ జీవితసూచిక"**లు ఆకర (Reference) గ్రంధాలుగా గుర్తింపబడినవి. ఉగాదికి అందించే కవితా సంకలనాలలోని కొన్ని కవితలు ఇతర భాషలలోకి అనువాదం చేయబడినవని గర్వంగా చెప్పుకుంటున్నాము. అయితే ఈ విజయం ఏ ఒక్కరిది కాదు అందరిదీను. రచయితలు, కవులు లేకుంటే సంస్థే లేదు, సంస్థ లేకుంటే సమిష్టి కృషి లేదు. సంస్థ గమనంలో 25 సంవత్సరాలుగా సహకరిస్తున్న ప్రతి ఒక్కరికీ, అందరికీ మా వందన చందనాలు, నమ్రతాపూర్వక కృతజ్ఞతలు.

ఈ కథల సంకలనము అన్న ఊహ ప్రారంభించినప్పటి నుండి, తను కూడా బాధ్యతను తీసుకొని ఈ విజయమునకు తోడ్పడిన సోదరి అనిశెట్టి రజితకు, సహకరించిన కథకులకు, మా వెన్నుదట్టి ప్రోత్సహిస్తున్న మిత్రులకు, తమ ఔదార్యమును విస్తరించిన విజ్ఞులకు, మా ప్రచురణలను అందించడంలో తమ చేయూతను అందిస్తున్న శ్రీ పచిక నర్సింహారెడ్డి-శ్రీశాంతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హన్మకొండ వారికి మా అభినందన చందనాలు.

ఎందరో మహానుభావులు... అందరికీ వందనాలు.

సాహితీ సేవలో ...

**డా॥ టి. శ్రీరంగస్వామి**

అధ్యక్షుడు

శ్రీలేఖ సాహితి, వరంగల్లు.

వృష-సంక్రాంతి,

తేది : 14-01-2002.

# కథా క్రమంబెట్టిదనిన...

# శ్రీలేఖ సాహితి ప్రచురణలు...

| | | |
|---|---|---|
| 1. | శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి | రూ. 10.00 |
| 2. | కవితా గానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. 3.00 |
| 3. | ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥ జి. దామోదర్ (తెలుగు అనువాదం) | రూ. 5.00 |
| 4. | వేణుతరంగాలు - శ్రీ యల్. వేణుగోపాల్ రావు | రూ. 5.00 |
| 5. | ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం | |
| 6. | వరంగల్లు జిల్లా రచయితలవాఙ్మయజీవిత సూచిక - శ్రీ టి.శ్రీరంగస్వామి | రూ. 15.00 |
| 7. | కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. 6.00 |
| 8. | జన్మభూమి సిరులు - శ్రీ పల్లె సీను | రూ. 6.00 |
| 9. | జీవనరాగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు | రూ. 10.00 |
| 10. | శుక్ల (కవితా సంకలనం)- శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 5.00 |
| 11. | ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు | రూ. 9.00 |
| 12. | ప్రమోదూత (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 6.00 |
| 13. | నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు | రూ. 3.00 |
| 14. | ఏకశిల వైతాళికులు(వ్యాస సంకలనం)-శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 15. | ప్రజోత్పత్తి (కవితాసంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 6.00 |
| 16. | కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి | రూ. 15.00 |
| 17. | కావ్యం-కవిస్వామ్యం - డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు | రూ. 30.00 |
| 18. | విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 60.00 |
| 19. | నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 10.00 |
| 20. | మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వ వీచిక) - శ్రీపల్లె సీను | రూ. 26.00 |
| 21. | ఈశ్వర (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 10.00 |
| 22. | సాహితీ గవాక్షం (వ్యాససంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 30.00 |
| 23. | సరయేవోనుండి ఏకశిలకు (అనుసృజన కవితలు) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. 30.00 |
| 24. | రాగ పంక్తులు (కవితా సంపుటి) - శ్రీ పల్లె సీను | రూ. 30.00 |
| 25. | ప్రమాది (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 26. | మనోరాగం (కవితా సంపుటి) - శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ | రూ. 30.00 |
| 27. | విక్రమ (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 28. | అవధానవసంతం - డా॥ ఆశావాది ప్రకాశరావు | రూ. 30.00 |
| 29. | వృష (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 30.00 |
| 30. | నిజాం రాజు అధికారం అంతమొందిన రోజు - శ్రీనందనం కృపాకర్ | రూ. 30.00 |
| 31. | పెరుగుతున్న కాలుష్యం-తరుగుతున్న ఆయుష్యం - శ్రీనందనం కృపాకర్ | రూ. 40.00 |
| 32. | శ్రీలేఖ (కథా సంకలనము) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. 60.00 |



**అనిశెట్టి రజిత,**

ఇ.నెం. 3-12-60, కుమార్‌పల్లి,

హన్మకొండ - 506 001

ఫోన్ : 450493

# మట్టి బంధం

పట్నం పొమ్మంటే పల్లె రమ్మంటదో లేదోగాని, పల్లె పొమ్మంటే మాత్రం పట్నం రమ్మనదు. ఎందుకంటే పట్నాల్లో అంతా ఇరుకే, జాగ సరిపోదు, మనిషి మనిషి సంబంధాలైతే మరీ ఇరుకు. పల్లెల్లో ఏమున్నా లేకపోయినా పలకరింపు ఉంటుంది... అయ్యో అన్న ఆర్ద్రత ఉంటుంది. పట్నపు జీవితాలనుండి పల్లెకు పోవడానికి ఎవ్వరూ ఇష్టపడరు. పల్లెల్లో ఏముంటుంది దుబ్బ అంటారు. మరైతే పల్లెలనుండి పట్నాలకు వలసొచ్చే వాళ్ళుమాత్రం సంతోషంగా వస్తారా... ? రారు... పల్లెల్లోని ధనికులైతే తమ పిల్లల్ని పెద్ద చదువులు చదివించేందుకో, సిటీల్లో ఏదైనా వ్యాపారం పెట్టుకునేందుకో డబ్బులు మూటగట్టుకొని వస్తారు. కాబట్టి వారి వారి స్థాయిల్లో ఆ వలస సుఖప్రదమైనదే. మరి ఆర్థికస్థోమత లేనోళ్ళు, గత్యంతరం లేని పరిస్థితుల్లో పొట్టచేతబట్టుకొని పల్లెటూళ్ళు దాటుతారు. కాబట్టి వాళ్ళ వెంటొచ్చేది తెగిన ఊరుబంధం... దుఃఖం... అయోమయమే.

ఇట్లా దీర్ఘంగా సమత ఆలోచనల్లో మునిగితేలుతున్నదంటే అందుక్కారణం తానుండే పట్నానికి వందమైళ్ళ దూరంలో ఒక పల్లెలో ఉన్న తన మేనత్త అనంతమ్మ కుటుంబం యావత్తు త్వరలోనే పల్లెబంధం తెంపుకొని బతుకుదెరువుకు పట్నానికి రాబోతుండడమే... తన మేనత్త ఆ పల్లెకు కాపురానికి పోయి నలభై ఏండ్లు దాటింది. ఇప్పుడు పరిస్థితులు తరుముకొచ్చి ఉన్న భూమినీ, ఇంటినీ తెగనమ్ముకుని తమ పట్నానికి రావాల్సి వస్తున్నందుకు వాళ్ళ మనఃస్థితి ఎట్లున్నదో సమత ఊహిస్తున్నది. ఊహించి వెలితిగా అనిపిస్తుంటే అతిగా ఆలోచిస్తున్నది. పల్లెలంటే సమతకు మహాఇష్టం. చిన్నతనం నుండీ బడికి సెలవులు వచ్చి నపుడు మేనత్త-మామయ్యావాళ్ళ ఊరికిపోయిన సందర్భాల్లో వాళ్ళ పిల్లలు లక్ష్మి, పుష్ప, రాముడు, రాజులతో కలిసి ఇరుగుపొరుగునున్న పిల్లల్ని కూడా కలుపుకొని ఊరంతా కలియతిరుగుతూ ఎడతెగని ఆటలు... తోటలంట జామకాయలు, మామిడికాయలు, బత్తాయిలు... చింతలతోపుల్లో విహరించడాలు... చెరువుకుంటల్లోకి దిగి ఆడుకోవడం... చెట్లెక్కి కోతికొమ్మచ్చులాట, ఊరి నడుమనున్న శివుని గుడికిపోయి

గుడిశిఖరందాకా ఎక్కే ప్రయత్నాలూ... ఊరవతలి మంచినీళ్ళ బావికాడికిపోయి నీళ్ళు చేదుకురావడం... ఇంటికొచ్చి వంటింట్లో అత్త పొయ్యిమీద కాచిన పాల గిన్నెలకంటిన పాలగోకు కోసం పోటీలు పడటం... రోజులు ఆటపాటలతోటి క్షణాల్లా దొర్లిపోయేవి.

సమత అత్తమ్మా, మామయ్యా వాళ్ళ నలుగురు పిల్లలూ, అనంతమ్మ అన్నా-వదినా వాళ్ళ ఇద్దరి పిల్లలూ, ఇంటి పాలేరు, అనంతమ్మ అత్త అందరూ కలిసి పన్నెండు మంది కోసం పూటకి కట్టెలపొయ్యిమీద రోజంతా పొగతో కండ్లుమండుతుంటే ఒండి వడ్డిస్తుండేది అనంతమ్మ. ఆమెప్పుడూ ఏదో దిగులుతో, భారంమోస్తున్నట్లుండేది. ఒక్కోసారి ఇంట్లో ఇంతమందికీ సరిపడా బియ్యం, చిల్లర సరుకులూ ఉండేవి కావేమో సమత తండ్రి చెల్లెల్ని పక్కకు పిలిచి డబ్బులిచ్చి అవసరమయినవి తెప్పించమనేవాడు. సమతా వాళ్ళకప్పుడు సుఖదుఃఖాలు తెలియని బాల్యం. తరువాత్తరువాత తెలిసొచ్చింది పల్లెలో తమవాళ్ళ దారిద్ర్యం, రోగాలూ, కష్టాలూ, కన్నీళ్ళూ... పల్లెలో ఉన్న దొరల, సావుకార్ల కుటుంబాలు తప్ప మిగితా కులాల వాళ్ళవి ఎప్పటికప్పుడు కటకటలాడే బతుకులే... రెక్కాడితేగాని డొక్కాడని కూలీ బతుకులే ఎక్కువగా ఉండేవి.

సమతకు సమాజశాస్త్రం ఒంటబట్టి సాంఘికదృశ్యం అర్థమయ్యేనాటికి తెలిసొచ్చిన వాస్తవాల్లో ఒకటి దొరలకు వందల ఎకరాల్లో భూములుంటే మిగితా కులాలవాళ్ళకు దానికి విరుద్ధంగా పోల్చడానికి వీల్లేనంత తక్కువలెక్కల్లో భూవసతి ఉండటం అన్నది, ఒకటీ రెండు ఎకరాల భూమి చెక్కలున్నా, ఓ మాదిరి పెరళ్ళున్నా చిన్నకారు, సన్నకారు రైతుల కుటుంబాల్లో ఆడామొగా వ్యవసాయపు కూలీపనులకు పోవడం అన్నది సర్వసామాన్యమైన అవసరం.

అట్లాంటి ఇండ్లల్లో ఆడపిల్లల్ని బడికి పంపించడం అనేదికల్ల... మొగపిల్లల్ని కొంత వరకు బడికి పంపించినా అదీ ఎప్పుడాగిపోయేదీ తెలియదు... ఆడపిల్లలైతే ఇంట్లో చిన్న పిల్లల్ని ఎత్తుకుని ఆడించడం, ఇంటిపనంతా చేయడం... బావులనుండి నీళ్ళు చేది పోయడం, ఊరిశివార్లకో... దగ్గరి ఊర్లకుపోయి తుమ్మకంపలు కొట్టుకరావడం... తంగేడు మొట్లు తవ్వుకురావడం, గంపలకొద్దీ పిడిక కున్నెలేరుకురావడం, అప్పుడప్పుడూ బర్లను కాయడం ఇదంతా ఒక శ్రమ చక్రం, ఆడపిల్లల చుట్టూ బిగుసుకున్న చాకిరి చట్రం. ఈ పనులన్నీకూడా అనంతమ్మ కూతుర్లిద్దరూ చేసేవాళ్ళు, మూడునాలుగు తరగతుల చదువు తోటే వాళ్ళు బడికి సున్నాచుట్టారు. ఇంటిపనులకు, తమ్ముళ్ళను ఎత్తుకుని ఆడించడానికి ఇంకెందుకు... ?

సమత ఈ ఆలోచనల్లోంచి బయటికొచ్చి వేరే పనులమీద మనసు పెట్టాలని ప్రయత్నించింది, అది కుదరలేదు. మనసు మళ్ళీమళ్ళీ ఆ పల్లెదిక్కు ఎగిరిపోతున్నది.

తనది కాకపోయినా పల్లెతో ఈ 25 ఏండ్లకాలంలో కల్సిపోయిన జ్ఞాపకాలు కెలుకుతుంటే తననే ఇంత దిగులుకమ్ముకుంటే ఇంక అత్తావాళ్ళకు ఎట్లున్నదో... వాళ్ళు వచ్చివచ్చి ఈ కాంక్రీటు జంగల్లో ఎట్లా బతుకుతారో అనుకుంటూ నిట్టూరుస్తున్నది.



వేసంగి పంటలు కోతకొచ్చినయి. ఆ ఊరిలో తమ మనుగడకు ఆఖరి సేద్యమైన వరి పొలాన్ని కోతబట్టారు. అనంతమ్మ పెద్దకొడుకు రాముడూ, పట్నం నుండి వచ్చిన చిన్న కొడుకు రాజు మసక చీకట్లోనే లేచి బర్రెలపని చూసుకొని, కూలోల్లను కేకేసి అమ్మ వండిన అన్నం తిని, చింతకాయ పచ్చడితోటి అన్నం సద్దిమూటలు కట్టుకొని పొలం దగ్గరికి పోయారు. వాళ్ళూ కూలికొచ్చినోళ్ళూ కలిసి మూడురోజులపాటు మునుముబట్టి పొలం కొసేసారు, కుప్పలేసారు. కొన్నాళ్ళపాటు గింజగొట్టి, తూర్పారబట్టి, పరిగేరి ఇంటికి చేర్చుకున్నారు. ఈ పనులన్నీ చేస్తూచేస్తూ అనంతమ్మ పెద్దకొడుకుల ఆలోచనలు ఒకలా సాగుతుంటే చిన్న కొడుకు ఆలోచనలు మరోలాసాగాయి. ఇంక ఈ గొడ్డుపనికి ఇదే ఆఖరు. ఈ పొలమూ ఉండదు, ఈ చాకిరీ ఉండదని చిన్నోడు రాజుకు సంబరమైతే, రామునికి మాత్రం మనోవ్యధగానే ఉన్నది. తమ తండ్రికూడా తాపీమేస్త్రీ పని ఎండనకా వాననకా చేసేటోడు అయినా పల్లెలోని ఆనవాయితీ అలవాట్ల ప్రకారం తాగీ తాగీ, ఇంటికొచ్చి తామందరికీ నరకం చూపించేటోడు, తల్లే పాలేరునూ, ఇద్దరక్కలనూ పట్టుకుని ఇంటినీ, పొలాన్ని ఈదుకుంటు వచ్చేది. తాగీ తాగీ హఠాత్తుగా తమ తండ్రిపోయి పదిహేనేండ్లయ్యింది. ఇప్పుడు తామందరూ ఊరే విడిచిపోతున్నారు.

రాముడు ఆలోచనల్లో కొట్టుకుపోతున్నాడు, అంతేనేమో ఒక సంబంధం పూర్తిగా తెగిపోతున్నప్పుడు ఒక అనుబంధాన్ని పూర్తిగా కోల్పోతున్నప్పుడు గతమంతా గుర్తుకొస్తుంది. మననం జరుగుతుంటుంది. రాముని ఆలోచనలు తమ్ముని మీదికి మళ్ళాయి. తను పదో తరగతితో చదువాపేసాడు. అక్కలిద్దరూ ఐదోతరగతికి కూడా రాలేదు. మరి తమ్ముడు పొరుగూర్లో పది ప్యాసయి ఇంకా చదువుతానంటే తను సరేనన్నాడు. వాడు పట్నంల ఉన్న పెద్దక్క బావల ఆసరాతోటి బావెంట తాపిపనికీ పోతూ ఆ పైసలతోటి చదువు సాగించాడు. అయినా వానికి ఉద్యోగం దొరకలేదు. తన తీరు కాకుండా తమ్ముడు కలంపట్టి బతుకుతాడని ఆశపడితే వాడు కులవృత్తి అయిన తాపీపట్టి బతుకుతున్నాడు... తల్లికి కొంచెం కుట్టుపని వచ్చు, అదే తనూ కొనసాగిస్తున్నాడు. పొలంమీద పండే ఇన్ని తిండి గింజలు, మిషనుకుడ్తే వచ్చే నాలుగు రూపాయలు వీటితోటి ఇన్నేండ్లుగా ఎడతెరిపిలేని కష్టాలనీది తల్లీ తనూ కలిసిఉన్న అప్పులుతీర్చి కొద్దిగా భూవసతి పెంచుకున్నారు. రాముడి అంతరంగం పూడిక తీసిన బావిలో ఊరుతున్న ఊటలా దుఃఖంతో నిండుతున్నది.



పొలం అమ్మేసారు. వాళ్ళకు ఇన్నేండ్లు కూడుబెట్టి బతికించిన పొలం అమ్మితే రెండు లక్షలు వచ్చాయి. లక్షరూపాయలు తీసుకుని రాముడు పట్నంబోయాడు. తమ పెద్దక్క వాళ్ళ ఇంటి దగ్గర్లోనే తాము కొనబోతున్న ఇంటికి బయానా ఇచ్చి అగ్రిమెంటు చేసుకుని వచ్చేందుకు నేరుగా అక్క ఇంటికే పోయాడు. వాళ్ళే తమకు దగ్గర్లో అమ్మకానికొచ్చిన ఇంటిని బేరం చేసి అన్ని పనుల్లో వీళ్ళకి ఆసరాగా ఉన్నారు.



పట్నాల్లో మానవసంబంధాలు పలుచన. వస్తు వ్యామోహ సంస్కృతిలోపడి మానవ ప్రేమలు నానాటికీ దిగజారిపోతున్నాయి. మనిషి మాట, ప్రేమలు అన్నీ వస్తువులతోటే... సుఖాన్వేషణ, భోగలాలసత్వం, ఆడంబరాల ప్రదర్శనల జీవితం ఇవే పట్నం బతుకులు.

పల్లెల్లో అందుకు విరుద్ధంగా సమిష్టి జీవన సంస్కృతి కనిపిస్తుంది. కులాలుంటాయి, ఆర్థిక అంతరాలూ ఉంటాయి కానీ ప్రేమలూ ఉంటాయి. కులాలతో పిలుచుకుంటారు, ఆపేక్షలతో జీవిస్తారు. కుల వృత్తులకు విలువనిస్తారు. చాకలి, మంగలి, గౌండ్ల, గొల్ల, ఉప్పరి, కుమ్మరి,పద్మశాలి,వడ్రంగి,కంసాలి, మాల, మాదిగ అందరూ పలకరించుకుంటూ సహకరించుకుంటూ సహజీవనం సాగిస్తారు. ఇప్పుడంటే మనుషులు తెలివిమీరి పట్నాల గాలిసోకి మారిపోతున్నారు. రాజకీయాలూ వాళ్ళను పార్టీలవారిగా విడదీసి పావుల్ని చేస్తున్నాయి. అయినా ఆ కలుషితాల పొగల నడుమన కూడా ఇంకా పల్లె జీవితపు ఆనవాళ్ళను మానవ సంబంధాల రూపంలో చూడవచ్చును.

ఇంతెందుకు సమతకు బాగా జ్ఞాపకం తమ అత్తమ్మ వాళ్ళింట్లో ఒక గదిలాంటి దాంట్లో దూదేకుల వాళ్ళకుటుంబం, మరోగదిలో కోస్తాంధ్ర ప్రాంతం నుండి రోడ్డుపనుల ఉద్యోగం మీద బతకడానికొచ్చిన వడ్డెర వాళ్ళూ, ఇంటిపక్కన మంగలి నారాయణ, ఇంటి వెనుకవైపు గౌండ్ల సమ్మక్క, ఇంటికి ఎదురువరుసలో మతం దీసుకున్న మాదిగ సాయిలు, ఏసోబు, మరియమ్మల కుటుంబాలు ఉండేవి. తెల్లవారి లేచింది మొదలు వాళ్ళందరి మధ్యనా ఏదో విధంగా మాటలు, సంబంధాలు ఉండేవి. ఊర్లలో కులం పట్టింపులు ఎక్కువే అయినా అవి నిత్యజీవిత పనులకు అడ్డురావు. వాళ్ళ నవ్వుల్నీ, ఏడ్పుల్నీ, జీవితంలోని ప్రతి అంశాన్ని ఒకరికొకరు పట్టించుకుంటూనే ఉంటారు. ఎవ్వరూకూడా ఏదికూడా పట్టనట్టుగా ఉండరు. అదీ పల్లెలంటే, హూం పట్నాలా... సమత అసహ్యించు కుంటున్నది తన మస్తిష్కంలో ముసురుతున్న భావాల్లోనే.



అనంతమ్మ ఇంకా ఒకటి రెండు నెలల్లో ఊరిడిచిపెట్టి పోయేందుకు మానసికంగా తయారు అవుతున్నది. పెద్దకొడుకు పిల్లల్ని వెంటతీసుకుని పట్నంలో పుట్టింటికిపోయింది.

ప్రతి సంవత్సరం వ్యవసాయపు పనులు తీరినప్పుడు పట్నంబోయి తన పుట్టింట్లో కొన్నాళ్ళు ఉండిరావటం ఏండ్లుగా జరుగుతున్నది. పుట్టింట్లో ఇప్పుడున్నది వదిన విజయమ్మ, మేన కోడలు సమతలే. అన్న చనిపోయి ఇరవైఏండ్లు, తల్లిపోయి ఆరేండ్లు, ఇక ఎట్లైనా కొద్ది నెలల్లో పట్నంమొచ్చేస్తామని ఆమె ఊరినుండి పెరట్లోని దొండపాదు వేరుగడ్డను తవ్వి పట్నంలోని పెద్దకూతురు ఇంటెనుక నాటేందుకు తీసుకుపోయింది. ఆ విషయం తెలిసినప్పుడు సమతకు బాధనిపించింది. తమకి పట్నం కొంపల్లో చెట్లుపెట్టుకునేంత ఖాళీ స్థలమంటూ లేక ప్రతి సంవత్సరం అనేకసార్లు కూరగాయల విత్తనాలు సేకరించి పల్లెనుండి వచ్చిపోయే వాళ్ళతో అత్తవాళ్ళకు పంపించడం జరిగేది. ఆ విత్తనాలు మొలిచీ తీగలుసాగి కాయలుకాస్తే అక్కడినుండి వచ్చేవాళ్ళతో ఆకూరగాయలు వీళ్ళకు చేరుతుండేవి. ఇప్పుడు ఇరుకు కొంపల్లో, రాయిరప్పల కుప్పల మధ్యన చెట్లకు స్థానంలేని దగ్గరకు దొండతీగ వేరుగడ్డను తెచ్చింది అత్తమ్మ. ఆగడ్డ భూమిలో నాటిన రెండురోజులకే ఊరపందులు నేలను కెలికి గడ్డను తినేసాయి. మనిషికి సహజమైన మట్టితో సంబంధం తెగిపోవడమంటే ఎన్నెన్ని సంబంధాలు తెగిపోవడమో... ? ఉన్న ఊరిని విడిచిపెట్టి పోవడమంటే ఒక సంస్కృతిని, సాంఘిక జీవితాన్నీ పాతిపెట్టిపోవడమే. అయినా గత్యంతరంలేని పరిస్థితుల్లోనే కదా ఎవరైనా కన్నతల్లిలాంటి ఊరినీ, ఇంటినీ విడిచి వలసబోయేది. ఉన్నోళ్ళకి వలసలు అందమైన మలుపులైతే, అల్పాదాయ వర్గాల జనానికి, వృత్తికులాలూ, ఉత్పత్తి కులాల జనానికి అవి చావుతోటి సమానం. ఈ ఆలోచనల ఒత్తిడితో ఈ మధ్యన పరధ్యానంగా ఉంటోంది సమత. సున్నితమైన మనసుంటే తప్పదు కదా క్షోభ.

అనంతమ్మ కొడుకులు, కోడళ్ళు, పిల్లలతోటి పట్నంలో తాము కొనుక్కున్న ఇంట్లోకి వచ్చి దిగింది. ఒక పోర్షనులో చిన్నకొడుకు-కోడలూ, మరోదాంట్లో పెద్దకొడుకూ-కోడలూ నలుగురు పిల్లలు. ఆమె ప్రస్తుతం పెద్దకొడుకు ఇంట్లోనే ఉన్నా కొన్నాళ్ళ తరువాత నెలకొక కొడుకింట్లో ఉండేట్టుగా అనుకున్నారు. రాముని పిల్లల్లో మగపిల్లల్ని ప్రైవేటు బళ్ళలో, ఆడపిల్లల్ని గవర్నమెంటు బళ్ళలోచేర్చారు, రాజుకింకా పిల్లలుకలగలేదు, కొత్తగా పెళ్ళైంది.

తెల్లవారింది... ఊళ్లో చీకట్లోనే లేచి బర్రెలకు మేతేసి పాలుపితికి, వాకిలి ఊడ్చి, అలుకు జల్లి, ముగ్గులుపెట్టి, పొయ్యిరాజేసి... ఇట్లా ఉండే దినచర్య పట్నం బతుకులో పూర్తిగా మారిపోయింది. ఇక్కడ లేచింది మొదలు వంటలు, పిల్లలకు స్నానాలూ, తినిపించడం, పుస్తకాలు సర్ది బళ్ళకు పంపించిరావడం, పగటి సమయానికి పిల్లలకి అన్నాలు తీసుకుపోయి తినిపించిరావడం, సాయంత్రం మళ్ళీ పిల్లలని ఇంటికి తీసుకు రావడం... ఈ నడుమన ఇంటిపని వగైరాలు, ఇదంతా అలవాటులేని యుద్ధంలా చేయాల్సి వస్తున్నది ఎటూ తోచని స్థితి.

కడసారిగా తమ పొలంలో పండిన తిండిగింజలు తెచ్చుకున్నారు. కాబట్టి పచ్చళ్ళు పెట్టుకుని గడుపుతున్నారు. రాజు నెలకు పదిపదిహేను రోజులు తాపీ పనికి పోతున్నాడు. రాముడింకా ఏ పనిలోకీ దిగలేదు. అతనికొచ్చింది కుట్టుమిషన్ పనే. రోజులు వారంలోకి వచ్చాయి. ఏమనిపించిందో ఏమో రెండురోజులుగా అతను కమ్మినట్లుగా ఉండటం అనంతమ్మ గమనిస్తున్నది. ఆమెకుకొంత అర్థమవుతున్నది, ఖర్చులుఎక్కువైనాయి, రాబడి లేదని కొడుకు బెంగపెట్టుకున్నాడని పగలు కోడలు పిల్లలకు సద్దులు తీసుకుపోయిన తరవాత ఆమె కొడుకును కదిలించింది, "ఎందుకురా రాముడూ బెంగటిల్లినట్లు ఉంటున్నవ్, ఏం రంధిబెట్టుకున్నావా బిడ్డా" అని. రాముడు దిగులుదిగులుగా చూస్తూ "అమ్మా, ఇక్కడ ఏంపనిలేక ఈ పిల్లగాండ్లతోటి ఎట్లా బత్కుడే, ఆల్ల సదువులెట్లయితయి, పూటకు గింతమందిమి తిండికెట్ల ఎల్లదే, నాకు రోగం కూడినట్లయితాందే" అన్నాడు.

ఖాళీ చాపలాగ ముందట పర్చుకున్న తమ ఎడారిబతుకును చూసి కొడుకు భయపడ్తున్నాడని అనంతమ్మకు అర్థమైంది. నిజం చెప్పాలంటే ఆమెకూ గుబులు గుబులుగానే ఉన్నది. తిండి ముందర కూర్చుంటే రెండు ముద్దలు కూడా మింగుడు పడటంలేదు. అయినా నిండామునిగిన తరువాత తడిసినామని ఏడ్చేదేమున్నది, ఏ ఒక్కనాడూ సుఖ శాంతులులేని బతుకులు తమయి. పెనుగులాడుతునే బతికినాము, ఇప్పుడుకూడా తెగించి ఏదో బతుకు దెరువును ఏర్పాటు చేసుకోవాలి. తమకున్నాయి రెక్కలే అనుకుంటూ "ఏందిరా కొడుకా అన్నీ ఇ...రించే గీడికిచ్చినంగదా, తమ్ముడూ గంత సదువు సదివి తాపీ పని చేసుకుంట లేడా... నీకు సుత బట్టల పని వస్తదిగదా, నువ్వూ నీ పెళ్ళాం కలిసి ఉన్న పైసలతోటి దుకానం పెట్టుకుందురుగని నువ్వు బెంగటిల్లకు బిడ్డా..." అన్నది. తల్లీ కొడుకులిద్దరు కలిసి పొయ్యిరాజేసి చాయ్ చేసుకుని తాగారు. అనంతమ్మ మళ్ళీ మొదలు పెట్టింది. "మనం మన మట్టిల కెల్లి ఏర్లు పెరుక్కొని ఊరితోటి ఉన్న బత్కు సమ్మందాన్ని తెంపుకోని వచ్చినం... ఇగ గీ ఊల్లే మన ఏర్లను దింపుకోవాలె, తీగెలుసాగాలే, మొలకలొలిగె మొలిచి కొమ్మలు బెట్టాలే. తప్పదు బిడ్డా మనం బతుక్కుంట మన పిల్లగాండ్లను సాదుకోవాలే, ఆల్లను సదివించి పెద్దోల్లనుజెయ్యాలే. మనతీర్గ మట్టీ, బుర్దాపూసుకునే బతుకులు ఆల్లకద్దు, నాలుగు దినాలు కట్టపడాలె, కుదురుకునేదాన్కనే గీ అగులుబుగులు, అటెంక బండిదారిన బడ్తది, అదే నడుత్తది, ఇన్నొద్దులు నడువలేదా గట్లుండకు కొడుకా, మన కులపోండ్ల ఇండ్లల్లకు, సుట్టపోల్ల ఇండ్లల్లకు పోయిరా పో, జరతెరిపిన బడ్తవు, ఊకే గంప కింద కోడితీర్గే ఉండకు, మనోల్లందరికి బట్టలుకుడ్తనని జెప్పిరా, ఇగమీ అక్క, బావ, తమ్ముడు, సమతక్కతోటి రేపాదారం నాడు ఏదన్న చేసేదాని గురిచ్చి ఇసారిద్దాంగని లే బిడ్డా అట్ల పోయిరా పో, కొక్కుబట్టిన కోడితీర్గ ఇంట్ల కూసుంటే బత్కుదెర్వు ఎదురత్తదా, పూనుకుంటే తొవ్వ దొరుకుతది" ఆమె జీవితానుభవాల్ని దంచి నూరిపోసినట్లు కొడుక్కు ధైర్యాన్ని నూరిపోసింది.

తల్లి అంత ధైర్యంగా మాట్లాడిన తరవాత రాముడు తేరుకున్నట్లు చూసాడు, లేచి షర్టు వేసుకుని, సైకిలు తీసి దుమ్ము దులిపి ఏదో బలమొచ్చినట్లు చుట్టాలిండ్లవైపు సైకిల్ తిప్పాడు.



అత్తమ్మ వాళ్ళొచ్చి పదిరోజులైనా సమతకింకా గ్రామీణపేదల జీవితాలగూర్చిన ఆలోచనలు తెగడం లేదు. ఇక ఇంట్లో ఉండలేక స్నేహితురాలు పూర్ణ ఇంటికి వెళ్ళింది. ఆమె తీరిగ్గానే ఉండటంతో ఉపోద్ఘాతం లేకుండానే మొదలుపెట్టింది. "పూర్ణా మనమీ పట్నాలలో ఏదో ఒక ప్రభుత్వోద్యోగం చేసుకుంటూ, నెలజీతాలు తీసుకుంటూ కూడా ఎప్పుడూ ఇంట్లోకి ఇది లేదు, అది లేదనీ, ఇంకేదో కావాలనీ, సమకూర్చుకోవాలని వెలితి పడ్తుంటాము. పట్నం నాగరికతకు తగినట్లుగా బంధువుల ముందు గొప్పలు ప్రదర్శించు కోవాలని ఆరాటంతో అప్పులు, వృధా ఖర్చులుచేస్తూ ఎప్పుడూ సెల్ఫ్ పిటీతో ఉంటాం. అసలు జీవితమంటే, కష్టమంటే మనకేం తెలుసని, మనం జీవిస్తున్నదే జీవితమనీ, మన సమస్యలే కష్టాలనుకుంటాం, అసలు జీవితం పల్లెల్లో ఉంటుంది, అడవుల్లో ఉంటుంది. వాళ్ళ కష్టాలముందు, కనీస అవసరాలుకూడా తీరని వాళ్ళ కరువు బతుకుల ముందూ, మనమూ మన జీవిత సమస్యలేపాటివి... ?"

ఇంట్లో చిన్నచిన్న పనులు చేసుకుంటూనే తనవెంట తిరుగుతూ సమత మాట్లాడిన విషయాల్ని విన్న పూర్ణ "నిజమే సమతా.. పల్లెల్లో రోగాలకని, పెండ్లిల్లకని, పండుగలు, మొక్కులకని అప్పులుచేసి అవి తీర్చలేక, సంవత్సరమంతా చేసే పనుల్లేక, కరువులవల్లా ఎందరో చిన్నకారు రైతులు, వ్యవసాయకూలీలు, వృత్తికులాలోల్లు ఈ పట్నాలకు వలసొచ్చి ఖాళీస్థలాల్లో గుడిసెలువేసుకుని దొరికినపనల్లా చేసుకుంటూ పొట్టబోసుకునేది చూస్తూనే ఉన్నాంకదా. ఆడవాళ్ళూ, కొంచెం పెద్దపిల్లలూ మనలాంటి మధ్యతరగతి ఉద్యోగస్తులూ, ధనవంతుల ఇండ్లలో పాచి పనికి కుదురుకుంటారు. మగవాళ్ళు హమాలీ పని, రిక్షా తొక్కడం, తట్టలుమోసేపని చేస్తుంటారు" పూర్ణ కూడా లోతుగాపోయి మాట్లాడింది.

మాటా మనసూ కలిసిన నేస్తం దొరికినందుకు సమత ఇన్నాళ్ళ తన ఆలోచనల్ని ఆమెతో చెప్పుకుంది "మన ఇండ్లలో పనిచేయడానికి వచ్చే ఈ వలస ప్రాణుల్ని మనం చూడాల్సినంత సానుభూతితో చూడం. నిజానికి వాళ్ళు నిమ్న, వెనుకబడిన కులాలవాళ్ళే, మనదీ అదే కులం అయినా ఇక్కడ మనది ఉద్యోగవర్గం, మనం చచ్చేదాకా చావులేని ప్రభుత్వోద్యోగాల్లో నిలదొక్కుకున్నవాళ్ళం, సంఘటిత రంగంలో స్థిరపడినవాళ్ళం, కాబట్టి పొట్టచేతబట్టుకొని మనతో సహజీవనం చేద్దామని వచ్చినవాళ్ళను మనవాళ్ళలా చూడం మనం, ఎందుకనుకుంటున్నావు ? ఈ వ్యవస్థలో మనమంతా వృత్తులనూ, ఉత్పత్తులనూ

అనుసరించి నానా కులాలుగా, వర్గాలుగా చీల్చబడినవాళ్ళం, చీలిపోయిన వాళ్ళం. మట్టిని నమ్ముకున్న మట్టి మనుషులంటే తక్కువ భావం మనకు, వాళ్ళు చెమటోడ్చి పండించేవన్నీ ముప్పొద్దులా తింటూ, వాళ్ళ శ్రమని గౌరవించనివాళ్ళం. వాళ్ళ బతుకుల్ని స్పర్శించని వాళ్ళం. మనకిక్కడ రక్తసంబంధాలు, స్నేహ సంబంధాలే అంతంతమాత్రంగా ఉంటాయి. ఇంక ఊరిబంధాలూ, మట్టిబంధాలూ పట్టేంత నాగరికులమా, మనం వట్టి నగరీకులమే నాయె" సమత కడుపులోని గోడునంతా వెళ్ళకక్కుతూ పోతున్నది.

"నీవు ఏ విషయాన్నైనా చాలా బాగామాట్లాడుతావు సమతా... ఈ మధ్యన మీ అత్తమ్మ వాళ్ళు పల్లెనుండి ఇక్కడికి వచ్చినప్పటి నుండీ నువు చాలా డిస్టర్బ్‌డ్‌గా ఉంటున్నావు, అతిగా ఆలోచిస్తున్నావు. ప్రతీదీ అంత డీప్‌గా తీసుకుంటే బతకలేం" పూర్ణ వాస్తవాల్ని ఒప్పుకుంటూనే సమత ఆందోళనను నిలువరించాలని చూస్తున్నది.

"మన వరకు వస్తేగానీ తెలియదు ఏ నొప్పైనా, అంతవరకూ ఎవరెటు పోయినా, ఏదేమైనా, సమాజంలోని లక్షలాదిమంది పేదలు ఏ చావులు చస్తున్నా పట్టించుకోము. తీగ లాగితేనే కదా డొంకంతా కదిలేది. మనకో, మనవాళ్ళకో ఆపదలొస్తేనే కదా ఆ బాధ మనకూ తగిలేది. ఎంతైనా పూర్ణా మనం ఉన్నత విద్యలు నేర్చిన లౌక్యులం. కవచాలూ, ముసుగులూ తగిలించుకుని బతకడం నేర్చిన భద్రలోకపు మనుషులం కదా" ప్రజా సంఘాల్లో ఇరవై ఏళ్ళుగా పనిచేస్తున్న సమత ఆవేశం.

"నీవు అనేవన్నీ నిజమే, మనం స్వార్థపరులమే, ఇది ఔనన్నా కాదన్నా నిజమే. ఐదయ్యింది, పొద్దున పిల్లల్ని అక్కవాళ్ళింట్లో దింపి స్కూల్‌కెళ్లి వచ్చాను. సాయంత్రం చిల్డ్రన్స్ పార్క్‌కి తీసుకుపోతానని వాళ్ళకు చెప్పాను, వస్తావా పోదాం" పూర్ణ సమతను అడిగింది. "సరే పద కాసేపు చెట్లగాలి పీల్చుకోవచ్చు చల్లగా" అని సమత తాళంకప్ప అందుకుని బయటికి నడిచింది. ఇంటికి తాళంవేసి ఇద్దరూ సమత స్కూటరెక్కారు. వాళ్లింటి సందులోనుండి మలుపు తిరిగి ఆ బండి రోడ్డెక్కింది. ఈ సిమెంటు, కాంక్రీటు గట్టిదనం నుండి మట్టివాసన తగలాలన్నా, మట్టి స్పర్శా, చెట్టు స్పర్శా తెలియాలన్నా పట్నాల్లో తమలాంటి వాళ్ళు పిల్లల సాకుతోనైనా పార్కులకు పోవాల్సిందేననుకుంటూ మిత్రులిద్దరూ పిల్లల్ని కూడా తీసుకుని మట్టి దారి పట్టారు, కాదు కాదు పార్కుదారి పట్టారు. ❑



శ్రీదాస్యం లక్ష్మయ్య,
ఇ.నెం. 11-73/2,
హన్మకొండ రోడ్, హుస్నాబాద్,
జి॥ కరీంనగర్ - 504 467
ఫోన్ : 56620



# తల్లిపానం

“రేపు అక్టోబర్ రెండో తారీఖు ‘గాంధీ జయంతి’ గవర్నమెంటు సెలవు”అని పంతులు చెప్పంగనే పిల్లలు చప్పట్లు సరిసింద్రు. సెలవనంగనే పిల్లల ఆనందం, బడి చుట్టికాంగనే పిల్లలంత ఉరుక్కుంట ఇంటి తొవ్వపట్టింద్రు. హైస్కూలుపిల్లలు నిదానంగ నడుసుకుంట పోతాంద్రు.

సెలవిచ్చింద్రన్న సంతోషం తోటిపిల్లలందరిట్ల ఉన్నా తిరుపతికి మాత్రం సంబరం కల్గ లేదు. పదమూడేండ్ల తిరుపతి పెద్ద బల్లె ఎనిమిదో తరగతి సదువుతాండు. బడి అంటే పానం. బడిఎగ్గొట్టి సోపతోల్లతోటి చెట్లపొంటి తిరుగుడు, ఆటలాడుడు తిరుపతికి తెల్వదు. వాడికి సదువే లోకం. సదివేది ఎనిమిదో తరగతి అయినా సదువంటే పంచపానాలు.

తిరుపతి ఊరు కొత్తపల్లి, హుస్నాబాద్‌కు దగ్గర్ల ఉంటుందా ఊరు. తిరుపతి తల్లి దండ్రులైన కనకవ్వ, రాజయ్యలు తిరుపతి ఆరో తరగతి వచ్చేసరికి దగ్గరలోని హుస్నాబాద్ ఆస్టల్‌లో చేర్పిచ్చి సదివిత్తుంద్రు. కనకవ్వ, రాజయ్యలకు ఇద్దరే సంతానం. పెద్దోడు వెంకటేశ్వర్లు వ్యవసాయం చేస్తుంటడు. పెనిమిటి రాజయ్య రెండేళ్ళ కిందట్నే కాలం జేసిండు. ఇద్దరు బిడ్డలకు కనకవ్వనే పెద్దదిక్కు అయ్యింది. పెద్దోడు ఎవుసాయంలో సాయం అవుతోంటే చిన్నోడు తిరుపతి ఎనిమిదో తరగతి సదువుతాండు.

చిన్నప్పట్నించి తిరుపతికి సదువంటే పానం. ఆ, ఆలు దిద్దించిన కాన్నించి అచ్చరాలు పూర్తయ్యేదాక సూపిన యావకు రాజయ్య బతికున్న రోజుల్ల బహు సంబరపడ్డడు. పెద్దోనికి సదువు ఒంటబట్టకపోయినా, తాము సదువుకోక పోయినా వీడన్నా సదువుమీద మనసు పెట్టినందుకు ఖుషి అయ్యింద్రు. ఊల్లెగూడ అందరూ తిరుపతి సదువు గురించే ముచ్చట పెడుతున్నరు. “ఇంకేంది కనకవ్వా చిన్నోడు సదివి కొలువు తెచ్చుకొని నిన్ను సాత్తడు తియ్యి” అని పక్కింటోళ్ళు అనవట్టింద్రు, పొల్లగాని గడగడ సదువునుజూచి, సక్కదనాల రాతను గురించే అందరూ ముచ్చటించుకున్నరు.

కొత్తపల్లి బడిలో అయిదో తరగతిలో అందరికన్నా మార్కులు ఎక్కువ తెచ్చుకొని ఊరి సర్పంచుతోటి బహుమతి గెలుచుకున్నడు తిరుపతి. ఊల్లె పంతుల్లందరు తెగమెచ్చు

కున్నరు. కనకవ్వను పిలిపించి పైతరగతి సదవనీకి మంచిబల్లెకు పొల్లగాన్ని పంపించుమని చెప్పినప్పుడు కనకవ్వ వాళ్ళతోటి "పట్నంలఉంచి చదివించుడు నాతోనయితదా బాంచెను. రాజయ్య బతికుంటేనన్న సదివిచ్చెటోడేమో, ఇగ సదివినకాడికి సాలుగని, పెద్దోనికి పనిల సాయమన్న అయితడు" అనేది.

ఆ ఊల్లె పిల్లలందరు పెద్ద సదువులకోసం ఆస్టల్‌ల చేరుతోంటే తానుగూడ సోపతోల్ల తోటిగూడి ఆస్టల్‌ల ఉండాలనిపించింది తిరుపతికి. ఆ ముచ్చటనే తల్లితోటి సెప్పిండు. తాను గూడ అస్టల్‌కు పోతనన్నడు. సర్కారోల్ల ఆస్టల్‌ల పైసల్తగలయని, బల్లె ఫీజు లుండయని చెప్పిండు. చిన్నోని సదువుకోసం దూరం పంపుడు ఇట్టం లేకపోయినా పొల్ల గానికి సదువు మీదున్న యావ జూసి ఆకరికి పంపింది కనకవ్వ.

ఆస్టల్ పక్కనే బడి. ఆ బడి తిరుపతికి సాన నచ్చింది. బడిపంతుల్లు నచ్చింండ్రు. ఆరో తరగతిల, ఏడో తరగతిలగూడ తిరుపతి క్లాసులల్ల పస్టచ్చిండు. పంతుళ్ళ దృష్టికూడ తిరుపతి మీదనే పడింది. తిరుపతికి సదువు మీదున్న ఇంట్రస్టుచూసి టీచర్లందరూ తిరుపతి మీద అభిమానం పెంచుకున్నరు. ఏడోక్లాసుల ఫస్టు అచ్చినందుకు మండలం లోనే అందరికన్న ఎక్కువ మార్కులు తెచ్చుకున్నందుకు ముఖ్యమంత్రి చేతులతోటి ప్రతిభ పురస్కారంగూడ అందుకున్నడు. టీచర్లు, సోపతోల్లు అందరు తిరుపతిని తెగమెచ్చు కున్నరు.

గాంధీ జయంతికి సెలవని చెప్పంగనే హాస్టల్ పిల్లలు ఒకరోజు ముందే ఇంటిదారి పట్టింండ్రు. బడికి ఒకరోజు సెలవుయిచ్చినా ఆస్టల్‌ల ఉండే పిల్లలు దగ్గరి ఊరోళ్ళు ఇండ్లల్లకు పోతరు. తిరుపతి ఊరువాళ్ళు పదిమందిదాకా హాస్టల్‌ల ఉండి సదువుతాండ్రు. వాళ్ళందరూ సెలవులకని ఊరికిపోతాంటే తిరుపతి కూడా అయిట్టంగానే తోటిపిల్లలతోటి కలిసి వాళ్ళూరికి బయల్దేరిండు. ఆటోలు, బస్సులుఉన్నా పదికిలోమీటర్ల దూరాన్ని పిల్లలు కొందరు నడిచే వెళ్తారు. కొందరు సైకిల్లమీద పోతరు. తిరుపతికి సైకిలు తొక్కుడురాదు. ఆ ప్రయత్నంగూడ చెయ్యలేదు.

సెలవులకు ఇంటికచ్చినప్పుడల్లా కనకవ్వకు, అన్న వెంకటేశ్వర్లుకు సంబరమే. వాళ్ళకు వాడిదే లోకం. పొద్దంతా కూలిపనో, పాలంపనో చూసుకొని కాలం గడిపే వీళ్ళకు తిరుపతిని చూడంగనే, మాట్లాడంగనే వాళ్ళు పొద్దుందాకా చేసిన కట్టం మర్సిపోతరు.

ఆ రోజు ఆస్టల్ నుండి ఇంటికి వచ్చిన తిరుపతినిజూసి అప్పుడే పొలం నుండి ఇంటికి వచ్చిన కనకవ్వ, వెంకటేశ్వర్లు వచ్చీరాంగనే తిరుపతిని జూసి సంతోషపడ్డరు. కంగారుపడ్డరు కూడ గాభరపడి "ఏంది బిడ్డా రేపుబడి లేదా, ఇయ్యాల అచ్చినవు, జరంగిన రాలేదు గద" అన్నది.

తల్లి కంగారు చూసి వెంకటేశ్వర్లు గూడ గాభరపడ్డడు. చేతిలున్న ముల్లు గర్రను మూలకు పడేసి తిరుపతి రెక్కపట్టి జూసిండు. జరం వచ్చిందేమోనని.

"లేదన్న జరం లేదు, ఏం లేదే" అన్నడు తిరుపతి అన్నపడుతున్న గాభరాను చూసి. పక్కనే నిలబడి సూత్తున్న తల్లితోటి "లేదవ్వా రేపు గాంధీ తాత పుట్టినరోజు గదా, మాబడికి సెలవు ఇచ్చిండ్రు. మల్ల ఎల్లుండి పొద్దుగాలనే లేసి బడికి పోతనే, జరంలేదు గిరంలేదు" అన్నడు తిరుపతి.

కనకవ్వ మనసు కుదుటపడ్డది. అన్న మనసుకూడ అల్కగయ్యింది. ఆ రాత్రికి ముగ్గురు కల్సి తిన్నరు, ముచ్చట్లతోటి కాలం గడిసిపోయింది.



ఆ రోజు గాంధీజయంతి, పొద్దున్నే లేచిన కనకవ్వ వంటపని సూత్తాంది. వెంకటేశ్వర్లు బండి గీరలుఇప్పి జనుమేత్తాండు. రాజయ్య బతికుండంగ వెంకటేశ్వర్లు ఎవుసం పని చెయ్యక పొయ్యేది. కనకవ్వ రాజయ్యలే ఆపని చూసుకునేది. రాజయ్య కాలంచేసిన తర్వాతనే ఒక్కొక్కపని నేర్సుకున్నడు. పెద్దకొడుకుగా పుట్టినందుకు తల్లిని, తమ్ముణ్ని ఎట్ల జూసుకోవాల్నో పెద్దమనుషులు చెప్పంగవిని తెలివిలబడ్డడు. సదవులేకఊల్లె బలాదూరుగ ఆడీడ తిరిగే వెంకటేశ్వర్లు పెద్దమనుషుల మాటలతోటి దారికొచ్చిండు. పెద్దోడు తిరుగుల్లు మాని పనికి చేతికచ్చినందుకు కనకవ్వ సంతోషపడ్డది.

రాజయ్య రెక్కల కష్టంతోటి సంపాదించిన రెండెకరాల పొలం, కొంత సెలక వుంది. పొలంల పండిన వడ్లు ఇంటికే సరిపోతయి. కూలీల కర్సులు, ఎరువులు, పురుగు మందుల కర్సుపోను యాడాదిగాసం మిగులుతాంది. ఇంకో ఐదారుఎకరాలు కౌలుకు తీసుకొని పొలం జేస్తాండ్రు తల్లికొడుకులు. రెక్కలు ముక్కలు జేసుకుంట నాలుగురాళ్ళు వెనకేసుకొస్తున్నరు.

తెల్లారిందో లేదో తిరుపతి దోస్తులు ఇంటిమీద పడ్డరు. ఆటకురమ్మని కొందరు, తిరిగి రావడానికి కొందరు. తిరుపతి సోపతోల్లతోటిగూడి పండ్లల్ల పుల్లేసుకుని కాల్వమొకాన పొయ్యచ్చిండు. కొద్దిసేపు ఆటకుపొయ్యచ్చిండు. ఇంటికొచ్చినంక తానంజేసి సల్లబడ్డడు.

ఇంటిముంగల దొడ్లోఉన్న ఎడ్లను విడిచి నీళ్ళకు పట్టుకపోతున్న అన్న దగ్గరికిపొయ్యి ఎనకాల నిలబడ్డడు తిరుపతి.

"ఏందిరా తమ్మి ఇట్లొస్తివి, దోస్తులు ఇడిసి పెట్టిండ్రా అప్పుడే"అన్నాడు తమ్మునితోటి.

"దోస్తులదేందిగని, ఎప్పుడుండేదేనాయె. ఊల్లెకచ్చినప్పుడల్లా కల్తనే ఉంటరాయే" అన్నడు. "గుట్టపొంటి చింతపల్కపండ్లు కనపడుతానయానే అన్నా" అని అడిగిండు.

"తెల్వదిరా తమ్మీ మొన్ననే ఊల్లెకు తెనుగోల్లు అమ్మచ్చింండ్రు, నేనైతే జూడలే తమ్మీ" అన్నడు వెంకటేశ్వర్లు.

ఊల్లెకచ్చినప్పుడల్లా దోస్తులతోటి సరదాగా గడిపేసే తిరుపతి ఈసారి సింతపల్కపండ్ల మీద ద్యాస నిలిపిండు. ఎట్లనైనా ఇయ్యాల గుట్టమొకాల పోవాలనుకున్నాడు. వట్టిగనే పండ్ల కోసరమే పోతానంటే అన్న, అవ్వ వద్దంటరని తెలుసు. ఇంటిముందటికి అమ్మస్తే కొందాం తియ్యిబిడ్డ అంటదని తెలుసు. అందుకే అన్నతోటి "ఇయ్యాల ఎడ్లను తొలుకొని గుట్టపొంటి మేపుకత్తనే అన్నా" అన్నాడు.

"నీకెందుకురా తమ్మి, నీ సదువు నీకున్నది గద. అచ్చినొక్క రోజన్న సోపతోల్లతోటిగూడి ఉండరాదూ. గీపని మాకు ఎప్పటికుండేదేనాయె" అన్నడు తమ్మునితోటి వెంకటేశ్వర్లు.

వాకిట్ల రోలు తుడిసి మిరం నూరడానికి కంచుట్లనిండా మిరపకాయలు నింపుకొని రోకలి బండతోటి వంటిల్లునుంచి బయటికి వచ్చిన కనకవ్వ అన్నదమ్ముల మాటలు విన్నది.

"నిజమేగని సదువు రోజు ఉండేదేగద, అయినా ఇప్పుడు పరీక్షలసంటియేంలేవు. రోజు చెయ్యబోతున్ననా ఈ పని. మీరిద్దరూ పనికిపోతే ఇంటికాడ నాకొక్కనికి ఏం మనసున బట్టదు. గుట్టమొకాన పొయ్యి మేపుకత్తెనన్న కొంచెం టైం కలిసత్తది" అన్నాడు తిరుపతి.

"సోపతోల్లతోటి సింతపల్కపండ్ల కోసంగిన గుట్టమొకాన పోతాండ్రుగావచ్చు, అందుకనేమో బిడ్డా అటు దిక్కు పోతాననేది" అన్నది కనకవ్వ.

"లేదే అవ్వా, బాయిమొకాన, గుట్టమొకాన పోక చాలొద్దులైంది. ఉట్టిగనే పొవుడెందు కని ఎడ్లను మేపుకత్తనంటన్న గంతే" అన్నడు తిరుపతి. 'సరేనన్నరు' కనకవ్వ, వెంకటేశ్వర్లు.

అవ్వ సద్దిగట్టింది. దాన్ని తీసుకొని చేతుల గైడుపట్టుకొని మూలకున్న ముల్లుగర్ర తీసు కొని ఎడ్లను తోలుకొని ఇంట్లకెల్లి బైలెల్లిండు తిరుపతి. చిన్నప్పుడు చెల్కలపొంటి, గుట్ట మొకాన వచ్చి ఎగిరిన రోజులు యాదికచ్చినయి తిరుపతికి. అప్పుడప్పుడు అన్న ఎంకన్న జాడకు తిరిగిన సంగతులు గుర్తుకచ్చినయి. ఏడదిరిగినా దొరకని అన్న ఈ బాయి దగ్గర్నే దొరికేటోడు అని అనుకుంటాండు. బాయి పక్కనుంచి ఎడ్లను గొట్టుక పోవుకుంట ఈడ లేడంటే యిగ గుట్టదగ్గిరి బండల మీద ఆడుకుంటనన్న ఉండేటోడు అని అనుకున్నడు.

గుట్టలపొంటి కొందరి పొలాలున్నయి. పత్తిచేన్లున్నయి. గుట్టల ఆవలిపక్కన బాగా పెరిగిన తుమ్మచెట్లున్నయి. ఊల్లె ఎవుసంఉన్న అందరికీ బాయిలున్నయి. గుట్టపొంటి పొలాలు చేనులున్నోల్లకు గూడ పెద్దపెద్ద బాయిలున్నయి. అదంతా మెరక జాగ, కాల్వలు లేవు, చెరువులున్నా నిండయి. అందరికి సొంతంగా తవ్వుకున్న ఇంజను మోటార్లు, మోట కొట్టుకునే నీల్లదిక్కు. ఆ బాయిలపొంటి ఎడ్లను గొట్టుకుంట ఊరవతలికి వచ్చిండు తిరుపతి.

ఎడ్లు గడ్డినిమేసుకుంట నడుత్తాంటే తిరుపతి గుట్టపక్కన పొలాలను, ఊరిఅందాలను చూసుకుంట నడుత్తాండు. పొలాలు దాటినంక, మైదానం సురువయ్యింది. బాగా పెరిగిన మాగిగడ్డిని ఎడ్లు మేస్తున్నయి. తుమ్మచెట్ల నీడను చూసుకొని తిరుపతి ఓ చిన్న బండ మీద కూకున్నడు. ఎడ్లు గుట్టసుట్టు తిరుక్కుంట మేత్తానయి. తిరుపతి అప్పుడప్పుడు వాటి సాలెంబడి తిరుగుతాండు. మద్దెమద్దెన బండలపొంటి పెరిగిన కాయలే ఉన్నాయి. అక్కడక్కడ గొట్టికాయలు పండ్లైతే గనపడలే. మల్లనీడను చూసుకొని కాసేపు కూకున్నడు.

ఈ అనుభవం కొత్తగున్నది. రోజు బల్లెపిల్లలతోటి గూడి ఉండే యాల్ల. బడి సంగతులు గుర్తుకత్తానయి. ఆస్టల్ దోస్తులు, ఆస్టల్ వార్డెన్‌సారు, కమాటీలు గుర్తు కచ్చింద్రు.

బాగ ఎండయ్యింది. సూరీడు నడినెత్తిమీదకచ్చిండు. తిరుపతికి ఆకలి దంచుతాంది. ఇంటికాన్నించి తెచ్చుకున్న సద్దిముల్లె ఇప్పుకొని నిదానంగ తిన్నడు. సీసాల తెచ్చుకున్న నీళ్ళు కడుపునిండ తాగిండు. ఎండల తిరిగినందుకు పానం అలసిపోయిండు. అలవాటు లేని పని, కాసేపు తెచ్చుకున్న గైడు ముంగటేసుకున్నడు. పాఠాలు తిరగేసిండు. మల్ల పంతుల్లు యాదికచ్చింద్రు. బల్లె సోపతోల్లను యాదికి చేసుకున్నడు. కడుపుల సల్లపడం గనే చిన్నగ కునుకు మొదలైంది. ఆవులింతలు తీసుకుంట బండమీది కొరిగిండు. సల్లంగ నిద్రలకు జారుకున్నడు. గుట్టక్రింది బండల దగ్గర ఏపుగ పెరిగిన తుమ్మచెట్లకింద పరుపు బండ మీద సల్లటి నీడకు కునుకుతీస్తున్న తిరుపతికి దిగ్గున తెలివి వచ్చేసరికి ఘోరం జరిగి పోయింది. గుట్టపొంటి మేతమేస్తున్న ఎద్దులు పటేలు పత్తిచేన్లపడి మేత్తాన్నయి. ఎన్నడు లేనిది ఆరోజు శీనయ్య పటేలు బాయి మొకాన వచ్చిండు. ఈసారి పత్తిపంట మీద బాగ ఆశలు పెట్టుకున్న శీనయ్య పటేలు రెండెడ్లు చేనులబడి మేత్తాంటే చూసిండు. పత్తి మందు కోసం పాలేరును పట్నంపంపిన శీనయ్య పటేలు పొలం గట్లు చూసుకుంట పత్తిచేను కాడికి అప్పుడే అచ్చిండు, వచ్చిరాంగనే ఎడ్లు పత్తిచేను మేసుకుంట కనబడ్డాయి.

దిగ్గున లేచిన తిరుపతి ఎడ్లజాడపట్టుకుంట మర్లిండు. తొవ్వలనే శీనయ్య పటేలు పత్తి చేన్లనుండి గెదుముతాంటే రంకెలేసుకుంట బయటపడ్డాయి ఎడ్లు. ఎనుకనే కర్రతోటి శీనయ్య పటేలు ఎంబడిపడ్డడు. తిరుపతి ఎదురయ్యిండు. తిరుపతి కంట్లపడంగనే కోపం పెరిగింది.

"ఎడ్లనుమేపటానికి నాచేనే దొరికినాదుర, నీయవ్వ." అంటూ బండబూతులు తిట్టుడు షురువుజేసిండు శీనయ్య పటేలు.

"తప్పయిందయ్య పటేల" భయంభయంగా పటేలుతోటి అన్నడు తిరుపతి. ఊల్లె ఎన్నడుసుత పెద్దోల్లతోటి మాట్లాడినోడు కాదు తిరుపతి. పటేలు గుడ్లురిమి చూసేటాల్లకు ఎన్నుల వణుకు మొదలయ్యింది. ఎడ్లు కనబడకుండ ఉరుకుతనే ఉన్నయి. వాటెనక పరుగెత్తపోయిండు, తిరుపతిని పటేలు రెక్కపట్టి గుంజిండు.

"ఏందిర, నువ్వేనార పీటిని తోలింది. ఇది నీయవ్వ సొత్తనుకున్నావుర... నీఎడ్ల కొసరమే చేనుపెట్టినామురా" అన్నడు తిరుపతి జుత్తుపట్టుకొని గొరగొర గుంజుకుంట.

ఆ గుంజుడుకు తిరుపతి బొక్కబోర్లపడ్డడు. మోకాల్లు, మోచేతులు కొట్టుకపోయినయి లేచి కాళ్ళుచేతులు దులుపుకున్నడు. ఇగనన్న పటేలు ఇడిసిపెడతడనుకున్నడు.

శీనయ్య పటేలు పొల్లగాని జుట్టందుకున్నడు. తిరుపతేమో జుట్టుగుంజుడు కాకుండ ఉండనీకి చేతితోటి అదిమిపట్టి "దయ ఉంచుండ్రి, దండంబెడత, నన్నిడిసి పెట్టుండ్రి" అన్నాడు. శీనయ్య పటేలు మాత్రం జుట్టిడిసి పెడతలేడు. పొల్లగాడని జూత్తలేడు. పత్తి చేను నాశనం చేసిందన్న కోపమే కనబడుతంది.

"ఈ ఎడ్లను ఎవ్వలిడువమన్నర్ర నిన్ను, ఎవ్వడు మేపమన్నర్ర నిన్ను, ఎవునికి పుట్టినోని విర నువ్వు" అంటూ తిట్టిండు.

తిరుపతి పెనుగులాడి ఎట్లనో జుట్టును ఇడిపిచ్చుకున్నడు, శీనయ్యపటేలు తిట్లకు కోపంగూడ వచ్చింది. కండ్లపొంటి నీళ్ళు అత్తాన్నయి. చిన్నోన్ని చూసి గిదేంపని అని అందా మనుకున్నాడు.

"ఎడ్లకు తెల్వదిగద, తప్పయిందన్న గద, ఇగరానియ్య ఇంటికే తోలుకపోత" అన్నడు ఏడ్చుకుంట. పొల్లగాని మాటలకు శీనయ్య మనుసు కరగలే, పూనకం వచ్చినోని లెక్కున్నడు. ఆడ వాళ్ళిద్దరే ఉన్నరు. చుట్టుపక్కలగూడ ఎవ్వరు లేరు.

"ఏమో బాగ నీల్గుతానవేందిరా, చేనంత తిరిగి ఎడ్లు మేత్తాంటే ఏంచేత్తానవుర లంజ కొడుకా..." అంటూ తిట్టిండు, తిరుపతి ఎంతజెప్పినా పటేలు కోపం సల్లారకపోగా అవ్వను తిట్టుకుంట పోతాంటే కోపమొచ్చింది తిరుపతికి.

"అవ్వనెందుకు తిట్టుడు, అవ్వేంజేసింది. నోరులేని ఎడ్లుగదా మేసినయి. మా అవ్వ తోటి, అన్నతోటిసెప్పి పాబంది చేయిస్త, పాయమాలు కట్టిత్త తియ్యి పటేలా యిగ తిట్టకుండి" అని వేడుకున్నడు.

పటేలుకు కోపం పెరిగిపోయింది "అవ్వనంటే రోషంబుట్టుకచ్చినాదుర, కనకవ్వ కొడుకువార నువ్వు. నీ అయ్యనాకింద పాలేరుగజేసినోడే, నీకింత నీల్గుడార.. అవ్వనన్ననని రోషంబుట్టుకచ్చినాదిర" అనుకుంట మల్ల పొల్లగాని జుట్టుపట్టుకొని గుంజి ఇసిరికొట్టిండు. ఒక్కతోపుతోటే దూరంగ పడ్డడు తిరుపతి. శీనయ్య కోపంతోటి ఊగిపోతాండు.

తిరుపతికి కోపం ముంచుకొత్తాంది, పౌరుషం బుసలుకొడ్తాంది. ఊకుంటే లాభం లేదనుకున్నడు, అటీటు జూసిండు పక్కన బండరాయి కనపడింది. దాన్నందుకొని పటేలు

మీద కసికొద్ది ఇసిరేత్తే... దొర్కకుంట పారిపోతే... ధైర్యం చాలలే, కోపాన్నంతటిని తమాయించు కుంటాండు. ఇగపోనియ్యి తియ్యి అనుకున్నడు, కిందికి మీదికి జూత్తాండు.

పొల్లగాని చూపులతోటి శీనయ్య బిత్తరపోయిండు ఇంకా చిర్రెత్తింది, బాయికాడి గుడిసెమీదున్న కర్రనందుకున్నడు.

"ఏమో కిందికి మీదికి సూడబడ్తివిరా, ఏంజేత్తవుర నువ్వు ఏలెడంత లేవు" అనుకుంట కర్రతోటి మెడకాయమీద కొట్టిండు. ఆ దెబ్బకు లేతబొక్క కమిలింది. మెడచింపులు ఇరిగినయి. పొల్లగాడు విలవిల గొట్టుకున్నడు. మెడలు లేవనిత్తలేవు. అట్లనే కూలవడ్డడు. రెండు చేతులతోని మెడను పట్టుకుని కిందబడి బొర్లుతాండు, అమ్మా... అమ్మా... అని మొత్తుకుంటాండు.

శీనయ్య పటేలు కోపంతోటి కొట్టనైతే కొట్టిండుగని అటెనుక పోరని పరేషాను చూసి సల్ల చెమటలు పట్టినయి. పొల్లగాన్ని కర్రతోటి కొట్టినందుకు గాలిగావరయితాండు. అటుఇటు చూసిండు, పొల్లగాని అరుపులకు ఎవ్వలన్న అటుమొకాన వత్తాంద్రేమోనని చుట్టుపక్కల ఎవ్వలు కనిపిత్తలేరు. ఒక్క మానవపురుగు మెసులుత లేదు.

తిరుపతి కొట్టుకుంటాండు, మొత్తుకుంటాండు. ముక్కునుండి చెవుల నుండి రక్తం గారుతాంది. పొల్లగాడు పడికొట్టుకుంటున్న జాగంత రక్తం మడుగయ్యింది. శీనయ్యకు ఇదంతాజూసి పైపానంపైననేపోతాంది పుసుక్కున పొల్లగాని పానంబోతే... ఆలోసించటానికే ధైర్యం జాల్తలేదు. పొల్లగాని మూలుగులు బందయినయి.

శీనయ్యపటేలు కోపం మొత్తానికి దిగింది. పొల్లగాడు ఎదురయ్యిన యాల్ల మంచిది కాదనుకున్నాడు. పొల్లగాని పానం పొయ్యేదిక్క ఎట్ల అని భయపడ్డడు. బాయికాల్వకాడికి పోయి దోసిట్ల నీళ్ళుతెచ్చి తిరుపతి మొఖంమీద కుమ్మరిచ్చిండు. అప్పటికే పిల్లగాడు గుడ్లెల్ల పెట్టిండు. తిరుపతి పానాలు గాలిల కల్సిపోయినయి.

దెబ్బఆడింగ తలిగినందుకు పోరని పానంబాయె అనుకున్నాడు. మూడేండ్ల కిందట ఊల్లె జరిగిన చాకలి వీరన్న చావు గుర్తుకచ్చింది. బాయలల్ల దిగిపూడికలు తీసే వీరన్న ఓసారి పురుషోత్తం బాయిల దిగిపనిజేస్తాంటే బావిదరి కూలి పెద్దపెద్ద పెళ్ళలు ఇరిగి పడ్డయి. వీరన్న అండ్లనే కూరుకపోయిండు. ఊరోల్లంత పనికిపెట్టుకున్న పురుషోత్తం మీద అగ్గిమీద గుగ్గిలం అయ్యింద్రు. వీరని చావుకి కారణం అంటూ బావిపనికి పెట్టుకున్న పురుషోత్తంని నిలదీసింద్రు. పంచాయతీ పెట్టింద్రు. వీరని కుటుంబం పెద్దదిక్కు కోల్పో యిందని, నష్టపరిహారం కింద లక్షరూపాయలు కట్టియ్యాలని పాబంది చేసింద్రు. ఆ సొమ్ము కట్టలేక పురుషోత్తం ఊల్లేఉన్న పొలం, బాయి అమ్ముకొని పెద్దల మాటమీద

నిలిచిండు. బతుకుదెరువుకోసం ఉండే ఇల్లమ్ముకొని పట్నంబోయిన కథ యాదికచ్చింది శీనయ్య పటేలుకు.



పొద్దుగూకింది, పశువులు ఇండ్లల్లకుచేరుకుంటానయి. పనులల్లకు పోయినోల్లందరు కొంపలల్లకు చేరుకున్నరు. పొలం పనికిపోయిన వెంకటేశ్వర్లు ఇంటికొచ్చిండు. ఎడ్లకుమేత వేద్దామని ఎడ్లదొడ్డికి పోయిండు. ఎడ్లుకట్టేసి లేవు, బెదురుబెదురుగ సూత్తన్నయి. తమ్ముడు వీటిని కట్టెయ్యకుంటనే ఎటుపోయిండనుకున్నాడు. పల్లిపిండి ఎడ్లకుపెట్టి నీళ్ళుపెట్టిండు. కూలి పనికి పోయివచ్చిన కనకవ్వ కాల్రెక్కలు కడుక్కుంట "తమ్ముడేడిర... ?" అంది పెద్దానితోటి.

"ఎమ్మోనే అవ్వ, నేనిప్పుడే వచ్చిన, ఎడ్లయితే దొడ్లెనే ఉన్నయి, సోపతోల్లతోటి ఏడికి పోయిండో" అన్నడు. అటుపక్క, ఇటుపక్క ఇండ్లల్ల చిన్నోని గురించి అడిగింది. ఎడ్లను చూసినంగని తిరుపతిని సూడలేదన్నరు. వెంకటేశ్వర్లు ఇంటెనుక, ఇంటిముందర వెతికిండు. తమ్ముని జాడలేదు. పెరట్లకు పోయిండేమోనని జూసిండు. ఆడగూడ కనబడక పోయేసరికి ఆమాటే అవ్వతోటి చెప్పిండు.

అప్పటికే చీకటిపడింది. కనకవ్వ సోపతి పిల్లగాండ్లందరి ఇండ్లల్లకుపోయింది. అందరూ పొద్దుగాల్నె కనిపించిండుగని మల్ల కనిపించలేదన్నరు. కనకవ్వ పానం అతలాకుతల మైంది. కొడుకుని తలచుకొని కండ్లల్ల నీళ్ళు తిరిగినయి. ఇల్లిల్లు తిరిగి ఉట్టిగనే వచ్చిన వెంకటేశ్వర్లును దగ్గరికి తీసుకొని ఏడ్చింది.

పక్కపొంటి ఇండ్లోల్లు ఒక్కొక్కరే రావట్టింద్రు. "పొల్లగాడు ఎటుపోయిండు మరి" అని ఒకరు, తోటోల్లందరూ ఈడనే ఉన్నరు కదా ! యింకేడికి పోతడుఅని తలోరకంగ మాట్లాడుతాంద్రు. తల్లి ఏడ్పునుజూసి వెంకటేశ్వర్లుకు దుఃఖమాగలే. తల్లిని సముదాయించుతాండు. "ఏడికి పోయిండో కొంచెంసేపు జూద్దాం" అన్నరు.

"ఎడ్లు మర్లి అచ్చినపుడే అనుకున్న పొల్లగాడేడపోయెనోనని" ఎవ్వలో ఒకరన్నారు. "పనిచేతగానోన్ని, చదువుకునే పోరన్ని ఎడ్లగాయనీకి పంపకపోతేంబాయె" అన్నది ఇంకొకామె.

"గిప్పుడవన్ని ఎందుకుగని కందిళ్ళు తీసుకొని, టార్చిలైట్లు పట్టుకొని పొల్లగాడు ఎడ్లను కొట్టుకపోయిన దిక్కుజూసిరాపోంద్రి మగోల్లంతా" అన్నది అందరికన్నా పెద్దమనిషి రత్తవ్వ. మొగోల్లందరూ తలో లైటుపట్టుకొని తయారైంద్రు, వెంకటేశ్వర్లుగూడ వత్తనంటే "అవ్వను జూసుకుంట ఉండుర, జర ఊకుంచుదాన్ని" అని చెప్పి చీకట్లనే బయటికి నడిచింద్రు.

రాత్రంతా వెతికింద్రు. పొల్లగాని జాడతెల్వలే. కనకవ్వ గుండెలుబాదుకున్నది. వెంకటేశ్వర్లు తమ్ముని జాడలేదని తెలిసి కుమిలికుమిలి ఏడ్చిండు. వాళ్ళిద్దరిని అందరూ ఊకుంచుతాంద్రు. ధైర్యం తెచ్చుకోమంటాంద్రు, తెల్లారినంక వాడేదొరుకుతడు తియ్యి అంటాంద్రు. ఆవాడకట్టుల ఎవ్వల్లకి నిద్రల్లేవు. జాగారం చేసినొల్లు చేసినట్లే, ఎప్పుడెప్పుడు మొగోల్లు ఏం మతలావు తెత్తరోనని, ఇనకూడని ముక్కేమన్న జెప్పుతరేమోనని కనకవ్వ, వెంకటేశ్వర్లు రంది పడుతాంద్రు.

కోడికూసేటాల్లకు అందరు మర్లి వచ్చింద్రు. నాలుగు దిక్కులపోయి గుట్టసుట్టూ, పొలాలసుట్టూ, చేనులసుట్టూ తిరిగినోల్లు, బాయిలల్ల వెదికినోల్లు అందరూ అచ్చింద్రు. ఏడ జాడ లేదన్నరు.

ఆస్టల్‌కు పోయిండేమోనని కొందరంటే ఆరాత్రే హస్టల్‌కుపోయి తెల్లారేసరికి వచ్చింద్రు కొందరు. అకాడికే రాలేదన్నారు. కొడుకు జాడ తెల్వకపోయేసరికి కనకవ్వ గుండెలు బాదుకున్నది. ఎవ్వలాపినా ఆగుతలేదు. బొచ్చెంత కొట్టుకుంటాంది. అవ్వను ఊకుంచలేక పోతాండు పెద్దోడు. అవ్వతోకలిసి ఏడుత్తాండు. వాళ్ళనూకుంచటం ఎవ్వల తరమైతలేదు.



తెల్లటన తెల్లారింది, ఊరోల్లు అందరు కనకవ్వ యింటి ముందల్నే ఆగి తిరుపతి ఏమైండని అనుకుంటాంద్రు. ఏడ్చిఏడ్చి శోషచ్చి పడిపోయింది కనకవ్వ. ఎవ్వలెన్నితీర్ల చెప్పినా చిన్నోన్ని కూడా యాదికిజేసుకుంట పార్లిపార్లి ఏడుత్తాంది. దుఃఖమాగుతలేదు. వచ్చినోల్లు కూడా ముక్కు లెగజీత్తాంద్రు. అందరి మొఖాలల్ల విచారమే.

ఊల్లె పెద్దమనుషులందరు జమయ్యింద్రు. ఆస్టల్ సారును కలువడానికి నలుగురు, బల్లె పెద్దసారును కలిసి విచారించడానికి నలుగురు పోయింద్రు. ఆస్టల్ల సదివే పిల్లగాల్లందరిని నిల్చోబెట్టి ఊరిసర్పంచ్ తిరుపతిని గురించి అడుగుతాంద్రు. బల్లె ఎట్ల మెలుగుతడు, ఆస్టల్‌ల ఎట్లమెలుగుతడు, బాగాదగ్గరి సోపతి ఎవ్వరు, పగోల్లు ఎవ్వరు అని అడుగుతాంద్రు.

హుస్నాబాద్ పోయినోల్లు తిరిగి వచ్చింద్రు. పొల్లగానిజాడ ఆస్టలోల్లకు, బల్లోల్లకు తెల్వదన్నరు. అంతా చిత్రం. పొల్లగాడేడపోయిండనుకున్నరు. మల్లోసారి అందరూ గుట్టపొంటి చూసేందుకు పోయింద్రు. మర్లిరాంగ బాయిలల్ల తొంగిసూత్తాంద్రు. శీనయ్య పటేలు పత్తి చేనుల రక్తం మడుగు కనిపించింది. అందరికనుమానం అచ్చి చట్టుపక్కల వెతికింద్రు, మడుగు పక్కనే ముల్లుకర్ర, గైడు కనబడ్డయి. గైడు చూసి అందరూ ఇది తిరుపతిదేనని నిర్ణయమైంద్రు. పక్కన కుప్పపెట్టిన చొప్ప కింద అడుగునుంచి కాల్లు బయటికి కనిపిత్తానయి. జూసినోల్లు జప్పుజప్పన చొప్పనిగ్గింద్రు, తిరుపతి శవం బయటపడేంది.

ఈ వార్త గుప్పున ఊల్లె తెల్సింది. ఊరోల్లందరూ శీనయ్య పత్తిచేనుల పడ్డరు. కనకవ్వ కొడుకు పానంలేని కట్టె పటేలు పత్తి చేనుల పడిందని తెలిసి తలగొట్టుకున్నది.

పోలీసోల్లకు కబురు పోయింది. మెడమీద దెబ్బలు, రక్తపు మడుగు చూపెట్టింద్రు ఊరోల్లు. పొల్లగాన్ని అన్యాయంగ చంపేసి పాట్టలపెట్టుకున్నరు ఎవ్వరో ?అన్నది పోలీసోల్లు అందరినీ అడిగింద్రు. వాళ్ళ కుటుంబానికి ఎవరెవరు పగున్నరని అనుమానం ఉన్నవాళ్ళ గురించి చెప్పమన్నరు. పంచనామ అయ్యింది, పోస్టుమార్టంకు పంపింద్రు. రాత్రి వరకు శవాన్ని అప్పజెప్పింద్రు.

ఆ రాత్రంతా పొల్లగాని శవం దగ్గర కనకవ్వ, వెంకటేశ్వర్లును ఊకుంచెటోల్లు సతమత మైపోతాంద్రు. నిన్నిట్లా సూత్తమనుకోలేదు బిడ్డా.. కట్టెల్లకట్టయితివా బిడ్డా... చదువుకుంటా నంటివి బిడ్డా... నన్ను సాత్తనంటివి బిడ్డా... అంటూ ఏడుపులు మిన్నంటాయి. సూడ వచ్చి నవాల్లందరూ కనకవ్వతో గొంతు కలిపింద్రు. తెల్లారి తొమ్మిది గంటలకల్లా పొల్లగాన్ని దానం జేసింద్రు.

కనకవ్వ మనిషిలమనిషిగ లేదు బేజారైంది, మూడు రోజుల నుంచి తిండిలేదు, తిప్పల లేదు మొగంల కళ లేదు. వెంకటేశ్వర్లు సముదాయిత్తాండు. కనకవ్వ పరిస్థితి కఠినమై పోయింది. ఊల్లె అందరు తిరుపతి చావుకు కారణాలు వెతుకుతాంద్రు. పటేలు చేన్లల్ల ఎందుకు శవమయ్యిండు అనేదాని చుట్టూ ఆలోచించింద్రు. అందరికి పటేలు మీదకి అనుమానం వచ్చింది, పటేలు పాలేరుకూడా ఆరోజు పట్నంబోయిన ముచ్చట చెప్పుతోంటే పటేలుమీద అనుమానం పెరిగింది. అ ముక్కనే పోలీసోల్లకు చెప్పింద్రు. వాళ్ళు వాళ్ళ పద్ధతిలల్ల అసలు ముక్క రాబట్టింద్రు. శీనయ్య నేరం ఒప్పుకున్నాడు. ఊల్లె అందరు 'థూ' అని ఊంచింద్రు.



బడిలో తిరుపతి చావుగురించి తెలిసి పంతుల్లందరూ పరేషాను అయ్యింద్రు. ఆస్టల్ల గూడ పిల్లలందరూ అయ్యో పాపం అనుకున్నారు. తిరుపతికి మంచి భవిష్యత్తున్నదని అనుకునేటోల్లం అని బల్లె జరిగిన సంతాప సభల పతొక్కరు మాట్లాడింద్రు.

కనకవ్వ కొడుకుమీద రందితోటే మంచంబట్టింది. సొమ్మసిల్లిన పానంతోటి, కడుపుల తిండిలేక, మాటిమాటికి కొడుకును యాజ్జేసుకుంట సగమయ్యింది. పొల్లగాని దినాల నాటికి కనకవ్వ కూడా రందితోటి కాలంచేసింది. కొడుకుమీది మనాది తల్లిపానాన్ని బలి తీసుకుంది. ❑

**యన్.వి.యన్. చారి,**

లెక్చరర్,

ఇ.నెం. 2-11-387, విద్యారణ్యపురి,

హన్మకొండ - 506 009 ఫోన్ : 438660



# నరకం మరెక్కడో లేదు !

నా పేరు అహల్య. ఆనాటి గౌతముని శాపంతో రాయిగామారిన అహల్యను కాదు. ఈనాటి వరకట్న వ్యామోహ గౌతముడిచే బండబారిన మనసుగల అహల్యను.

మా నాన్న కుచేలరావుగారు సార్థక నామధేయులు, ఎలిమెంటరీ స్కూల్లో టీచర్. ఎందరో విద్యార్థుల జీవితాల్ని నందనవనాలుగా మార్చిన మానాన్న జీవితం మాత్రం రాళ్ళు, ముళ్ళతో నిండిపోయింది. మమ్మల్ని కూడా తీర్చిదిద్ద లేకపోయారు. జీతం రాళ్ళు నెలసరి వెచ్చాలకే సరిపోక అప్పులు చేయాల్సివచ్చేది. అప్పులు కొండల్లా పెరిగిపోయేవి ప్రపంచంలో ఎత్తైన పర్వతమేదని ఎవరన్నా అడిగితే "మా అప్పు" అనే జవాబు చెప్పేదాన్ని.

నాకు ఊహ తెలిసేసరికల్లా మా ఇంట్లో నాక్కనిపించినవి ఒక మూల కుక్కిమంచం. దానికి అతుక్కుపోయిన ఎముకలగూడు, మా బామ్మ నిరంతరం దగ్గుతూ, చిరిగి, మాసి కంపుకొట్టే గుడ్డలమూటలూ, అక్కడక్కడ ఊడిపోయిన పెంకులూ, ఆ రంధ్రాలగుండా మమ్మల్ని వెక్కిరించే సూర్యచంద్రులు, రేపోమాపో కూలిపోతానని బెదిరించే ఇల్లు. అంతే కాదండోయ్ ముగ్గురక్కలూనూ ! ప్రపంచంలోని దరిద్రమంతా మా ఇంట్లోనే తలదాచు కున్నట్టుండేది. అప్పుడు మాకు కష్టాలంటే అర్థమే తెలియదు. నాన్నకు తక్కువ జీతమైనా తిండికి లోటుర్రానిచ్చే వాడుకాదు. కానీ అమ్మా, నాన్నమాత్రం రాత్రిపూట తినకపోయేవాళ్ళు. ఏమని అడిగితే, శనివారమనీ, ఆదివారమనీ ఏడు రోజులూ ఏడుగురు దేవుళ్ళ పేర్లు చెప్పే వాళ్ళు. అలా పస్తుంటే పుణ్యమొస్తుందని చెప్పేవారు. పెద్దయ్యాకగాని తెల్సిందిగాదు, ఏ దేశంలోలేని ముక్కోటి దేవతలు మనకెందుకున్నారో, వాళ్ళ పేర్లు చెప్పి తమ అశక్తతను ఎట్లా కప్పిపుచ్చుకుంటున్నారో. కాలం మన కోసం ఆగదు కదా ! నాకు ఏ అనుభూతి లేకుండానే వయసు వచ్చేసింది పెళ్ళీళ్ళ లిస్టులో నాల్గోదానిగా చేరిపోయాను.

ముప్పైవసంతాల పెద్దక్క నలభై శిశిరాల్ని మింగినదానిలా కనిపిస్తోంది. ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి. లక్ష్మిసరస్వతులు మాకు దూరంగాఉన్న రతీదేవి మాత్రం మమ్మల్ని

ఆదరించింది. దాని పెళ్ళిగురించి అమ్మ నాన్నతో రోజూపోరాడేది. నాన్నమాత్రం ఏంచేస్తాడు, ఆయనకు మామీద ప్రేమలేకకాదు, కానీ వరకట్నం మా పెళ్ళికి ఆయనకు మధ్య రాక్షసిలా నిలిచినపుడు !

ఓ రోజు నేను బడినుండి వచ్చేసరికల్లా యింట్లో అంతా హడావుడిగా వుంది. రెండో అక్క చెప్పింది "పెద్దక్కకు పెళ్ళిచూపులు". నాకు ఎంతో సంతోషం కల్గింది. మాయింట్లో పండుగలకూ మామూలు రోజులకు అట్టే తేడా ఉండదు. ఆ రోజు పిండివంటలు చేసారు. అక్కను ముస్తాబు చేసారు. పక్కింట్లో రెండు కుర్చీలు అడుక్కొనివచ్చి ముందు గదిలో వేసారు. పెళ్ళికొడుకుతోబాటు ఎవరో వచ్చారు. నాన్నవాళ్ళను సాదరంగా ఆహ్వానించారు. అమ్మ అంది "పెళ్ళికొడుకు అందంగ్గా ఉన్నాడు అమ్మాయి అదృష్టం"మురిసిపోతూ. రెండో అక్క అడిగింది "ప్రక్కనున్నాయన పెళ్ళికొడుకు తండ్రా" అని. నాన్న కోపంగా చూసారు, "ఆయనే పెళ్ళికొడుకు, ప్రక్కనున్న అబ్బాయి అతని కొడుకు" అంటూ వివరించాడు. మేమంతా అవాక్కయ్యాము. అక్కను చేసుకునేది ఆ ముసలాయన, నాన్నకంటే బహుశా నాలుగయిదేళ్ళు చిన్నవాడేమో ? అమ్మ ముందు తేరుకుంది "నా కంఠంలో ప్రాణం ఉండగా ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదంది".

ఆయనకు మనం పదివేలు బాకీ ఉన్నాం, మనమ్మాయిని చేసుకుంటానని ఆయనే అడిగాడు. మనం బాకీ తీర్చనవసరం లేదంటూ అమ్మను సముదాయించారు.

కేవలం వండివార్చేందుకు పిల్లల్ని చూసుకునేందుకు ఆడది కావాలట. వంట ఇంటికి, పడకయింటికి పనికివచ్చే రోబోట్ కాబోలు ఆడదంటే ? శాశ్వత పనిమనిషి కోసం ముసలాయన ఎంత ఎత్తువేసాడు ? అక్కకు ఈ విషయం తెల్సింది, పరిగెత్తుకుంటూ వచ్చి అమ్మను కౌగిలించుకొని ఏడ్చింది. నాకు పెళ్ళి అవసరం లేదు, నేను మీకు భారమైతే ప్రపంచం వీడిపోతానని బెదిరించింది.

మా నాన్నకూడా తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించారు. మీరు కాదంటే నేను ఉరిపోసుకుని చస్తాను. ఆరునూరైనా పెళ్ళి జరగాల్సిందేనని పట్టుబట్టారు. అనుకున్నంతసేపు పట్టలేదు. అక్క పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళై అత్తవారింటికెళ్ళాక అక్క కనీసం మా గడప త్రొక్కిచూడ లేదు. అదేమైన ఆర్థికసహాయం చేస్తుందేమోనని ఆశించి భంగపడ్డారు నాన్న. ముఖ్యంగా నాన్నంటే దానికి కోపం పెరిగిపోయింది.

పెద్దక్క పెళ్ళి మా చిన్నక్కలిద్దరిలో మార్పుతెచ్చింది. ఎప్పుడు ఏవో ఆలోచనలతో మునిగి తేలుతుండేవారు. ఆ రోజు నేనింకా మరచిపోలేదు. రాత్రంతా రెండో అక్క నా ప్రక్కనే పడు కుంది. ఎంతో ముభావంగా ఉంది. నేను ఏవేవో కబుర్లు చెబుతున్నా విని విననట్లు ఊరు

కుంది. నన్నెవరో నిమురుతువుంటే మెలుకువ వచ్చింది. అక్క ఇంకా నిదురపోలేదు. నా వంకే తదేకంగా చూస్తు తలనిమురుతోంది. నాకు భయంవేసింది. దానికళ్లలో జలపాతంలా కారిపోతున్నాయి. "ఏం జరిగిందే" అంటూ దిగ్గున లేచి కూర్చున్నాను. అది మెల్లగా కళ్లు తుడుచుకొని... "ఏం లేదులే... పడుకో" అంది. "ఏం జరిగిందో చెప్పు" అన్నాను రెట్టిస్తు. "ఈ రాత్రి ఏం చెప్పాలి, ఉదయం చెపుతానులే" అంది. నేనేం మాట్లాడలేదు. నిద్దర నాకు క్లోజ్ ఫ్రెండ్.

ఇంట్లో ఏడ్పులు, కేకలు విన్పించి చటుక్కున లేచాను. అందరూ ముందు గదిలో ఉన్నట్లున్నారు. నేను వెళ్ళేసరికి రాత్రి నా ప్రక్కన సజీవంగా పడుకున్న రెండో అక్క నేలపై నిర్జీవంగా నిద్రపోతోంది. నేను కుప్పకూలిపోయాను. అమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి తన ఒడిలోనికి తీసుకుంది. ఏడుపొక్కటే మనసులోని బాధను తగ్గిస్తుంది. కాసేపు ఏడ్చాక... అమ్మ చెప్పింది... "ముందుగదిలో ఉరిపోసుకుని చచ్చిపోయిందని". నాన్న మౌనంగా అక్కరాసిన ఉత్తరాన్ని చేతిలో పెట్టారు. తన చావుకు ఎవరు బాధ్యులుకారంటూ, కేవలం ఈ లోకంపై విరక్తితోనే ఆత్మహత్య చేసుకుంటున్నట్లు వ్రాసుంది. ఆ ఉత్తరం చూసాక నాకు దుఃఖం ఆగలేదు. అప్పటికే ఇంట్లో చేరిన ఇరుగుపొరుగు పోలీసులు రాకముందే తతంగమంతా ముగించమని సలహా ఇచ్చారు. మాకూ... అదే సబబనిపించింది. చేదు నిజాల్ని తనలోదాచుకుంటూ కాలం మరింత ముందుకు నడిచింది. విమలక్క పుస్తకాలన్ని మూటగట్టుదామని తీయసాగాను. దాని చావుకు కారణం ఆ మూలకంగానే తెలుసుకోగలి గాను. హరి రాసిన ప్రేమలేఖలు అక్కయ్య విషాదగాధను తెల్పాయి. చనిపోయే నాటికి అది గర్భవతి అని తేలింది. ఎవడో దుర్మార్గుని ఘాతుకానికి అమాయకంగా బలైపోయింది. ప్రేమ పేరుతో మగాడు జరిపే మోసాలన్ని కథలుగ, సినిమాలుగ వస్తున్నా స్త్రీ పురుషున్ని నమ్ముతూనే వుంటుంది, మోసపోతూనే వుంటుంది... గొర్రె కసాయివాణ్ణి నమ్మినట్లు. ఆ నిజాల్ని నాలోనే దాచుకోవాలనుకున్నాను.

వయసొచ్చిన ఆడపిల్లలు గుండెలమీద కుంపట్లా ఉండటం భరించలేక వంద అబద్ధాలైన ఆడి పెళ్ళిచేయాలని చూస్తారు తల్లిదండ్రులు. మా మూడోఅక్క విషయంలో అట్లాగే జరిగింది. ఎవరో ముక్కుమోహం తెలియని వ్యక్తి కట్నం లేకుండా అక్కను పెళ్ళి చేసుకుంటానని తెల్పడం, దానికి అమ్మనాన్న అంగీకరించటం జరిగిపోయింది. కనీసం పెద్దక్కకు పెళ్ళికొడుకునైనా చూపించారు. దీనికి ఆమాత్రం కూడా లేదు. హడావుడిగా దేవుని గుళ్ళో రాత్రిపూట పెళ్ళి జరిపించారు. దొంగపెళ్ళి అంటే ఇదేనేమో. అమ్మ సంతోషం తో తన పెళ్ళిలోపెట్టిన గాజులు, నెక్లెస్ అలంకరించి పంపింది అత్తగారింటికి. కానీ పది రోజులు తిరక్కుండానే, కాళ్ళ పారాణి ఆరకుండానే తిరిగివచ్చి భోరుమంది. అమ్మ, నాన్న

కంగారుపడ్డారు. తన కథ చెప్పింది. అత్తవారింట్లో తను, భర్తతప్ప ఎవరూ లేరు. మొదటి రెండు మూడ్రోజులు ప్రేమగానే చూసుకున్నాడు. తర్వాత కాని అతని నిజ స్వరూపం బయటపడలేదు. మొదటి భార్య ఆమె తండ్రితో రావటంతో, అప్పుడు చెప్పాడు తనకిది వరకే పెళ్ళయ్యిందని, మొదటి భార్య అలిగి పుట్టింటికి వెళ్ళటంతో ఆమెకు బుద్ధి చెప్పటానికే రెండో పెళ్ళి చేసుకున్నానని. ఆమె అంగీకారం లేకుండా చేసుకున్నందున ఈ పెళ్ళి చెల్లదన్నాడు. పైగా నెక్లెస్, గాజులు లాక్కొని పంపించాడు.

విషయం విన్న నాన్న మండిపడ్డాడు. కాని ఏం లాభం... దాని జీవితం తెల్లారిపోయింది. చేతులు కాలాక... ఆకులు పట్టుకోవటంలో ప్రయోజనమేముంది. నాన్న మళ్ళీ ప్రయత్నం చేసినా "చట్టప్రకారం ఈ పెళ్ళి చెల్లదు, దిక్కున్నచోట చెప్పుకో ఫో" అన్నాడు. కనీసం నెక్లెస్, గాజులుకూడా ఇవ్వలేదు. మోడువారిన మూడోఅక్క జీవితం చిగురిస్తుందా. శిశిరం తర్వాత వసంతం వస్తుంది సహజంగా. కాని మ్రాను చిగురిస్తుందా ? ఆటుపోట్లకు తట్టుకోలేక పోయారు నాన్న. గుండెపోటు వచ్చింది, హఠాత్తుగ పున్నామ నరకం నుండి తప్పించటానికి కొడుకు కావాలన్న తాపత్రయంలో నలుగురు ఆడపిల్లల్నికని, పెంచేశక్తిలేని నాన్నను కాల్చ టానికి ఆడపిల్లే కావాల్సివచ్చింది. వచ్చిన పెన్షన్ డబ్బులతో అమ్మ కనీసం నా పెళ్ళయిన వైభవంగా చేయాలనుకొంది. కట్నాల విషవలయంలో చిక్కుకుపోయిన వరుల్ని కొనటానికి కొద్దిపాటి పెన్షన్ డబ్బులు ఏం సరిపోతాయి ? మండల ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్న రవి పదివేల రూపాయలతో నా స్వంతం అయిపోయాడు. అతనికి తల్లి మాత్రమే ఉంది నాలా. పుట్టినింటి నుంచి మెట్టినింట్లో కాలుపెట్టాను. కొత్త సంసారం, కొత్త ఊహలు, బంగారుకలలు మొదటిరాత్రే కరిగిపోయాయి. మల్లెల సువాసనలు గుభాళించాల్సిన చోట బ్రాందీ వాసన గుప్పుమంది. మనసు విప్పిమాట్లాడుకోవటం కరువయ్యింది. "నీవెరినైనా ప్రేమించావా ? అయినా నువ్వేం చేస్తావులే, వయసు ముదిరిపోయే, పెళ్ళికాకపోయే" వెకిలిగా నవ్వుతూ అనేసరికి శరీరంలో ముళ్ళు గుచ్చుకున్నట్లయ్యింది. మనసు తూట్లు పడింది. పెళ్ళికి ముందు మగాడు ఎన్ని తప్పులు చేసినా పట్టించుకోకూడదు. కాని ఆడది మాత్రం పవిత్రంగా, అనాఘ్రాతంగా ఉండాలి. పురుషాధిక్య సమాజం స్త్రీని బానిసగా, అబలగ సృష్టించింది. నరనరాల్లో ఆ భావాలే జీర్ణించుకుపోయిన నా భర్త వాళ్ళకు ప్రతినిధే కదా... ఇంకా ఎట్లా మాట్లాడుతాడు. రోజులు గడిచేకొద్దీ అతనిలోని మృగం బయటికి రాసాగింది. నా మౌనం, నా సహనం అతనిలో అనుమానం, కక్షను పెంచింది. అందంగా ఉంటావనే కదా నీ గర్వం అంటూ... కాలుతున్న సిగరెట్‌ను నా శరీరంపై ఆర్పేవాడు. ఆ బాధను మొదట్లో భరించలేకపోయినా.. తరువాత అలవాటయింది. దానికితోడు మా అత్త

గారు కూడా కట్నం తక్కువ ఇచ్చారంటూ కాల్చుకు తినేది. రోజూ ఆఫీసు నుండి రాగానే ఆయనకు పితూరీలు చెప్పటం, అతను నా శరీరాన్ని ఫుట్‌బాల్‌లాగ ఆడుకోవటం నిత్య కృత్యమయింది.

ఓ రోజు, ఆఫీసు నుండి వస్తూనే ప్రేమగా పిలిచాడు. కాఫీ గ్లాసుతో వెళ్లాను. ఆ రోజైనా తల్లినికాబోతున్న విషయాన్ని చెప్పాలనుకున్నాను. మా అత్తగారు ఆశ్చర్యంగా చూస్తున్నారు. "మా ఆఫీసులో క్యాష్ తక్కువయింది, నేను వాడుకున్నాను. రెండ్రోజుల్లో కట్టాలి. మీ అమ్మనడిగి ఐదువేలు తీసుకరా" అన్నాడు కటువుగ. అతని నిజస్వరూపం అర్థమయింది. "మా అమ్మ దగ్గర ఏముందండీ, ఆవిడ తిండికే ఎంతో బాధపడుతోంది. అయినా, అనుకున్న విధంగా ఉన్నదాంట్లో అన్నీ ఇచ్చారు కదా" నా మాటలు పూర్తికాకుండానే చెంప చెళ్ళుమంది "బోడి కట్నం ఇచ్చారు, అరవైవేలు ఇస్తామని వచ్చారు తెలుసా ! జాలిపడి చేసుకున్నానన్న కృతజ్ఞత కూడా లేదు". ఆ రోజున నేను తిన్నదెబ్బలు పగవాళ్లకు కూడా వద్దు. కడుపులో తన్నటంతో అబార్షన్ అయింది. కళ్ళు తిరిగిపడిపోయాను ఎవరో డాక్టరును తీసుకొని వచ్చారట. మగతగావున్న నాకు వారి మాటలు విన్పించసాగాయి. "దీనితో ఖర్చేతప్ప లాభం లేదు. దీన్ని వదిలించుకుంటే, ఇంతకంటే భేషయిన సంబంధం చేస్తాను. నీకేం ఖర్మరా" అంటున్నది. అత్తగారు. "మరి దీన్ని వదిలించుకోవటం ఎలాగే" వినపడింది భర్త గొంతు. అత్తగారు లోపలికి వెళ్లిన శబ్దం లీలగా విన్పించింది. నా ఒంటిపై కిరోసిన్ పడటంతో దిగ్గునలేచి కళ్లు తెరిచేసరికి వెలుగుతున్న అగ్గిపుల్ల కాంతిలో నా భర్త ముఖం వికృతంగా కన్పించింది. నాకేమాత్రం అవకాశం ఇవ్వకుండా అగ్గిపుల్లను నా ఒంటిపై విసిరాడు. ఇంకే ఆడపిల్ల మరో అహల్య కాకూడదని, వరకట్న పిశాచాలకు ఒక గుణపాఠం చెప్పాలని... ఒంట్లోని సత్తువనంతా కూడగట్టుకొని ఒక ఉదుటున వాళ్ళిద్దరిని గట్టిగా కరిచి పట్టుకున్నాను... ❑

*(తేది 21-4-1991న ఆకాశవాణి-కొత్తగూడెం కేంద్రం ద్వారా ప్రసారమయిన కథ)*





**నంబూరి పరిపూర్ణ,**
రిటైర్డ్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ఆఫీసర్,
ఇ.నెం. 5-7-41, సంగీతనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైద్రాబాద్ - 72 ఫోన్ : 3065750

# శిఖరారోహణ

ఫస్టుక్లాసులో ఇంటర్ పాసై కంప్యూటర్ బి.యస్సీ., చెయ్యాలనుకుంటున్న భార్గవిని, హఠాత్తుగా చదువుమానేయమని చెప్పాడు గోవిందరావు. కూతరు గ్రాడ్యుయేటయితే, పోస్టుగ్రాడ్యుయేటల్లుణ్ణి తేవాల్సి వస్తుందనీ, అందుకుతగ్గ త్రాణ తనకులేదనీ భయం. తల్లీ తమ్ముడూసైతం తండ్రిమాటనే పట్టుక్కూర్చునే సరికి - ఆశకు నీళ్ళొదలక తప్పలేదు భార్గవికి.

చిన్నతనంలోనే అబ్బిన తాగుడలవాటు, పెళ్ళయ్యాక మరింతగా ముదిరింది గోవింద రావుకు. ఐతే-పొగాకు కమిషన్ వ్యాపారం చేస్తూ దండిగానే సంపాదిస్తుంటాడు. కానీ-తన తాగుడుకూ, జూదం ఖర్చుకూపోగా మిగిలింది మాత్రమే భార్యచేతిలోపెట్టి, దాన్తోనే ఇంట్లో అన్నీ గడపమంటాడు. తన దృష్టిలో, తన స్వంత ఖర్చులు తప్ప మిగిలినవన్నీ వృథా ఖర్చులు ! ఇంటికి సంబంధించిన ప్రతిదీ-ఎంతో పొదుపుగా జరగాలి. గడ్డకట్టే చలిరోజుల్లో కూడా ఎవరూ వేన్నీళ్ళు పోసుకోగూడదు. మండే నడివేసవిలో ఫ్యాన్లు వేసుకోగూడదు. ఎప్పుడైనా పిల్లలు 'ఆన్'చేస్తే చటుక్కున ఆపుజేస్తాడు. ప్రత్యేకంగా కూరలూ, వంటలూ చెయ్యగూడదు. ఎడముఖం పెడముఖంగా వుంటే చప్పున వెళ్లిపోతాడు. ఇలాంటి పొదుపు చర్యల్ని తను తు.చ. తప్పకుండా అమలుచేస్తూ, ఇంట్లో అందర్నీ అమలుపర్చమంటాడు.

నిత్యం తాగిరావడం, అందరికన్నా ముందు తను భోజనం చేయడం, తీరా భార్యా బిడ్డలు తినబోయే సమయానికల్లా ఏదో ఒక గొడవ లేవదీసి, భార్య సుభద్రమ్మ వీపు విమానం మోత మోగించడం ! దుఃఖాన్ని మింగుతూ తల్లీ, అభోజనంగా పిల్లలూ అనేక రాత్రులు వెళ్లబుచ్చుతుంటారు.

ఇటీవల-తాగుడు మరీ ఎక్కువయ్యింది. ఇంటిని బొత్తిగా పట్టించుకోడం లేదు. టెన్తు చదువుతున్న కొడుకు ఎన్నిసార్లు ఫీజుడబ్బులడిగినా ఇవ్వకపోయేసరికి ఏకంగా స్కూలే మానేయవలసి వచ్చింది. వ్యాపారపు పన్లమీద చుట్టూపట్ల ఊళ్లకెళ్లి వస్తుండే గోవిందరావు

కొన్ని రోజుల్నించీ అసలు ఇంటికిరావడం మానేశాడు. తనొచ్చి భత్యమిస్తుంటేనే పొయ్యిలో పిల్లి లేచేది. తండ్రి రాకపోయేటప్పటికి పిల్లలు ఆకలితో నకనకలాడసాగారు.

"ఈ మనిషేమయినట్టు ? తాగి రోడ్డుమీద ఏదైనా యాక్సిడెంటు చేసుకోలేదుగదా !" అనుకుంటూ, దిగులు దిగులుగా భర్తకోసం ఎదురుతెన్నులు చూస్తూ కూర్చుంటోంది సుభద్రమ్మ.

రాన్రాను-గోవిందరావు ఇంటిముఖం చూడ్డం పదిహేను రోజులకొకమాటూ, ఇరవై రోజులకొకమాటూ జరుగుతోంది. ఈసారయితే అతనొచ్చి రెండు నెలలు అవుతోంది. సుభద్రమ్మకి ఎటూ పాలుపోవడం లేదు. ఏం చేసి పిల్లల కడుపుకింత వండిపెట్టుకోవాలో తెలియడం లేదు. ఇంటిల్లిపాదీ పస్తులుంటున్నారు.

కూతురు భార్గవి-దీర్ఘంగా ఆలోచించింది. ఈ దుస్థితిలో బయటపడేందుకు తను నడుంగట్టక తప్పదు. గట్టిగా ప్రయత్నించి, ఎంత చిన్న ఉద్యోగమైనా తను సంపాదించాలి. ప్రయత్నాలు ఫలించి చివరకొక ఫ్యాన్ల తయారీ కంపెనీలో అకౌంటెంట్ ఉద్యోగం దొరికి, అందులో చేరింది.

రెండువేల జీతం. తల్లి ముగ్గురూ కడుపునిండా తింటూ నిశ్చింతగా బతుకుతున్నారు. తల్లి ముఖంలోకి కొత్తకళ వచ్చింది. తమ్ముడు మళ్లీ స్కూలుకెడుతున్నాడు. భార్గవి తల్లికి సాక్షాత్తూ అన్నపూర్ణలాగా, తమ్ముడు భాస్కర్‌కి ఆమె సాక్షాత్తూ సరస్వతిగా కనిపిస్తోంది.

గోవిందరావు ఏమయ్యాడో, ఎక్కడున్నాడో జాడలేదు !



పూర్తిగా సంవత్సరం గడిచాక తిరిగి ఇంటికొచ్చాడు గోవిందరావు. తనింతకాలం ఎక్కడ వుందీ, ఏం చేస్తున్నదీ అడగ్గూడదని శాసించాడు. వచ్చీరాగానే అతని వంటినతుక్కుని, మురిక్కంపు గొడుతున్న బట్టలు విడిపించి, ఒంటినిండా బాగా చమురుపట్టించి, తలంటి పోసింది సుభద్రమ్మ. బొత్తిగా ఎముకలపోగయి వచ్చిన భర్తని చూచి ఎంతో జాలిపడింది. ప్రతి రోజూ ప్రత్యేకంగా లివరూ, చికెను, చేపలు వండిపెడుతూ నెలదిరిగేసరికి ఎలకలాగా వున్నతన్ని ఏనుగల్లే తయారుచేసింది.

బాగా కోలుకున్న గోవిందరావు ఇంటి స్థితిగతుల్ని తీరుబడిగా పరిశీలిస్తూ, అంచనా వెయ్యడం మొదలెట్టాడు. ఇన్నాళ్ళూ తనులేనందుకు వీళ్లు ఇబ్బందులు పడినట్లుగా కన బడ్డంలేదు. వస్తువులూ, సరుకులూ ఇల్లు నిండుగా వున్నాయి. భార్గవి ఉద్యోగం చేసి బాగా సంపాదిస్తున్నట్టుంది. తన భార్యకిప్పుడు కూతురిఅండ బాగా దొరికింది. తననూ, తన

మాటనూ యింక లెక్కెందుకు చేస్తుంది ? ఇన్నాళ్లలా భయభక్తుల్తో తన అడుగులకు మడుగులెందుకు వత్తుతుంది ?

తను అనుకుంటున్నది నిజమోకాదో తేల్చుకోవాలనుకుని ఓ రోజున బాగా తాగి, నిషా ఎక్కించుకొచ్చాడు. వచ్చిందే తడవుగా "ఏయ్ ! మంచినీళ్లు పట్రా !" అని భార్యకు కేక పెట్టాడు. సుభద్రమ్మ నీళ్లుదెచ్చి, గ్లాసందిస్తుండగానే "ఏంటింత ఆలస్యం ? అడగ్గానే తేకుండా, ఏం పెత్తనాలు చేస్తున్నావక్కడ ?" అంటూ గ్లాసు నేలకిసిరికొట్టి, ఆమెని దబ దబమని బాదడం మొదలెట్టాడు.

అప్పుడే వచ్చి, ఇంట్లోకడుగుబెడుతున్న భార్గవి "ఏంటి నాన్న ! ఎందుకలా బాత్తున్నావు అమ్మని ?" అని గదమాయిస్తూ అడిగింది, అతనికడ్డం వెళ్తూ.

"అమ్మాయ్ ! నువ్వడ్డం రామాకు, ఈమధ్య దీనికి నా మాటంటే ఏ మాత్రం లెక్కుండటం లేదు. అదేంటో తేలుస్తానివ్వాళ" అంటూ మళ్లీ తల్లి మీదికెళ్తున్న వాణ్ణి, విసురుగా పక్కకునెట్టి, "మా అమ్మ ఇంతకాలం నీచేత తిన్న దెబ్బలు చాల్లే, ఇకమీద ఆమె వంటిమీద దెబ్బపడనిచ్చేది లేదు. మీరిక చెయ్యెత్తితే ఊరుకోను" అని వార్నింగిచ్చి, తల్లిని వెనగ్గదిలోకి తీసుకెళ్లింది భార్గవి. కూతుర్ని చురచురా మింగేసేలా చూస్తూ, చరచరమని బయటికెళ్లి పోయాడు గోవిందరావు.

మర్నాటినించీ భార్గవికి తండ్రి వేధింపులు, సాధింపుల జోరు మొదలయ్యింది.

"అమ్మాయ్ ! నా మాటినుకొంచెం, నా కూతురు బయటికెళ్లి ఉద్యోగం చెయ్యడం అనేది నాకు చాలా చిన్నతనం. మాకు ఆడపిల్ల ఆర్జనమీద బతికే అవసరంలేదు. రేపట్నించే నువు ఉద్యోగం మానేయ్యాలి" అజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు గోవిందరావు.

ఈ విషయంమీద ఆ రోజు మొదలుకొని ప్రతిరోజూ తండ్రీ కూతుళ్లకి వాదం జరుగు తోంది. ఇల్లొదిలి ఎప్పుడు వెళ్లిపోయి, తిరిగి ఎప్పుడు వచ్చేదీ తెలియని, బొత్తిగా నిలకడలేని తండ్రి వత్తిడికి లొంగదలచడం లేదు భార్గవి. కుటుంబాన్ని ఎంతగానో ఆదుకుంటుండిన ఉద్యోగాన్ని ఎందుకొదిలెయ్యాలట తను ?

నెల గడిచింది. మళ్లీ చెప్పాపెట్టకుండా ఎటో వెళ్లిపోయాడు తండ్రి. తరువాతనించీ, మూణ్ణెల్లకో, ఆర్నెల్లకో ఒకసారొచ్చి ఒకనెలపాటుండి భార్యతో సకలసేవలు చేయించుకుని ఆమె తనవద్ద ఇంటిఖర్చులకని వుంచుకున్న డబ్బును లాక్కుపోవడం మొదలుబెట్టాడు. ఇంట్లో ఎవరికీ అతడిమీద భరోసా లేదు. అసలు తను ఇంటికి రాకపోవడమే మేలనుకునే స్థితికొచ్చారు.

కొన్నాళ్ల తరువాత సుభద్రమ్మకు ఒక మంచి ఆలోచన కలిగి, బ్యాంకులోను తీసుకుని నాలుగు గేదెల్నికొంది. వాటిని చక్కగా మేపుతూ, వాటికి చాకిరీ చేస్తూ, పాలుపిండి కేంద్రానికి పంపుతూ నెలకు వెయ్యిన్నర వరకూ సంపాదించసాగింది. కూతురుతోపాటు, తన భార్యకూడా సంపాదిస్తున్నదనివిన్న గోవిందరావు, వెంటనే ఇంటికొచ్చి వాలాడు. ఎన్నడూ చూపించని ప్రేమ - భార్యమీద కురిపించసాగాడు. ఆ మాటా ఈ మాటా చెప్పి, డబ్బున్నప్పుడు దాన్ని వ్యాపారమ్మీదపెడితే బోల్డులాభమొస్తుందని బులిపించి, సుభద్రమ్మ పోగేసిన డబ్బంతా శుభ్రంగా ఊడ్చుకెళ్ళాడు. అంతటితో ఆగలేదు. మళ్ళీమళ్ళీ వస్తూ, వ్యాపారం పేరుతో మళ్ళీ మళ్ళీ భార్య దగ్గరి సొమ్ము పట్టుకుపోతున్నాడు.

ఇలాగే ఒకసారొచ్చి డబ్బివ్వమంటూ పట్టుకుంటే "ఇకనించీ నా దగ్గర చిల్లిగవ్వ దొరకదు, నువ్వొచ్చేదీ డబ్బుకోసమే ఐతే యిక నుంచి రానవసరం లేదు" అని ఖచ్చితంగా అంది సుభద్రమ్మ. దాంతో ఉగ్రరూపం ధరించి, తలుపులన్నీ మూసేసి ఆమెను కొట్టడం సాగించాడు. నిగ్రహించుకోలేని ఆగ్రహంతో, రెండు చేతుల్తో ఆమె మెడను బిగిస్తున్నాడు. అప్పుడే ఇంటికొచ్చిన భార్గవికి ఇంట్లో ఏదో గడబిడ జరుగుతున్నట్టు అర్థమై కిటికీలోంచి తొంగిచూడ్డంతో ఆ భయానక దృశ్యం కంటబడి, బిగ్గరగా అరుస్తూ ఇరుగుపొరుగుల్ని పిలిచి, తలుపులు తీయించి "నువ్వసలు మనిషివేనా ? మాటమాటకీ వచ్చి ఎందుకిలా పీడిస్తున్నావు మమ్మల్ని ? ఆడవాళ్ళ ఆర్జనతో బతకడం యిష్టంలేదన్న నువ్వు మరిప్పుడు మా కష్టార్జితాన్నెందుకు తన్నుకుపోతున్నావు ? పో ముందిక్కణ్ణించి ! కదలకపోతే పోలీసుల్ని పిలుస్తా !" అంది ఆవేశంతో ఊగిపోతూ.

పళ్లు పటపటమనికొరుకుతూ "ఎంత పొగరే నీకు ? ఉద్యోగంచేసి ఉద్ధరిస్తున్నాననేగా ఈ పొగరంతా ! అదెన్నాళ్లో నేనూ చూస్తాను. మూడ్రోజుల్ల ఉద్యోగం ఊడగొట్టించకపోతే నా పేరుదీసి మారుపేరు బెట్టుకుంటాను" అని హూంకరిస్తూ పెద్దపెద్ద అంగల్తో బయటికి నడిచిపోయాడు.

మర్నాడు భార్గవి పన్జేస్తున్న కంపెనీ ఎం.డీ.ని కలిశాడు. "సార్ ! నా కూతురు భార్గవికి పెళ్లి సంబంధాలొస్తున్నాయి. ఎంత చెప్పినా అది పెళ్ళికొప్పుకోటం లేదు. ఆ పెళ్లి చేసుకున్న వాడు ఉద్యోగం చెయ్యనివ్వడని దాని భయం. వచ్చిన సంబంధాలు తిరిగిపోతున్నాయి. హాయిగా పెళ్లి చేసుకుని, భర్త నీడన సుఖంగా బతక్క, ఉద్యోగమెందుకు చెప్పండి ! ఏదో ఒక కారణంచూపి, దాన్ని ఉద్యోగంలోంచి తీసేసి, కాస్త సాయపడండిసార్ నాకు ! అప్పుడు గాని పెళ్లికొప్పుకోదు, కొంచెం పుణ్యంగట్టుకోండి సార్ !" అంటూ బ్రతిమాలాడు. అలాగే నంటూ ఎం.డీ. తలూపినా భార్గవిలాంటి స్కిల్డు వర్కర్ని వదులుకునేందుకు సిద్ధంగా లేడు.

ఆ మర్నాడు మళ్ళీ బుర్రలో ఏంతోచిందో దేశంమీదికి వెళ్ళిపోయాడు గోవిందరావు. మళ్ళీ ఎప్పుడూ ఇంటిముఖం చూళ్లేదు.



భార్గవి తమ్ముడూ భాస్కర్ ! అక్క ఉద్యోగంచేసి తనను చదివిస్తూ ఇంటి భారమంతా మోస్తున్నా, అతనికెందుకనో ఆమె ఉద్యోగంచేస్తూ ధీమాగా, ధైర్యంగా బతకడం ఇష్టం ఉండడం లేదు. పిల్లచేపకు ఈత వచ్చినంత సహజంగా, అతనికి తండ్రి లక్షణాలు అబ్బినయ్.

భాస్కర్ ఐ.టి.ఐ.లోచేరి ఎలక్ట్రానిక్సు ట్రేడ్‌లో డిప్లొమా చేశాడు. చదువు పూర్తయ్యింది. గవర్నమెంటు ఉద్యోగానికి ప్రయత్నిస్తూనే ఒక ప్రయివేటు కంపెనీలో పదిహేను వందల జీతమ్మీద పనిజేస్తున్నాడు. తల్లికూడా పాడిమీద బాగానేవస్తోంది. ఇప్పుడిక అక్క ఉద్యోగం చెయ్యాల్సిన అవసరంలేదు. పెళ్లిచేసుకు అత్తారింటికి పోతే, తమ కుటుంబానికి అదోక మంచి గౌరవం.

సుభద్రమ్మకి కూడా కూతురి పెళ్ళి చింతబాగా పట్టుకుంది. ఎన్ని సంబంధాలొచ్చిన పిల్ల తిరగ్గొడుతోంది. ఒకపక్క వయసు ముదిరిపోతున్నా చెప్పినమాట చెవికెక్కించుకోకుండా మొండిదేరిపోతోంది కూతురు.

పెళ్లిపార్టీల వాళ్లు బేరసారాలు సాగించే తీరు భార్గవికి ఏమాత్రం నచ్చడం లేదు. కాస్త చదువు, హోదావున్న వరుడికి ఐదు లక్షల రేటు, గుమస్తా, బస్సు కండక్టరు కేడరుకి రెండు లక్షలు ! పోనీలే తక్కువ రేటుగదాఅని ఒప్పుకోబోతే, పెళ్లవగానే ఉద్యోగం మానాలని షరతు. వళ్లు మండుతుంటుంది భార్గవికియివి చూస్తుంటే. ఏం ? ఎందుకని మానాలిట ? ఉద్యోగం చేసే భార్యంటే ఎందుకంత భయం ?

ఒకసారి భాస్కర్ అక్కపెళ్లి గురించి తల్లితో మాట్లాడుతూ "అమ్మా ! దీన్నసలు చదివించి తప్పుచేశారు మీరు. అదిచాల్దని ఉద్యోగం చెయ్యనివ్వడమొకటి. ఉద్యోగం మూలంగానే గదా యిది పెళ్లికొప్పుకోడం లేదు. ఇక యిప్పటికైనా ఉద్యోగం మాన్పించెయ్యి, పెళ్లి చేసేద్దాం. ఇప్పటికే ఫ్రెండ్సంతా అడుగుతున్నారు, మీ అక్కకి పెళ్లెందుకు కాలేదని" అన్నాడు భాస్కర్, వంశగౌరవం నిలిపే బాధ్యత తనదేనన్న పోజిస్తూ.

భార్గవికి పట్టరాని కోపం తన్నుకొచ్చింది "ఒరేయ్ ! మనల్ని వదిలేసి నాన్న ఎన్నిసార్లు దేశమ్మీదికిపోయినా, ఈ ఉద్యోగం వల్లనే ఎవరి ముందూ చెయ్యి చాపకుండా బతుకుతున్నాం. ఇది వుండబట్టే నీ చదువుకూడా పూర్తయ్యిందని గుర్తుంచుకో" అంది భార్గవి.

తల్లి వెంటనే కల్పించుకుని "మా అవసరాలన్నీ నువ్వేగడిపినట్టు మాట్లాడుతున్నావేంటే నేను పాడిచేసి సంపాదించిందంతా ఏమయ్యింది ? నువ్వెన్నయినా చెప్పమ్మాయ్ ! ఇప్పుడింక నీకు పెళ్లి ముఖ్యంగానీ ఉద్యోగంగాదు, చేసుకున్నవాడు మానేయమంటే మానవలసిందే. కాదంటే ఎలా అవుతాయి ఆడపిల్లలకి పెళ్ళిళ్లు ?" అంది సుభద్రమ్మ కూతురి మాటల్ని కొట్టిపారేస్తూ.

తెల్లపోతూ తల్లి ముఖంలోకి చూస్తుండిపోయింది భార్గవి.



భార్గవి ఆఫీసుకెళ్లడానికి బస్సెక్కుతుండగా భాస్కర్ ఫ్రెండొకడు సడన్‌గా 'బై' చెప్పి చెయ్యూపాడు. ముందు విస్తుపోయి, నవ్వుకుందామే. కానీ అతను రోజూ టైముకొచ్చి అదే లాగ చెయ్యూపడం మొదలెట్టాడు. చిరాకుపడుతూ, ఒకటీ రెండుసార్లు గట్టిగా వార్నింగ్ ఇచ్చింది, అయినా అతను మానడంలేదు. పైగా వెకిలిగా నవ్వుతున్నాడు. తప్పనిసరై పోలీసు కంప్లయింట్ ఇచ్చింది భార్గవి. ఏరియా సి.ఐ., అతన్ని పోలీస్ స్టేషన్‌కి పిలిపించి గట్టిగానే పాఠం చెప్పాడు. అప్పట్నించీ ఆ కుర్రాడు కక్షగట్టాడు. భార్గవి మీద చెడు కథలు కల్పించి భాస్కర్‌కి ఎక్కించాడు.

భాస్కర్ మండిపడుతూ, గబగబా ఇంటికొచ్చి "ఉద్యోగం మానమని ఎంత చెబుతున్న నువ్వెందుకు మానడం లేదో అర్ధమయ్యింది. ఉద్యోగం పేరుమీద మీ కొలీగ్‌తో కలిసి సినిమాలకీ, షికార్లకీ తిరగొచ్చనేగదూ ! రేపట్నించీ బయటికెక్కదులు చెప్తా ! ఇంటినించి గెంటెయ్యకపోతే చూడు !" అన్నాడు భార్గవి మీదిమీదికొస్తూ.

అవమానంతో అగ్గిబుగ్గవుతూ "నువ్వెవడివిరా ఉద్యోగంమానమనీ, బయటిక్కెళ్లొద్దనీ చెప్పడానికి ? పోకిరీ వెధవలు చెప్పిందే నిజమా ? నీవు పైకి రావాలని, కష్టపడిపన్జేసి ఆదుకున్నాను లేకపోతే ఏ హోటల్లోనో కప్పులు కడుగుతుండేవాడివి" అంది భార్గవి ఈసడింపుగా.

"ఏం కూశావే ? మళ్లీ అనామాట" అంటూ కొట్టడానికొస్తున్న కొడుక్కి అడ్డంపడి వెనక్కి నెట్టుకుపోయింది సుభద్రమ్మ.

ఆ రోజుకు చల్లబడ్డా, ఏదో ఒక సాకు చూసుకుని అక్కతో తగాదాకి దిగుతున్నాడు భాస్కర్. అప్పుడప్పుడు చెయ్యికూడా చేసుకుంటున్నాడు. ఇక ఇంట్లో వుండడం మంచిది గాదనుకొని, తల్లి ఇంట్లోలేని సమయం చూచి, బట్టలు సర్దుకు బయటికొచ్చేసింది భార్గవి.



అలావచ్చిన భార్గవి సరాసరి వర్కింగ్ ఉమన్స్ హాస్టల్లోచేరి మూడేళ్లుగా అక్కడే వుంటోంది. ఉద్యోగం చేస్తూనే 'దూరవిద్య' ద్వారా ఉన్నతవిద్య సంపాదించి, మరింత ఉన్నత ఉద్యోగాన్ని సాధించింది. ఆ క్రమంలో ఆర్.డి.ఓ.గా నియామకమై జాయి నయ్యేందుకు బయల్దేరేముందు తల్లికి ఉత్తరం వ్రాసింది.

"నా ప్రియమైన అమ్మా !

నువ్వు క్షేమంగా వున్నావనీ, తమ్ముడు నిన్ను భద్రంగా చూచుకుంటున్నాడనీ తలుస్తు న్నాను. నేను తమ్ముడి వైఖర్ని భరించలేక ఇంటినించి వచ్చేసినా, నా జ్ఞాపకాలనిండా వున్నది నువ్వే.

అమ్మా ! అలావచ్చినందుకు నాకెంతోమేలు జరిగిందనీ ! మొదటిది దూరవిద్య ద్వారా ఎం.ఏ. చదివాను. తరువాత గ్రూప్ వన్ సర్వీసు పరీక్షలకు కష్టపడి చదివి కూర్చుని, మంచిగా క్లాసు తెచ్చుకు పాసయ్యాను. ఇప్పుడు ఆర్.డి.ఓ.గా ఎంపికయి శ్రీకాకుళం జిల్లాలో పోస్టింగురాగా జాయినయ్యేందుకు వెళ్తున్న నాకు నీ నిండు ఆశీర్వాదాలు కావాలి.

ఈ రోజున నాకు మంచిచదువు, హోదా, సంపాదనా అన్నీవున్నాయి. ఇన్ని అర్హతలుండీ నేను భర్తను కొనుక్కోవలసిందేనా ? అలా ఎప్పటికీ చెయ్యను. నా అర్హతల్నీ, వ్యక్తిత్వాన్నీ యిష్టపడి, నా జీవితభాగస్వామి అవ్వాలని కోరుకునే వ్యక్తి తటస్థపడ్డప్పుడు, తప్పకుండా పెళ్లి చేసుకుంటాను. పెళ్లికన్నా, నాకు పిల్లలెక్కువ ఇష్టం. ఐతే, మాతృత్వ కాంక్షతో పిల్లల్ని కని, రేపేదైనా అయి, అతను దూరంగా వెళ్లిపోతే, వాళ్లను పట్టుకుని నీలా ఏడుస్తూ కూచోను. అన్నీ అనుకూలించినప్పుడే సంసార జీవితంలోకి అడుగు పెడతాను. తప్పటడుగు పడితే సరిదిద్దుకుంటాను.

తమ్ముడి పెళ్లయినాక, నీవు నా దగ్గరికొచ్చి, ఎప్పటికీ నా వద్దనే వుంటావని ఆశిస్తూ...

నీ భార్గవి"

❑




**జి. విజయలక్ష్మి,**

ఇ.నెం. 11-49-194,

మూడవ అంతస్తు, శివాలయం వీధి,

విజయవాడ - 520 001


# తెర తీసిన దుఃఖం

ఎప్పట్నుంచో పల్లెటూరు చూడాలనే నా కోరిక మాపెళ్ళైన ఐదేళ్ళకి తీరింది. మా చిన్నత్త గారి కొడుకు అంటే మా మరిది పెళ్ళికి వెళ్ళాము ఆ పల్లెటూరికి. ఆ పల్లెకి గుంటూరు నుంచి అరగంట ప్రయాణం. రోడ్డుకిరువైపులా ప్రకృతిమాత ఎర్ర జరీపూల చీరకట్టు కున్నట్టు మిరపతోటలు. ఆమె పాదాలకి పూసిన పసుపులా పసుపుపచ్చ పూలతోవున్న పశువుల మేత జనుము పంట. వృద్ధురాలి శరీరంలా ఎండి వంగిపోయిన పత్తి చెట్లు.

బస్సు ఊళ్ళో ఆగగానే ఆత్రంగా ఎవరు ఎవరింటికొచ్చారో పరిశీలించే కళ్ళు. అడిగి తెలుసుకునే ఆతృతతో, అడక్కపోయినా చిరునామా వివరాలు చెప్పే మనుషులు. రోడ్డు కెదురుగా మంచినీళ్ళ కొలను, కొలను పక్కనే రామాలయం. దానినానుకునివున్న షెడ్డులో రథం. చిన్న మట్టిరోడ్డు పక్కన అగ్గిపెట్టెల్లాంటి బడ్డీకొట్లు. గుంపులుగా చేరి కష్టసుఖాలు కలబోసుకుంటున్న మనుషులు. అంతా నాకు కొత్తగా వుంది. ఆఖరికి అక్కడ వీస్తున్న గాలి కూడా ఏదో ప్రత్యేకతని కలిగి వుందనిపించింది.

మా మావగారిది పెద్ద పెంకుటిల్లు, చుట్టూ ప్రహరీ, పెరడునిండా కూరగాయల మొక్కలు. మరోవైపు సన్నజాజి పందిరి. పచ్చటి తోరణాలు, పసుపు కుంకుమలతో అలంక రించిన గడపలు. ఓపక్క దేవుడిగది, ఇంకోవైపు బెడ్‌రూం, పెద్ద హాలు, ఓపక్కగా నెట్టు వేసిన ధాన్యం బస్తాలు.

ఎప్పుడో ఏదో కథలో చదివిన పల్లెచిత్రం నా మనసుమూలలలో కదిలింది. మా మావ గారు ఇరవై ఎకరాల మోతుబరి రైతు. పొలం పనులు చూసుకోవడానికి ఒక పాలేరుని పెట్టుకుని అతని కాపురంకూడా పొలంలోనే చిన్నపాకలో పెట్టించారు. అతని పేరు ఏసోబు. అతడి భార్య పేరు మరియమ్మ. ఏసోబుకి ఇప్పుడు పెళ్ళవుతున్న మా మరిదికి ఒకే వయసుంటుంది. కాకపోతే వాడికి మరియమ్మతో పెళ్ళయి రెండేళ్లు దాటుతుందట.

చెరువునుంచి కావిళ్ళతో నీళ్ళు తేవటంతో బిజీగా వున్నాడు ఏసోబు. ప్రతి పనికి వాడే అన్నట్లు తలుచుకుంటే చాలు ప్రత్యక్షమౌతున్నాడు. మరియమ్మ గిన్నెలుకడగడం, వాకిళ్ళు

ఊడ్వడం, భోజనాలదగ్గర ఇస్తర్లెత్తడం, గ్లాసులు కడగడంలో మునిగిపోయివుంది. అయినా వాళ్ళిద్దరి మొహాల్లో పనితాలూకు అలసటగాని, చిరాకుగాని కనిపించడం లేదు. పైగా ఎంతో సంబరంగా ఉరుకులు పరుగులుమీద పనులన్నీ చకచకా చక్కబెట్టేస్తున్నారు. పదిమంది మనుషులు చేసే పనిని వాళ్ళిద్దరే చేస్తున్నారు. ఆశ్చర్యంగా నేను వాళ్ళనే గమనిస్తున్నాను.

పెళ్ళి కార్యక్రమం ముగిసి, భోజనాల తతంగంకూడా పూర్తయ్యేటప్పటికి రాత్రి పన్నెండు దాటింది. హడావిడంతా సద్దుమణిగి పెళ్ళికొచ్చిన బంధువులు నిద్రకుపక్రమిస్తుంటే నేను పడుకోబోతూ సన్నజాజి పందిరిదగ్గర గాలి పీల్చుకుందామని ఓక్షణం ఆగాను. దూరంగావున్న గొడ్లచావిడి దగ్గర ఏసోబు, మరియమ్మ గొంతుక్కూర్చుని వున్నారు.

ఇంతలో మా అత్తగారు లోపల్నుంచి పద్మా అని పిలిస్తే వెళ్ళాను. ఒక గిన్నెలో మిగిలిపోయిన వంటకాలు కొన్ని కలగాపులగంగా వేసి "ఇవి తీసుకెళ్ళి ఏసోబుకి, వాడి పెళ్ళానికి పెట్టు. సావిడి దగ్గరున్నారు" అంది.

నేను మరోమాట మాట్లాడకుండా సావిడి దగ్గరకెళ్ళి గిన్నెలు అక్కడపెట్టి స్టాండులో కడిగి సిద్ధంగా వున్న రెండు ప్లేట్లు, గ్లాసులు తీసుకొని వంటకాలు వాటిలో వడ్డించి ఎంతో అభిమానంతో వాళ్ళముందు పెట్టాను. జగ్గుతో నీళ్ళుతెచ్చి రెండు గ్లాసుల్లోపోసి, పక్కనేవున్న పట్టాపరిచి "ఈవైపు సర్దుకుని కూర్చుని తీరిగ్గా తినండి. ఇపుడింక చేయవలసిన పనికూడా ఏమీ లేదుగా" అన్నాను.

వాళ్ళకేమైనా అవసరం వస్తుందేమోనని అక్కడే నిలబడ్డాను. రెండుమూడు నిమిషాలు గడిచినా వాళ్ళు కదలకుండా బొమ్మల్లా అలాగే కూర్చున్నారు తప్ప భోజనం చేయటానికి రావట్లేదు. నేను మళ్ళీ కిందకివంగి "ఏమిటి ఆలోచన కానివ్వండి" అని ప్లేట్లు వాళ్ళకి దగ్గరగా జరిపాను.

ఈలోపు మా అత్తగారు మీనాక్షమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి "అయ్యో, అయ్యో ఏమిటమ్మాయీ ఈపని" అని నన్ను మందలిస్తూ "ఆ పిల్లంటే చిన్నట్నుంచీ పట్నవాసంలో పెరిగొచ్చింది. మీ బుద్ధికేవొచ్చిందిర్రా" అని ఏసోబువాళ్ళని గట్టిగా అరిచింది. "నువ్వు తప్పుకో పద్మా" అని నన్ను పక్కకినెట్టి "ఆ ప్లేటుతీసి బాదంచెట్టు కింద పడెయ్యండి" అని వాళ్ళని ఆజ్ఞాపించింది. వాళ్ళిద్దరూ ఒకరిమొహాలొకరు చూసుకుంటూ అలాగే చేశారు.

సావిట్లో దడిపుల్లలకి తగిలించివున్న గ్లాసులు, అక్కడే బోర్లించివున్న రెండు సత్తు కంచాలు తెచ్చుకుని మళ్ళీ గొంతుక్కూర్చున్నారు.

మా అత్తగారు మూటలా ఇస్తర్ని మడిచితెచ్చి దూరం నుంచే వాళ్ళ కంచాల్లోకి దిమ్మరించింది ఆహారపదార్థాల్ని. వాళ్ళు వాటిని కాసేపు అటూఇటూ కెలికి, తిన్నామనిపించి, సత్తు కంచాలు నీళ్ళతో తొలిపి మళ్ళీ ఆదేచోట్లో బోర్లించి, గ్లాసులు పుల్లలకి తగిలించి భారంగా అడుగులు వేసుకుంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

ఉదయంనించి వాళ్ళ కళ్ళలోవున్న వెలుగు ఒక్కసారిగా ఆరిపోయింది. నేను ఆ ఊరి నుండి తిరిగి వచ్చేసినా చాలాకాలం ఆ సంఘటన నన్ను వెంటాడింది.

రెండు సంవత్సరాలు గడిచాయి. మా మరిదికి బాబుపుట్టి బారసాల జరుగుతుంటే మళ్ళీ మేం ఆ పల్లెకి ప్రయాణమయ్యాం. పల్లెలో దిగి ఇంట్లో అడుగుపెట్టగానే నా కళ్ళు గువ్వల్లా తిరిగే ఆ జంటకోసం వెదికాయి. ఏసోబు ఎక్కడా కన్పించలేదు. మరియమ్మ చిరిగిన పైటకొంగు తిప్పి బొడ్లో దోపుకుంటూ గిన్నెలు తోముతూ కనిపించింది.

నేను దగ్గరగా వెళ్ళి "బాగున్నావా మరియమ్మా" అని ఆప్యాయంగా పలకరించాను. ఆమె గబుక్కున లేచి నిలబడింది కానీ ఏమీ మాట్లాడలేదు. మరియమ్మ కళ్ళలో నీళ్ళు ఊరటం చూసి "ఏం జరిగింది"అన్నాను అయినా మౌనంగానే వుంది. ఏమీ మాట్లాడలేదు. "అవున్లూ ఏసోబు కనబడటం లేదు పనిమీద పట్నంకేవన్నా పంపారా మావయ్య" అన్నాను.

ఈలోపు నన్ను పలకరించడానికి అటుగా వచ్చిన మా మరిది "ఏసోబు లేడొదినా మన పొలం తగాదాల్లో రాజిరెడ్డి మనుషులు నాన్నని కొట్టబోతుంటే ఏసోబు అడ్డువెళ్ళాడు. నాన్నకి తగలాల్సిన దెబ్బలు బలంగా వాడికి తగలటంతో అక్కడికక్కడే చచ్చిపోయాడు" అన్నాడు.

మా మరిది చెప్పిన విషయం వినగానే పొంగుకొచ్చిన దుఃఖంతో మరియమ్మ పైట కొంగుతో మొహందాచుకుని కుమిలికుమిలి ఏడవటం మొదలుపెట్టింది. ఆ విషయం వినగానే నేను వెంటనే తేరుకోలేకపోయాను.

"సర్లే నువ్వుముందు పనిగానివ్వు. అవతల శుభకార్యం జరుగుతుంటే ఇక్కడ నీ ఏడుపాకటి. నువ్వు లోపలికి పదొదినా" అంటూ మా మరిది వెళ్ళిపోయాడు. నాకుమాత్రం వేటగాడి బాణంతగిలిన పక్షి విలవిలలాడినట్లు అనిపించింది మరియమ్మని చూస్తే తర్వాత తెలిసింది మరియమ్మ నెలరోజుల పాపకి తల్లి అని.

మా మరిది కొడుకు గుక్కపెట్టి ఏడుస్తున్నాడు. బహుశా వాడికి ఆకలేస్తుందనుకుంటా మా తోడికోడలు రాధ బెడ్రూంలోంచి వాడిని హాల్లోకితెచ్చి ఊరుకోబెడుతూ "మరియమ్మా ఒసే మరియమ్మా" అని గట్టిగా అరిచింది.

అప్పుడు సమయం తెల్లవారుజాము మూడు గంటలు దాటింది. ఎక్కడ పడుకుని వున్నదో కానీ మరియమ్మ పరుగు పరుగున వచ్చింది. "వెళ్ళి శుభ్రంగా కడుక్కొని రా బాబు ఏడుస్తున్నాడు" అంది రాధ.

మరియమ్మ మారుమాట్లాడకుండా వాకిట్లోవున్న తొట్టిపక్కకి వెళ్ళి రొమ్ముల్ని శుభ్రంగా కడుక్కొని వచ్చి బాబుని ఒడిలోకి తీసుకుని రొమ్ము నోటికందించింది. వాడి ఆకలి తీరిన ట్టుంది పదినిమిషాల తర్వాత ప్రశాంతంగా నిద్రలోకి జారిపోయాడు.

ఇదంతా నేనుపడుకున్న గది కిటికీలోనుంచి గమనిస్తున్నాను. అయోమయంగా వుంది నాకు. ఆలోచిస్తూ పడుకున్నా, పడుకున్నానే కానీ నిద్రపట్టలేదు. అరగంట తర్వాత సావిట్లోంచి మరియమ్మ కూతురు ఏడుపు వినిపిస్తోంది. గుక్కపట్టి ఏడుస్తూనే వుంది. ఏడ్చీ ఏడ్చీ సొలిపోయినట్టుంది. ఆ ఏడుపు ఆగిపోయింది.

ఉదయం లేవగానే ఈ విషయాన్ని నా తోటికోడలు రాధతో ప్రస్తావించాను.

"అవునక్కా నా పాలు బాబుకి ఇవ్వకూడదన్నారు డాక్టర్‌గారు. వాడికేమో పోతపాలు పడటం లేదు. ఎవరో ఒక తల్లిపాలు పట్టచ్చని డాక్టరిచ్చిన సలహా ప్రకారం ఇలాచేస్తున్నాం. మరియమ్మకూడా చంటిబిడ్డ తల్లేగా అందుకే మావయ్యగారు ఈ ఏర్పాటు చేశారు" అంది.

"మరి మరియమ్మ కూతురికెలాగా పాలు" అన్నాను.

"దానికి మన గేదె పాలు పోస్తుందిలే" నిర్లక్ష్యంగా అంది రాధ.

రాధ జవాబులోని నిర్లక్ష్యంతో "తల్లిపాలలో ఉండే పోషకపదార్థాలు, రోగనిరోధక శక్తి గేదెపాలలో ఉండవు కదా ?" అని అడుగుదామని గొంతుదాకా వచ్చిన ప్రశ్నని పెదవుల లోపలే ఆపేసుకున్నాను.

మరియమ్మ సావిట్లోనే ఉండే ఏర్పాటు ఎందుకు జరిగిందో అప్పుడర్థమైంది నాకు. ఏసోబు చనిపోయినతర్వాత ఆమె రక్షణకోసం ఇంటిలో ఆశ్రయమిచ్చారనుకున్నాను నేను. కేవలం మరియమ్మ తల్లిపాలకోసమే ఆమెని సావిడికి రప్పించారని అర్థమయింది.

రాధ పెళ్ళిరోజు సంఘటన కళ్ళముందు మెదిలింది. పగలంతా గొడ్డుచాకిరి చేసిన వాళ్ళకి అన్నాన్ని అంటరానితనంవంకతో నిర్దాక్షిణ్యంగా నేలపాలు చేయించింది అత్తగారు. ఈ రోజు మనవడి ఆకలి తీర్చడానికి, తన వంశోద్ధారకుడు ఆరోగ్యంగా పెరగడానికి అదే అంటరానితనం ఏవిధంగానూ అడ్డురాలేదు. మరియమ్మ దరిద్రం ఆమె తన బిడ్డకి తన పాలిచ్చుకోలేకుండా అడ్డుపడింది.

వాళ్ళ బతుకులు వాళ్ళవికాదు. వాళ్ళప్రాణాలు వాళ్ళవికాదు. ఆఖరికి వాళ్ళమాతృత్వం వాళ్ళది కాదు. మాతృత్వాన్నికూడా తాకట్టు పెట్టుకోవాల్సిన దౌర్భాగ్యం వాళ్ళది.

ఇరవైఏళ్ళ తర్వాత మా మరిది కొడుకు సునీల్ ఏక్సిడెంట్‌లో చనిపోయాడనే పిడుగు లాంటి వార్తతో మళ్ళీ ఆ పల్లెలో అడుగుపెట్టాం. ఆ షాకుతో మా అత్తగారికి మతిస్థిమితం తప్పింది. రాధ గుండెలు పగిలేట్లు ఏడ్చింది. జరగాల్సిన తతంగం జరిగిపోయింది. ఓపక్క ఏడుస్తూనే మరియమ్మ పనులు చేస్తున్నది. వృద్ధాప్యం ఛాయలతో ఒంటి బిగువు తగ్గింది. తలకూడా కొంతభాగం నెరిసింది. అయినా గానుగెద్దులా తిరుగుతూ పనిచేస్తూనే వుంది.

రాధ తల్లి వచ్చి రాధని, మా అత్తగార్ని బ్రతిమాలుతోంది. "పోయినవాడు తిరిగిరాడు, తిండి తిప్పల్లేకుండా ఎన్ని రోజులిలా వుంటారు. పోయినవాళ్ళతో మనమూ పోలేం కదా" లేచి కొద్దిగా ఎంగిలిపడండి అంటోంది.

మరియమ్మ పనులన్నీ పూర్తిచేసి సావిడి దగ్గర గుండెలు పగిలేలా ఏడుస్తున్నది. తెరలు తెరలుగా వస్తున్న దుఃఖాన్ని ఆమె ఆపుకోవడం లేదు.

మరియమ్మనే గమనిస్తున్న నేను ఆశ్చర్యపోయాను. దానికి కారణం ఒకప్పుడు మరియమ్మ భర్త ఏసోబు చనిపోతే ఆమె మీద సానుభూతి చూపిన వాళ్ళు ఈ ఇంట్లో ఒక్కరూ లేరు, పైగా మరియమ్మ దరిద్రాన్ని ఆసరా చేసుకొని ఆమె తల్లితనాన్ని కూడా పిండుకున్నారు. అలాంటి మనుషుల దుఃఖం చూడలేక మరియమ్మ గుండెలు పగుల గొట్టుకుంటూ ఏడుస్తున్నది.

దుఃఖసముద్రం మరియమ్మ గుండెలోతుల్లోంచి పొంగుతున్నది. ఆమె అనుభవించిన బాధల అలలన్నీ ఆ సమయంలో కెరటాల్లా ఎగసిపడుతున్నాయి. తనభర్త చనిపోయి నపుడు, తన బిడ్డకి పాలివ్వ లేనపుడు పడలేని దుఃఖం కట్టలు తెంచుకొని ఇప్పుడు ప్రవహిస్తోంది. అది జీవనదిలా స్వచ్ఛంగా ఉంది. ❑





**ధప్పూరి శ్రీధరాచార్య,** M.A., M.Ed.
లెక్చరర్,
ప్రభుత్వ జూనియర్ కాలేజి,
అసిఫాబాద్, జి॥ ఆదిలాబాద్ - 504 293

# పక్షిగూడు

భార్య గదినిదాటి బయటకు వెళ్ళడంతో రామనాథం వర్షం వెలసినట్లు ఫీలయి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

కిటికీ దగ్గరకు నడిచి బయటకు చూశాడు. సాయంకాలం ఎండవేడిమి తగ్గింది, కాని పాడిగాలులు వేడిగానే వున్నాయి.

కిటికీ ఎదురుగా పెద్ద వేపచెట్టు ఉంది. రామనాథంను ఆ చెట్టు కొమ్మల్లోని ఓ విచిత్ర దృశ్యం ఎప్పుడూ ఆకర్షిస్తూంటుంది.

చెట్టు చిటారు కొమ్మల్లో పక్షిగూడు వుంది. ఆ గూటికి చేరుకునే పక్షి జంటను... అవి చేసే అల్లరిపనుల్ని, రామనాథం తీరికగా ఉన్న సమయంలో చూస్తుంటాడు. అలా వాటిని చూస్తూ కూర్చోవడం అతనికి ఎంతో తృప్తిగా వుంటుంది. మనస్సుకు 'రిలీఫ్' కలుగుతుంది. జీవితంలో లోపించిన అనురాగం వాటిలో చూస్తూ మైమరచి పోతుంటాడు.

గది కిటికీ నుండి ఆయన చూపు ఈ రోజు అదే చెట్టు కొమ్మల్లో యిరుక్కుపోయింది. రెండు పక్షులు పుల్లా, పుతక తెచ్చి అన్యోన్యంగా తమ గూటిని బాగుచేసుకుంటున్నాయి.

రాబోయే నూతన సంతానానికి ఆవాసం కల్పించు కుంటున్నాయి. వాటిని, వాటి అన్యోన్యతను చూస్తూ రామనాథం ఇంతక్రితం జర్గిందాన్ని నెమరు వేసుకుంటున్నాడు.

తన భార్య దుర్గ, తాను మెతక కాబట్టి కాపురానికి వచ్చిన నాట్నుండి తనను సాధిస్తోంది. "సంసార సుఖం అంటే యిదేనా బాబోయ్ ! దీనికంటే అడవుల్లోకి పారిపోవటం మేలు" అనుకున్నాడు ఎన్నోమార్లు.

కాని తన మెతకతనం అలా పారిపోనీయలేదు.

తమకు కల్గిన ఒకే ఒక సంతానం పార్వతి. దుర్గ పార్వతిని తనలాగే, తన అభిప్రాయాలతోనే పెంచింది.

పెండ్లికూడ తనకు వేలువిడిచిన సంబంధాన్ని మరీ వెతికి చేసింది.

తను రాముడు కాబట్టి దుర్గకు ఎదురు చెప్పకుండ ఆమె చెప్పినట్లు విన్నాడు. తనకు మానసిక క్షోభ తప్పించి... తమ సంసారం బజారున పడలేదు.

పార్వతిని చేసుకున్న శివుడు తనలా కాదు. మూడు నెల్లు తిరక్కుండా పార్వతి కాపురం వదిలి... తల్లిని చేరుకుంది.

"దాని కాపురం చక్కదిద్దలేని అసమర్థున్ని" అంటూ యింతవరకు సాధించి వెల్లింది దుర్గ.

భార్యాభర్తల బంధంలో కావాల్సిన సూత్రం, హక్కులు, అధికారాలు, సాధింపులు కావు... అనురాగం, అప్యాయతలు.

రామనాథం తల్లితోబాటు గది బయటకు వెళ్ళకుండ గదిలోనేవున్న పార్వతిని కిటికీ దగ్గరకు తెచ్చి పక్షుల జంటవైపు చూపించాడు.

ఒక పక్షి ముక్కుతో కరుచుకొని తెచ్చిన పుల్లను మరొకటి అందుకొని గూటిని బాగు చేయటంలో నిమగ్నమయివున్నాయి.

"పార్వతీ ! ఆ పక్షుల్నిచూడు... వాటికి విజ్ఞానం లేదు, చదువులేదు, అయినా సంసారం అనేదానికి వాటి అనురాగం, అప్యాయతలే సాక్ష్యం. భార్యాభర్తలు చిలుకాగోరింకల్లా కాపురం చేయండి అంటూ దీవిస్తుంటారు పెద్దలు. దానిలో అర్థం యిదేనమ్మా... ! నీ భర్త దగ్గరకు వెళ్ళు, శివుడు నాకంతా చెప్పాడు. తప్పులు ఎన్నుకోవటం కాదు. భార్యాభర్తలు పాలు నీళ్ళలా కల్సిపోయి జీవించటం కావాలి" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు.

"నాన్న ! మీ బాధ నాకర్థమయింది, పదండి ఇప్పుడే వెళదాం ఆయన దగ్గరకు" అంటు సూట్‌కేస్ సర్దుకోవటానికి గదిని దాటింది పార్వతి.

రామనాథం ఆ పక్షుల గూటివైపు చూస్తూ... తన కూతురు కాపురం నిలబడు తున్నందుకు ఎంతో తృప్తిని పొందాడు. ❑





**డా॥ నల్ల యాదగిరి,** M.A., M.Phil., Ph.D.
తెలుగు లెక్చరర్,
ఇ.నెం. 1-9-948,
పోస్టల్ కాలనీ, హన్మకొండ.
ఫోన్ : 572726

# సారీ... సార్ !

ప్రొద్దున్నే బుచ్చమ్మ బతుకు తెల్లారింది. ఇంటి ముందు జనం. ఇంట్లో నుండి బిడ్డల కొడుకుల ఆర్తనాదాలు. యాభైఏళ్ళ బుచ్చవ్వ దుండు ముక్కలాగా గుత్ప కర్రలాగా ఆరోగ్యంగా బలిష్టంగా ఉండేది. ఎలాంటి అనారోగ్యం లేదు. రాత్రి చక్కగా భోంచేసి నిద్ర పోయింది. నిద్రలోనే ఎప్పుడుపోయిందో తెల్వదు. రోజూఉదయం ఐదింటికిలేచే బుచ్చమ్మ అలాగే నిద్రిస్తుంటే తట్టి చూచి శాశ్వత నిద్రేనని తెలుసుకొని ఇంటిల్లిపాది భోరుమన్నారు. బిడ్డల శోకనాదాలు హృదయాన్ని ద్రవింపచేస్తున్నాయి. "నువ్వెంత పని చేస్తివే నా అవ్వా ! ఏది బంగారుముఖమే నా అవ్వా-ఎవర్ని పల్లెత్తిమాటనవే నా అవ్వా ! ఆ దేవుని గుల్లే మన్ను పొయ్యనా అవ్వో ! నిన్నెట్ల తీస్కపోయెనే నా అవ్వ ! నీయి బంగారు చేతులే నా అవ్వ ! మొఖం కడుక్కుందువులేవే నా అవ్వ-ఛాయ తాగుతువులేవే నా అవ్వ" అంటూ ఆడబిడ్డలు ఏడుస్తున్న ఏడ్పులకు జనమంతా ఒక్కసారి గొల్లుమన్నారు. పాపం బుచ్చమ్మ ఎలా చచ్చింది. నిద్రలోనే పోయిందట. చాలా మంచిది ఎవరినీ ఏమీ అనదు, దుర్వ్యాఖ్యానాలు చేయదు. మంచే తప్ప చెడు అంటే గిట్టని బుచ్చమ్మ పాపం అకాలమరణం చెందడం అందరికీ బాధగానే వుంది. బుచ్చమ్మ ఇంటి ప్రక్కకు బుచ్చయ్య వుంటాడు. పాలిపగ పాముపగ. బుచ్చయ్య దుర్మార్గానికి నిలువెత్తు నిదర్శనం. స్వార్థంతో, అన్యాయార్జనతో కల్తీ వ్యాపారంచేసి ధనికుడయ్యాడు. మానసికంగా నిర్ధనుడైన బుచ్చయ్యఅంటే ఊళ్లోవాళ్లెవరికీ గిట్టదు. కాని అతని సహాయంలేంది పూటగడవదు. పోగైన జనమంతా బుచ్చమ్మను తీసుకు పోయేబదులు 'బుచ్చిగాన్ని' తీసుకుపోతే బాగుండుననుకున్నారు.

సాయంకాలం కావస్తుంది. 'ఉదయిస్తున్న సూర్యుడు అలాగే వుండాలనుకోవడం దురాశ. అస్తమించిన సూర్యుడు ఉదయించడనుకోవడం నిరాశ' అన్నాడు కాళోజీ. బుచ్చమ్మ శవయాత్ర సన్నాహాలు మొదలయ్యాయి. ఇంటిముందు డప్పులమోత, పాడె కడ్తున్నారు, ఏడుకట్ల సవారి. బుచ్చమ్మ భర్త కుమిలికుమిలి ఏడుస్తున్నాడు. శవాన్ని లేపారు. చీర అడ్డంగాకట్టి స్నానం చేయించారు. ముఖమంతా పసుపుపూసి, ఎర్రని కుంకుమబొట్టు

పెట్టారు. కన్ను తెరిస్తే భద్రకాళి మాతలాగే వుంటుంది. జనమంతా గొల్లుమన్నారు. నల్గురు మనుషులు పట్టిపాడెమీద వేశారు, లేపారు. ముందు కొడుకు 'కుండ' పట్టుకొని నడుస్తున్నాడు. డప్పులమోత, ఊరేగింపు, ప్రతి కూడలివద్ద ఆగుతున్నారు. ఎవరో పది రూపాయల నోటు కిందవేస్తే డప్పులోళ్లు ఎగురుతూ వంగి కంటిరెప్పతో నోటు తీసుకొన్నాడు. ముందు కేరింతలు వెనక ఆర్తనాదాలు. "ఇది చావా ? పెళ్లా ? చావుకూడా పెళ్ళి లాంటిదే బ్రదర్" అన్నాడో సినీకవి.

శవయాత్ర వల్లకాడు సమీపించింది. పాడెను దించారు. 'దింపుడుగల్ల' మంటారట. అప్పులందరూ ఒక్కొక్కరూ వచ్చి పాడెమీదున్న 'బుచ్చమ్మ' చెవిలో గట్టిగా 'బుచ్చమ్మా'అనో 'అక్కా'అనో, 'అత్తా'అనో ఎవరెవరి వావి వరసనుబట్టి వాళ్లు పిలుస్తున్నారు. 30 సంవత్సరాల బుచ్చమ్మ కూతురు లక్ష్మి 'అవ్వా' అని వెక్కివెక్కి ఏడుస్తూ గట్టిగా చెవిలో నోరుపెట్టి పిలిచింది. అంతే ఒక్కసారిగా బుచ్చమ్మ లేచికూర్చుంది. గుళ్లో పెద్దమ్మ తల్లిలాగా వుంది. జనమంతా భయపడి దూరంగా జరిగారు. ఇది ఏభూతమో, ప్రేతమో కాదుగదా ! అనుకొని ఈ హఠాత్పరిణామానికి ఆందోళన చెందారు. జనానికి చచ్చినా ఆందోళనే, బ్రతికినా ఆందోళనే. లక్ష్మికి తన తల్లి ఒకేసారి పాడెమీద లేచికూర్చునేసరికి గుండె గుభిల్లుమంది. పొద్దున్నుండి తల్లి శవం ప్రక్కన కూర్చొని ఏడుస్తూనే వుంది. బ్రతికితే బాగుండునుకుంది. ఏదైనా దివ్యశక్తి అవ్వను బతికిత్తే బాగుండుననుకుంది. ఇప్పుడు నిజంగా అవ్వ లేచి కూర్చుంది. తానేమో భయపడి దూరంగా జరిగింది. కాసేపట్లో తేరుకుని భర్త, కూతుళ్లు, కొడుకులు, బంధువర్గమంతా పాడె చుట్టుమూగారు. బుచ్చమ్మ పాడెమీద కూర్చొనిజనాన్ని వింతగా చూస్తుంది.

కూతురు లక్ష్మి అవ్వ దగ్గరికెల్లి శరీరాన్ని స్పర్శించి "అవ్వా ! నువ్వు చచ్చావ్ కదే, మళ్ళీ ఎలా లేచావ్ ?" అని అడిగింది. "అవును, నేను చచ్చిపోయాను నా శవం యమలోకం పోయింది. అక్కడ ఎర్రనిగుడ్లతో భయంకరంగా ఉన్న యముడు, చిత్రగుప్తున్ని పిలిచి "చిత్రగుప్తా, ఇవ్వాల్టి ఈ డెత్‌లిస్ట్‌లో బుచ్చయ్య అనే పేరుంది. అతనేడి అని అడిగేసరికి చిత్రగుప్తుడు గుండెలు గుభేలుమన్నాయి. "సారీ సార్ ! ప్రింట్ మిస్టేక్‌వల్ల పొరపాటు జరిగింది. 'య్యా'కు బదులు 'మ్మ'పడడంవల్ల బుచ్చమ్మను తేవడం జరిగింది సార్. ఇప్పుడే ఆమెను రిటర్న్ చేసి బుచ్చయ్యను పట్టుకొస్తానన్నాడు". అలా బుచ్చమ్మ పాడెమీద లేచి కూర్చున్న క్షణంలోనే బుచ్చయ్య అక్కడ ప్రాణం విడిచాడు. ఆ రోజు యముడు చిత్రగుప్తున్ని తిట్టిన తిట్టు తిట్టకుండ తిట్టి ఇకముందు ఇలాంటి పొరపాటు జరక్కుండా చూడమని ఆదేశించాడు. ☐

*(డా॥ జి. గోవర్ధనస్వామి, లెక్చరర్ గారు చెప్పిన నిజ సంఘటన ఆధారంగా)*



**వరిగొండ కాంతారావు,**

ఇ.నెం. 5-70, జీవనమిత్రా నగర్,
విద్యారణ్యపురి, హన్మకొండ - 506 009
ఫోన్ : 438812

# మొగుడు

అధికారమూర్తీ, ప్రజారాణీ ఇటీవలే కాపురం పెట్టారు పట్నంలో. వాళ్ళ పెళ్ళయి చాన్నాళ్ళయ్యింది. సనాతన కుటుంబాలు కావడంవల్ల ప్రజారాణీ పెద్దమనిషవకుండానే పెళ్లి జరిపించారు పెద్దలు.

కొత్తకాపురం. ఓ రోజు సరదాగా సినిమాకు బయలుదేరారు మొగుడూపెళ్ళాలు. హాలు దగ్గరే అవడంవల్లనూ, సినిమాకింకా సమయం ఉండడంవల్లనూ నడచే బయలుదేరారు వాళ్ళు. ఓ వందగజాలు వెళ్ళారో లేదో ఆ వీధి రౌడీ తీవ్రనాథం సైకిలేసుకొని వస్తూ ఎదురు పడ్డాడు వాళ్ళకి.

అధికారమూర్తికి రౌడీలంటే భయం. పెళ్ళాన్ని పక్కకితోస్తూ రోడ్డువార కొచ్చేశాడు అధికారమూర్తి. అందమైన పెళ్ళాన్ని కాపాడుకొందుకు మొగుడుపడుతున్న అవస్థ తీవ్రనాథం కంటపడనే పడింది. వేరే ఆలోచనల్లోఉన్న తీవ్రనాథానికి ప్రజారాణీ మీద దృష్టి లేకుండింది. కాని, అధికారమూర్తి ఆరాటంచూసి వాణ్ణోకసారి ఏడిపిద్దాం అనిపించింది అతగాడికి.

నేరుగా సైకిలుని వాళ్ళిద్దరికీ అడ్డంగా ఆపి ప్రజారాణికి కన్నుగొట్టి, ఆవిడ చీరకొంగు నొకసారి లాగి "ఏమే బాగున్నావా !" అని చెంపమీద చిటికవేసి అధికారమూర్తి కళ్ళల్లోకి తిరస్కారంగా చూస్తూ వెళ్ళిపోయాడు తీవ్రనాథం.

కొయ్యబారిపోయాడు అధికారమూర్తి. బిక్క చచ్చిపోయింది ప్రజారాణి. "ఛీ ! పాడు ప్రాణం పోయినా బాగుండుననుకొంది పదిసార్లు". మనసుపాడయిన దంపతులు సినిమా మానేసి ఇంటికొచ్చారు.

తాళం తీసి లోపలి కొచ్చారో లేదో పెళ్ళామ్మీద విరుచుకుపడ్డాడు అధికారమూర్తి. "అసలెంత కాలంగా జరుగుతోందీ నాటకం. వాడికీ నీకూ ఏమిటి సంబంధం ! ఎంత పరిచయం లేకపోతే మొగుణ్ణి నేనుండగానే "బాగున్నావా !" అని పలకరిస్తాడు. నీవింత చెడిపోయిన

దానివని ఎరిగుంటే నేన్నిన్నసలు కట్టుకొనే వాణ్ణేకాదు" కోపం చల్లారేవరకూ పెళ్ళాన్ని చితక్కొడుతూనే ఉన్నాడు అధికారమూర్తి.

"ముక్కూ మొహం తెలీనివాడు మొగుడి ముందర కన్నుగొట్టి, చెంగు లాగినందుకు ఏడవాలా ! ధూర్తుడు తన కళ్ళెదురుగా భార్యనవమానపరుస్తున్నా కాపాడుకోలేని మొగుడి చేతకాని తనానికేడవాలా ! తన చేతకానితనాన్ని కప్పిపుచ్చుకొందుకు ఎదురు పెళ్ళాన్ని కొడుతున్న అతని మగబుద్ధిచూచి ఏడవాలా !" అని ఆలోచిస్తూ ఏడుస్తూ, ఏడుస్తూ ఆలోచిస్తూ సొమ్మసిల్లి పడిపోయింది ప్రజారాణీ.

"దీన్ని తన్నడం మంచి పనైంది, లేకపోతే తీవ్రనాధం గొప్పతనం ఊరూవాడా ప్రచారమై పోను" తన్ను తాను అభినందించుకొన్నాడు అధికారమూర్తి.

తీవ్రనాధం గొప్పతనాన్ని దెబ్బతీయాలని గట్టిగా నిర్ణయించుకొన్న అధికారమూర్తి, అతడు తనకెదురు పడకుండా జాగ్రత్త పడుతున్నాడు అప్పట్నించీ. ❑






**డా॥ కె.యల్.వి. ప్రసాద్,**

రామక్రిష్ణా కాలనీ, సహృదయ మార్గ్,

ఆర్.ఇ.సి. పోస్ట్, సుబేదారి,

హన్మకొండ - 506 004 ఫోన్ : 432098


# సుజాతకు పెళ్ళయిందిట... !!

సుజాతకు పెళ్ళయిందిట... !!

"ఆఁ సుజాతకు పెళ్ళయిందా ?" మనస్సులో నాకు నేను ప్రశ్నించుకోకుండా వుండలేక పోయాను. ఎవరో చెబితే నేను అంతగా పట్టించుకునేవాణ్ణి కాదు. కాని సుజాతకు అత్యంత ప్రీతిపాత్రురాలయిన స్నేహితురాలు సుమన చెప్పింది. నేను కొత్తగూడెం రైలు ప్రయాణం చేస్తూ, డోర్నకల్ స్టేషన్‌లో రైలు ఆగినపుడు, స్టేషన్లో కాసేపు ఫ్లాట్‌ఫారంమీద తిరుగు తుంటే అనుకోని రీతిలో సుమన అక్కడ కన్పించి యీ విషయం చెప్పింది.

అయినా, ఆడపిల్లకు పెళ్ళికావడంలో వింత ఏముంది కనుక ? ఆడపిల్ల పెళ్ళి చేసుకొని ఆ తర్వాత అత్తారింటికి వెళ్ళిపోవడం సహజమే కదా ! అయితే కావచ్చుగాని, సుజాత పెళ్ళివిషయం అంత తేలిగ్గా తీసిపారేసేది కాదు. నిజానికి ఆమెకు పెళ్ళయిందంటే, స్నేహితులే కాదు, పరిచయస్తులు సయితం ఆశ్చర్యపోతారు. అయినా సుజాతకు పెళ్ళ యిందంటే అందుకు అందరూ సంతోషించేవాళ్ళే వుంటారు. అందులో నేనూ ఒకణ్ణి మరి ! అనుకోని రీతిలో అకస్మాత్తుగా, ఎప్పుడో నాతో కలిసి పనిచేసిన సుజాత ప్రస్తావనరావడంతో, నా ఆలోచనలు అనుకోకుండా పది సంవత్సరాలు వెనక్కి వెళ్ళిపోయాయి. కారణం సుజాతకు నాకుఉన్న పరిచయం అలాంటిది. సుజాతకు పెళ్ళయితే నాకు సమాచారం అందకపోవడం వింతగానే ఉంది. నా మెదడు నాటి సంఘటలను సింహావలోకనం చేయడం మొదలుపెట్టింది.



వరంగల్‌లో ఒక ప్రధాన ఆసుపత్రిలో నేను సీనియర్ ఫార్మసిస్ట్‌గా చేరి అప్పటికే అయిదు సంవత్సరాలు దాటిపోయింది. డాక్టర్లు, నర్సులు, ఇతర సిబ్బంది తరతమ భేదాలు లేకుండా నాతో ఎంతో కలసిమెలసి వుండేవారు. ఎప్పుడు సంతోషంగా నవ్వుతూ తుళ్ళుతూ సందర్భాన్నిబట్టి జోకులు పేల్చడం, అందరినీ నవ్వించడం, చలాకీగా నా పనులు నేను

చేసుకుపోవడం, ఎంతో ఆనందంగా గడిచిపోయేవి ఆ రోజులు. నా అయిదు సంవత్సరాల సర్వీసులో ఎంతోమంది యువతీయువకులు ఉద్యోగంలో చేరడం, ఆ తర్వాత హాయిగా పెళ్ళిళ్ళు చేసుకొని జీవితంలో స్థిరపడిపోవడంవంటి సన్నివేశాలు ఎన్నో చూశాను. ఇది మామూలుగా అందరి జీవితాలలోను జరిగే సాధారణ వ్యవహారమే కదా !

అయితే, ఓ రోజు మా మెడికల్ ఆఫీసర్ ఒక అందమైన అమ్మాయిని వెంటబెట్టుకొని నా రూమ్‌కు వచ్చారు. స్టాక్‌రిజిష్టర్ వ్రాయడంలో నిమగ్నమయివున్న నన్ను "దాశరథీ ! ఈ అమ్మాయి పేరు సుజాత, స్టాఫ్‌నర్స్‌గా మన ఆసుపత్రిలో ఇవాళే జాయిన్ అయింది" అని పరిచయం చేశారు మా మెడికల్ ఆఫీసర్.

సుజాత ఎంతో నమ్రతగా, మర్యాదగా, స్నేహపూర్వకంగా రెండు చేతులు జోడించి.. "నమస్తే సార్... !" అంది.

ఆ విధంగా సుజాతకు నాకు పరిచయం అయింది. ఆమె డ్యూటీలో సమయం చిక్కినప్పుడల్లా పలకరించడానికి నాదగ్గరకు వచ్చేది. మంచిచెడ్డలు మాట్లాడుతూ వుండేది. ఎన్నో సలహాలు అడుగుతుండేది. ఆ రకంగా మా మధ్య మంచి స్నేహం ఏర్పడిపోయింది. పరిస్థితి ఎంతవరకు వచ్చిందంటే, ఎలాంటి అవసరం వచ్చినా నన్ను సంప్రదించకుండా ఆ పనిని ముట్టుకునేది కాదు. అలా.. అలా... మా స్నేహం మరింత బలపడింది.

సుజాత నాకు పరిచయం అయ్యేనాటికి నాకు పెళ్ళయి సంవత్సరం కూడా కాలేదు. సుజాత గురించి, ఆమె పరిచయం గురించి, ఆమె అంద-చందాల గురించి చెబుతుంటే మా ఆవిడ సుశీల ఒకటే ఉడుక్కుపోయేది. నేను మరిన్ని కల్లబొల్లి కబుర్లు కల్పించి చెప్పి ఆమెను మరింత ఏడ్పిస్తుండేవాణ్ణి.

సుజాత పరిచయం గురించిగాని, ఆమె అందచందాల గురించిగాని, వంపుసొంపుల గురించిగాని నేను యేనాడు ప్రత్యేకంగా ఆలోచించలేదు. కాని, మా కలుపుగోలుతనం, అన్యోన్యంగావుండడం చూచి చాలామంది మమ్మల్ని వింతగా చూడ్డం మాత్రం గమనిస్తూనే వుండేవాణ్ణిగాని, దానికి అంత ప్రాముఖ్యత నిచ్చేవాడినికాదు.

అయితే, సుజాత తను 'డే-ఆఫ్' తీసుకున్న ఒకానొక రోజు అందంగా తయారయి సరాసరి నా సీటు దగ్గరికి వచ్చి కూర్చుంది. పచ్చని పసుపురంగు నైలాన్ చీరలో, దానికి తగిన మ్యాచింగ్‌లో లో-నెక్ జాకెట్ వేసుకొని, ఒక ప్రత్యేక సెంటువాసనతో, మరోప్రక్క జడలోని మల్లెపూల సువాసనలతో, ఆ ప్రాంతం అంతా ఘుమాయించిపోయింది. అలాంటి పరిస్థితిలో నా మనస్సు అనుకోకుండా, పదునెక్కిన ఆమె యవ్వనం గురించి, వంపు సొంపుల గురించి, అందచందాల గురించి ఆలోచించక తప్పిందికాదు. అయినప్పటికి నా

మనస్సులోని ఆలోచనలకు కళ్ళెంవేసి, సుజాత కళ్ళల్లోకి సరాసరి చూస్తూ... "సుజాత... నువ్వు పెళ్ళి చేసుకోకూడదా ?" అన్నాను ధైర్యంచేసి.

ఏమాత్రం ఆలస్యం చేయకుండా "ఆ... అదృష్టం నాకు లేదు సార్ !" అని నిట్టూర్చింది సుజాత. ఆమె జవాబు నన్ను ఆశ్చర్యపరచి, రవ్వంత ఆలోచింపజేసింది. ఆమెకు ఏమి తక్కువని పెళ్ళిచేసుకునే అదృష్టం లేదుట ! ఆమెకు చక్కని ఉద్యోగం, దానికి తగ్గట్టుగా జీతం, ఎలాంటివారినైనా ఇట్టే ఆకర్షించే శరీర ఛాయ, మత్తెక్కించే యవ్వనభారపు వంపుసొంపులు, సన్నని నడుం, ఎప్పుడూ నవ్వుతూ కన్పించే అందమైన ముఖం, దానిమ్మ గింజలవంటి పలువరుస, ఇవన్నీ ఎలాంటి మగవాణ్ణయినా దరికి రప్పించే లక్షణాలు. క్షణం ఆలోచించకుండా ఆమెను ఉన్నపళంగా ఎగరేసుకుపోయే అందచందాలు ఆమెవి. మరి ఆమె పెళ్ళికి ఆనకట్ట ఎక్కడ పడ్డున్నట్లు ! సుజాత నిరాశ నిస్పృహల వెనకవున్న అసలు రహస్యవ్యవహారం ఏమిటో ఆరాతీయాలని నిర్ణయించుకున్నాను.



సుజాతతో నాకు ఉన్న చనువుకు, నా సీనియారిటీనీ, పెద్దరికాన్ని ఆసరాగా తీసుకొని, ఆమె జీవితం వెనుక ఆవరించివున్న మబ్బులచాటు మర్మాలను తెలుసుకోవాలని నా శాయశక్తుల ప్రయత్నించాను.

బాల్యంలోనే సుజాత తండ్రి చనిపోవడం, చిన్నతనంలోనే తనకు మేనమామతో వివాహం నిశ్చయించడం, ఆ భయాన్ని తట్టుకోలేక ఆమె ఒక గమ్యమంటూ లేకుండా ఇంటి నుండి పారిపోవడం, అదృష్టవశాత్తు ఆమె ఒక వృద్ధ మహిళ చేతిలోపడడం, ఆమె సుజాతను కన్నకూతురు కంటే ఎక్కువగా చూసుకోవడం, ఆ తర్వాత ఆమెను నర్సింగ్‌లో శిక్షణ ఇప్పించడం, ఈలోగా తల్లి మతిస్థిమితం లేనిదికావడం, చివరికి తల్లి, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు సుజాత దగ్గరకు చేరుకోవడం, తల్లి మానసిక పరిస్థితినిబట్టి వాళ్ళందరిని పెంచే బాధ్యత సుజాత మీదపడ్డం. తను పెళ్ళి చేసుకుంటే వీరికి న్యాయం జరగదేమోనన్న అనుమానంతో పెళ్ళి చేసుకోవడానికి సాహసించడం లేదని ఒకానొకరోజు ఆమె రోదిస్తూ తనజీవితాన్ని ఒక కథమాదిరిగా వివరించి చెప్పేటప్పటికి నా కళ్ళల్లోకూడా నీళ్ళు నిండాయి.

తర్వాత సుజాతను పెళ్ళి గురించి ఎప్పుడూ గుర్తుచేయలేదు. ఈలోగా నాకు హైద్రాబాద్‌కు బదిలీ అయిపోవడం, సుజాతకు సంబంధించిన ఆలోచనలకు దూరం కావడం, సహజంగానే జరిగిపోయాయి. కొత్తగూడెం వెళ్ళే రైలు గార్డు విజిల్ విన్పించే వరకు నేను ఈ లోకంలోకి రాలేకపోయాను. రైలు ఎక్కానేగాని, సుజాతవైపే మళ్ళాయి తిరిగి నా

ఆలోచనలు. సుజాతకు శుభాకాంక్షలు తెలియజేస్తూ ఉత్తరం వ్రాయాలని నిర్ణయించు కున్నాను.



సుజాతకు ఉత్తరం వ్రాసిన నాలుగు రోజులకే ఆమెనుండి రిప్లయి వచ్చింది. సుజాత దస్తూరీతో బాగా పరిచయంవున్న నాకు వెంటనే ఆ ఉత్తరం చదవాలన్పించింది.

"డియర్ దాశరథి గారు,

నమస్కారం. ఉత్తరాలు వ్రాయడం అంతగా అలవాటులేని నాకు మీ ఉత్తరం చూచిన వెంటనే జవాబు వ్రాయాలన్పించింది. నా శ్రేయోభిలాషికి ఇంతకుమించి మాత్రం నేను చేసేది ఏముంది ? చాలా కాలం తర్వాత మీకు నేను గుర్తొచ్చినందుకు, గుర్తొచ్చి ఉత్తరం వ్రాసినందుకు, అందులో ప్రత్యేకంగా నాకు శుభాకాంక్షలు అందజేసినందుకు ధన్య వాదాలు. మీరు ఊహించినంత సుఖంగా, సంతోషంగా నేను లేకపోయినప్పటికి జీవితం ఏదో... గడిచిపోతోంది. మీరు బదిలీ అయి హైద్రాబాద్‌కు వెళ్ళిన తరువాత, నేను వంటరి దాన్నన్న సానుభూతి చూపించేవాళ్ళు, మాయమాటలు చెప్పి నన్ను నిలువునా దోచుకుందా మని చూచేవాళ్ళు, నేను ఆసుపత్రి పనిలో బిజీగా ఉన్నప్పుడు అవసరం వున్నా లేకపోయినా నా శరీరంలోని ప్రతి అణువును కన్నార్పకుండా చూచేవాళ్ళు ఎక్కువయిపోయారు. నన్ను గురించి, నా జీవితం గురించి విని మీరెంతగానో జాలిపడేవారు. అంతకుమించి మీరు నా నుండి ఏమీ ఆశించలేదు. అందుకే మీరంటే నాకెంతోయిష్టం. నాపెళ్ళి గురించిన ఆలోచన లను బలవంతంగా అణచిపెట్టుకున్నప్పటికి, నా వివరాలు అడిగి నాతో మళ్ళీ అలాంటి ఆలోచనలకు బీజం వేసారు మీరు. అది మీ తప్పు కానేకాదు. నా మీద మీకున్న జాలి. అభిమానం అంతే !

అయితే, నాకు తెలియకుండానే నా హృదయంలో ఒకే ఒక వ్యక్తికి చోటిచ్చి ఆరాధించాను. ఆ వ్యక్తి నన్నెప్పుడూ ఆ రకంగా ఊహించలేదు. ఆ రకంగా అర్థం చేసుకో లేదుకూడ ! ఆయన అర్థం చేసుకొనేవిధంగా నేను ఎక్కువగా ప్రయత్నంకూడా చేయలేదు. కారణం నా మనస్సులోని మనిషికి భార్యాపిల్లలు కూడా ఉండడమే ! మీరిక్కడ వున్నంత వరకు నాకెంతో రక్షణ వుండేది. మీరు బదిలీ అయివెళ్ళిన తరువాత ఊరకుక్కలు, పిచ్చి కుక్కలు నా మీద పడడానికి ప్రయత్నం చేసాయి. అందుకే నాకు 'లైసెన్సు' అవసరం అయింది. నెల రోజులు సెలవుపెట్టి పెళ్ళికూతురిగా తిరిగివచ్చాను. మీకులాగానే ఇక్కడ అందరూ ఆశ్చర్యపోయారు. నా గుండెలో గూడుకట్టి నేను దైవంగా ఆరాధించుకున్న వ్యక్తిని

నేను పెళ్ళాడానని మీరనుకుంటే పప్పులోకాలేసినట్లే ! సమాజంలో 'పెళ్ళి'కి లైసెన్సుగా పరిగణించే మంగళసూత్రం ఎవరో పరాయి మగాడు నా మెళ్ళో కట్టలేదు సుమా ! నాకు నేనే కట్టుకున్నాను !! పెళ్ళయినట్లుగా నాకు నేనే డిక్లేర్ చేసుకున్నాను. అందరూ లేని నా భర్త గురించి ఆరాతీయడం మొదలుపెట్టారు. "మా ఆయన అందరికి కన్పించడు... నాకే కన్పిస్తాడు" అని చెప్పాను. అందరు నాకు పిచ్చెక్కిందని గుసగుసలాడారు. కొంతకాలానికి అంతా సద్దుమణిగి పోయింది. ఇప్పుడు సమాజం దృష్టిలో నేను వివాహితనే ! ఇప్పుడు నా వంకచూసే ఏ గుంటనక్కా పళ్ళికిలించడం లేదు. ఏ మగాడు ఓరచూపులు చూడ్డం లేదు. అందుకే పూర్తిగా కాకపోయినా, కొంత వరకయినా సంతోషంగా వున్నానని చెబుతున్నాను. నేను ఆరాధిస్తున్న వ్యక్తి నన్ను అర్థం చేసుకుంటాడని, అర్థం చేసుకున్నా ఆయన సరసన నిలబడ్డానికి నేను అర్హురాలిని కాదని నేను అనుకొంటున్నాను. ఆ వ్యక్తిని గురించి ఇంతకు మించి మీకు ఏమి చెప్పగలను ? అందుకే అది మీ ఆలోచనకే వదిలివేస్తున్నాను. మీ అభిమానానికి మరోసారి ధన్యవాదాలు.

ఎప్పటికి మీ అభిమాని...
సుజాత

ఉత్తరం ముగించేసరికి రెండు కళ్ళనుండి కన్నీరు నదులై ప్రవహించింది. హృదయాన్ని మెలిపెడ్తున్న బాధను తట్టుకోలేక ఉత్తరం మడిచి బరువుగా నిట్టూర్చాను. ❑



శ్రీమతి శ్రీగిరిరాజు విజయలక్ష్మి,
ఇ.నెం. 6-3-785/1,
అమీర్‌పేట,
హైద్రాబాదు - 500 016



# అవార్డుల జాతర

ఈ మధ్య సరస్వతివి రెండు పుస్తకాలు ఆవిష్కరింపబడిం తర్వాత కొన్ని సాహితీ సంస్థలనుండి ఆహ్వానాలురావటం ఎక్కువైంది. ఇటువంటి వాటికి ప్రేక్షకులురారు. అందుకే కొందర్ని వెదకిపట్టుకుని ఆహ్వానాలు పంపుతుంటారు. అందులోభాగంగా రసిక జనరంజని ఆర్ట్‌వారి సినీ-సాహితి అవార్డులకు సంబంధించి ఆహ్వానం వచ్చిందామెకు.

అసలా కార్యక్రమం ఎలా ఉంటుందో అనే ఉత్సుకతతో ఆరోగ్యం సరిగాలేకపోయినా ఆదివారం డి.డి.1లో వచ్చే "స్పిరిట్ ఆఫ్ యూనిటీ కన్‌సర్ట్స్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్" ప్రోగ్రామ్‌ను త్యాగం చేసి మరీ వెళ్ళింది సరస్వతి.

ఏవో సినిమాస్టైల్‌లో జానపదపాటలకు చిన్నపిల్లల రికార్డింగ్ డాన్సులు, మ్యాజిక్‌షోలు అయ్యాయి. ముఖ్య అతిథిగారు ఒంటిగంటకు వేంచేశారు.

కవి సమ్మేళనానికి పేర్లు తీసుకున్నారు ముందుగానే. ఆహ్వాన పత్రికలో విడిగా ఒక కాయితంలో-కవిసమ్మేళనంలో పాల్గొనేవారు కన్వీనర్‌గార్ని ఫలానా అడ్రసులో కలుసుకోవచ్చని-(అంటే కొద్దో గొప్పో ముడుపులు సమర్పించుకోవటానికి అని అర్థం చేసుకోవచ్చు) వ్రాసి ఉన్నది.

కవిసమ్మేళనంలో సర్వసతిది ఇరవై రెండవ పేరు. కొందరు చాంతాడంత కవితల్ని (అర్థంపర్థం లేకండా) చదువుతుంటారు. ప్రేక్షకుల(శ్రోతల) సహనానికి అగ్నిపరీక్షపెడుతూ, కొన్ని కవితలయితే మరీ గిటకబారిపోయి సదరు కవులపేరే కొండవీటి చాంతాడులా ఉంటుంది. తన పేరెప్పుడొస్తుందో, అన్ని గంటలు కూర్చోలేనే అనే బాధపడుతున్నంతలో కార్యక్రమం మొదలవబోతున్నట్లు సదరు సంస్థ కన్వీనర్‌గారు మైక్‌ముందు కొచ్చి పెద్దలను వేదికమీదకు ఆహ్వానించసాగారు. జోలెలాంటి సంచొకటి భుజానికి తగిలించుకుని పాండు రోగిలా ఉన్నాడతను పాపం ! ఈ మధ్య కొన్ని సినిమాలలో, ఇలా సంచిని జోలెలాగా భుజానికి తగిలించుకోవటమనేది ఫ్యాషన్ (ముఖ్యంగా హీరోపాత్రలు) "డబ్బు తగినంతగానే లేకపోయినా అందర్నీ సత్కరించాలనే సదుద్దేశంగల మన్మధరావుగారు యిలాంటి సత్కార్యాన్ని తలపెట్టడం అభినందనీయం" వగైరాలంటూ పెద్దలు మాట్లాడారు.

ప్రభుత్వానికి సంబంధించిన చీఫ్ గెస్ట్‌గార్కి ఎన్నో కార్యక్రమాలున్నాయి. వార్లు వెళ్ళే తొందరలో సీట్లోంచి ఏకంగా లేచిపోయారు ఉన్నట్లుండి. మన్మధరావుగారు ఎదురెళ్ళి "సార్... సార్" అంటూ బ్రతిమాలుకొచ్చి వార్ని సీట్లోకూలేశారు. ఒక శాలువా కప్పారు. వద్దు, వద్దంటూ కప్పించుకుని తృప్తిగా కూర్చున్నారాయన. బహుమతి ప్రదానం వారిచే మొదలు పెట్టబడింది.

ముందుగా పగటి వేషగత్తెలాఉన్న మన్మధరావుగారి కార్యకర్త ఒకామె అవార్డు అందు కున్నది. ఆవిడ ఏ రంగంలో సేవచేసిందో, ఏమిటో సరిగా తెలీదు. కొందర్ని సంతృప్తిపరచి, దాని ద్వారా చాటుగా మరికొంత ధనార్జనచేసి తమ సంస్థ పేరు ప్రతిష్టలకోసం మన్మధరావు గారు పడుతున్న తపన సరస్వతికర్థమైంది.

వరుసగా వంద మందిదాకా పేర్లు పిలిచారు-మన్మధరావుగారు, చీఫ్‌గెస్ట్‌గార్కి చిర్రెత్తిపో తోందిలా ఉంది. అవార్డు విన్నర్సంతా వేదికపై మూగారు బెల్లంచుట్టూ ఈగల్లా. అందులో అతి చిన్నవాళ్ళు, చాలా పెద్దవాళ్ళు ఉన్నారు. వీరంతా ఏ రంగానికి సేవచేశారో ఈ గందర గోళంలో అర్థం కాలేదు.

"ఫోటోలు కావాల్సిన వాళ్ళు తీయించుకోవచ్చు. దీనికి విడిగా డబ్బు కట్టాలి" అంటూ మరో ప్రకటన చేశారు మన్మధరావుగారు. ఒక పద్ధతీ పాడూ లేకుండా అందరూ అలా గుమికూడి చీఫ్‌గెస్ట్‌తో కల్సి ఎలా ఫోటో దిగుతారబ్బా ! అనన్పించింది సరస్వతికి.

ఆ గోలలోంచి బయటపడ్డ ఒక ముసలమ్మగారు(అవార్డు విన్నర్) "అవార్డంటే ఏమిటో అనుకున్నా, కాకికీ కోకిలకూ కూడా ఒకటేరకం మెమెంటోనా ! ఒక రేకుమీద సంస్థ ఎంబ్లమ్, దానిపై అవార్డు పొందినవారి పేరు - క్రింద మన్మధరావుగారి పేరూనూ. నా పేరున్నది ఎవరికో పోయింది, అన్నీ తారుమారయ్యాయి, సంతలా సాగిన ఆ గోలలో అమెరికా వెళ్లబోయే మనవడికి గొప్పగా చెప్పుకున్నా, ఈ రేకు ముక్కనెలా చూపించనూ.." అంటూ గొణుక్కుంటూ సరస్వతి ప్రక్కనే కూర్చుంది.

కవిసమ్మేళనం అయ్యేసరికి ఏ సాయంత్రమో అయ్యేలాఉందని ఆ ఆదివారపు తెలుగు సినిమా (కళాఖండం) మిస్సవుతానేమో, కళ్లు తిరిగి పడిపోతానేమో అనుకుంటూ జనాన్ని తోసుకుని బయటపడింది సరస్వతి. కొన్నాళ్ల తర్వాత 'సాహితిశ్రీ' అవార్డు స్వీకరించండి అంటూ తన పుస్తకాల ఆవిష్కరణ జరిపించిన శంకర్రావుగార్నుండి ఉత్తరం వచ్చింది సరస్వతికి.

ఎవరిగొప్ప వాళ్లకర్థంకాదు కాబట్టి (ముఖ్యంగా సరస్వతికి)నిరాశావాది కనుక శంకర్రావు గార్ని కల్సుకున్నదామె ఒకరోజు. ఎందుకు నాకీ అవార్డు ఇస్తున్నారంటూ అడిగింది. "ఈ మధ్య మీ పుస్తకాలు రిలీజ్ చేశాం కదా ! ఈ అవార్డులు ప్రకటించే కమిటీ ఆర్గురికి

ప్రకటించింది వారి సాహితీ సేవను, ప్రతిభను పరిగణనలోకి తీసుకుంటూను. మీ బుక్స్ చాలా బాగున్నాయి. అందరి ప్రశంసలూ పొందాయి. మీరు మంచి పోయట్‌కూడా కదా !" అంటూ సందేహం తీర్చారాయన.

ఆ తర్వాత యిలాంటి కార్యక్రమాలు నడిపించేడంలో ఉద్దండులైన శ్రీశంకర్రావు ఆధ్వర్యంలో చక్కగా పలువురి ప్రశంసలనందుకునేలా జరిగిందా కార్యక్రమం. కేంద్ర మంత్రి గారు అవార్డులు ప్రదానం చేశారు. బండబారిపోయిన మనసుగల సరస్వతిని యీ సంతోషకరమైన విషయం కొద్దిగా కూడా స్పందింపచేయలేదు.

తన గురించి చెప్పుకోవాలంటే సిగ్గు సరస్వతికి, స్వంత డబ్బా వాయించుకుంటుందం టారని భయం. పబ్లిసిటీ లేకపోతే మనలోని ప్రతిభ పదిమందికీ ఎలా తెలుస్తుందన్న ఇంగిత జ్ఞానం లేదామెకు.

శంకర్రావుగారు పాటల పోటీలు, కవిసమ్మేళనాలు వగైరాలు నిర్వహిస్తూ ఎందరో ప్రతిభావంతులను వెలుగులోకి తెచ్చారు. పది ఆహ్వానాలువస్తే, ఒకదానికి వెళ్ళేది సరస్వతి, వెన్నుకయిన ఆపరేషన్‌వల్ల గంటలు గంటలు కూర్చోలేక, క్యాన్సర్ రోగి అయిన తల్లి కోరిక మేరకు పుస్తకాల ఆవిష్కరణ ఏర్పాటుచేయించుకుందప్పుడు. ఆ రోజు సెలవు పెట్టి పడుకున్నది నాల్గయిదు గంటలన్నా కూర్చోవాల్సొస్తుందని, నోరు తెరిస్తే కప్పలాగా ఉండే హీరోను ఒక పిక్చర్‌లో తన మాటల చాతుర్యంతో ఉన్నతస్థానానికి తీసికెళ్లిన ఒక ప్రముఖ రచయిత (ఆ హీరోవల్లే ఫేడవుట్‌కూడా అయ్యాడతను) మరికొందరు చాలా చక్కగా సమీక్ష చేశారు, ఆ పుస్తకాల ఆవిష్కరణనాడు, అనుకున్న విషయాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పటమేకాక, అన్నింటికీ చక్కగా పరిష్కారమార్గాన్ని సూచించిందంటూ మరొక పత్రికా సంపాదకుడూ సమీక్షించాడు, ఏదో ఇంగ్లీషు రచనల గురించి మాట్లాడుతూ శిల్పంలో ఇంకా కృషిచేయాలన్నారు, పరిణతి సాధించాలన్నారు. మరెవరో మాట్లాడటానికి లేచారు. అదే సందని "యిందాకేదో శిల్పం అన్నారు, ఏమిటది ?" అన్నది సరస్వతి తెలియనట్లు. "శిల్పం అంటే ముగింపులో ట్విస్ట్ ఉండటం" అన్నాడు నీళ్లు నములుతూ ఆ 'శిల్పం' అన్నతను. "అన్నింటిలో ట్విస్ట్ ఉంటే మూసపోసినట్లుండదా ? కథనుబట్టి కథనం, ముగింపు ఉండాలిగానీ" అంటూ ఫేడేల్మని మొహానకొట్టినట్లడిగింది సరస్వతి.

ఆ తర్వాత సరస్వతి మాట్లాడాల్సి వచ్చింది. మామూలుగా అందర్నీ ఉద్దేశించి తర్వాత "రచయిత ముందుగా విమర్శకుడై ఉండాలి. ప్రతి రచయితకూ తన లోటుపాట్లు తెల్సుండాలి. అలా తెల్సుకునప్పుడు ఎవరేమి విమర్శచేసినా పట్టించుకోనవసరం లేదు. పైగా విమర్శకుడికి రచయిత వ్రాసిన విషయాలపై అవగాహన ముఖ్యంగా ఉంటేనే సద్విమర్శ చేయగలడు" అంటూ కొద్దిగా మాట్లాడింది ఆమె.

మర్నాడు కొన్ని పత్రికలలో బాగా వ్రాశారు. ఈ కువిమర్శల సదరు సంపాదకుడు తన డైలీలో రచయిత్రి ఎంతో ఎదగాలనీ, వగైరా రచయిత్రికి సూచించారనీ వక్రీకరించి వ్రాయించాడు, ప్రశంసించాడని వ్రాయించకుండా, "మీరు వేదికమీద చెప్పే నీతులకు వ్యతిరేకంగా కథలు ప్రచురించమని వెళ్లిన రచయితలకు "పాత చింతకాయపచ్చడి ఎవరికీ కావాలయ్యా ! సెక్స్, వయొలెన్స్, ఫిక్షన్ కావాలిగానీ" అని అంటార్ట. ఇదేమన్నా భావ్యమా ! నామీద అలా వక్రీకరించి వ్రాశారేం ? పరిణతికి అంతమంటూ ఉందా ? అసలు" అంటూ ఘాటుగా వ్రాశారామె అతనికొక లేఖ.

ఆతర్వాత తన పుస్తకాలనుఅన్ని లైబ్రరీలకూ పంపింది. కొన్ని సమీక్షలకోసం పత్రికలకూ పంపింది. తెలుగువాడిని తెలుగువాడు గుర్తించడు ఒక పట్టాన. కానీ మద్రాసులోఉన్న ఒక తెలుగు మహిళా మాసపత్రికలో మాత్రం వెంటనే ఆమె పుస్తకాలపై చక్కని సమీక్ష లొచ్చాయి, ప్రతి పాఠకుడూ చదివితీరాల్సిన రచనలంటూ. ఆ తర్వాత అది చూసి కొందరి నుండి మీ పుస్తకాలు పంపండంటూ అభ్యర్ధనలొచ్చాయి, అభిమానులేర్పడ్డారు. "మీవి రచనల్లా లేవు, వాస్తవగాథల్లా ఉన్నాయి. కొడవటిగంటి, రావిశాస్త్రి తదితరుల రచనలకు ఏ మాత్రం తీసిపోవు. మీరు పేరుకోసం, డబ్బుకోసం కలంపట్టినట్లు కన్పట్టం లేదు. ప్రజల కోసం, ఒక సదాశయం కోసం రచనలు చేస్తున్నట్లు కన్పిస్తున్నది. మీరు ఆవకాయ జాడీ నుండి అమెరికా వరకు ఏ విషయాన్నయినా వ్రాయగలరు. మీరు ముందుమాటలో వ్రాసి నట్లు 'గొప్పవారితో పరిచయం లేకపోవటంవల్ల ముందుమాట నేనే వ్రాసుకున్నానన్నారు' సత్తాలేని రచనలకు మేధావులు వ్రాసిన సందర్భాలెన్నో ఉన్నాయి. మీకు నిజంగా సాహిత్య అకాడమీ అవార్డు రావాలి, ఇంకారాస్తూ ఉండాలి. మాలాంటి అభిమానుల కోసమంటూ" లేఖలొచ్చాయి.

సరస్వతికి ఆర్థికస్తోమత అంతగాలేక కేవలం రెండువందల పుస్తకాలు మాత్రమే వేయించుకున్నది, నెలనెలా వచ్చే జీతంలో కొంత ప్రెస్‌లో కడుతూ. ఎప్పుడో మనసు స్పందించి, సమస్య కొత్తగా కన్పించినప్పుడు మాత్రమే వ్రాసిన రచనలామెవి. ఇప్పుడు అనారోగ్యంవల్ల ఎక్కువగా రాసే ఓపికా లేదు. డబ్బు కోసం కమర్షియల్ రచనల జోలికి వెళ్లే తత్త్వం కాదామెది.

ఆ సంవత్సరానికి సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించారు. సరస్వతికి రాలేదు. అవార్డులకు సంఖ్యా బలం ముఖ్యమా ! ఇందులోకూడా అకాడమీలో సభ్యులుగా ఉన్న వార్ని కనుక్కొని వార్ని సంతృప్తిపరచి యిలా అవార్డులు సంపాదిస్తారా ? అనన్పించింది ఆమెకు. తను డైరెక్ట్‌గా పంపింది. కానీ పాఠకుల నుండి వాళ్లకు లేఖలు రావాలట రచనలపై. ఎవరు వ్రాస్తారు ? అంత నిజాయితీగా రాయించుకుంటే తప్ప కుదరదు. అప్పుడు అవార్డులకు విలువ ఉంటుందా ? ఈనాడు ఎక్కడ చూసినా అవార్డుల జాతరే.

ఉద్యోగరత్న, సాహిత్యరత్న, విద్యారత్న, ఆ రత్న, ఈ రత్న అంటూ పుట్టగొడుగుల్లా వెలుస్తున్న సాహితీ సాంస్కృతిక సంస్థలు ధనార్జన కోసం సంస్థల ప్రతిష్ఠను యినుమడింప చేసుకోవడంకోసం, అమాయకుల, అత్యాశపరుల .(కళాకారుల) బలహీనతను క్యాష్ చేసుకుని అవార్డులనిస్తున్నాయి.

నిజంగా ప్రతిభకలవారికి, అవకాశాలు లేనివారికి యీ అవార్డులు ఎండమావుల లాంటివే, ఏ నూటికో కోటికో తప్ప. అసలులో సరుకు లేకపోయినా సభల్లో వక్తలకు, నిర్వాహకులకు ఘనంగా శాలువాలు కప్పి, దూరదర్శన్‌లో కనిపించేలా చేసుకుని అన్ని పేపర్లలో వచ్చేలా చేసుకునే వార్కి ఇప్పుడు రోజులన్పించింది సరస్వతికి, ప్రతిష్ఠాత్మకమైన అవార్డులను అవార్డుల కమిటీ వార్ని కాకాపట్టి, ముడుపులు సమర్పించుకుని, పైరవీలు చేయిస్తే తప్ప ఏరకమైన అవార్డులూరావు, ఎన్నడోగానీ.

అందుకే సాహిత్య అకాడమీ అవార్డు నివ్వకుండా ముందుగానే తనకు 'సాహిత్య శ్రీ' అవార్డు పడేశారా ? అనే సందేహం సరస్వతికి కల్గింది. ఎందుకంటే తన పుస్తకాలపై విమర్శ చేసిన సంపాదకుడు సాహిత్య అకాడమీ సభ్యుడని తెల్సింది. కాలక్రమంలో అవార్డులు కొనుక్కునే హీనస్థాయి యీనాడు ఉన్నదీ అంటే అవార్డుల స్థాయి ఏ పరిస్థితికి దిగజారిందో అర్థం చేసుకోవచ్చు.

ఆ తర్వాత శంకర్రావుగారు సరస్వతి అన్న ద్వారా ఆమె గురించి పూర్తిగా తెల్సుకుని మనకు జీవితమూ, టాలెంట్స్ భగవంతుడిచ్చిన వరం, అవి ప్రాజెక్ట్ చేసుకోవటంలో తప్పేమిలేదని బాగా బోధించి ఆమె కార్టూన్లు, ముగ్గులు, ఆమె తీసిన ఫోటోలు, వేసిన చిత్రాలు ఒక ప్రదర్శనగా ఏర్పాటుచేసి అందులో ఆమె పాడిన శాస్త్రీయ, లలితగీతాల సంగీతపు క్యాసెట్లు కూడా విన్పించేలా ఏర్పాటు చేశారు.

ముఖ్యంగా యీ ఫోటోగ్రఫీ, కార్టూన్లరంగంలో ఆడవారికి త్వరగా గుర్తింపురాదు, రానివ్వరు. స్త్రీకి స్త్రీయే శత్రువన్నట్లు సాటి స్త్రీలే అవతలివారి ప్రతిభను గుర్తించరు. ఎవరో శంకర్రావుగారిలాంటి (పురుషులలో) నిస్వార్థపరులు తప్ప. తనలో ఉన్న టాలెంట్స్‌ను ఆవిష్కరింపచేసే ప్రయత్నం జరిగింది. ఆ తృప్తిచాలు. మరే అవార్డులూ తనకక్కర్లేదు-అని తృప్తిపడింది. అవార్డుల ఎంపికలోగల తత్వం బోధపడిన సరస్వతి. ❑





**మేడిచర్ల సూర్యప్రకాశరావు,** B.A.
ఇ.నెం. 7-109,
రాజోలు, రామరాజులంక - 533 253
తూర్పుగోదావరి జిల్లా.

# మరణం

నా చిన్ననాటి స్నేహితుడు మదన్ ఇంటికి, వాళ్ళ ఊరుకి వెళ్ళడానికి బయలుదేరినది మొదలు ఎంతో ఉత్సాహం నాలో పరవళ్ళు తొక్కుతుంది.

నేను కూర్చొన్న కారు మంచి స్పీడ్‌గా పోతుంది. మదన్‌వంటి మంచి స్నేహితుడ్ని చాలా కాలానికి కలుసుకోబోతున్నందులకు నా అంతరంగం ఉత్తుంగ తరంగంలా ఉంది. నా ఆలోచనలు మదన్ చుట్టూ తిరుగుతున్నాయి. మదన్ నేను హైస్కూల్లో, కాలేజీలో క్లాస్ మేట్స్‌మి, సినిమాలకు, షికార్లకు తరచుగా వెళ్ళేవాళ్ళం మదన్, నేను.

బి.ఏ., చదువు పూర్తయ్యి నేను నాన్నగారి వ్యాపారరీత్యా విజయవాడ వచ్చేశాను. మదన్ మాత్రం తన స్వగ్రామంలోనే వ్యవసాయం చేసుకుంటున్నాడు. బి.ఏ. చదువు పూర్తయిన నాటినుండి.

నేను పయనిస్తున్న చిన్న కారు మదన్ ఇంటికి ముందు తారు రోడ్డుపై ఆగింది. ఇంటి ముందు జనం మూగివున్నారు.

కారు డోర్ తీసుకొని దిగి జనంలోకి వెళ్ళి నిలబడ్డాను. ఓ పెద్దాయన మాటలు నా చెవులకు తాకాయి.

"మదన్ ఎంత పని చేసావయ్యా, ఇంత పిరికివాడిలా ప్రవర్తిస్తావనుకోలేదు'' అంటున్నాడు ఆ పెద్దాయన. జనంల్లో నుండి ముందుకి వంగి తొంగిచూసాను. ఎవరిదో నిర్జీవ శరీరం నేలమీద వుంది. దానిపై తెల్లని వస్త్రం పరచి వుంది, ముఖం కనిపించటం లేదు.

"ఎవరండీ పోయినవారు ?'' అడిగాను ప్రక్కన ఓ ఆసామిని.

"మదన్ !... తాను ఎంతగానో ప్రేమించిన తన మేనమామ కూతురు కుసుమ వేరొకరిని పెళ్ళిచేసుకోవటంతో... తట్టుకోలేకపోయాడు, పాపం సూసైడ్ చేసుకున్నాడు'' చెప్పాడు.

అంతే ఆ ఆసామి మాటలు విన్న నేను అక్కడే ఆ జనంలోనే కుప్పకూలిపోయాను. ❑



గుండెబోయిన శ్రీనివాస్,
ఇ.నెం. 11-23-889, ఎల్.బి. నగర్,
వరంగల్ - 506 002
ఫోన్ : 420769

# ముడి సరుకు

రచయిత రఘురామ్ వ్రాయలేకపోతున్నాడు. ఎంతోసేపటి నుండి అతడు తన డ్రాయింగ్ రూంలో అలాగే కూర్చుని ఉన్నాడు. వేసిన లైటు గదిలో వేసినట్టే ఉంది. మూత తీసిన ఫౌంటెన్ పెన్ తీసినట్లే ఉంది. తెల్లకాగితం మీద నల్లగీత లేదు. గంటలు గడిచి పోతున్నా అతని ఆలోచనలు మాత్రం అక్కడి నుండి కదలడం లేదు. అతనికి ఎంతో అసహనంగా ఉంది. మనసంతా గజిబిజిగా ఉంది. ఎవరిమీదో తెలియని కసిగా వుంది. ఏమైంది తనకిప్పుడు ? ఎందుకు తను మునుపటిలా వ్రాయలేకపోతున్నాడు ? తనేమిటి అనామకుడిలా వ్రాయడానికి తడబడటమేమిటి ? రఘురామ్‌కు నిజంగా ఆశ్చర్య మనిపించింది.

పిస్టల్ ఆకారంలో ఉండే ఆంధ్ర దేశ పటంలో బుల్లెట్‌లా పేలింది అతని పేరు. పది హేనేళ్లపాటుగా అది తెలుగు పాఠకుల గుండెల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంది. రచయితగా ఎన్ని ప్రయోగాలు చేశాడు ! ఎంత వివాదాన్ని సృష్టించాడు ! తన రచనల కోసం ఎంత మంది పడిచచ్చేవారో, ఎందరు నిజంగా చచ్చారో అతనికి స్ఫురణకు రావడంలేదు. సెక్స్, వయొ లెన్స్, క్రైమ్, సస్పెన్స్-ఈ నాలుగు అంశాలను తీసుకొని నవలలు, కథలు వ్రాశాడు. అప్పటి వరకు వ్రాస్తున్నవాళ్ళు అనుసరిస్తున్న దానికి భిన్నమైన మార్గం అది. అందుకే అతని కి మిగతావాళ్ళను మించిన పేరు ప్రతిష్టలు వచ్చేశాయి. ప్రస్తుతం తెలుగులో వ్రాస్తున్న అయిదారుగురు సూపర్‌ఫాస్ట్ రైటర్లలో అతనూ ఒకడు. అలాంటి తను వ్రాయలేక పోతున్నాడా ? నిజంగానే వెనకబడిపోతున్నాడా ? అతనికి అస్సలు నమ్మబుద్ధి కావడం లేదు. కానీ అది నిజం.

ఎడిటర్లు ఏమాత్రం ఖాతరు చేయడం లేదు. పబ్లిషర్లు తనను చూస్తే పక్కకు తప్పు కుంటున్నారు. సాటి రచయితలు చాటుమాటుగా నవ్వుకుంటున్నారు. డాక్టరవబోయి యాక్టరయినట్టు రఘురామ్ రచయిత కావడం కూడా విచిత్రంగా జరిగింది. యం.బి.ఏ. పూర్తయ్యాక ఏదైనా మంచి వ్యాపారం చేద్దామని రాజధాని చేరుకున్నాడు. కాస్త ఓపికగా

పరిశీలిస్తే తెలిసిన రహస్యమేమిటంటే రచనా వ్యాసాంగాన్ని మించిన లాభసాటి వ్యాపార మేదీ లేదని, ఉబుసుపోక నవలలు చదివే అలవాటు వ్రాయడానికి బాగానే ఉపకరించింది. పాఠకులను ఆకట్టుకోవడం కోసం రచనలలో అనేక టెక్నిక్కులను జొప్పించాడు. అతని ప్రయోగాలు వృధా కాలేదు. ఫలితం కావలసినంత డబ్బు, అంతకుమించిన కీర్తి ! అక్కడి నుండి వెనుకకు తిరిగి చూసుకొనే అవసరం లేకపోయింది. అయిదారేళ్ళలోనే లబ్దప్రతిష్ట లైన రచయితలో రఘురామ్ ఒకడైపోయాడు. ఎందరో అభిమానులు ఎక్కడికి వెళ్ళినా బ్రహ్మరథం పట్టేవాళ్ళు. కొత్తవాళ్ళు తన ఒరవడిలో రచనలు ప్రారంభించారు. అనుకరణను మించిన పొగడ్తేమి ఉంటుందని మొదట్లో సరిపెట్టుకునేవాడు. కానీ ఈ కొత్తవాళ్ళే తన కొంప ముంచుతారని మాత్రం ఊహించలేకపోయాడు. అనుకరణతో మొదలైనది ఆక్రమణ దాకా వచ్చేసింది. రఘురామ్ రచనలకు మూలమైన రహస్య స్థావరాలను వాళ్ళు క్రమంగా కొల్లగొట్టడం మొదలుపెట్టారు. ఇతడు మొదలుపెట్టక ముందే వాళ్ళు పూర్తి చేసేస్తున్నారు. అసలు రచయితకు కూడా అనుమానం రానంత అద్భుతంగా కాపీ చేస్తాడనేది రఘురామ్ పైనున్న ప్రధాన విమర్శ. కానీ కొత్తవాళ్ళ పద్ధతి అతనికి మింగుడు పడడంలేదు. రన్నింగ్ కామెంటరీలాగా వ్రాసేవాడొకడు, తనకు తెలిసిన విషయాలన్నీ రచనల్లో జొప్పించే వాడొకడు. ఏకంగా పుస్తకాలకు పుస్తకాలనే కాపీచేసి పడేసేవాడు మరొకడు. ఇట్లాంటి వెధవలను పట్టుకొని ఇంద్రుడవు చంద్రుడవంటూ పత్రికలవాళ్ళు ఆకాశానికెత్తేస్తుంటే రఘురామ్‌కు మహా చిరాకెత్తుకొస్తోంది. గతంలో తనను కూడా వీళ్ళు ఇలాగే పొగిడేవాళ్ళు. రచనా సామర్థ్యాన్ని ఏమాత్రం పరిగణనలోకి తీసుకోకుండా వ్యక్తులను ఊదరగొట్టే చవక బారు ప్రచారంగా దానిని తన విమర్శకులు అభివర్ణించేవాళ్ళు. తనకున్న పాఠకాదరణ చూసి ఓర్వలేని విమర్శకుడొకడు "శ్రీరఘురామ్ రచనల్లో పాఠకున్ని ఆకట్టుకునే విషయాలు చాలానే ఉంటాయి, ఒక వాస్తవం తప్ప" అంటూ విషం కక్కేడు.

ఆకలి, దరిద్రం అంటూ వ్రాస్తే తప్ప అది రచన కాదట ! ఆకలేమిటో, దరిద్రమేమిటో తనకెప్పుడూ అనుభవంలోకి రాలేదు. తాను పుట్టిపెరిగిన వాతావరణం గొప్పది, చదివిన చదువుగొప్పది, ప్రస్తుతం తానున్న పొజిషన్‌గొప్పది. అందుకే వాటి గురించి ఆలోచించాల్సిన అవసరం లేకపోయింది. రఘురామ్‌కు ఎవరో కవి అన్న మాటలు గుర్తొచ్చాయి, "జీవితం ఎల్లప్పుడూ మట్టివాసన వేస్తుండాలట !" మట్టి వాసనేమిటో ! అసహ్యంగా, పేద వాసన లాగా ! మట్టినే తింటూ జీవితాంతం మట్టిలోనే పొర్లుతూ వుండాలేమో ! ఇటీవల ఒక పార్టీలో కలిసినప్పుడు ఒక ఎడిటర్ అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి "ఆకలి, దరిద్రపు" రచనలవైపే పాఠకులు మొగ్గుచూపుతున్నారట. కాస్త వాస్తవాన్నికూడా కలిపికొట్టవోయ్ రఘురామ్ అంటూ ఓ ఉచిత సలహా. నువ్వు తలుచుకుంటే తప్పకుండా వ్రాయగలవు. నీకా శక్తి వుందంటూ ఓ బోడి సర్టిఫికేట్, పైగా వాస్తవ జీవితాల్లోంచి పుట్టుకు వచ్చిన రచనలే కలకాలం జీవిస్తాయంటూ ఓ కొటేషన్. ఈ ఎడిటర్లకు ఎన్ని నాలుకలున్నాయో అర్థం కాదు.

సెక్సుర్రాసి పాఠకులను వేడెక్కించమనీ, మంత్ర తంత్రాల గురించి చదివితే పాఠకుడు పూనకం పూనాలనీ, అడ్డమైన ఐడియాలిచ్చి వ్రాయించేదీ వీళ్ళే. సాహిత్యం, పాతివ్రత్యం అంటూ మంది ముందు మడికట్టుకున్నట్లు నటించేదీ వీళ్లే, ఎన్ని వగలు ! వీళ్ళకన్నావేశ్యలు వెయ్యిపాళ్ళు నయం అనుకున్నాడు రఘురామ్. ఒకప్పుడు సీరియల్ వ్రాసిమ్మంటూ తన ఇంటిచుట్టూ తిరిగినవాళ్ళు ఈ రోజు చూద్దాం ! అవసరమైతే వేద్దాం ! అంటూ దొంగ మాటలు చెబుతున్నారు. పరిస్థితి ఇలాగే కొనసాగితే రచయితగా తనకు నూకలు చెల్లినట్లే ! ఈ మాట మదిలో మెదలగానే ఒక్కసారిగా అతని ఒళ్లు జలదరించింది. కాళ్ళు చేతులు సన్నగా వణికాయి ! నిజమా ! నిజంగానే తనకు ఫ్యూచరుండదా ! అలా అయితే ఎలా ? ఏం చేస్తే తను మళ్ళీ మునుపటిలా పాఠకుల అభిమానాన్ని సంపాదించగలడు ! తన మనసు అంగీకరించినా అంగీకరించకపోయినా తన రచనలకు డిమాండు తగ్గినట్లు అమ్మకాలే చెబుతున్నాయి. ఆ ఎడిటర్ అన్నట్లుగా జీవితం మట్టి, ఆకలి, దరిద్రపు రచనలకు ఆదరణ లభిస్తున్నట్లు తన సహరచయితలు కొందరు చెప్పగా విన్నాడు. మరి అట్టాంటివే తను కూడా వ్రాస్తే, అనిపించిందతనికి.

జనంలోకి వెళ్ళాలి ! గుడిసెల చుట్టూ తిరగాలి ! తానాపని చేయగలడా ? తానేమిటి సమాజంలో తన స్టేటసేమిటి ? అడుగడుగునా తనకు ఎందరో అభిమానులున్నారు ! ఆ మురికి కొంపల్లో వాళ్ళు తనను గుర్తిస్తే, తను నిజంగానే మురికి కూపాల్లో కూరుకు పోతున్నట్లు భావిస్తే తన పురువు పోతుందనుకున్నాడు. కాబట్టి ఈ ఆలోచన బాగాలేదని పించింది. పైగా ఎవరో అన్నమాట జ్ఞాపకం వచ్చింది "తినే కంచం వద్దకు వెళ్ళి చూస్తే తప్ప పేదవాడి తిప్పలు అర్థం కావాయేమిటి" ఇంతవరకు బాగానే వుంది, మరయితే ఏం చేయాలి ? ఏంచేసి తన స్థానం నిలుపుకోవాలి ? ఏమీ తోచక కణతల్ని గట్టిగా నొక్కు కున్నాడు. అసహనంగా కుర్చీలో అటూ ఇటూ కదిలి తలను వెనుకకు వాల్చాడు.

ఎదురుగా ఉన్న గది గోడకు గడియారం గుండెలాగా అమర్చబడి ఉంది. విచిత్రం ! తన గుండెచప్పుడులాగే అదికూడా దానంతట అదే చప్పుడు చేస్తోంది. ఒక్క దమ్ము గుండెల నిండా పొగ పీలిస్తే బాగుండుననిపించింది. ఖాళీ అయిన సిగరెట్ పెట్టె జాలిగా అతనివైపే చూస్తోంది. వేళ్ళ మధ్యనున్న పెన్ను వెక్కిరిస్తున్నట్లనిపించింది. రఘురామ్‌కు ఇంకో ఆలోచన తట్టింది. ఏదైనా కథల పోటీకో, నవలల పోటీకో న్యాయనిర్ణేతగా వెళ్లితే ఎలా ఉంటుందనిపించింది. వ్రాసేవాళ్ళు దాదాపుగా కొత్తవాళ్ళు. పైగా ఫ్రెష్‌థాట్స్ ! కాబట్టి బాగానే ఉంటుందనిపించింది. గతంలోనయితే తననెంతమంది రమ్మన్నా వెళ్ళేవాడు కాదు. ఏ విధంగా చూసినా తనకది టైం వేస్టు వ్యవహారంలా కనిపించేది. పోనీ ఇప్పుడు పని గట్టుకొని వెళ్ళినా తననొక్కడినే పిలువరు. తనతో పాటు మరో అయిదారుగురు వస్తారు.

ఆ ఇన్స్పిరేషన్తో వ్రాశామంటే తప్పకుండా వాళ్ళు పట్టేస్తారు. ఇప్పటికే ప్రత్యర్థులు తన మీద దుమ్మెత్తిపోస్తున్నారు. ఎన్నో అభియోగాలు చేస్తున్నారు. ఈ ఆలోచనకూడా బాగాలేదని పించింది. కాసేపు కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు రఘురామ్.

తెరచి వుంచిన కిటికీ నుంచి వీస్తున్న చల్లగాలి శరీరానికి హాయిగా తగులుతోంది. ఎదురింటివాడి టేపు రికార్డరులోంచి మధురమైన సంగీతం వినిపిస్తోంది. లయాత్మకంగా చేతులను ఎదురుగా ఉన్న టేబులుపై ఆడించసాగాడు. ఇంతలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది. తానే ఒక రచయితల సలహా కేంద్రంలాంటిది పెడితే ! అద్భుతం ! ఇక్కడికయితే ఇతరులు తొంగి చూసే అవకాశం ఉండదు. ఈ ఐడియా రావడంతోటే రఘురామ్ ఇక ఆలస్యం చేయలేదు.

రచయితలుగా రాణించ లేకపోతున్నారా ? ప్రోత్సాహం లేదని బాధపడుతున్నారా ? అయితే మీరిక చింతించనవసరం లేదు. మీ వెన్నుతట్టడం కోసమే మా సలహా కేంద్రాన్ని ఏర్పాటు చేశాం ! మీ తప్పుల్ని దిద్దుతాం, మిమ్మల్ని రచయితలుగా తీర్చిదిద్దుతాం ! ఇందులో చేరడానికి ఎలాంటి ఎంట్రీ ఫీజులు లేవు. ఏ ఇతర ఆంక్షలూ ఉండవు. ప్రవేశం కొరకు మీరు చేయాల్సిందల్లా నవలలైతే ఒకటి, కథలయితే మూడు చొప్పున మా కేంద్రానికి పంపండి. చేయి తిరిగిన రచయిత శ్రీరఘురామ్ నుండి విలువైన సలహాలను పొందండి అని అన్ని పత్రికల్లో ప్రకటనలు వేయించాడు.

ఆశ్చర్యం !! వారం గడిచిందో లేదో, రాష్ట్ర నలుమూలల నుండి రచనలు వరదలాగా వచ్చిపడ్డాయి. రఘురామ్ అప్పటికే నిర్ణయించుకున్నాడు. ఆరునెలల వరకూ రచనల జోలికి పోగూడదని. ఇక ఆలస్యం చేయలేదు, రోజుకు పదహారు గంటలు చదవడానికే వినియోగించాడు. ఒకటా ! రెండా ! ఎన్ని నవలలు ? ఎన్ని కథలు ? అన్నీ ఓపికగా చదివే వాడు. చదువుతున్న కొద్దీ అతనికి అంతకంతకూ ఆశ్చర్యమనిపించసాగింది. అందరూ కొత్తవాళ్ళే. కొత్తకొత్త విషయాలను చెప్పాలని తాపత్రయ పడుతున్నవాళ్ళే. వాళ్ళకు శిల్పం గురించి తెలియదు, సంవిధానం అంతకన్నా తెలియదు.

కానీ వాళ్ళకు తమచుట్టూ వున్న జీవితం తెలుసు. అందులోని వైరుధ్యాలు తెలుసు, ఆర్థిక సంబంధాలు తెలుసు, బతుకుల్లోని భీభత్సం తెలుసు. కథలు, నవలల్లో వాస్తవ విషయాలెన్నో చర్చించబడ్డాయి. కానీ సమర్థవంతంగా చిత్రించబడలేదు. ఎన్ని విషయాలు, ఎంత చిన్న విషయాలు, ఎన్నోసార్లు చూసీ చూడనట్టు వదిలేసిన విషయాలనుండి కూడా కొత్తవాళ్ళు ఇతివృత్తాలనెన్నుకొని కొత్త కోణాలనుండి పరిశీలించారు. ఎంతో అనుభవమూ, పేరున్న రచయితనైన తన బుర్రకెందుకు తట్టలేదో ? ఎవడో విమర్శకుడన్నట్టు "తాను

జీవితం, గాలి సోకని రోదసిలాంటి ఎ.సి. రూముల్లో కూర్చుని రోబోటులాగా రచనలు చేశాడా ?" తాను పెన్ను పట్టినప్పటినుండి ఒక ప్రవాహంలాగా వ్రాస్తూపోయాడు. రచయిత అనే వాడు వ్రాస్తూనే ఉండాలి. మూడ్ వచ్చినప్పుడే వ్రాస్తాననేవాడు రఘురామ్ దృష్టిలో వట్టి మూఢుడు. వ్రాస్తూ వ్రాస్తూ రాశిపెంచుకుంటూ పోయాడేతప్ప అందులో ఎంత నిలుస్తుందో ఎంత సాహిత్య చెత్తలో కలుస్తుందో ఎప్పుడూ ఆలోచించలేదు. ఒక రచయిత్రి పాకశాస్త్ర పరిభాషలో అతని రచనలను తీసిపారేసిన మాటలు జ్ఞాపకం వచ్చాయి "వంటకానికి ఉపయోగించే పదార్థమే పుచ్చుదయినప్పుడు, ఎన్ని మసాలాలు గుప్పిస్తేమటుకు ఏం లాభం అని" ఆవిడ ఈసడించినట్లు తన రచనలు నిజంగా పనికిరాని పుచ్చు బాపతే అని సరిపెట్టుకున్నాడు కూడా ! తాను దినుసు మంచిదికాకున్నా మసాలాలతో ఇంతకాలం పాఠకులను మెప్పించినపుడు, అది చేతిలో ఉంటే ఆ మాత్రం చేయలేనా అనుకున్నాడు రఘురామ్. ఒక్కమాటలో చెప్పాలంటే వీళ్ళనుండి తాను సేకరించింది ముడిసరుకు. వట్టి రా మెటీరియల్. దీనితో తనకు కావలసిన వస్తువులు, కావలసిన విధంగా తయారు చేసు కోలేడా ! తప్పకుండా తయారు చేసుకోగలడు. ఈ దెబ్బతో తన ప్రత్యర్థులనొక్కొక్కడినే అధిగమిస్తూ ముందుకు పోతాడు. సమీప భవిష్యత్తులో వీళ్లెవ్వరూ తన దరిదాపులకుకూడా చేరుకోలేరు. కనీసం అయిదారేళ్ళ వరకూ తెలుగు వచనా రచనా సార్వభౌముడిగా తను మరొక్క వెలుగు వెలగబోతున్నట్లు ఊహించుకున్నాడు. ఆ తరువాత కథలు నవలల కట్టలకేసి చూస్తూ 'నా భవిష్యత్ రచనా నిర్మాణ సౌధానికి ముడిసరుకును అందిస్తున్న ఓ కొత్త రచయితలారా, మనసులోనైనా మీకు కృతజ్ఞత చెప్పకుండా ఉండలేక పోతున్నాను" అంటూ తృప్తిగా నిట్టూర్చాడు. ❑






**రంగు చక్రపాణి,**

రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్,

ఇ.నెం. 1-7-442, రెవెన్యూ కాలనీ,

సుబేదారి, హన్మకొండ - 506 001

జి॥ వరంగల్. ఫోన్ : 431468


# యువరాణి డయానా హేర్ స్టైలు

ఒకప్పుడు నా జుట్టు కాకులు దూరని కారడివిలా దట్టంగా, పొడుగ్గా వుండేది. ఏండ్లు పైబడినప్పటినుండి వాసిలో తగ్గటమే కాకుండా అక్కడక్కడ తెల్లబడటంకూడ మొదలైంది. అంతే కాకుండా సైజు కూడ తగ్గినది. అంటే మెడనుండి ఓ బెత్తెడు అని ఖచ్చితంగా చెప్పు కోవచ్చు. ఈపాటి జుట్టుతో మంచి స్టైలిష్ హేర్ స్టైలు కొరకు ప్రయత్నిస్తూనే వున్నాను. అన్ని రకాల హేర్ స్టైల్లు ట్రై చేశాను. కాని జుట్టు సుతారాం సహకరించడం లేదు. ఓటమి అంగీక రించుటకు మనసొప్పక, మరికొన్ని ప్రయోగాలు చేశాను.

పెళ్ళైన కొన్నాళ్ల వరకు ముద్దుగా సాంప్రదాయంగా సాదాసీదా కొప్పుతోనే సరిపెట్టుకొనే దాన్ని "కొప్పులో ఒప్పుగా అలరిస్త లేవు డియర్ ! జుట్టును కొద్దిగా జారవిడువుము" అని శ్రీవారు అనగానే లేనిపోని చిక్కులు వచ్చిపడినవి. "గుప్పెడు పిన్నులతో నా కుచ్చిళ్ళను పకడ్బందీగా బందిస్తే కాని ఓమానాన ఆగవండోయ్, లేకుంటే ఆదుపు ఆజ్ఞలేని తెగిన గాలిపటంలా స్వేచ్ఛా విహారమే" అని వాదించా.

ఓ రోజు నేను డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చొని నా కురులను దువ్వెనతో దువ్వు కొంటుంటే, శ్రీవారు టేబుల్‌పైనున్న టేలరింగ్ కత్తెరను గైకొని ఎంత వాదించి, వారించినా వినకుండా తిరుమల కొండపై మంగలి మహారాజు ఒకటో అరకత్తెర్లిస్తే, ఇతగాడేమో నాలుగైదు కత్తెర్లేసి "డియర్ ! ఇప్పుడు నీ కురులు ఎంచక్కా నీ భుజమును చుంబించ, నీ మోములో గులాబీల నునుపుతనం ప్రజ్వలిస్తూంది సుమా !"

"అలాగా ?" అని ప్రశ్నించి, ఫ్లోర్‌పైపడ్డ వెంట్రుకల రాసులను చూసిన ఆందోళన నా మనస్సులో. అద్దంలో ఓసారి శ్రీవారు చేసిన నిర్వాకం చూడ మిగిలియున్న కురుల హెచ్చు తగ్గులు ఇంటి బల్లెము గేటు పోలికతో సరిపోతుంది !

జరిగిన ప్రమాదమేదో జరిగిపోయింది. విచారించి ఇప్పుడు మిగిలిన జుట్టునెలా అందంగా నరిదిద్దుకోవాలనేది తక్షణ కర్తవ్యం. వెంటనే హేర్ డ్రెస్సర్ల వద్దకు వెళ్ళి, హెచ్చు

తగ్గులుగల కురులను టి.వీ.లో కన్పించే పారాచూట్, వాటికా హేర్ ఆయిల్ ప్రకటనలో కన్పించే అమ్మాయిల కురులమాదిరి సరిసమానంగా శస్త్రచికిత్స చేయించుకోవాలి.

అసలు హేర్ డ్రెస్సింగ్ సెలూనులంటే నాకు తెలీదు. హేర్ డ్రెస్సింగ్ సెలూన్ల సందర్శించే సాహసమునకిదే నాంది.

భుజాల క్రిందికి జాలువారే కురులిక లేవన్న తలంపు నన్ను ఓ క్షణం వేధించినది. ఇప్పుడింకో బాధ మోముపై, తుఫాను గాలికి వూగిసలాడే చెట్లమాదిరి, కురులు చెల్లా చెదురుగా పడుతుంటే వాటినెలా మనోహరంగా మలుచుకోవాలని ! వివిధరకాల షాంపూల ప్రకటనలననుసరించి, నా ప్రస్తుత కురులను నవీన హేర్ స్టైలుగా సరిదిద్దుకొనుటకు నాతో కాని పని. నిండామునిగితే చలిలేనటుల, ప్రస్తుత ఫాషన్‌లోనున్న కురుచ కురుల లోని అన్ని రకాల హేర్ స్టైల్లను ప్రయత్నించుటకు మనోస్థైర్యాన్ని పెంపొందించుకొని. ప్లేబోయ్ కట్, లేయర్ల కట్ మరి ఇతర వర్ణించబడని హేర్ స్టైల్లను ట్రై చేశాను.

నేను సందర్శించిన ప్రతి హేర్ డ్రెస్సింగ్ సెలూన్‌లో చేయించుకొన్న నవీన హేర్ స్టైలు మంచి ఫలితాలనిచ్చింది. కాని ఆ స్టైలు కొరకు యింట్లో కురులతో ఎంత పోరాటం సల్పినా సహకరించని నా కురులతో ఓటమినీ చవిచూసితిని. ఇరుగుపొరుగు లేడీస్ తమ కురులనెలా అదుపులోనుంచుకొని, వారలకు నచ్చిన హేర్ స్టైల్లలో మెరుస్తుంటే నా కెంతో ఆనందం కల్గేది. అయితే నా కురుల సమస్యకు పరిష్కారము దొరకకపోదా ?

ఎట్టకేలకు హేర్ స్టైల్లకు ప్రసిద్ధిగాంచిన చైనీస్ హేర్ డ్రెస్సర్ వద్దకు వెళ్ళాను.

నేను సెలూనులోని కడుగుపెట్టిన ఫలానా "కురులను కట్ చేయించుకొనెదరా" అని అడిగినది ఆ డ్రెస్సర్. వెంటనే సరియైన సమాధానమివ్వక "చూడండి మేడమ్ ! నా కురులు మంచివీ, సమస్యల్లా త్వరగా సెట్‌కావు, సెట్టైనా అట్టే నిలువవు. పర్మింగ్ ట్రై చేశాను." ఆమె తన అభిప్రాయం చెప్పేలోగా "పర్మింగ్ వెంట్రుకలను నష్టపరుస్తుంది" అన్నాను. నా మాటలు ఆ చైనీజ్ హేర్ డ్రెస్సర్‌ను ఆలోచనా సంద్రంలో ముంచింది.

"మరి నా కురులనేమి చేస్తారు ?" అని ఛాలెంజ్ చేసే ధోరణిలో ప్రశ్నించాను

ఆవిడ నా ముఖారవిందాన్ని అన్ని కోణాలనుండి పరిశీలించింది. ఆమె తీర్పుకై ఓ క్షణం వేచిచూశాను. తుదకామెకు మంచి ఐడియా తట్టినదేమో, కాచిన పందెంలో విజయాన్ని వరించినట్టుంది. ముసిముసిగా నవ్వుతూ "మీకు యువరాణి డయానా హేర్ స్టైలు కలిగిస్తా" అని ప్రకటించింది.

"వద్దు వద్దని ?" ప్రతిఘటించా. "ఎందుకనగా యువరాణి డయానా అందాలభరిణి. నాకన్న ఎన్నోవత్సరాలు వయస్సులో చిన్నది. ఇంతేకాక అందాలరాణికి వ్యక్తిగతంగా ప్రత్యేక హేర్ డ్రెస్సర్ ఉన్నది. రోజుకు ఐదుసారులు ఆమె కురులను సవరించును. నక్క ఎక్కడ నాగలోకమెక్కడ ? రోజుకొకసారైన నా కురులను సవరించే హేర్ డ్రెస్సర్ లేదే !"

కాని నా నిరసన నిలువునా నీరుకారిపోయింది. ఆ చైనీజ్ హేర్ డ్రెస్సర్ తన ప్లాను ప్రకారం నా కురులను కత్తెరతో టకటకా కత్తిరించింది. నా చుట్టూరా కురులు కుప్పలు కుప్పలుగా పడియుండటం చూచి అవాక్కైపోయాను. ఈ విచిత్ర హేర్ డ్రెస్సింగ్ సెలూన్ కెలా నేను వచ్చాను ? ఇదేమి చోద్యం ? చైనా ప్రభుత్వంలా ఏమి ఈ హేర్ స్టైలిస్టుకు నిరంకుశత్వం ? ఆమెను చూడలేక నా కన్నులను మూసుకొంటిని.

బ్రష్‌చేసి, షాంపురాసి, సెట్టింగ్‌చేసి హేర్ స్ప్రే తర్వాత ఓ అద్భుతమే కాన వచ్చినది. అద్దం వెనుకనుండి నన్ను చూస్తున్నది. యువరాణి డయానా కాదు కాని, ఈ హేర్ స్టైలు నాకు భలేగామొప్పినది. ఈ స్టైలు నాలుగు రోజుల వరకు చెక్కు చెదరకుండా నున్నది. ఈ నాలుగు రోజులు దువ్వెనకు పని కల్పించకపోవటమే !

ఆ చైనీస్ హేర్ డ్రెస్సర్ పనితనాన్ని తలచుకొని యింటివద్ద కురులకు షాంపు పులిమి నేను ట్రై చేస్తే వచ్చిన ఫలితం శూన్యం. ఆమెకెంతో సులభ సాధనమైందో నాకు అంత అసాధ్యమైంది. మరొకసారి ప్రయత్నం చేశాను. వెనుకకు కురులను పదిసార్లు దువ్వి, హేర్ స్ప్రేను దట్టంగా పట్టించి కొంతలో కొంత ఆ యువరాణి డయానా హేర్ స్టైల్ పోలిక వచ్చినది. కాని దినం తప్పి దినం ఈ హేర్ స్టైలుకు యాతనపడకుంటే, నా జుట్టు అప్పుడే పచ్చిక బయటనుండి తప్పిపోయిన మేకచందమగుతుంది !

ఈ సుదీర్ఘ సుదూర హేర్ డ్రెస్సింగ్ సెలూన్ల సందర్శన నిష్క్రమణల తర్వాత ఓ నిర్ణయానికి వచ్చితిని, జరిగిన శృంగ భంగం చాలు. రెడ్డచ్చే మొదలాయేనటుల, నా కురులు పూర్వపు సీదాసాదా భారతనారీ సాంప్రదాయ కొప్పుకు సరిపడే వెంట్రుకలు పొడుగ్గావచ్చే పర్యంతం వేచియుంటాను. ❑

*(సుధా పాటిల్ "ది లేడి డయానా లుక్" అను ఆంగ్లోఇండియన్ కథకు అనువాదం)*





**రాపాక పవన్‌స్వరూప్,** B.E.
ఇ.నెం. 1-5-69/1/బి,
ఫణిగిరి కాలనీ, చైతన్యపురి,
హైద్రాబాద్ - 60

# ఓల్డేజ్ హోం

నాకు ఈ రోజు చాలా సంతోషంగా ఉంది. పరీక్షలన్నీ ఐపోయి రేపటి నుంచి సెలవులు మరి ! ఓ వారంరోజులు బోరుకొట్టించే లెక్చరర్ల నుండి, విసుగెత్తించే విశ్వవిద్యాలయం నుండి విముక్తి. అందుకోసం 'కాకా క్యాంటీను'లో ఛాయ్‌ని, కుర్రకారు కొంటె కామెంట్లనీ వదులుకోవాల్సి వచ్చినా ఫర్వాలేదు. ఉక్కిరి-బిక్కిరి యాంత్రిక జీవితం నుండి దూరంగా ఏదైనా ప్రశాంతమైనచోటికి పారిపోవాలనుంది. ఇదే విషయం లోగడ నాన్నకిచెప్తే "ముందు పరీక్షలు బాగారాసి తగలడు, నిన్నెక్కడికి పంపాలో పంపుతాను" అన్నారు. ఈ రోజే ఆఖరి పరీక్ష రాసేసా, రిజల్టు వచ్చేవరకు దర్జాగా తిరగచ్చు. వస్తే ఎలాగూ నాన్న "నీ తెలివితేటలకి ఎనభైశాతం చాలవురా, సరిగ్గా చదివి ఉంటే..." అంటూ దండకం విప్పడం మామూలే. ఇంటికి చేరుతూనే లగేజీ సిద్ధం చేసుకోవాలి. నాన్న ఎక్కడికి పంపదల్చారో చూడాలి. నేనైతే ఫ్రెండ్స్‌తో గోవా వెళ్తానన్నాను. బంధువుల దగ్గరకైతే మాత్రమే ఒప్పుకుంటానన్నారు నాన్న. అమ్మకూడా వత్తాసు పలకడంతో 'సరే' అనక తప్పలేదు.



"వామ్మో ! బాబోయ్.. మిలట్రీబాబాయ్ దగ్గరికా ?" నాన్నమాట వింటూనే అరచినంత పనిచేశాను. "ఆయన మీసాలంటే చచ్చేంత భయం" అప్రయత్నంగానే బయటకనేశాను. "నీకూ ఉన్నాయి, భయందేనికీ ? ఆటపట్టించింది అమ్మ. చిన్నప్పుడు అల్లరి చేసినందుకు బాబాయి చెవి మెలేయడం ఇంకా గుర్తుంది. నా భావాలు పసిగట్టేసినట్టుగా "వాడు నువ్వనుకునేలా రాక్షసుడు కాదు. నా తమ్ముడి మనసువెన్న. నీకే తెలుస్తుంది, బయల్దేరు" అంటూ నవ్వారు నాన్న. అయిష్టంగానే ప్రయాణమయ్యాను. ఊరి బస్సెక్కింది మొదలు బాబాయి గురించే ఆలోచనలు. నేను పుట్టక ముందే సైన్యంలో చేరాడు. ఎందుకో పెళ్ళి చేసుకోలేదు. తాతయ్య, నానమ్మలను చూడటానికి అప్పుడప్పుడు వచ్చేవాడు. చివరిసారిగా నేను ఎనిమిదో క్లాసులో ఉండగా బాబాయిని కలిసాను. తర్వాత... ఇన్నేళ్ళ తర్వాత మళ్ళీ కలవబోతున్నాను. రిటైరైపోయాక ఏదో 'ఓల్డేజ్ హోం' ఒకటి నడుపుతున్నాడని తెల్సింది. ఎప్పుడు నిద్రపోయానో తెలియదు. మెలకువ వచ్చేసరికి బస్సులో నుండి 'కిరాణకొట్టు',

'భోజనం తయరు' లాంటివి చూసి ఊరి పొలిమేర్లకి చేరామని గ్రహించాను. ఈ అచ్చు తప్పులు ఇక్కడ ఏమాత్రం అక్షరాస్యత ఉందో తెలుపుతాయి. బస్సుదిగి రిక్షా కట్టించుకొని బయలుదేరాను. ఓల్డేజ్ హోం విశాలమైన ప్రాంగణంలో, పూల మొక్కలతో ఓ పర్ణశాలలా ఉంది. అరుగుపైన ముసలివారు ముచ్చట్లాడుతున్నారు. గేటు దగ్గరకెళ్ళాకా నా దృష్టి 'వృథాశ్రయం' బోర్డు పైబడింది ఆశ్చర్యమేసింది. బాబాయి బాగా చదువుకున్నవాడట. ఆ రోజుల్లోనే ఇంజినీరింగ్ గోల్డ్ మెడలిస్టని నాన్న చెప్పేవారు. మరి ఆయన ఈ అచ్చు తప్పుని దిద్దకపోవడమేమిటీ ? ఇంతలోనే అందరూ నన్ను ఎగాదిగా చూస్తున్నారని తెలిసి టోపీ, సన్ గ్లాసెస్ తీసి నేను వచ్చిన విషయం వివరించేలోగానే బాబాయి వచ్చాడు. ఆయన మీసాలు అక్కడక్కడా తెల్లబడడం తప్పించి పెద్దగా మారలేదు. అదే పదును, అదే కరుకుదనం. "రారా ఎంగ్‌మాన్, ఎన్నాళ్ళయింది ? అచ్చం మీ నాన్నపోలికే..." అంటూ అప్యాయంగా భుజంచుట్టూ చెయ్యేసి లోనికి తీస్కెళ్ళాడు. మిగతా వారందరూ ఏదో అర్థమైనట్టుగా వెను దిరిగారు. పురాణాలు చదివేవారూ, వైకుంఠపాళిలాంటివి ఆడుతున్నవారూ తమ తమ పనుల్లో తిరిగి నిమగ్నమైపోయారు. కుశలప్రశ్నలయ్యాక నేను జర్నలిజంలో మాస్టర్స్ చేస్తున్నందుకు బాబాయి మెచ్చుకున్నాడు. కొంత ధైర్యంవచ్చి అచ్చు తప్పు గురించి ప్రస్తావిస్తూనే పెద్ద తప్పు పట్టేసిన ఆనందం కనపడనీయకుండా జాగ్రత్తపడ్డాను. "ఓ అదా ! కావాలనే పెట్టించాను. ఇక్కడున్న వారందరూ తమతమ వారిచేత 'వృథా' అని వదిలి వేయబడ్డ వారేగా !" ఆవేశంగా చెప్పాడు. వాదించే సాహసం లేక వేరే అంశాలపై పిచ్చాపాటీ మొదలెట్టాను. రాజకీయాలు, కాశ్మీరు సమస్య, ముషార్రఫ్ పాలనా వగైరాలు చర్చించు కున్నాకా భోజనంచేసి విశ్రాంతి తీస్కున్నా అలసిపోవడంచేత తొందరగా నిద్రపట్టేసింది.



కళ్ళు తెరవాగానే ఎదురుగా తాతయ్య, నానమ్మల ఫోటోకి దండవేసి ఉండడం చూశాను. కిందగా చిన్న బల్బు దీపంలా వెలుగుతోంది. చాలా శ్రద్ధ తీసుకున్నట్టు చూడగానే చెప్పవచ్చు. హాలులో పెద్దగా బాబాయి అరుస్తుండడంతో నా గుండె గుభేలుమంది. 'మిలట్రీ క్రమశిక్షణ' ఎవరు అతిక్రమించారో అనుకుంటూ మెల్లగా గుమ్మంగుండా తొంగి చూశాను.

"అదే ఎందుకూ అంటున్నాను, నువ్వు అక్కర్లేదు పొమ్మన్న నీ పిల్లలూ, వాళ్ళ పిల్లలూ నీకెందుకు గుర్తుకురావాలీ అని ప్రశ్నిస్తున్నాను. జీవితమంతా కష్టపడి నానాతిప్పలూ పడి ప్రయోజకుల్ని చేశావు. గొప్ప ప్రయోజకులే అయ్యారు ! పట్నం పోయి ఇన్నేళ్ళలో కనీసం నువ్వు ఉన్నావో, చచ్చావో చూడడానికి ఒక్కసారైనా వచ్చారా ? నీ బాగోగులు ఎప్పుడైనా పట్టించుకున్నారా ? నిన్ను పీల్చి పిప్పిచేసి బాగుపడ్డారు. నీ సత్తువ తగ్గాక వాళ్ళకి బరువై పోయావు. నువ్వు కన్నవారే ఇలా ఉంటే ఇంక వాళ్ళు కట్టుకున్నవారు తన్ని తగలెయ్యరూ మరి ! ఒక్కొక్కరినీ షూట్ చేసి పారేయాలన్నంత కోపంగా ఉంది" అంటూ ఆవేశంగా

ఊగిపోతున్నాడు బాబాయి. కొంతమంది ఆయన అనే ప్రతిమాట 'నిజమే సుమా' అన్నట్టు తలూపుతున్నారు. మరికొందరు ఇదేమీ కొత్తకాదన్నట్టు నిర్లిప్తంగా ఉండిపోయారు. బాబాయి శాంతించాడు. "నీకేం తక్కువ చేశానిక్కడ ? ఏం లేదు చెప్పు. మీ అందరి కోసమేగా రాత్రీపగలూ కష్టపడుతున్నాను. నీకు తెలీనిది ఏమీ కాదు. నువ్వు బాధపడితే నేను చూడలేను. నేను మాత్రం నీ కొడుకులాంటివాన్ని కానా ?" అంటూ ఎదురుగా పాలిపోయిన ముసలాయనని దగ్గరికి తీస్కున్నాడు. "అంతకంటే ఎక్కువేరా" అంటూ ఆయన బాబాయిని కావలించుకుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు. బాబాయి కళ్ళలోని ఆవేదనని మొదటి సారిగా చూశాను. ఆయనని సరిగా అర్థం చేసుకోలేదేమోనని అనిపించడం మొదలైంది. అందరం భోజనాలు ముగించాక ఇల్లంతా కలియదిరగడానికి బయలుదేరాను. తాతల నాటి లంకంత ఇల్లు. అక్కడక్కడా ఆధునీకరించడం మినహా పెద్దమార్పులేం లేవు. ఓ గదిలో గ్రంథాలయం, అందులో రకరకాల పుస్తకాలూ, వారపత్రికలూ, పురాణేతిహాసాలు, కథలు, కావ్యాలు రకరకాలున్నాయి. మరోగదిలో సంగీతం కేసెట్లు, హరికథలు, భక్తిపాటల రికార్డులు ఉన్నాయి. బయట చావిడిలో కొందరు ఆడవారు వడియాలూ, అప్పడాలూ పెడుతున్నారు. మగవారు పిచ్చాపాటిలో హుషారుగా ఉన్నారు. కొందరు పెరటి పని చేస్తున్నారు, మరికొందరు పూలదండలు అల్లుతున్నారు. ఇలా ప్రతిఒక్కరు ఏదో ఒక పనిలో హడావిడిగా ఉండడం వింతగా తోచింది. ఇంకొంచెం ముందుకెళ్తే పెద్దపూజగది. అందరు దేవుళ్ళూ ఆశీర్వదిస్తున్నట్టుగా ఉంది. ఆ తర్వాత పెద్ద టీవీ హాలు, పడకగదులూ ఉన్నాయి. ఇంటి వెనకాలకి చేరాను. ఒకరిద్దరు ఆడవారు అంట్లుతోమే పనిమనిషికి సహాయం చేస్తున్నారు. బాబాయి గట్టుమీద కూర్చొని ఏదో పుస్తకం చదువుతూ ఆడపాదడపా తలెత్తి అన్నీ గమనిస్తున్నారు. ఓ పెద్దాయన "ఒరేయ్ బాబూ ! రాయుడిని చూడాలని ఉందిరా. టౌనుకి ఎప్పుడు తీస్కెళతావు ?" అని బాబాయిని అడిగారు. పనిమనిషి మణమ్మ ఒక్కసారిగా ఎందుకు ఉలికిపడిందో నాకర్థం కాలేదు. బాబాయి మాత్రం వీలుచిక్కినప్పుడు వెళ్ళచ్చు లెమ్మని ముక్తసరిగా జవాబిచ్చి "ఇప్పుడవన్నీ ఎందుకు ? ఇంతకీ నువ్వు నాటిన గులాబీ మొక్క మొగ్గేసింది చూశావా మావా" అన్నాడు. జాగ్రత్తగా మాట మార్చగలిగినా విస్పష్టంగా కనిపిస్తున్న ఆందోళనని నా నుంచి దాచలేకపోయాడు. వీళ్ళు ఏది అడిగినా కాదనని బాబాయి ఇలా ఎందుకు ప్రవర్తించాడో, టౌనుకి వెళ్ళడమేంటో నాకు అర్థం కాలేదు. బాబాయిని అడిగే ధైర్యం లేదు. మరుసటి రోజు మణమ్మని అడిగాను. మొదట తనకేమి తెలియదన్నా నిలదీసేసరికి "టౌనులో మరో బ్రాంచి ఉండాది" అద్దై ఉంటాది లెండి, ఐనా ఎందుకు బాబుగోరు ?" అని తప్పించుకుంది. టౌనులో బ్రాంచి ఏంటో అసలర్థం కాలేదు. ఇంకో బ్రాంచి ఉంటే బాబాయి నాకెందుకు చెప్పలేదు ? ఈ ఓల్డేజ్ హోంకి ప్రభుత్వం ఇచ్చే సహాయం, స్వచ్ఛంద సంస్థల విరాళాలూ, తన పెన్షను నుండి చేసే ఖర్చు తదితరాలన్నీ చెప్పిన బాబాయి ఈ విషయం ఎందుకు దాచినట్టు ? అంతా అయోమయంగా తోచింది.

తర్వాతి రెండు మూడు రోజుల్లో అడుగుదామనుకున్నా బాబాయి మాట దాటేశాడు. ఇక్కడ వారం రోజులు ఎలా గడిచిపోయాయో తెలీదు. తిరుగు ప్రయాణానికి సిద్ధ మయ్యాను. వెళ్ళే ముందు నా సందేహాలన్నీ తీర్చుకునే వెళ్ళాలని నిశ్చయించుకున్నాను. సాయంత్రం అడిగాను, చెప్పక తప్పదనడంతో "సరే విను, ఇక్కడికి ఎందరో ఎక్కడెక్కడి నుండో వస్తారు, అందరూ వయసుపైబడిన వారే. వారి చివరి మజిలీని ఆనందదాయకం చెయ్యాలని నేను అన్ని విధాలా ప్రయత్నిస్తున్నాను. తమ వారినీ, వారి జ్ఞాపకాల్నీ మరిపించ డానికి అనుకూలమైన వాతావరణం కల్పించాను. ఇక్కడ వారు చిన్నపిల్లల్లా కాలక్షేపం చేస్తారు. నిజమే... చిన్నపిల్లలే... అన్నీ తెలిసిన పిల్లలు. ఇలా సంతోషంగా సాగిపోయే వారి జీవితాల్లో అనుకోనిది ఏదైనా జరిగితే ఎవరూ తట్టుకోలేరు. అంతా ఓ కుటుంబంగా బ్రతుకుతారు. ఒకరికి మరొకరం అన్న భావన ఉంటుంది. అలాంటి స్థితిలో ఎవరైనా మృత్యువుకి దగ్గరైతే మిగతావారందరూ తమకీ నేడోరేపో చావు తప్పదని భయపడతారు. పోయిన వారిని మర్చిపోలేరు. మమకారాలూ, జ్ఞాపకాలు వెంటాడతాయి. తమ బంధువుల్నీ తల్చుకుని కుమిలిపోతారు. వీరి సంబంధీకులకి ఇదేమీ పట్టదు. అందుకే ఎవరి ఆరోగ్యం బాగోకున్న సిటీకి తీసుకెళ్ళి వైద్యం చేయిస్తాను. అంబులెన్సు చూశావుగా. వయసు ప్రభావం వల్లగానీ, ఇతర కారణాలవల్లగానీ వారుపోతే మరోకంటికి తెలీకుండా సిటీకి తరలించి బంధువులకి కబురుపెడతాను. వారికి ఇష్టంలేకో, మరో కారణంచేతో రావడం వీలు కానప్పుడు నేనే అంత్యక్రియలు చేసిన సందర్భాలు ఉన్నాయి. ఇక్కడి వారికేం చెప్పను ? అందుకే టౌనులో ఆస్పత్రికి దగ్గరగా మరో బ్రాంచి ఉందనీ అక్కడ వారు కులాసాగా ఉన్నారనీ నమ్మబలుకుతాను. వేరేదారి లేదు. బాధంతా దిగమింగి పైకి గంభీరంగా ఉండడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు. ఆయన గొంతు వణకడం నేను గమనించక పోలేదు. నాన్న చెప్పింది నిజమే. బాబాయి మనసు వెన్న. ఫిరంగిమోతలతో బండబారి పోయిందనుకున్న ఆ హృదయం ఎంత సున్నితమైనదో అర్థం చేసుకుంటున్నాను. "స్వరూప్! ఇది ఇన్నేళ్ళుగా నేను చేస్తున్నదే కానీ, నా బాధంతా ఒక్కటే, ఇవాళ నేను అన్నీ చూస్కో గలుగుతున్నాను. పెళ్ళాంబిడ్డలు వద్దనుకున్నాను. నాకూ వయసు పెరుగుతోంది. ఓపిక సన్నగిల్లుతోంది. నా తర్వాత ఆశ్రమం గతేంటి ? వీళ్ళని ఎవరు చూస్తారు ? అదే భయంగా ఉందిరా" అంటుండగా నా కళ్ళు చెమర్చాయి. "బాబాయి ! ఈ రోజు మనస్ఫూర్తిగా ప్రమాణంచేసి చెప్తున్నాను. నీ ఆశయాల్ని నేను నిజం చేస్తాను. నువ్వు చేపట్టిన ఈమహోన్నత కార్యానికి నేనే వారసుణ్ని. ఏం దిగులుపడకు. నీ దగ్గర అన్నీ నేర్చుకుని ఈ ఆశ్రమాన్ని నీ ఆశలకి తగ్గట్టుగా చేస్తాను. ఇది నాఅదృష్టం, నన్ను ఆశీర్వదించు" అని ఆయన పాదాలు తాకాను.

"చాలురా స్వరూప్ ! చాలు. ఈ జీవితానికిది చాలు" అంటూ నన్ను కావలించుకుని ఆనందబాష్పాలు ఆపే ప్రయత్నం చేస్తున్నాడు. ఇప్పుడాయన మీసం చూస్తుంటే భయం స్థానే నా బాధ్యతలూ, ఆయన ఆనందం, సంతృప్తి కానవస్తున్నాయి. ఆ భావాలని పదిలంగా మనసులో దాచుకుని తృప్తిగా తిరుగు ప్రయాణమయ్యాను. ❑

**ఇనపకుర్తి చినసత్యనారాయణ,**
డ్రాయింగ్ టీచర్, Z.P.H. స్కూల్
గ్రా॥ వేపాడ,
జి॥ విజయనగరం.



# అంతర్మథనం

అదో పల్లెటూరు ఎటు చూసినా పచ్చని పొలాల్తో ఆహ్లాదకరంగా ఉంది వాతావరణం, కాని రాములుకు మాత్రం మనసు మనసులో లేదు. "ఏం రాములన్నా ఒదినకెలాగున్నాది, ఒంట్లో బాగోనేదని తెలిసింది పిల్లలెవలన్నా ఒచ్చినారా" అడిగాడు. "లేదురా వాళ్ళకేవో పనులున్నాయని, సెలవులు లేవని ఊరిలో డాక్టరుకు చూపించమని ఉత్తరాలు రాసారు సూరయ్యా" అని రాములు బాధపడ్డాడు. "ఒక్కడినైనా ఇక్కడుంచుతే సెయ్యికి అవుతాడు యెవసాయం సెయ్యడానికి సరిపోతాడు"అని అప్పుడంటే 'ఇన్నావా', "పోనీ నే మా సిన్నోడికి సెప్పి బండి పూయిత్తాను పట్నంతీసుకెల్దాం బేగితయారవ్వండి" అని చుట్ట వెలిగించు కుంటూ సూరయ్య వెళ్ళిపోయాడు.

రాములు ఇంటికి నడుస్తున్నాడు కాని మనసు ఎటో పరుగులు పెడుతోంది, ఎక్కడ పొరపాటు జరిగిందా అని.

సుమారు 20 ఏళ్ళక్రితం జ్ఞాపకాలు రాములు, సూరయ్య సమానరైతులు, సమానంగా ముగ్గురేసి పిల్లలు. రాములు ఐదోతరగతి వరకు చదువుకొన్నాడు, సూరయ్యకు చదువు లేదు. రాములు పిల్లల్ని చదువులకని పట్నం పంపడంవలన వచ్చిన ఆదాయం చాలక ఉన్న పొలం అంతా హారతి కర్పూరంలా కరిగిపోయింది. సూరయ్య మాత్రం ఊర్లో ఉన్నంత వరకు పిల్లల్ని చదివించి వ్యవసాయంలో పెట్టేశాడు. అంతా కలసికట్టుగా వ్యవసాయం చేయడం వలన బాగా కలిసొచ్చింది. మరో పదెకరాలు సంపాదించాడు. ముగ్గురు పిల్లలకు సరిపడా ఇల్లు కట్టుకున్నాడు. పొలంలో కరెంటు మోటారు పెట్టాడు. దర్జాగానే బ్రతుకు తున్నాడు. పిల్లాపాపలతో హాయిగా ఉన్నాడు సూరయ్య. మరి రాములు పరిస్థితి పిల్లలంతా బాగానే ఉన్నారు, ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఆర్థికంగా ఎవరినీ చూడనవసరం లేదు. వారే ఎంతోకొంత పంపిస్తున్నారు. కాని ఇలాంటప్పుడే కాలు చేయి వంగినపుడు ఎవరు

చూస్తారు ? పిల్లలు ఇలా ఉద్యోగాల పేరుతో పట్నం పట్టేయడంవలన ఊరిలో పట్టు కోల్పోవడమేనా ? కొన్నాళ్ళకు వీరికీ గ్రామానికీ సంబంధం తెగిపోతుంది కదా! పిల్లలు బాగా చదువుకొన్నారుగాని తల్లిదండ్రులకు ఆపద వచ్చినపుడు ఆదుకోనవసరం లేదా ? రాములు మనసులో ప్రశ్నలు తొలిచేస్తున్నాయి. పోనీ పిల్లల వద్దకు వెళ్లి ఉందాం అంటే పుట్టి పెరిగిన ఊరును వదల్లేక మరియు సంక్రాంతికి పిల్లలందరూ వచ్చినపుడు ముసలోళ్లని మీ దగ్గరుంచండి, మీ దగ్గరుంచుకోండి అని వాళ్ళనుకున్న మాటలు గుర్తొస్తున్నాయి. వీళ్ళు మమ్మల్ని చూడడానికి ఇల్లావంతులాడుకుంటున్నారే ఇందుకేనా మేం పస్తులుండి పిత్రార్జిత మైన బంగారంలాంటి భూమిని అమ్మి వీళ్ళని చదివించింది ? సూరయ్యలాంటివారు "నీకు కొద్దిగైనా భూమిఉంచుకోరా ఏ ఆధారం లేకుండా ఉన్నదంతా అమ్మేత్తన్నావు" అంటే "పోనీ లేరా నీవు లక్ష్మిని సంపాదిస్తే, నేను నా పిల్లలకు సరస్వతిని సంపాదిస్తున్నాను, వారు చూడక పోతారా" అనేవాడ్ని. ఇందుకేనా ? అయినా ఏంత చదివించినా సంస్కారానికి, చదువుకీ తేడా ఇప్పుడే తెలుస్తుంది. రాములుకు ఇది జీవితం నేర్పిన గుణపాఠం, దీనికంతకీ కారణం ప్రేమ, ఆప్యాయతలకు దూరంగా పట్నంలో ఉన్నందువలనా ? లేక సమాజంలో మారాలా? అదే రాములు అంతర్మథనం. ❑



**కె. సూర్యముఖి,** M.A.
*రిటైర్డ్ లెక్చరర్,*
ఇ.నెం. 1-7-1223, 1224, రోడ్ నెం. 2,
అడ్వకేట్స్ కాలనీ, హనుమకొండ - 506 001
ఫోన్ : 577355



# అపరాజిత

"ఏమండీ ! అమ్మాయి ఇంజనీరింగు కూడా పూర్తి కావస్తూంది. మీకు చీమ కుట్టినట్లైనా లేదేమండీ ?" అంటూ రాజ్యం భర్త రామారావుపై దండయాత్రకు ఉపక్రమించింది.

ఆనాటి పేపరు చదవడంలో తలమునకలైన రామారావు రాజ్యం వ్యగ్రతకు ఉలిక్కిపడి తలయెత్తి చూసేడు.

"అదేమిటి? అమ్మాయి ప్రతి క్లాసు మంచిమార్కులతో పాసవుతూ, చదువుకుంటూంటే చీమకుట్టడం మాటెందుకొచ్చిందోయ్ !"అంటూ పేపరు పక్కన పెట్టేడు. ఏదో విశేషముండే వుంటుంది లేకపోతే ప్రొద్దుటే ఇలాంటి ప్రస్తావనెందుకొస్తుంది అనుకుని సావధానుడై కూర్చున్నాడు.

జ్ఞానమెరుగని వయసులోనే రామారావు, రాజ్యాలకు పెండ్లి ముడిపడింది. రాజ్యం సాంప్రదాయక మూసలో పెరిగింది. ఆచారాలు, నమ్మకాలు ఆమె రక్తంలో జీర్ణించుకు పోయాయి. రామారావు అతినేర్పుతో, ఓర్పుతో ఆమెను కొత్తబాటవైపు, నూతన సామాజిక విలువల దిశగా పయనింప చేయడానికి ప్రయత్నించి, కొంత వరకు సఫలీకృతుడయ్యాడు.

శ్రీపాద, వీరేశలింగం గార్ల కథలు రోజుకొకటైనా చదివి వినిపించేవాడు. ఓపిగ్గా, భర్త చదువుతూంటే కథ వినడం రాజ్యానికి అలవాటైపోయింది. నెమ్మదిగా స్వంతంగా చదువు కోవడం నేర్చుకుంది, పరీక్ష పాస్ అయ్యింది.

"వయసు వచ్చిన అమ్మాయికి చక్కని సంబంధం చూసి మూడుముళ్లు వేయించడం మన బాధ్యత కాదా ?".

"కాదని నేనంటే కదా నన్ను దుయ్యబట్టడానికి ? చదువు పూర్తికానీ ! అమ్మాయి ఇష్ట మైనంతవరకు చదువుకుంటుంది. దాని చదువుకు మనం పరిమితులెందుకు పెట్టాలి ?"

"మీరెప్పుడు బాధ్యతలు గుర్తించేరు గనుక ? నా మాటెప్పుడైనా లక్ష్యపెట్టేరా ?".

"నీ మాట నేనెప్పుడు జవదాటేనో చెపుదూ ముందు. కష్టసుఖాలు, బరువుబాధ్యతలు మొదటినుండి మనిద్దరం సమానంగానే పంచుకుంటున్నాం కదా ?".

"ఆహా ! నామాట జవదాటరు. మీ తెలివితేటలు, వాదనా పటిమ నామీద ప్రయోగించి నాచేత 'ఊ' అనిపిస్తారంతే. నాకు చదివే ఓపికలేదు మహాప్రభోఅంటే వినిపించుకున్నారా ?" రామారావు పెదాల మీద దరహాసం మెదిలింది. రాజ్యం చదువు ప్రహసనం మదిలో మెదిలింది.

"నీ చదువేమోగాని నన్ను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించేవు. పాఠం మధ్యలో పాలుతోడేయాలనో, కూరమాడిపోతోందనో వంకలుచెప్పి తప్పించుకు పారిపోతూంటే వళ్లుమండిపోయేది. పిల్లలైతే ఒక మొట్టికాయ ఇచ్చుకోవచ్చు, కాని నీ అంతటి దానిపై చేయెలా ఎత్తను ? ఆఖరికి రాళ్ళ కమ్మల లంచమే నాకు దారి చూపింది".

"అంతతో వదిలారా నన్ను, ఉద్యోగంలో చేర్చేరు. అత్తయ్య మొత్తుకుంటున్నా వినక. ఇంటా బయటా సమర్థించుకోలేక చస్తున్నాను. మన అమ్మాయినీ ఆ సుడిగుండం లోకి నెట్టాలా ?".

"పిచ్చిదానా ! అది సుడిగుండం కాదోయ్. జీవిత సుడిగుండాల నుండీ, ఆటుపోటుల నుండీ బయటపడేందుకు దారి. అమ్మాయి చదువుల సరస్వతి. పెద్దఉద్యోగిని అవుతుంది. వీటికి తోడు తన జీవిత భాగస్వామిని ఎన్నుకునే విజ్ఞత అమ్మాయికుంది, అమ్మాయి అపరాజిత".

"చదువు, ఉద్యోగం ఒక ఎత్తు, వివాహం ఒక ఎత్తు. చిన్నపిల్ల తెలియక తప్పటడుగు వేస్తే, మళ్లీ అది వెనక్కు తీసుకోవడం మనతరంఅటండీ ! అదీ కాక లోకానుభవంతో మనం పెద్దవాళ్ళం మంచిచెడ్డలను దృష్టిలో పెట్టుకుని అడుగువేయగలం. పచ్చనివన్నీ బంగారం కాదు గదా ! ఈ ఎగుడుదిగుడు కాలంలో ఏ చిన్న పొరపాటు జరిగినా జీవితం సర్వనాశనమైపోతుందండీ !"

"నువ్వు తెల్సొంకుంటున్నావుగా ! కానీ !"

"నోరు విప్పితే స్త్రీ పురుషుల సమానత్వమని మొదలుపెడతారుగా ! శివపార్వతుల అర్ధ నారీశ్వర తత్వాన్ని అందరకూ వంటపట్టిస్తూ వుంటారు. కాని అమ్మాయి పేరు దగ్గరనుండి పెండ్లిదాకా మీ మాటే నెగ్గించుకుంటున్నారు. 'అన్నపూర్ణ' అంటే 'అపరాజిత' అని పట్టుబట్టేరు. ఆ సమానత్వ సిద్ధాంతం మనకు వర్తించదనుకుంటాను".

"రాజ్యం ! ఇన్నాళ్ళ మన సంసార జీవితంలో నన్నర్థం చేసుకున్నదింతేనా ?"

ఆడ పిల్ల పుడితే దాన్నెలా వదుల్చుకోవాలా అని దార్లు వెతుక్కుంటున్న దౌర్భాగ్యపు సమాజంలో మనమున్నాం. పెండ్లికాని ఆడపిల్ల గుండెలమీద కుంపటంటూ అంగలారుస్తూ, మగవాడైతేచాలనుకుని తమ సర్వస్వం వాడికి ధారపోయడానికి వెనుకాడడం లేదు ఏ తల్లిదండ్రులూ. ఈ సంగతులన్నీ నీకు నేను మళ్లీ జ్ఞాపకం చేయాలా ? మన బిడ్డ

ఎక్కడా ఓడిపోకూడదనీ, ఆత్మ గౌరవంతో, ధైర్యస్థైర్యాలతో అన్నిటా నెగ్గుకు రావాలనే ఆశ తోనే ఆ పేరు సూచించేను. అంతేకాని, నీమాట కొట్టిపారేయాలని కాదు. అన్నపూర్ణ అనే పేరు అయిష్టము కాదని నీకెన్నిసార్లు చెప్పినా దెప్పడం మానవు కదా రాజీ !"

భర్త గొంతులోని నిజాయితీని నిష్ఠూరాన్ని గుర్తించింది రాజ్యం. "సర్లెండి, ఏదో అన్నాను దానికింత రాద్ధాంతం చెయ్యాలా ఏమిటి ? అమ్మాయి పెండ్లి ప్రయత్నాలు మొదలు పెడుదురూ !"

"రాజ్యం, అమ్మాయిని ఇంజనీరింగులో చేర్చవద్దని కాకిగోల చేసేవు. ఆనాడు నీమాట వింటే, అమ్మాయి తెలివి, చురుకుదనం బూడిదలో పోసిన పన్నీరే అయ్యేది. పెండ్లి, సంసారం, పిల్లలు అంతా ప్రకృతి సహజమే. ఆ సంసార సాగరాన్ని శక్తివంతంగా, విజయ వంతంగా ఈదడానికి ఈనాటి స్త్రీకి చదువు, ఆర్థికస్వావలంబన చాలా అవసరం రాజీ ! కాలానుగుణంగా మనం మన పద్ధతులను మార్చుకోవాలి కానీ, సాంప్రదాయం పేరిట, బురదలో కూరుకుపోకూడదు. స్త్రీపురుషుల సమానత్వ సిద్ధాంతాన్ని నమ్మి, ఆచరణలో పెట్టాలనుకున్నందుకు నాకే ఎసరు పెడుతున్నావా ? అమ్మాయి చదువులో రాణించక, పెండ్లివైపు మొగ్గు చూపించివుంటే అలాగే చేసి వుండేవాడిని !"

"పిల్చి అడగండి ఏమంటుందో ?"

"పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి, ఆమె దీక్ష చెడగొట్టకు !"

"ఈలోగా సంబంధాలన్నీ దాటిపోతాయి".

"ఎక్కడకూ పోవు, నువ్వనసరంగా కంగారుపడకు".

"మా స్కూల్లో అందరూ అంటూనేవున్నారు. అపరాజితకు అమెరికా సంబంధం ఖాయ మని". కూతురు ఇంజనీరింగులో చేరింది మొదలు స్కూలు టీచర్లు, ఇరుగు పొరుగులు, బంధు మిత్రులుఅనే మాటలు విని రాజ్యానికి ఆమెరికా అల్లుడిని గురించిన ఉబలాటం విరాట్రూపం దాల్చింది. ఆ ప్రస్తావన వచ్చినపుడల్లా, రామారావు అమ్మాయి చదువుకు, అమెరికా సంబంధానికి ముడిపెట్టవద్దని చెప్తూనే వున్నాడు. కాని అదే భావన "ఇంతింతై వటుడింతయై" అన్నట్లు పెరిగి పెరిగి, కూతురు ఇంజనీరింగు ఆఖరు మెట్టు ఎక్కేనాటికి, అర్హులైన మన దేశంలో ఉన్న యువకులను రాజ్యం, పెండ్లికొడుకుల జాబితాలోనే చేర్చలేదు. ఆ భూలోక స్వర్గంలోనే తన బిడ్డ స్థిరపడాలనే నిర్ణయం చేసేసుకుందామె.

"నాకు తెలుసు రాజీ ! నువ్వు ఆమెరికా అల్లుడి కొరకు అర్రులు చాస్తున్నావు. రోజూ పేపర్లు చూస్తున్నావుగా ! నవ వధువుల హత్యలు, ఆత్మహత్యా ఘట్టాలు. వాటికన్నిటికీ తల్లి దండ్రుల తొందరపాటు, దురాశే మూలకారణం".

"అందుకే మనమ్మాయిని అమెరికా ఉద్యోగస్తుడికే ఇవ్వాలనుకుంటున్నాను. అక్కడి వాళ్ళు నిక్షేపంగా సుఖంగా వుంటున్నారు. ఎందుకు అశుభం మాటలు. అందరకూ ఒకలాగే జరుగుతుందా ? మన అమ్మాయి అపరాజితేగాక, అపరంజి కూడా. ఈ అపరంజి బొమ్మను ఆరళ్ళుపెట్టే అత్తమామలు, మగడు వుంటారా ?"

"సరే చూద్దాం, ముందు డిగ్రీరానీ ! ఈలోగా అమెరికా గురించి పగటి కలలు కనడం కట్టిపెడుదూ ! మనిషిలో మంచితనం వుండాలి కాని, అమెరికాలో ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన చాలదోయ్. సప్తసముద్రాలు దాటించితీసుకుపోయి అక్కడేంచేసినా దిక్కుండదు. నువ్వు వేయి చెప్పు, లక్ష చెప్పు అన్నిటికంటే ముఖ్యం అమ్మాయి తన కాళ్ళ మీద తను నిలబడాలి. మగణ్ణి కొనుక్కునే గతి పట్టకూడదు. అప్పుడు తనకు నచ్చిన, తనను మెచ్చిన జీవిత భాగస్వామిని ఎన్నుకోవాలి. అంతగా అయితే, ఆ బాధ్యత అమ్మాయి మన మీద పెడితే, మనం ప్రయత్నిద్దాం".

"అన్నప్పుడు అమెరికా సంబంధాలు దొరుకుతాయటండీ !"

"అంటే ఇప్పుడు అమెరికా అబ్బాయి నీఅల్లుడి 'పోస్టు'కోసం వాకిట్లో నిలబడి వున్నాడా ఏమిటి కొంపతీసి. '*ఆలూ లేదు చూలూ లేదు కొడుకుపేరు సోమలింగం*' అన్నట్లుంది నీ వరుస". రాజ్యం సమాధానం ఇవ్వకుండా దరహాసరేఖలు వెదజల్లుతూ మౌనంవహించింది.

"రాజీ ! అనాలోచితంగా ఎవరికీ మాటీయకు సుమా !"

"మీ చెవిన వేయకుండా నేనెన్నడైనా స్వంత నిర్ణయాలు తీసుకున్నానా ?"

"అమెరికా మాటెత్తుతేనే మీరెప్పుడూ ఇంతెత్తున ఎగురుతారు. కమలా టీచరు పుట్టింటి వారంతా అక్కడే ఇళ్ళూ వాకిళ్ళూ అమర్చుకుని స్థిరపడిపోయారట. వాళ్ళ తల్లిదండ్రులు ఏటా ఒకటి రెండుసార్లు వెళ్ళి వస్తూంటారు. ఆమె వాళ్ళెవరూ ప్రసవాలకైనా ఇక్కడకురారు. చీటికీమాటికీ వీళ్ళనే పిల్చుకు పోతుంటారు".

"మనం రోజూ వరంగల్లు నుండి హైదరాబాదు వెళ్ళి వస్తూన్నట్లు" అని రామారావు పకపకా నవ్వేడు. భర్త నవ్వు చూసి రాజ్యానికి చిర్రెత్తుకొచ్చింది. అయినా తమాయించు కుంది. కార్యసాధకురాలు మరి.

"మా కమల భర్తకూడా మీలాటి మనిషే. మీకంటే నాలుగాకులెక్కువే చదివేడు. ఆమె తోడబుట్టిన వాళ్ళంతా అమెరికాలో భోగభాగ్యాలతో తులతూగుతుంటే, వీళ్ళకు స్వంత ఇల్లయినా లేదు. అక్కడకు వెడదామంటే ససేమిరా అంటాడట, పైగా కావాలంటే నువ్వే వెళ్ళంటాడట. వాళ్ళు వచ్చినపుడల్లా బట్టలు, వస్తువులు కోకొల్లలుగా తెచ్చిపడేస్తుంటారట".

రాజ్యం ! అమెరికా జపం చేస్తూ అంతవల్లమాలిన మోజులో పడకు. అమెరికా భాగ్య వంతమైన దేశమనడంలో సందేహం లేదు. మానవుడు భౌతికంగా పొందే అనేక సుఖాలు,

మన ఊహకందని రీతిలో వాళ్ళ దేశంలో చాలామంది అనుభవిస్తున్నమాట నిజమే. ఆ భాగ్యమంతా ఎక్కడిదనుకుంటున్నావ్. మారణాయుధాలే వాళ్ళ సంపత్తి. సప్తసముద్రాలు దాటి, ప్రపంచంలో ఏ మూల, ఏ ఏ దేశాల మధ్య ముళ్ళు పెడదామా ? ఎక్కడ చిచ్చు పెడదామా అని పొంచి పొంచి చూస్తూంటుంది వాళ్ల ప్రభుత్వం. ఎంచక్కా ఇరుపక్షాలకు ఆయుధాలమ్మి సొమ్ము చేసుకుంటారు. ఆ మారణ హోమంలో ఆజ్యంపోస్తూ రావణాసురుడి కాష్టం చేస్తూంటారు. ఆ నెత్తుటి కూడే మహదానందంతో జుర్రుకుంటున్నారు. ఏ ప్రపంచ దేశాలకు వాళ్ళ ఆయుధాలు కొనుక్కునే అవసరం లేకపోనీ ! శాంతియతంగా బ్రతకనీ, ఆ అయ్యల సౌభాగ్యం సంగతి అప్పుడు తెలుస్తుంది. విశ్వమానవాళి విపత్తులే వాళ్ళ సంపదకు పునాది''.

భర్త ఆవేశం చూసి రాజ్యం ముసిముసిగా నవ్వింది. వెంటనే రామారావు చల్లబడ్డాడు. భార్యతో ఇక వాదించడం శుద్ధ దండగని బయటకు వెళ్ళిపోయాడు. 'తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు, చేరి మూర్ఖుని మనసు రంజింపతరమే' అనే భర్తృహరి పద్యాన్ని కూని రాగం తీస్తూ ....

మొత్తానికి రాజ్యం నసకు రామారావు మనసు లొంగటం ప్రారంభమైంది. ఇన్నాళ్ళూ అపరాజిత చదువు, పరీక్షల సందడిలో మునిగిపోయి పరిసరాల ధ్యాసే లేకుండా గడిపింది. ఈ మధ్య ఆమె వివాహ విషయంలో తల్లిదండ్రుల మధ్య జరుగుతున్న చర్చలు, తర్జన భర్జనలు, వాగ్వివాదాలు తరచు ఆమె చెవిన పడుతున్నాయి. తల్లి రాజ్యం, కమలా ఆంటీల భావాలు ఆమెను ప్రభావితం చేస్తున్నాయి.

ఆమెరికాలో తనకు మంచి భవిష్యత్తు వుంటుంది. తన స్నేహితులెంతో మంది, అక్కడకు వెళ్ళి మంచి ఉద్యోగాలు సంపాదించుకుని స్థిరపడిపోవడం తెలుసు. తన సహాధ్యాయులు నిరుటినుండి ఆ సమాచార సేవలో మునిగిపోయారు. అమ్మ మాటలో ఎంతో నిజం ఉంది. ఆమెరికా సంబంధం కుదిరితే అమ్మ కోరికా నెరవేరుతుంది. నాన్న ఆశా తీరుతుంది అనే ఆలోచనలు అపరాజితను ముప్పిరిగొంటున్నాయి. వివాహ విషయంలో తల్లి వైపే మొగ్గు చూపింది.

"మనం మీనమేషాలు లెక్కిస్తూ కూర్చుంటే పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. అమెరికా పెళ్ళికొడుకున్నాడని తెలిస్తేచాలు ఎవరో ఒకరు ఎగరేసుకుపోతారు, అన్ని విషయాలు కమలతో మాట్లాడి తెల్సుకున్నాను. వాళ్ళను తీసుకురమ్మని ఆవిడకు చెప్పేసుకూడా" అంది రాజ్యం స్థిరంగా.

"అదీ కాక ఇన్నాళ్ళూ అమ్మాయి మెచ్చిన, అమ్మాయిని మెచ్చినవాళ్ళను చేసుకుంటుందంటూ పాట పాడేరు కదా ? మళ్లీ మాట మారుస్తున్నారే మనం వాళ్ల ఊరు వెళ్లి చూసి రావడమెందుకు ? మా కమల మనల్ని మోసం చేస్తుందనుకున్నారా ? అమ్మాయి

అంగీకారం తెల్పింది. మీరు అడ్డుపుల్లలు వేయకండి. అక్కడే స్థిరబద్ధ భాస్కర్‌ను చేసుకుంటే అమ్మాయి భావి మూడుపువ్వులూ, ఆరుకాయలుగా వుంటుంది, అన్నీ నేను చూసుకుంటాను''. రాజ్యం భర్త మాటను 'వీటో' చేసింది.

ప్రతి చిన్న విషయానికి తండ్రి సలహాలను పాటించే అపరాజిత పెండ్లి విషయంలో ముభావంగా ఉంటుంది. ఆ విషయం గ్రహించిన తండ్రి, తన బాధను తనలోనే ఇముడ్చుకుని మౌనం వహించాడు.

పెండ్లి చూపులు, అమ్మాయి, అబ్బాయి ఒకరినొకరు మెచ్చడం జరిగిపోయింది. ఇచ్చిపుచ్చుకోటాలు వగైరా మాటలు జరుగలేదు. పైమాట ప్రసక్తి మగ పెండ్లివారు తీసుకు రాలేదు. కట్నకానుకల మాటెత్తుతే తండ్రీ, కూతుళ్లు అంగీకరించరని మగ పెండ్లి వారితో కమల, రాజ్యం పనుపున మాట్లాడింది.

ఒక్కతే కూతురు, వారి సర్వస్వం అమ్మాయికేననే అభిప్రాయం మగ పెండ్లి వారిలో కల్పించింది కమల. పెండ్లి ఘనంగా చేస్తారని భరోసా ఇచ్చింది, అన్నిటా, అంతటా తానే అయి కమల మధ్యవర్తిత్వంతో కుమార్తె పెండ్లి నిశ్చయం చేసింది రాజ్యం. మగ పెండ్లివారు బీదకుటుంబీకులనీ, వాళ్ళ ఆశలన్నీ ఈ కొడుకుమీదనే పెట్టుకున్నారనీ వాపోతూ రాజ్యం వాళ్ళ ఖర్చులకు, బట్టలకు ఘనంగానే ముట్టజెప్పింది.

నోరువిప్పబోతే "మనకు మాత్రం ఇంకెవరున్నారు. ఏం చేసినా, ఏం పెట్టినా ఇప్పుడే కదా'' అంటూ భర్తను నిరుత్తరుణ్ణి చేసేది.

పెండ్లికి అనవసరపు ఖర్చులు లేకుండా, తీసుకున్నదేదో అమ్మాయి భవిష్యత్తుకే వుంచాలనే భర్తతో రాజ్యం ఏకీభవించలేకపోయింది. ఎవరి ముందూ తలవంచనీ రామారావు కూతురి పెండ్లి విషయంలో రాజీపడాల్సిన పరిస్థితులేర్పడ్డాయి.

తన ప్రాణంలో ప్రాణమైన కూతురి కోరకైనా, అల్లుడి కాళ్ళు కడిగి కన్యాదానం చేసే ఘట్టానికి రాజీపడలేకపోయాడు. అందుకే తనకిష్టంలేని ముఖ్య ఘట్టాలను దాటవేయడానికి పురోహితుణ్ణి ఒప్పించాడు. వివాహం జరుగుతున్నంతసేపూ కూతురి కండ్లలోని మెరుపు, నునుసిగ్గుల దొంతరలు, చిరునవ్వులోని సంతృప్తిని అనిమిషనేత్రుడై గమనిస్తూనే వున్నాడు.

రాజ్యం మహదానందంతో, మగపెండ్లివారి అవసరాలను వేయికండ్లతో కనిపెట్టి వారికే లోటూ రాకుండా చూస్తూంది. కమలను ప్రత్యేకంగా వారివద్ద నిల్పింది. వారి నోటి నుండి మాట రావడమే తరువాయి భర్త తోడ్పాటుతో, నిమిషాలమీద వారి కోర్కెలను తీరుస్తోంది.

మగ పెండ్లివారి భాష్టికం, గొంతెమ్మ కోర్కెలు, కుసంస్కారం అడుగడుగునా ఉట్టిపడుతూ కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. వారు తిండికి ముఖం వాచినట్లున్నారు. ఫలహారాలు, భోజనాల జాబితాను వచ్చిన మరుక్షణమే కమల చేతిలో వుంచారు.

వరంగల్ చూడాల్సిన చారిత్రాత్మక స్థలాల దర్శనాలు ముగిసేయి. తిరుగు ప్రయాణపు ఏర్పాట్లు చేస్తున్న రామారావుకు వాళ్ల అనుకోని 'ఫర్మానా' రామప్పగుడి దర్శనం పిడుగు పాటైంది. ఏభై మందికి కాకినాడ గౌతమికి చేసిన రిజర్వేషను రద్దుచేసి మరునాటికి మళ్ళా చేయడం మాటలా ? అంతవరకు పెండ్లివారి ఖర్చులను భరించడం తనవల్ల ఔతుందా ? అనుకుంటూ రామారావు స్థాణువులా నిలబడిపోయాడు.

ఈ విషయంవిన్న రాజ్యం భర్తను సమీపించింది. ఆయననా స్థితిలో చూసి, పలకరించే సాహసం చేయలేకపోయింది. కమలతో కలసి మగ పెండ్లివారితో మాట్లాడ్డానికి వెళ్లింది.

ఫలితం ఫరాభవమే. రాజ్యం నీళ్ళునిండిన కండ్లనుచూసి రామారావే ధైర్యం తెచ్చుకున్నాడు. క్షణంలో తేరుకున్నాడు. భార్య చేయి సున్నితంగా పట్టుకున్నాడు.

"రాజీ ! దిగులుపడకు. నిండా మునిగినవాళ్ళకు చలేమిటోయ్ ! రోట్లో తల పెట్టేశాం. ఎంత పోటు పడుతుందోననే భయందేనికోయ్. నీపని చూసుకో. నే వెళ్ళి ప్రయాణపు ఏర్పాట్లు చేయిస్తాను".

అత్తవారి కొత్త కోర్కె విన్న అపరాజిత అవాక్కయింది. తేరుకుని భర్త దగ్గరకు బయలుదేరింది. స్నేహ బృందం మధ్య ఠీవిగా నిలబడివున్నాడు భాస్కర్.

"భాస్కర్ !" చివాలున వెనుదిరిగి చూసేడు. అపరాజిత కన్పించింది. ఆ పిలుపుకు కినుకవహించి, ముఖం చిట్లించుకుని ఆమె వైపు అడుగులు వేసేడు.

"నీ చిన్ననాటి స్నేహితుణ్ణి పిలిచినట్లు పిలుస్తున్నావే సంగతేమిటి ?"

"పేరుపెట్టి పిలిస్తే తప్పా? అందులో మీరు నవనాగరికదేశంలో వుంటున్నారుకూడా !"

"అమెరికా వాస్తవ్యుడినైనా భారతీయ పురుషుడిని, మనదేశపు సాంప్రదాయాలంటే పడి చస్తాననే విషయం తెల్సుకో. సమానత్వం చాటుకోవాలంటే ఆ పప్పులు నాదగ్గర ఉడకవు".

అతడి భావాలను, మగవాడిననే అహంకారాన్ని చూసి నివ్వెరపోయింది నవవధువు. అతడి మాటలను పట్టించుకోదల్చుకోలేదు ఇప్పుడు. "నాదొక ప్రార్థన ఈ ప్రయాణపు మార్పులు చాలా కష్టం. మళ్ళీ ఇక్కడకు వచ్చినపుడు, మనిద్దరం స్థిమితంగా, మీరు చూడదల్చుకున్న ప్రదేశాలు సరదాగా తిరిగి వద్దాం".

"ఓహో ! మళ్ళీ ఇంతమందినీ కాకినాడ నుండి తరలించుకు రావడానికి పాపం మీ నాన్న ఖర్చులు భరించగలడా ? ఆయన మీద జాలిపడే, ఆ ఏర్పాట్లేవో ఇప్పుడే చేయమంటున్నాను" అన్నాడు భాస్కర్ తన ఉదారతను చాటుకుంటూ.

"ఖర్చుల మాటటుంచి మళ్ళీ ఒక్కరోజు వ్యవధిలో ఇన్ని టిక్కెట్లు దొరకద్దా ?"

"అదంతా నాకనవసరం. అయినా మీ నాన్న రైల్వేలో పెద్ద ఆఫీసరు కదా ! రైల్వే వాళ్ళు చేయలేని పనులుండవని నాకు తెలుసు. తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేయగల సమర్థులు. ఈ మాత్రం చేయలేకపోతే ఇంకెందుకు ?" అని విరగబడి నవ్వుతూ మిత్ర బృందాన్ని చేరేడు.

దిక్కుతోచని అపరాజిత వెతుక్కుంటూ వెళ్ళి, దిగాలుగా మాట్లాడుకుంటున్న తల్లి దండ్రులను చేరింది. "నాన్నా !" తండ్రి చేయిపట్టుకుంది తన రెండుచేతులతో ? దుఃఖంతో చేష్టలుడిగి మ్రాన్పడిపోయింది.

"తల్లీ ! నువ్వూ విన్నావుగా ! ఇంతదాకా వచ్చేక మనం చేయగల్గింది లేదు. వాళ్లను రామప్పకు పంపే ఏర్పాట్లుచేసి స్టేషనుకు వెడతాను. మీరేమి దిగులు పెట్టుకోకండి". కూతురి తల నిమిరి, రామారావు నిష్క్రమించాడు. అర్థగంటలో ఒక బస్సు, ఒక కారు విడిది ముందాగాయి. పెళ్ళివారు ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ బస్సు ఎక్కేరు.

ఆదిలోనే హంస పాదా అని ఆక్రోశించింది. రామారావు నెమ్మదిగా కూతురి గదిలోకి వెళ్ళేడు. "అమ్మా ! అనే తండ్రి పిలుపుకు, కిటికీలోనుండి విడిదివైపు చూస్తున్న అపరాజిత వెనుదిరిగింది. "తయారవమ్మా ! ఇపుడు వెనకడుగు వేసి లాభం లేదు".

"తప్పదంటారా నాన్నా ?"

"ఈ దశలో ఏ తటాపటాయింపులూ వద్దు. ఏ నెపమూ నీ మీదకు వచ్చేటట్లు అవకాశ మీయకు తల్లీ ! కనపడని రంపపుకోతకు తరతమ భేదాలతో అందరం గురవుతున్నాం. ఎంతో విజ్ఞత, సంయమనం చూపించాల్సిన సమయమిదే". అపరాజిత తలూపి, తండ్రితో బాటు కారువైపు నడిచింది. అప్పటికే కారు భాస్కర్ మిత్రులతో క్రిక్కిరిసిపోయింది.

"అపూ !" తలయెత్తి స్థిరంగా భర్తవైపు చూస్తూ.

"కాదు, అపరాజిత" అంది.

"సరే ! అపరాజితా ఇక్కడ చోటులేదు. నువ్వు మావాళ్ళ దగ్గర కూర్చో".

ఈ సంభాషణ విన్న భాస్కర్ చెల్లెలు బస్సుదిగి విసవిసా కారుదగ్గరకు వచ్చింది. అన్నను చీవాట్లు వేసింది. ముందుసీట్లో కూర్చున్న భాస్కర్ స్నేహితుణ్ణి బలవంతాన దింపించింది.

ఆడబిడ్డ సంస్కారానికి చలించిన అపరాజిత ఆమె దగ్గరకు వెళ్లి "వదినా ! మనిద్దరం బస్సులోనే వెడదాం రండి" అని ఆమె చేయి పట్టుకుంది.

"నవవధువు స్థానమిదేనమ్మా !" అని వదినను, అన్న ప్రక్కన కూర్చోబెట్టి వెనుదిరిగింది భాస్కర్ చెల్లెలు. కారులో కూర్చుందన్న మాటేగాని అపరాజిత హృదయం వేదనాభరిత మైంది. కారుకంటే వేగంగా ఆమె మనసు పరిపరివిధాల పరుగులెడుతోంది.

తనకేమైందసలు ? ఆమెరికా సంబంధమనగానే భూతల స్వర్గారోహణే అనుకుంది. తీయటి కలలు, మధురోహాలు ముప్పిరిగొనగా, తన విచక్షణాజ్ఞానం గాలికి ఎగిరిపోయింది.

తన తండ్రి, ఆయన ప్రవర్తనవల్ల తరచు చేసిన బోధలవల్ల, అందించిన విజ్ఞానంవల్ల తనలో పాదుకొల్పిన ఉదాత్తభావాలను, పునీత సంస్కారాన్ని, అమూల్యమైన మానవ విలువలు, తన జీవితభాగస్వామిని ఎంచుకోవాల్సిన సమయం వచ్చేసరికి విస్మృతపథంలో పడిపోయాయి. నిజానికి ఆ సమయం ఆసన్నమే కాలేదు. తల్లి అనుచితమైన తొందరపాటు చేస్తూంటే. తానూ తలూపేసింది ముందువెనుకల ఆలోచన లేకుండా, విషయం గ్రహించిన తండ్రి ఏం చేయగలరు. నిస్సహాయుడై, ప్రేక్షకుడిగా వుండిపోవడం తప్ప.

తన జీవిత భాగస్వామి ఎవరో, అతడి స్వభావమేమిటో, ఆలోచనలు, ఆశయాలు ఏమిటో తెలుసుకోకుండానే, ఆసక్తి అయినా చూపకుండానే, కేవలం అతడు ఆమెరికాలో ఉద్యోగం వెలగబెడుతున్నాడన్న కారణంగా తాను గంగిరెద్దులా తలూపటం, తల్చుకుంటే తనకే జుగుప్స కలిగింది. ఒక్క కుదుపులో కారాగడంవల్ల బాహ్య ప్రపంచంలోకి వచ్చింది.

“నిద్ర పోతున్నావా ? లే, రామప్ప వచ్చేసింది” అన్న భాస్కర్ మాటలకు అపరాజిత ఎడ తెగని ఆలోచనా పరంపర నుండి బయటపడింది.

మగపెండ్లివారు సుఖంగా కాకినాడ చేరుకున్నారు. కూతుర్ని విడిచి వస్తూన్నపుడు రాజ్యం హృదయం  ఏదో తెలియని భయంతో, ఆందోళనతో బరువెక్కింది. వీసా ప్రయత్నాలు చేసుకుని, తామిద్దరూ తరువాత వస్తామన్న భాస్కర్ మాటలు, ఆమెకు కొంత ఊరట కల్గించేయి. మట్టి గుర్రాన్నెక్కించి, అమ్మాయిని ఏట్లో దింపేమేమోననే చింతతో రామారావు భార్యతో వరంగల్ చేరేడు.

కారు చీకట్లో కాంతిరేఖలా, చల్లని చంద్రరేఖలా భాసించిన ఆడబిడ్డ వెళ్ళిపోయిన తరు వాత అపరాజితను వంటరితనం చుట్టుముట్టింది. ఎంతసేపలా కూర్చుందో ఆమెకే తెలియదు.

“పొద్దు పోయింది, వచ్చి భోజనం చేయి పెళ్ళికూతురా ! ఇది నీ ఇల్లేననుకుని, నలుగురితో కలిసిపోవాలి. నిన్ను బొట్టుపెట్టి భోజనానికి పిలవడానికి ఇక్కడ ఎవరూ లేరమ్మా !” అన్న అత్తగారి పలుకులు విని అపరాజిత నివ్వెరపోయింది.

ఎలాగోలా నిలదొక్కుకుంది. మనస్సు సరిపెట్టుకుంది. “ఇద్దరంకలిసి తినొచ్చని ఆగేను అత్తయ్యగారూ”.

“మగణ్ణి కొంగున కట్టుకుని తిరిగే నేర్పు జన్మతఃవుండాలి, తెలుస్తూనేవుంది అమ్మాయి తెలివి. చదువుకోగానే సరిపోదు. కొత్త పెళ్ళాన్ని ఇంట్లో పెట్టుకుని నా కొడుకు బలాదూరు తిరుగుతున్నాడంటే తప్పెవరిది ? వాడెప్పుడొస్తాడో ? నువ్వెళ్ళి నాలుగు మెతుకులు తిని వంటిల్లు సర్దిరా, మా అందరి భోజనాలు అయిపోయాయి”.

ఆకలి, అవమానాలతో అట్టుడికిపోతున్న అపరాజితకు ఉక్రోషం ముంచుకొచ్చింది, కండ్లు ఎర్రబడ్డాయి. "అన్నీ చూస్తూంటే ఇప్పటికే కడుపు నిండిపోయిందండీ ! అన్నం తినేందుకు కడుపులో చోటూ లేదు, గిన్నెలు సర్దేందుకు ఓపికా లేదు. ఆ పనేదో మీరే చూసుకోండి".

అనుకోని ఈ విసురుకు నివ్వెరపోయింది భాస్కర్ తల్లి.

"గంగి గోవనుకున్నాను, పోట్లగిత్తలా మీద కొస్తున్నావే".

"అవసరమైతే గంగిగోవులా గాండ్రించాలి కదా !"

"మాటకు మాట అనడం ఆడదానికి తగదమ్మాయ్, ఆడది అణగిమణగి వుండాలని మీ అమ్మ నీకు నేర్పలేదా ?"

"మా అమ్మా నాన్న జీవితంలోని ఆటుపోటులెలా ఎదుర్కోవాలో బాగానే నేర్పించారు. కోడళ్లక్కూడా ఆకలిదప్పులుంటాయన్న విషయాన్ని మర్చిపోయి, ముందు తమరంతా భోం చేసి, నన్ను వంటిల్లు సర్దమంటూ పురమాయించేరు. బహుశా మీ అమ్మాయికి ఇలాంటి సుద్దులే నేర్పి అత్తింటికి పంపివుంటారు". కొరడాతో కొట్టినట్లుగానే కోడలినుండి వచ్చిన సమాధానం భాస్కర్ తల్లికి ఊహించని మలుపు. సంభాషణ పెంచడం అనవసరమన్నట్లు అపరాజిత విసవిసా గదిలోకి వెళ్ళిపోయింది.

"అబ్బాయి రానీ, నా తడాఖా చూపిస్తాను" అని సణుక్కుంటూ కొడుకు రాకకు ఎదురు తెన్నులు చూస్తూకూర్చుంది.

ఇంతలో భాస్కర్ మిత్రులతో వచ్చి, తల్లిచేత అన్నం పెట్టించుకుని తిని బయటకు వచ్చాడు. 'సత్రం భోజనం-మఠం నిద్ర' అన్నట్లు ఊరమ్మట తిరిగి తిరిగి, తిండికి మాత్రం తోచినపుడు, వేళాపాళాలేకుండా రావడం చూస్తుంటే అపరాజితకు భర్త వ్యవహారం అంతు పట్టడంలేదు. రాత్రిపూట మత్తులో వస్తూన్న లక్షణాలను స్పష్టంగా గమనించింది.

స్నేహితురాలు, సహాధ్యాయిని అయిన అనిత స్మృతులు అపరాజితను, అత్తవారింటికి వచ్చినప్పటి నుండి నీడలా వెన్నంటుతున్నాయి. ఆమె మనసును కలవరపెడుతున్నాయి. అనితకు పెండ్లయిన ఏడాది లోపునే నూరేళ్లు నిండేయి. ఆమె పెండ్లి, సంసారం, చావు అపరాజిత కండ్లలో మెదుల్తూనే వున్నాయి.

ఇంజనీరింగ్ మూడవ సంవత్సరంలో వుండగానే అనిత పెండ్లి జరిగింది. ఉన్న వూరు, కోటీశ్వరులు, తమకు కావాల్సినవాళ్ళు అంటూ తల్లిదండ్రులు సంబంధం కుదిర్చేరు.

పెండ్లి మాటలు జరుగుతూన్నపుడే అపరాజిత, స్నేహితురాల్ని హెచ్చరించింది. చదువు పూర్తిగాకుండా పెండ్లి చేసుకోవద్దని అనేక విధాల బ్రతిమాలింది. అన్నిటికీ అనిత చిరు నవ్వుతో కూడిన మౌనమే సమాధానం.

"అందరకూ ఇలాటి చదువు సాధ్యం కాదు. మనం రాత్రింబవళ్ళు కష్టపడి చదివి సీటు సాధించేం, అర్ధాంతరంగా చదువును గుంటలో పెట్టి గంట వాయించడం మంచిదికాదు".

"నేను చదువుకు స్వస్తి చెప్తున్నానని ఎందుకనుకుంటావు ? పెండ్లయితే మాత్రం చదువుకోకూడదా ? వాళ్ళు అంగీకరించేరు" అంది చెదరని చిరునవ్వుతో.

"అత్తవారింట ఎన్నో బాధ్యతలుంటాయి. చదువెలాసాగుతుందే, ఇదేమైనా మామూలు చదువా ? డిగ్రీ చదువైతే ఇంట్లో కూర్చుని అయినా స్వంతంగా చదువుకోవచ్చు. మార్కెట్ రేటు కంటే చాలా ఖరీదిచ్చి మగణ్ణి కొనుక్కుంటున్నావుగాని, ఆ సరుకు నీ ఇంటికి రాదు. ఆ సరుకుపై నీకే హక్కులూ వుండవు. పైగా డబ్బుతోసహా నిన్ను వాళ్ల చేతుల్లో పెట్టేక. ఇక నీకు నోరెత్తే అవకాశమే వుండదు. అసలే నోరులేని దానివి అని వెక్కిరించింది, ఎద్దేవా చేసింది". అయినా అనిత, అపరాజిత మాటలను లక్ష్యపెట్టలేదు. మహదానందంతో ఆ పెండ్లికి సిద్ధపడింది. ఆకాశమంత పందిరివేసి, భూనభోంతరాళాలు దద్దరిల్లేట్లు పెండ్లి చేసేరు. తలవంచి తాళి కట్టించుకుంది.

అనిత పుట్టింటికి వచ్చినపుడల్లా అపరాజితను కలిసేది. పెండ్లికిముందున్న మెరుపులు అనిత కండ్లలో లేవు. ఆమె కండ్లు వెలవెలబోతూండడం అపరాజిత గ్రహించింది. ఏదో చెప్పబోతూ అనిత వెనుదీసిన విషయం అపరాజిత కనిపెట్టింది. కాని రెట్టించలేకపోయింది. తన దుఃఖం, సమస్యలు ప్రాణస్నేహితురాలితోనైనా పంచుకోలేకపోయింది అనిత. ఆమె ఆత్మహత్యకు కారణం ఎవరికి తెలియదు.

గుట్టుచప్పుడు కాకుండా శ్రాద్ధకర్మలు ఘనంగా జరిపించేసేరు, చేతులు కాలేక అనిత తల్లి ఆకులు పట్టుకోబోయింది, లాభమేమిటి ? అపరాజితను వాటేసుకుని పసిపిల్లలా ఏడ్చేది తల్లి.

"చిన్న దానివైనా పెద్ద ఆరిందలా, నాకు ఎన్నోవిధాలా చెప్పేవమ్మా పెండ్లికి తొందరపడ వద్దని ! నా కళ్ళు కప్పుకుపోయేయి. వాళ్ల డబ్బొక్కటే నాకు కన్పించింది. కాని ఆ డబ్బు తెచ్చే దుర్లక్షణాలు, అత్తలుపెట్టే ఆరళ్ళు, ఆడపిల్లల చేతకానితనం నా కళ్లబడలేదు"అనివాపోయేది.

చెప్పడం సులభమే. తనదాకా వచ్చేక తానేం చేసింది ? విజ్ఞులైన తండ్రిమీద భరోసా వుంచలేకపోయింది. పెండ్లికి ముందే నేనెవర్ని చేసుకుంటున్నానో, నాన్నా గ్రహించగల్గేరు. కాని నా ఆనందాన్ని కోరే నాన్నా, నా అభిప్రాయాలకు విలువనిచ్చే నాన్నా ఉదాసీనంగా వుండిపోయారు. బహుశా నా తెలివితక్కువకు, తప్పుడు అంచనాలకు అంతరంగంలో అల మటించిపోయే వుంటారు. పొరపాటున ఊబిలోపడ్డాను. అది తెలుసుకునీ బయటపడలేక పోవడం క్షంతవ్యం కాదు. పరిపరివిధాలైన ఆలోచనలతో ఎలాగో మరో నాలుగురోజులు గడిచాయి. భాస్కర్ దినచర్యలో మార్పులేదు. అపరాజిత ఎవరి పిలుపూ లేకుండానే తనకు ఆకలివేసినపుడు వంట ఇంట్లోకి వెళ్ళి, ఏదో ఇంత తిన్నాననిపిస్తూంది. భాస్కర్ ఆ రోజు

మధ్యాహ్నం భోజనం చేసి అనుకోని విధంగా గదిలోకి వచ్చేడు. భార్యను అన్నం తిన్నావా అనే పలకరింపే లేదు. "ఎన్నాళ్ళిలా" ఇంక ఊరుకోలేకపోయింది, మాటల్లోకి దించింది.

"భాస్కర్ ! మన కార్యక్రమం ఏమిటి ? మన వరంగల్ ప్రయాణమెప్పుడు ? వీసా ప్రయత్నాలు చేసుకోవద్దా ?"

"ముందు పాస్‌పోర్ట్ తీసుకో, నేను 'వీసా' సంగతి చూస్తాను. అదెంత ? నాకు క్షణాలలో పని. ఏం లేకుండా ప్రయాణపు ఏర్పాట్లంటూ గోలపెడతావేం ? మేమూ చదువుకున్నాం. మగాళ్ళతో సమానమేనంటూ విర్రవీగడమేగాని, కొంచెమైనా ప్రపంచ జ్ఞానమెక్కడిదీ ఆడ జాతికి ? నీకంటే 'అ, ఆలైనా రాని మా అమ్మ నయం' అన్నాడు భాస్కర్ ఈసడింపుగా".

"మీ అమ్మ అమెరికా ప్రయాణపుటేర్పాట్లు చేసేసుకున్నారన్నమాట. ఇంకేం ? 'అ,ఆ' రాని మీ అమ్మ నీతో సముజ్జీగా వుండగా ఆడాళ్లనందర్నీ చులకనచేసి మాట్లాడడమెందుకు ?"

"నేను ఏమన్నాని, అంత ఉపన్యాసం ? వున్నమాటంటే ఉలుకెక్కువన్నారందుకే".

"మరి నేనేమన్నానని ముఖం కందగడ్డ చేసుకున్నావు. చీటికి, మాటికి స్త్రీనవమానించే నీలాంటి మగాళ్లే కాలానుగుణంగా మారలేకపోతున్నారు. మార్పునుగుర్తించే ధోరణేలేదు".

"తరతరాల దీర్ఘనిద్రనుండి వంద సంవత్సరాల క్రితం మాత్రమే మేల్కొన్న మేము ఉరుకులు, పరుగులతో ముందుకు పోతున్నాం. మా పరుగందుకోలేక కొంతమంది మగాళ్ళు కళ్ళుకుట్టి కుళ్లుకుంటున్నారు".

"సరే ! దానికేంగాని, మా స్నేహితులందరం ఎప్పుడో పాస్‌పోర్ట్ సంపాదించేసుకున్నాం, తరువాయి కథ నువ్వే నడపాలి". వ్యంగ్యం, కారం రంగరించిన అపరాజిత మాటలకు భాస్కర్ సరైన జవాబు చెప్పలేక మాటమార్చాడు.

"ఇంతకూ మన భవిష్యత్ కార్యక్రమమేమిటి మాట్లాడవేం ?"అని అడిగింది అపరాజిత భర్త మౌనాన్ని చూసి.

"మీరు స్టేట్స్‌లో ఏం చేస్తున్నారు ?"

"ఆంటీ చెప్పలేదా ? ఏమీ తెలియకుండానే తాళి కట్టించుకున్నావా ? ఏడాదికి ఒకటి రెండుసార్లయినా కంపెనీ పనిమీద, ఇక్కడకు వచ్చి వెడుతుంటాను".

"మంచి ప్రతిష్టాకరమైన కంపెనీలో ఇంజనీరన్నారు మేము నమ్మేం. ఇప్పుడా వివరాలు తెలుసుకుందామని కుతూహలం. ఇటుపై జరగాల్సిన కార్యక్రమాలన్నీ మనం ఇద్దరం ఆలోచించుకుని, చేయాల్సిందే కదా !"

"ఏమిటి నీతో కల్సినేనాలోచించాల్సింది అన్నీ ముందే నిర్ణయించేసేను. నేను ఐదారు సంవత్సరాల నుండి అక్కడే వున్నాను. విషయాలన్నీ నాకు కొట్టిన పిండే. నేను చెప్పినట్లు విని నాతో రావడమే నీ బాధ్యత. యక్షప్రశ్నలు వేసి నన్ను విసిగించకు".

అయినా అపరాజిత చెక్కు చెదరలేదు. చెదిరిన హృదయాన్ని కూడదీసుకుని ఆవేశాన్ని అణచిపెట్టుకుంది. "ఇంత మామూలు విషయానికి మీరెందుకంత ఉగ్రులౌతున్నారో నాకు అంతుపట్టడం లేదు. మనం పరస్పరం తెలుసుకోవద్దా ?"

"నా చదువు, ఉద్యోగ వివరాలు నీకనవసరం. ఒళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నోరు మూసుకుని పడి వుండడంతప్ప వెర్రిమొర్రి ప్రశ్నలువేయకు, ప్లీడరులా క్రాస్-ఎగ్జామినేషన్ చేసి కూపీ లాగాలని చూస్తున్నావా ? జాగ్రత్త" అని గుడ్లురిమేడు.

"ఓహో ! అంతవరకు వచ్చిందా వ్యవహారం" అంది అపరాజిత అతనివైపు నిర్లక్ష్యంగా చూస్తూ. దీంతో రెచ్చిపోయాడు భాస్కర్.

"ఏమిటే పేట్రేగిపోతున్నావు ?" అంటూ మదించిన పొట్లగిత్తలా భార్య మీద మీదకు వెళ్ళి చేయిత్తాడు. అప్పటిదాకా కూర్చునే మాట్లాడుతున్న అపరాజిత చెంగున లేచింది. "ఆగు" అని గర్జించింది.

భాస్కర్ విస్తుపోయాడు. ఎత్తినట్లే వుంది చేయి. ఈ హఠాత్పరిణామాన్ని కలలో కూడా ఊహించని భాస్కర్, చేష్టలుడిగి చూస్తుంటే అపరాజిత హెచ్చరించింది.

"ఆ చెయ్యి ఏ మాత్రం కదిలినా మర్యాద దక్కదు. పశువులా మీద కురకడమేగాని, సుశిక్షితులైన వాళ్ళ కరాటే దెబ్బలు, రుచి చూసి వుండవు. సాటి మనిషిపై చెయ్యెత్త సాహసించే కుసంస్కారివి. పసరం కూడా తనను తాను రక్షించుకుందుకు కొమ్ము విసురుతుంది. ఈనాడు దౌర్జన్యానికి పట్టంగట్టాలనుకున్న నీలాంటివాళ్ల బ్రతుకులెలా తెల్లవారుతాయో తెలుసా ?"

"ఢీ అంటే ఢీ అంటున్నావే ! ఒకటికి రెండుసార్లు ఆలోచించి మాట్లాడ్డం నేర్చుకో మాటలు తూటాల్లా విసిరేస్తే ఫలితం తెలుసా?"

"నెయ్యం కయ్యంగా మారినప్పుడు మాటలు తూటాల్లాగే ఎగురుతాయి !" ఏమనుకున్నాడో భాస్కర్ చెయ్యి దించి సర్దుకున్నాడు.

"నేనేమీ మిమ్మల్ని మాయమాటలు చెప్పి మోసం చేయలేదే ! నా చదువును గురించి కూడా మీకు తెల్సనే అనుకున్నాను. మీరడుగలేదు, నేను చెప్పలేదు అంతే" అంటూ తలెగరేశాడు.

"మా కుటుంబానికి ఆప్తురాలైన కమలా ఆంటీ చెప్పిన మాటలు నమ్మేం. ఆవిడకూ తెల్సివుండకపోవచ్చు వివరాలు. నిజమే, నిన్ను మేమేమి అడగలేదు. నాకంటే నీకు తక్కువ చదువైనా నాకభ్యంతరం వుండకపోయేది భాస్కర్. చదువు, తెలివి సహజంగానే అందరకూ ఒకేస్థాయిలో వుండకపోవచ్చు. సంస్కారం, మానవత్వం మాత్రం మనిషైనవాళ్లందరకూ ముఖ్యంగా ఉండి తీరాల్సిందే. నా భర్త చదువు, జీతం గురించిన బాధ నాకు లేదు. కాని నా

భర్త ఒక మనసున్నమనిషిగా, స్నేహితునిగా వుండాలనేదే నా ఆశ. ఆ ఆశ దురాశ కాదను కుంటాను. అది లోపించేక వైవాహిక జీవితానికి అర్థమేలేదు. జీవితం దుఃఖభాజనమే కదా !"

ఏదో చెప్పబోతున్న భాస్కర్‌ను వారించింది.

"జీవితంలో నేను ప్రాణప్రదంగా చూసే విలువలను, నీ దృష్టిలో విలువ లేకపోవడం నేను సహించలేను. ఈ విషయం నాదృష్టిలో నాజీవితానికి సంబంధించిన మౌలిక సమస్య."

"అయితే ఏమంటావు ? నీ ఆశయాలకు ఇప్పుడు వచ్చిన ముప్పేమిటట ?"

"ఏమీ లేదు భాస్కర్ ! నా ఆశలన్నీ కూకటివేళ్లతో పెకలించుకు పోయాయంతే".

"అమెరికా సంబంధం అనే మైకం మా అమ్మనేగాక నన్నూ ఆవహించిందానాడు. కాని ఆ మైకం రామప్ప ప్రయాణపు ప్రహసనంలోనే చాలావరకు పటాపంచలయింది. ఇంకా ఏమైనా మిగిలివుంటే, ఈ మూణ్ణాళ్ళ ముచ్చటతో పూర్తిగా తొలగిపోయింది".

ఒక్క క్షణం మౌనం వహించింది. ఈ సంఘటనతో మబ్బులు పూర్తిగా చెదరిపోయాయి. వాడియైన వేడియైన సూర్య కిరణాలు, అపరాజిత అంతరాంతరాల్లోకి ప్రవేశించేయి. ఆమె హృదయంలోని చీకటి కోణాలను ఛేదించేయి. అపరాజిత పరాజిత కాదల్చుకోలేదు.

"నీ చుట్టూ తిరుగుతున్న జక్కాయి బుక్కాయిగాళ్లను చూస్తుంటే, నీ స్థాయి ఏమిటో, నీ సంస్కారమేమిటో తేటతెల్లమైంది". అతని ఉనికినే లక్ష్యపెట్టకుండా అపరాజిత పెట్టె సర్దుకోవడంలో మునిగిపోయింది.

తన బండారమంతా ఈ పిల్ల గ్రహించేసిందని నివ్వెరపోయాడు భాస్కర్. తల్లిదండ్రుల ఏకైక సంతానం, చదువరి, సుందరియైన అపరాజిత సర్వస్వం ఆమెను కన్నవారితో సహా తన కనుసన్నలలోనే వుంటారనే భావం కమల మాటలవల్ల కల్గింది. అందుకనే తాత్సారం చేయకుండా, కట్నకానుకల ప్రసక్తే లేకుండా దర్పంగా మూడుముళ్లూ వేసేశాడు పాపం. వారి ఆస్తిపాస్తులు, సిరిసంపదలు స్వంతం చేసుకోవచ్చని కన్నకలలన్నీ కండ్లెదురుగా కూలి పోతున్నాయి. అపరాజిత, చదువుకున్నా సాంప్రదాయాల వలయంలో కూరుకుపోయిన గంగిగోవు కాదని తెల్సుకున్నాడు. స్త్రీ పురుష సమానత్వ విషయంలో చాలా పట్టుదలగా వుండే తన చెల్లెల్ని మించిపోయిన కొరకరాని కొయ్యగా తన భార్య కనిపించింది. అయినా మేకపోతు గాంభీర్యంతో...

"అపూ ! ఎక్కడికా ప్రయాణం ?" అని ప్రశ్నించాడు.

చివాలున తలయెత్తి అతనివైపు ఛీత్కారంగా చూసింది. తల్లి అయినా ఆమెనెవరూ అలా పిలవరు. తండ్రి ఎప్పుడూ అపరాజితా అనే పిలుస్తాడు.

భాస్కర్ ఆమె చూపులలోని వేడిగ్రహించేడు. వెంటనే తప్పుదిద్దుకున్నాడు. "అపరాజితా నేనేదో కోపంలో వళ్ళు తెలియక రెండు మాటలంటే ఇంత రాద్ధాంతం చేస్తావా ?" సౌమ్యంగా ఉండడానికి ప్రయత్నించేడు. గొంతులోని కరకుదనాన్ని సాధ్యమైనంత తగ్గించుకున్నాడు.

"కోపతాపాలు మగాడికే కాదు, నాకూవున్నాయి. నేను రాగద్వేషాలకు అతీతురాల్ని కాదు. మగాడిగా నువ్వు చూపిస్తే, మనిషిగా నేను చూపిస్తున్నాను. అందరకూ వుంటుంది స్పందన. ఒకందుకు మాత్రం నీకు చాలా కృతజ్ఞురాలిని".

ఎందుకన్నట్లు చూసేడు భాస్కర్.

"ఇంత తొందర్లో నీ నిజస్వరూపం ప్రదర్శించగల్గినందుకు, నా భ్రమలు పటాపంచలు చేసినందుకు".

"మన పవిత్రమైన వివాహబంధం తెంచేయడం అంత సులభమనుకున్నావా ? నన్ను కాదని నువ్వెలా బయటపడతావో నేనూ చూస్తాను. అంతా నీ ఇష్టమేనన్నట్లు, అంతా నీ చేతుల్లోనే వున్నట్లు విర్రవీగుతున్నావే ? మనవెనుక మన పెద్దవాళ్ళులేరా ? ఇదేమైనా బొమ్మల పెళ్లనుకున్నావా ?" భాస్కర్ మళ్ళీ తాడెత్తు ప్రమాణానికి లేచాడు. తాత్కాలికంగా తెచ్చిపెట్టుకున్న మార్దవం మటుమాయమైపోయింది. మగవాడిని నన్నెవరేం చేస్తారనే అహంతో నిండిపోయాయతని చూపులు.

"ఆ రోజులు గతించిపోయాయి. పవిత్రత ఉండాల్సింది బంధానికికాదు. దంపతులకు. నా నిర్ణయాన్ని తేలిగ్గానే అర్థం చేసుకోగల తల్లిదండ్రులు నాకున్నారు. అలాంటి అదృష్టం ఏ కొద్దిమందికోగాని పట్టదు. కొత్త పెండ్లికూతుర్నైన నాకు మాట్లాడబోతేనే హుంకరించి, చెయ్యెత్తే అనాగరికుడు, నా పాలిటపడ్డాడని తెలిస్తే నా నిర్ణయాన్ని హర్షిస్తారు. నీకా విషయంలో ఏ బెంగా అక్కరలేదు. పెండ్లంటే బొమ్మలాట నీకుగాని నాకు మాత్రంకాదు".

తాగుబోతు, తిరుగుబోతు, వదరుబోతు అయిన ఆ త్రిగుణభూషణుడు ఆమెకు దుస్సహమే అయేడు. "నీవు అనితవు కాదు-కాకూడదు".

"చీవాట్లు, చెప్పుదెబ్బలు తింటూ బ్రతికేవాళ్లు మనుష్యులు కాదు, భీరువులు. నీవు మానవివి. అనితలా అన్యాయానికి, దుర్మార్గానికి బలికాకు. దురహంకారాన్ని, దౌర్జన్యాన్ని ప్రతిఘటించు. మనిషిలా బ్రతుకు. నీవు అపరాజితవు". ఏదో అంతఃశక్తి తనను గబగబా తట్టి ముందుకడుగేయిస్తున్న అనుభూతిని ఆమె పొందింది. పెట్టె చేతబట్టుకుని బయటకు నడిచింది. వెనుదిరిగైనా చూడకుండా పుట్టింటి కోటకు పయనమై వెడుతూన్న భార్యను భాస్కర్, అతని తల్లి చేష్టలుడిగి చూస్తూ వుండిపోయారు. ❑




## ఎ. నాగేశ్వర రావు.

సంపత్ కిరాణ దుకాణం,
అశ్వాపురం - 507 116
జి॥ ఖమ్మం.


# మలుపు

సంపత్ ఆదర్శభావాలు అందరినీ ఉత్తేజితులను చేస్తుంది. తన పల్లెటూరుకోసం, అక్కడి యువకులను చైతన్యపరచాలనే ఆలోచనలతో సతమతమవుతున్నాడు. తన పల్లెటూరు పచ్చని పంటపొలాలతో విలసిల్లుతున్నది. అందరూ కష్టించి పనిచేస్తారు. పంటలను బాగా సాగుబడి చేస్తారు. స్వాతంత్ర్యం వచ్చినా ఆ ఊరు నాగరికతను అందుకోలేదు. అభివృద్ధి దిశలో పయనించడం లేదు. పంటబాగా పండించినా, లాభాలు గడించినా అవి అన్నీ ఆ గ్రామస్తుల వ్యసనాలకే సరిపోతున్నది. ఆధునిక వసతుల కొరకు ఎవరూ పాటుపడడంలేదు. అందరిని కూడగట్టుకొని గ్రామాన్ని చైతన్యపరచాలనే ఆలోచనకు నాంది వేసాడు. ఆ ఊళ్ళోఉన్న యువకులందరినీ ప్రతి ఇంటినుండి ఒక్కొక్కరిని కూడగట్టుకొని తన ఆలోచనను వారి ముందుంచాడు. అందరినీ అంగీకరింపజేసాడు.

సంపత్ ఆలోచనల ఫలితము అన్నట్టుగా మరునాడు ఊరి పెద్దలందరూ సమావేశము అయినారు. సంపత్ గ్రామస్తులు వ్యసనాలకు గురిఅయ్యే విధానాన్ని, అందువలన ప్రజలు పొందే నష్టాన్ని కండ్లకుకట్టినట్టు చూపెట్టాడు. తాగుడు మనిషిని పతనం చేయడమే కాకుండా ఊరి అభివృద్ధిని ఎలా అడ్డుకొంటుందో విడమర్చి చెప్పినాడు. అంతేకాకుండా జబ్బుల బారిన పడినప్పుడు, రోడ్లు సరిగా లేకపోవడంవలన పట్టణమునకు తీసుకపోలేని పరిస్థితులను వారికి అర్థమయ్యేలా చెప్పాడు.

అక్కడ జమ కూడిన ప్రజలలోంచి ఎల్లవ్వ లేచి "బిడ్డా నీవు చెప్పేది బాగానే వుంది కాని మనమేం చేయాలి... మనం బాగుపడాలంటే మనోల్లు తాగొద్దు... తాగే పైసలు అందరం జమచేద్దాం... వాటితో మనూరికి ఏమైనా చేద్దాం బిడ్డా" అని అంది.

ఎల్లవ్వ చెప్పిందే నేను కోరుకుంటున్నాను. మరి మీరేమంటారని మిగతావారిని... "ఆపు బిడ్డా ! నా వంతు ఇగో ఈ కడియం ఇస్తున్నానని" ఎల్లవ్వ ఇచ్చింది.

అక్కడున్న జనం అందరూ తమతమ దగ్గరున్న వాటిని ఇచ్చారు. ఊరి పెద్ద అయిన రామయ్య గొంతు సరాయించుకొని ఇలా అన్నాడు "మీరు ఇప్పుడిచ్చింది మాత్రమే సరి పోదు... ఇక నుండి మనందరం తాగుడు బందు చేసి... సంపత్‌బాబు చెప్పినట్టు రాత్రి బడికి వచ్చి చదువుకుందాము. ఊరును ఆదర్శ గ్రామంగా మారుద్దామని" అన్నాడు. సరేనంటూ అందరూ ప్రమాణం చేసారు. తను కోరుకున్న మార్పును గ్రామస్తుల దగ్గర ఇంత తొందరగా వచ్చినందుకు బిత్తరపోయాడు సంపత్. ఈ మలుపుకు తన వంతు కర్తవ్యము దీక్షగా చేయాలని తలచాడు. ❑

నామని (క్యాతం) సుజనాదేవి, M.A., B.Ed., LL.B.
H.G.A., L.I.C. Dist. Branch Wgl.,
W/o కె. సంపత్,
ఇ.నెం. 11-29-36, పృథ్వీనగర్ కాలనీ,
వరంగల్ - 506 002



# నిరీక్షణ

ప్రియా... !

ఎంతకాలమీ నిరీక్షణ ! ఎంతకాలమీ విరహ నిరీక్షణ... క్షణాలు యుగాలుగా రెండు వసంతాలెప్పుడు గడవాలి ? నిరీక్షణెంతో మధురమంటారే ! మరి నాకింత ఘోరనరకంగా అన్పిస్తుందెందుకని ? బహుశా ఫలించిన నిరీక్షణ మధురంగా ఉంటుందేమో ! నేనూ ఈ నా నిరీక్షణ మధురస్మృతిగా మిగలాలనే కోరుకుంటున్నాను. అయినా నాకీ శిక్ష పడవలసిందే ! నిన్నంత నరకయాతనకు గురిచేసినందుకు ఈ మాత్రం వ్యధ నాకింకా తక్కువేనేమో ! మన్నించుమా ప్రియా ! అనటానికి కూడా అర్హతలేనిదాన్ని. కష్టాలవాగులో కన్నీటి కెరటంలా కొట్టుకుపోతున్న నేను తీరమై దరికి చేర్చుకుంటున్న నిన్ను నెట్టివేసి సుడి గుండాల్లో కొట్టుకుపోతూ ఒడ్డుకే వెళుతున్నాననుకున్న పిచ్చిదాన్ని.

మొట్టమొదటిసారి నేను మిమ్మల్ని చూసిన సన్నివేశము నాకింకా బాగా గుర్తే. తూరుపు ఆకాశం నుదుట ఎర్రసిందూరం దిద్దుకుంటున్నవేళ పెట్టెబేడాతో అద్దె ఇంట్లోకి మొదటిసారి కాలిడుతున్న నిన్ను సహజంగా ఏడిపించే గుణమున్న నేను కావాలని రాష్‌గా వచ్చి ఢీకొని నీ పెట్టె కిందపడేట్లు చేసాను. చెల్లాచెదురైన వస్తువులను అయోమయంగా చూస్తూ, తలెత్తిన నీ కళ్ళలో ననుచూడగానే చేజారిన పెన్నిధిని చూసిన ఆశ్చర్యం, అద్భుత కళాఖండాన్ని చూసిన ఆరాధన మిళితమై కన్పించగా, నిర్లక్ష్యంగా "సారీ" కూడా చెప్పకుండా తలెగరేస్తూ వెళ్ళిపోయాను. అది మొదలు మౌనంగా నన్నారాధిస్తున్న నిన్ను, క్షణక్షణం అల్లరిపాలు, అవమానం పాలుచేస్తూ, నా ఎంజాయ్‌మెంట్‌కి నిన్నో పావులా వాడుకున్నాను.

నువ్వు మాథమాటిక్స్ యూనివర్సిటీ ఫస్ట్ అని తెలుసుకున్న మావాళ్ళు కావాలని ట్యూషన్ చెప్పమని మిమ్మల్ని కోరితే, మీరర్థమయ్యేలా చెప్పినా ఉడికించడానికి, కావాలని అర్థం కాలేదని పదిసార్లు చెప్పించుకునేదాన్ని. మీరు సిన్సియర్‌గా నిజమనుకుని మరింత విడమరిచి, గంటసేపు గొంతు తడారిపోయేలా చెబుతుంటే మంచి పనయ్యిందని (లేదంటే క్లాస్ ఫస్ట్‌ను నాకే చెబుతానంటాడా అన్న్) పెదాల వెనుక నవ్వుకునేదాన్ని.

ఎప్పుడూ మాడ్రన్ డ్రెస్‌లలో ఉండే నేను, పరికిణీ ఓణీలలో అంత బాగా ఉంటానని, మీరు వేసిన చిత్రం చూసాకే తెలిసింది. అయినా నా అనుమతి లేకుండా, అంతద్భుతంగా మీరా చిత్రంవేయటం నాలో అసూయ రగిలించి, కసిగా ఆ చిత్రాన్ని మధ్యకు చింపి పడేసినపుడు మీ కళ్ళలో బాధ నా ఆత్మను శాంతింపజేసింది. ఒక మంచి కథ రాయటానికి రచయిత(త్రి), ఒక మంచి చిత్రాన్ని చిత్రించడానికి చిత్రకారుడు, పసిబిడ్డ పుట్టటానికి ముందు తల్లెంత ప్రసవ వేదన పడుతుందో అంత బాధపడతారట. అంత బాధను తల్లి తర్వాత తన బిడ్డను చూసి మరచిపోయినట్లు, పూర్తయిన కళాఖండాన్ని చూసి వారూ తమ భాధ మరిచిపోతారట. అలాంటి కళాఖండాన్ని ధ్వంసంచేస్తే స్నిగ్ధకోమలమైన నీ మనస్సెంత కందిందో ఆ కళ్ళల్లో ఎర్రజీరల్లో స్పష్టంగా కనబడింది. అంత బాధించినందుకు నాకు అప్పుడెంతో సంతోషంగా అన్పించి గర్వంగా వెళ్ళిపోయాను. అప్పుడు నీ మనస్సెంత క్షోభ పడిందో అహంకారాగ్ని పొరలు తొలగిన నాకిపుడు బాగా అర్ధమవుతుంది. అయినా చేతులు కాలాక ఆకులు పట్టుకునేం ప్రయోజనం. శ్రావణ మేఘాల్లామారిన నా కళ్ళు నీ హృదయ ఫలకంపై ఏర్పడ్డ మరకలను కడిగేయాలనా ?

నా పుట్టినరోజుకు ఎంతో ప్రేమతో నీవిచ్చిన బహుమతి కావాలని చేజారినట్లు నటించి నీ కళ్ళముందే పగలగొట్టినపుడు నీ ముఖాన్ని ఆవరించిన నీలిమేఘాలు, బాధతో చెమర్చిన నీ కళ్ళు నాకెంతో సంతృప్తినిచ్చాయి. ఆఫీస్ తరపున బాంబే టూర్ వెళ్ళి వస్తూ ఇంట్లో అందరితోపాటు నాకూ చీర తెచ్చిన మిమ్మల్ని, మీ కళ్ళముందే నా అంతస్తుకు సరితూగ లేదని పరోక్షంగా తెలియజేస్తూ దాన్ని పనిమనిషికిస్తుంటే నిశ్చేష్టులైన మిమ్మల్ని చూసి నవ్వుకున్నాను. చీర నేను తీసుకుంటున్నపుడు అంబరాని కెగసిన ఆనందాన్ని చూసిన కన్నులలో పనిమనిషికిస్తున్నపుడు అధఃపాతాళపు లోతులు చూసాను.

ఒంటరిగా డాబా పైనున్న నా దగ్గరకొచ్చి మీ ప్రేమ వెలిబుచ్చినపుడు నా చేయి మీ చెంపను తాకటం, బిత్తరపోయిన నీతో నా కాలిగోటికి సరిపోని నీ అంతస్థేమిటంటూ నా అంతస్తు ముందు గడ్డిపోచవైన నీ తాహతెంతని నేనేద్దేవా చేస్తుంటే, చిదిమితే పాలుగారేలా ఉండే మీ పచ్చటి ముఖం అవమానభారంతో ఎర్రబారటం చూసి హేళనచేస్తూ వెళ్ళిపోయిన క్షణమే మిమ్మల్ని చూసిన ఆఖరి క్షణమవుతుందని, ఆ తర్వాత జీవితంలోని అన్ని ఆటు పోట్లు ఒకేసారి శరఘ్ఘాతాలుగా తగలగా అన్నీ కోల్పోయిన నేను, గతించిన జ్ఞాపకాలే మధుర స్మృతులుగా, వేదన అరణ్యరోదనై, పశ్చాత్తాపం దావానలంలా దహించివేస్తుంటే మీరు పెట్టిన గడువుకై క్షణమొక యుగంగా ఎదురుచూస్తూ గడుపుతానని ఊహించి ఉండరు.

"నీ సుఖమే నే కోరుకున్నా, నిను వీడి అందుకే నే వెళుతున్నా..." అంటూ ఒకవేళ ఈ లోపు నా మనసే మారితే రెండేళ్ళలో మళ్ళీ వచ్చి మీ చివరి అదృష్టాన్ని పరీక్షించుకుంటావని నా ఆశ అడియాశ కాకుండా చిరుదీపంలా పెట్టిన గడువును, కొడిగట్టనివ్వకుండ కాపాడుతూ వస్తున్నాను.

ఇది మీ చివరి దురదృష్ట పరీక్ష కాదు, నా అదృష్టానికి చిట్టచివరి గడువు పరీక్ష. ప్రేమ రెండు హృదయాల మధ్య పాటలాంటిది. ఒకే హృదయం ఒంటరిగా పాడుకుంటే విషాదం.

"వానకారు కోయిలనై, తెల్లవారి వెన్నెలనై, ఈ నిశీధి నీడలలో ఎడద నీకు పరిచాననీ.. విన్నవించు నా చెలికీ... విన్న వేదనా.. నా విరహవేదనా.." ఆహా ! ఎంత వేదన అనుభవించి రాసాడో కదా ఆ కవి, ఆ పాటను ఏ గాలికి అందించను నా సందేశాన్ని, ఏ పిల్ల తెమ్మెర వీచినా అది మిమ్మల్ని కూడా స్పృశించి ఉండవచ్చుననే ఆలోచన పులకరింతను కలుగ జేస్తుంది. నేను చూసే సూర్యున్ని, చంద్రున్ని నువ్వు రోజూ నేను చూస్తున్న సమయానికే చూస్తూ ఉన్నా నువ్వెక్కడో నాకు తెలియదు. ఆ చంద్రుడే నాపై జాలిపడి వినిపించరాదా నా సందేశాన్ని. అయినా ఏమని వినిపించను నా సందేశాన్ని ? ఎంతకాలమీ చకోర నిరీక్షణ అని చెప్పనా ? కన్ను మూస్తే వచ్చి కనుమరుగౌతావేమోనని రెప్పవాల్చని కళ్ళ లోగిళ్ళతో వీక్షిస్తున్నానని చెప్పనా ? చెట్టుమీది చిలకాగోరింకలు కూడా నన్నుచూసి గర్వంగా హేళన చేస్తున్నాయని చెప్పనా ? ఏ చిరుగాలి సవ్వడైనా, ఏ ఆకులు గలగలలాడినా మీ పద ధ్వను లేమోనని నా కళ్ళు ఆశగా చూస్తున్నాయని చెప్పనా ? నా మాటలు ఈటెలై నీ గుండెలో దిగుతున్నా చిరునవ్వు కవచంతో కప్పేసుకుని మన్నించిన మీకు అశ్రుతర్పణాలిస్తున్నానని చెప్పనా ? చేసిన తప్పు శాపమై, తాపమై, పశ్చాత్తాపమై కార్చిచ్చులా దహించివేస్తుంటే, వేగమే మంచు తెమ్మెరవై వచ్చి వర్షించమని చెప్పనా ? నీ సన్నిధిలో యుగమొక క్షణంగా గడపడానికి, చెలియలికట్ట దాటి పొంగే బాష్పధారలను ఆపలేకపోతున్నానని చెప్పనా ? "రాదిక నీ కోసం సఖీ... రాదిక వసంతమాసం..." అని మీరెళ్ళిపోయినా తిరిగివచ్చే వసంతం కోసం ఎదురుచూసే కోయిలలా, నీ ఎదఅంచుల లోతులదాటి ఆరాధన అవధులుదాటగా, నీవు నేనై, నేను నీవై తన్మయంగా తనువు పులకరించే క్షణానికై ఎదురుచూపు అని తెలుపనా ?

తిరిగిరాదనుకున్న వసంతం తిరిగివచ్చిన వేళ, కన్నకలలు ఫలించే వేళ, స్వప్నం వాస్తవమై, ఆనందం అనంతమై అంబరానికెగసే వేళ... కలువల దోసిళ్ళతో కన్నీటి నీరాజనాలు తప్ప ఏమివ్వగలను ప్రియా !... నా హృదయ పుష్పాన్ని మీ పవిత్ర పాదఫలకంపై ఉంచటం తప్ప...





**కురిమిండ్ల సృజన,**

ఇ.నెం. 3-14-450/3, దుర్గా కాలనీ,

హన్మకొండ - 506 001

# మట్టి బొమ్మలు

వర్షరుతువు ప్రారంభమై నెలరోజులు దాటింది. రాత్రంతా కుండపోతగా ఒకటే వర్షం. తెల్లవారి చూస్తే నీటిచుక్క ఆనవాలు లేదు. ఎండ మింగేసిందా... భూమి మింగేసిందా... వాతావరణం మాత్రం కొంత చల్లగా, కొంత వెచ్చగా ఆహ్లాదకరంగా ఉంది. ఆ సమయం లోనే "ఏమయ్యా మార్కెటుకు పోయి కూరగాయలు తెచ్చేదుందా లేదా, నాకేందిమల్ల నీకే బడికి లేట్ అయితది" అంటూనే నా సహచరి వనమాల ప్లాస్టిక్ బుట్ట నా చేతికిచ్చింది. వారంలో కనీసం రెండుసార్లైనా నాకిది తప్పనిసరి డ్యూటీ. సైకిల్ తియ్యాల్నా, స్కూటర్ తియ్యాల్నా అని అనుకుంటూ బయటికి నడిచా. మా ఇంటి కాంపౌండ్ నుండి అటు రోడ్డు దాకా ఓసారి తొంగి చూస్తే ఏమున్నది... అసలే గతుకుల సందు కాస్త రాత్రి వానకు రాళ్ళు ఇటుకలు తేలి, రా చూద్దాం... ! ఎట్లా దాటుతావో మమ్ము అంటూ సవాల్ చేస్తున్నాయి. సైకిల్ తీసి ఎత్తి పట్టుకుంటూ ఎట్లాగో రోడ్డెక్కాను.

మార్కెట్ నుండి తిరిగొచ్చి బరువైన కూరలబుట్టను మా వనాన్ని పిలిచి అందించాను. "ఏమయ్యా ఇంతకీ పూలు తెస్తివా లేదా, ఇయ్యాల క్రిష్ణుని బొమ్మకు దండెయ్యాలె కదా" "తెచ్చిన లేవమ్మా" అంటూ పూల ప్యాకెట్టును పట్టుకొని ముందటి గదిలోకి వచ్చాను. షో కేసులోని మురళీధరుని ప్రతిమను చూస్తూ... ఆ సుందరమూర్తి కేవలం మట్టిబొమ్మ మాత్రమే కాదు... నాకూ మా వనానికీ, మా పిల్లలకు కూడా అది ఓ చిన్నారి చెమటతో రంగు లద్ది తీర్చిన కళాప్రతిమ. గుండె బరువెక్కుతుంటే రెండు నెలల క్రితం మా వీధిలోనే జరిగిన ఆ... సంఘటన యాదికొస్తున్నది.

ఆరోజు ఆదివారం, ఎండలు మండిపడుతున్నాయి... మిట్టమధ్యాహ్నం ఓ పన్నెండేళ్ల పిల్లవాడు తోపుడు బండినిండా రకరకాల మట్టిబొమ్మల్ని పెట్టుకుని మా ఎగుడుదిగుడు సందులోకి కసరత్తు చేస్తూ వీరుడిలా వచ్చిపడ్డాడు. "బొమ్మలు, బొమ్మలు.. రంగురంగుల బొమ్మలు... ఒక్కటి పది రూపాయలే" అంటూ వీధివీధందరికీ వినపడాలని అరుస్తున్నాడు కొనమని పిలుస్తున్నాడు.

వాడిగొంతులో లేతదనం, అసహనం.. మరి కొద్దిసేపట్లో బెల్లంచుట్టూ ఈగలు ముసిరినట్లుగా మా వీధి జనం. ఏదొచ్చినా అంతే. పద్మవ్యూహంలోకి దూరినట్లు అమ్మకందార్లు ధూరిపోగానే మా వీధి సైనికులు చుట్టుముట్టి వాళ్ళ భరతంపట్టడం జరుగుతుంది.

బొమ్మల బండిచుట్టూ సందడి మొదలయ్యింది. భీకరపోరాటం మొదలవుతున్నది.. అరుపులు, బేరాలు, చేతివాటాలు. నేనూ మా చిన్నోడు నరేశ్, బేబి రాణి, మా వనం అందరం బయటికొచ్చాం. మా వనం పిల్లలూ బండి దగ్గరికిపోగా నేను కాంపౌండ్ గోడ మీది నుండి ఆ భీభత్స దృశ్యాన్ని చూస్తున్నాను. మా నరేశ్, బేబి కూడబలుక్కున్నట్లుగా రెండు ఏనుగుల బొమ్మల్ని తెచ్చి "డాడీ గీ ఏనుగులు కావాలె డాడీ.. మన షోకేసుల పెడుదాం" అని నా వెంట పడ్తున్నారు. మా వనం మాత్రం ఆ వ్యూహాన్ని చేదించి ఓ కృష్ణుని బొమ్మను అపు రూపంగా చేజిక్కించుకునొచ్చి "దీనికి పది రూపాయలేనట, బొమ్మ చక్కగ పెద్దగ ఉన్నది గిదే తీసుకుందాం" అన్నది నన్ను, పిల్లల్ని ఉద్దేశించి. "ఏనుగులెందుకురా, ఇంకా నయం కోతి బొమ్మల్ని కావాల్సన లేదు". అవి ఇంట్ల మంచివి కావట పక్కింటి వదినె చెప్పింది" అని నన్ను మళ్ళీ "ఏమయ్యా పదిరూపాలియ్యి" అని ఆర్డరేసింది. ఆమె దగ్గర పదిరూపాయలు లేక కాదు. తను లోపలికెల్లి ఖజానా కెల్లగించి తేవాలని అందుబాటులో ఉన్న నాకా పని అప్పగించింది. పిల్లలు లొల్లి, మాకు ఏనుగులే కావాలని, "మట్టి బొమ్మలెందుకురా, మీరు కోతి చేష్టలుచేసి వాటిని పగులగొడ్తరు ఇప్పటికిది చాలులెండి. మల్లోకసారికి చూద్దాం" అని తేల్చేసినాను. వాళ్ళకు తెలుసు తల్లితండ్రీ ఏదైనా వద్దంటే ఇక అంతే సంగతులని.. సణుగుడు రాగాలు తీసుకుంటూ మళ్ళీ బండిదగ్గరికి పోయారు.



మా వీధిలో టెర్రర్ మ్యాన్ సోమయ్య అరుపులు వినిపించి షోకేసులో బొమ్మను అమరుస్తున్న నేను మళ్ళీ బయటకొచ్చాను. "ఏయ్ పిల్లగా ఏందిరో లావు మాట్లాడుతున్నవ్ పచ్చి బొమ్మలకు రంగేసి తెచ్చినవ్, ఇచ్చుకపోయింది, ఇంకోటియ్యమంటే నేనే పగులగొట్టి ఇంకోటి అడుగుతున్ననంటావురా, నీ చాలాకీ నా దగ్గర సాగదు బిడ్డా... నా పైసలియ్యి లేకుంటే ఇంకో బొమ్మియ్యి" అని ఆ పిల్లాడి మీదికి పోతున్నాడు. నాకూ సోమయ్యకు ఒక దగ్గర లొల్లైె మాటల్లేవు, అందుకే ఏమీ పలకరించకుండా చోద్యం చూస్తున్నాను. లోలోన చిన్నపిల్లోడని చూడకుండా ఏమారుస్తున్నందుకు రక్తం సలసల మంటున్నా, నిస్సహాయంగా ఒళ్ళు దగ్గర బెట్టుకుని...

అక్కడున్న జనాలెవరూ పిల్లోన్ని సపోర్టు చేయడం లేదు, పైగా సందుట్ల సడేమియా అన్నట్లు తమ తస్కర క్రీడను కొనసాగిస్తున్నారు. పిల్లగాడు శక్తిమేరకు వాదించి, ఏడుపు మొఖంతో సోమయ్యకు కొత్త బొమ్మనిచ్చి, పైసలుతక్కువొచ్చినా, మాయమయిన బొమ్మల గురించి లోలోన ఏడుస్తూ, ఆకలి నీరసాలతో ఆ ఎండపూట నల్లగా మాడిన పూవులా బండి

నీడ్చుకుంటూపోయాడు. "అయ్యో బిడ్డా పోయిపోయి ఈ వాడకొచ్చి నష్టపోతివి కదరా.... కనీసం పిల్లగాడన్న దయకూడా లేకుండా నిన్ను దోచుకున్నరే పీతిరిగద్దలని" మనసులో మదనపడుతూ నా కడుపాకలి గుర్తొచ్చి ఇంట్లోకి పోయినా రోజు.

"ఇవి పచ్చియి కావుసార్, వారంరోజులు కష్టపడి తయారు చేసినం సార్, రంగులు నేనే పూసిన సార్ "పైసలియ్యండి సార్" దీనంగా వేడుకుంటున్న స్వరాలు. చెవుల్లో ప్రతిధ్వని స్తుంటే "ఏమయ్యా పూలు మాలకట్టకుండ అట్ల బొమ్మతీర్గ నిల్సున్నవేంది, ఏడికిబోయింది నీ మనసు ?" అని మా వనం నన్నీలోకం లోకి తీసుకొచ్చింది, "డాడీ నిల్సునే కలలు గంటాండు" అని నరేశ్‌గాడు నవ్వుతున్నాడు.

పూలదండను తన పని తీరితే మా వనం కడ్తుంది లేకపోతే నేనే కడ్తాను. ఆ పని నాకు చేతకాదా అని, ప్రతిమకు దండేసి నేను బడికెళ్ళిపోయాను. ప్రతివారం మంగళవారం రోజున దండేస్తున్నాం.



సాయంత్రం ఇంటికొచ్చేసరికి పల్చటి అగరొత్తుల వాసన కృష్ణుని ప్రతిమ ముందు అగరొత్తులు, మెడలో పూలదండతో అందంగా, నిశ్చింతగా కన్నయ్య.

నేను వాలుకుర్చీలో జారగిలబడి చాయ్ తాగుతూ మళ్ళా నా లోకంలోకి పోయాను. నాకు బొమ్మల పిల్లగాడే కండ్లముందు ఆడుతున్నడు, పేరేమిటో తెలియదు.

సుమారు నెలన్నర రోజుల క్రితం రాత్రి ఏడుగంటలప్పుడు నేను పిల్లల పరీక్ష పేపర్లు దిద్దుతుంటే... నరేశ్‌గాడు బాల్ నేలకేసికొట్టి అందుకుంటూ ఆడుకుంటూ ఇంట్లోకి వస్తు న్నాడు. "నరేశ్ ఎక్కడికిబోయినవ్.. రాత్రయ్యింది, ఎక్కడ తిరుగుతున్నావ్" అన్నాను. వనం ఇంతకు ముందే వాడింటికింకా రాలేదని నాకు అంటించి ఉంది.

"ఎక్కడికి పోలేదు డాడీ... మామయ్యోల్లు కడ్తున్న కొత్తింటికాడికి బొయినా, రాజు బావతోటే గింతసేపున్న, ఆఁ డాడీ పాపం...గా బొమ్మల పిల్లగాడు లేడా డాడీ, మనం కృష్ణుని బొమ్మ కొన్నం చూడు గా పిల్లగాడు" అని వాడు కొంచెం చిన్నబోయిన మొఖంతో కాసేపాగాడు. "ఆఁ ఏందిరా బొమ్మల పిల్లగాడు ఎదురయ్యిండా ఏంది నీకు". "అయ్యో కాదు డాడీ ఆ పిల్లగాడు జరమొచ్చి చచ్చిపోయిండంట, రాజు బావ చెప్పిండు. పదిరోజుల కింద ఆ పిల్లగాని తల్లి తండ్రీ అక్కా వాడూ అందరూ మామయ్య ఇల్లు పనికి తట్టలు మోసేందుకు వచ్చిండ్లట, మూడు రోజుల కింద జరమొచ్చి ఆ పిల్లగాడు సర్కారు దవాఖాన్ల ఒక్కరోజుల్నే చచ్చిపోయిండంట.. పాపం కదా డాడీ" అని నా కొడుకు చెప్పగానే ఒక్కసారిగా నేను కృంగిపోయాను. కొద్ది క్షణాల తరువాత వనాన్ని కేకేసి దుర్వార్త చెప్పాను. ఆమె నేనూ ఇద్దరం విచారంతో మూగబోయినాము.

అందుకే, ఆ చిన్నారి స్మృతి చిహ్నంగా మేమీ కృష్ణుడి ప్రతిమను అపురూపంగా, భక్తిగా చూసుకునేది. పిల్లలిద్దరూ మా ప్రవర్తన అర్థంగాక పట్టనట్టు ఉంటారని, వాళ్ళకు నేనూ వనం కలిసి మన దేశంలోని అసంఖ్యాకపు పేద, అనాథ బాలల దుస్థితి గురించి చెప్పాం. నేను పదేపదే సమయం దొరికినప్పుడల్లా మా బడిలో పిల్లలకీ, ఇంట్లో పిల్లలకీ అభాగ్యులైన బాల కార్మికుల గురించి, వాళ్ళపట్ల మనం కనీస పద్ధతిగా మెలగాల్సిన తీరు, సాటి పిల్లలుగా ప్రేమించాల్సిన తీరు బోధిస్తూనే ఉంటాను. కానీ వనానిది జాలి, దయలతో నిండిన హృదయం కాబట్టి సరిపోయింది. మరి పిల్లలకు సమాజం హెచ్చు తగ్గులు చెప్పాల్సిందేనని, మనుషుల్ని తరతమ భేదాలు లేకుండా ప్రేమించడం, గౌరవించడం గురించి చెప్తుంటాను. అందుకే ఇప్పుడు మా పిల్లలకూ ఆ ప్రతిమంటే ప్రాణం. నిజానికి మా కందరికీ ఆ ప్రతిమలో నిండుగాఉన్న బొమ్మల బండిని తోసుకుంటూ "బొమ్మలు, బొమ్మలు..." అని పిలుస్తూ వచ్చే ఆ చిన్నారి మొఖమే కనిపిస్తుంది.

లక్షలాది మంది చిన్నారుల బాల్యం నిత్యం ముక్కలవుతుంటే ఏమీ చేతగాక ముడుచుకుని కూర్చున్న బుద్ధిమంతులు, నాలాంటి వాళ్ళెందరో. "చిన్నా... ఇప్పుడా అద్దం ఎందుకు జరుపుతున్నావురా బొమ్మకు తాకితే కిందపడి పగుల్తది, అది మట్టిబొమ్మరా" అని మా వనం కేకేస్తున్నది. నేను ఉలిక్కిపడి యదార్థ లోకంలోకి వచ్చాను, కండ్లు జారుస్తున్న బాధాతప్తధారలను తుడుచుకుని "చిన్నా నీ కెన్నిసార్లు చెప్పినా ఇంతేనా, ఆ బొమ్మ దగ్గరికి పోవద్దని చెప్పలేదా, అది పగిలితే మనందరి గుండెలు కూడా పగుల్తయిరా" అన్నాను.

"కాదు డాడీ నేనూ అక్కా మా ఫ్రెండ్ ఇంట్ల పూలతోటకెల్లి లిల్లీపూలు తెచ్చి పక్కింటి అత్తమ్మతోటి దండ కట్టిస్తున్నం డాడీ, గదా బొమ్మకెద్దామని అద్దం జరుపుతున్న, అక్క అత్తమ్మ ఇంట్లకెల్లి దండ తెస్తాంది" అని నేనూ తల్లీ తనని అర్థం చేసుకోనందుకు కొంచెం భంగపడినట్లు వివరణ ఇచ్చాడు. ఇంతలో నా కూతురు దండతీసుకుని తనవెంట పక్కింటి పిల్లలు నలుగురైదుగురు రాగా ఇంట్లోకి వచ్చింది. పిల్లలు నిశ్శబ్దంగా నిలబడి ఆ మూర్తికి దండవేసి నమస్కరిస్తున్నారు. నా హృదయంలో అట్లాంటి మట్టిబొమ్మలు ఎన్నో ముక్కలై నేలపాలవుతున్నాయి.

ఇప్పుడా పిల్లలు చేస్తున్న పనిని చూస్తే కొంచెమైనా సంతోషం కలగాలి కానీ అంతులేని దుఃఖం, ఏడుపు తన్నుకొస్తున్నది. నేను అది పిల్లల కంటబడకుండా గదిలోకి దూరిపోగా మా వనం కన్నీళ్ళు తుడుచుకుంటూ ఇంటి వెనుకకు వెళ్ళిపోయింది.

మాకా మట్టిబొమ్మంటే ఎందుకంత శ్రద్ధో మీకు అర్థమయి ఉంటుంది. మాకున్నది భక్తో, ప్రేమో మీరే తేల్చుకోవాలి, దీంతోపాటే ఛిద్రమవుతున్న బాల్యాన్ని చూసీచూడనట్లు ఉండటమా.... లేక పట్టించుకోవడమా ? అదీ తేల్చుకోవాలి మనం ! ❑



మండువ వెంకట ప్రసన్న,
ఇ.నెం. 6-8-30,
రాగన్నదర్వాజ,
హన్మకొండ - 506 011

# ప్రణయ మందిరం

"సరోజ !"

"ఏమండీ !"

"నేను ఆఫీసుకు వెళుతున్నాను".

"మంచిది త్వరగా రండి, ఉదయం చెప్పిన విషయం మరచిపోకండీ" అంటూ చీర చింగులుపైకి చెక్కి వంట ఇంటిలో నుండి వచ్చింది సరోజ.

"ఏమిటా విషయం ?" అన్నాడు రమేశ్.

"ఎప్పుడూ నా నోటితోనే పలికిస్తారు. కాని మీరెప్పుడూ, ఎక్కడా బైటపడరు గదా ?"

వెనుదిరిగి మెట్లు ఎక్కిన రమేశ్ "అలా కాదు, ఇలా ఉండాలి" అంటూ పైకి చెక్కిన చీర చింగులను క్రిందకు గట్టిగా లాగాడు. "ఛీ ! పసిపిల్లాడిలా చేయకండి, వూడిపోతుంది చీర" అంది.

"పోతె పోయింది ".

"పాపం ఎంత ఆశండీ !"

"ఆశ కాదు మరీ. అది సరేకాని అసలు విషయం ఏమిటో చెప్పు" అంటూ రెండు చేతులు నడుం చుట్టూ పెనవేశాడు.

"చెప్పేది ఏమీ లేదు, సాయంత్రం ఆఫీసు నుండి త్వరగారండి, అర్థం కాలేదా ? ఇంకా చెప్పాలా ? ఎందుకో ?"

"ఎందుకో త్వరగా రావటం ?"

"జ్ఞాపకం లేదా తెల్లవారుగట్లో మీరు ఏమి అడిగారో ?"

"అవును నిద్రరావటం లేదు, ఏమి చెయ్యాలో" అన్నాను.

"ఆహాఁ ! అదికాదు సాయంత్రం ఏదో ప్రోగ్రామ్ వుందని..."

"ఓ స్వీట్ రోజా, నా సరోజా తప్పకుండా రాత్రికి వస్తాను".

"మంచిది రాత్రికే రండీ, అంతా తెలిసే మాట్లాడుతారు".

"అవును దొరసాని సన్నిధిలో అలాగే మాట్లాడాలి, అప్పుడే..."

"నేనేఁ దొరసాన్ని కాను, కేవలం ఒక ఆఫీసరుః భార్యను మాత్రమే"

"సరేగాని టైంఐంది, వెలుతున్నాను".

"జ్ఞాపకంతో తెస్తారుగా నేను అడిగినవి ?"

"ఓహో ! లేత గులాబి బాలకు మల్లెలు కావాలా ? తెస్తాను, లేకపోతే ప్రణయ మందిరంలో రాత్రికి గెలుపు తమదే కదూ ?" అంటూ బుగ్గమీద చిటికె వేశాడు.

"పోండీ ! మీరు రోజు రోజుకు చిలిపి వారైపోతున్నారు. సమయాసమయాలను చూడక పసిపిల్లవాడై పోతున్నారు".

"మన మధ్య మూడో ప్రాణి లేనన్ని రోజులు నేనే నీ పాపను, కనుపాపల్లో కాపురం వుంటాను".

"అయ్యయ్యో మీరు ఆఫీసుకు ఇక వెళ్ళరా ? టైం అయిపోతుంది".

"అయితే అయింది, ఈరోజు సెలవు పెడతాను. నా ప్రణయసుందరి సేవలో రోజంతా గడుపుతాను".

"రేపు మీపై ఆఫీసరు పిలిచి సెలవు ఎందుకు పెట్టారని అడిగితే జవాబు ఏమిస్తారు".

"మహాశయా ! నిన్న నా భార్య సరోజారాణి అలిగి కూర్చుంది. ఆ బాలామణిని అలక పాన్పు నుండి నా పాన్పుకు తీసుకరావడానికి..."

"ఛీ ! మరి ఇంత ఇదిగా మాట్లాడుతారు".

"ఆఁ ! సరేగాని ఒక్క మల్లెలేనా ? ఇంకా ఏమైనా ?"

"ఏమీ వద్దు, మల్లెపూలు, మీరు తప్ప".

"ఓ.కే." అంటూ దూరం నుండే ముద్దుపెట్టుకున్నట్టు బుగ్గలపై చిటికవేసి బయట పడ్డాడు రమేశ్.

భర్తతో కొత్తగా కాపురానికి వచ్చిన సరోజకు భాగ్యనగర్ చాలా అందమైన పట్టణంలా కనిపించింది. పట్టణ ప్రభావానికి, పరిస్థితులకు అనువుగా మారిపోయింది. సరోజ పెద్ద చదువులు చదవకపోయినా గృహిణీకి కావలసిన విషయాలు స్వయంగా చూసుకునే సత్తువ, భర్తకు ఇచ్చిపుచ్చుకోవాల్సిన అనురాగం, ఆప్యాయత, ప్రేమ, సామర్ధ్యం గలది. భర్త అభిరుచులకు అంకితమైన దాంపత్య జీవితాన్ని అనుభవిస్తున్న నవయువతి.

ఎదురుచూడటంలో కూడా ఆనందం వుంది, తృప్తి వుంది. సాయంకాలం ఎప్పుడవుతుందా అని సరోజ వేయి కన్నులతో చూడసాగింది. రమేశ్ కొరకు చూసి చూసి అలసిపోయింది. అలసిన మనసుకు ఆహ్లాదం కొరకు కాచుకొని వుంది.

సాయంత్రం 5 గంటలైంది రమేశ్ రావడమే కాలింగ్‌బెల్ నొక్కాడు. "వస్తున్నాను" అని లోపలి నుండి వినబడింది. ఐనా అర్జంటు అన్నట్టు మళ్ళీ నొక్కాడు. "వస్తున్నానండీ ! ఒక్క నిమిషం" అంది ప్రక్కగా వున్న కిటికీ నుండి చూస్తూ.

సరోజ ఎందుకు రావడంలేదో రమేశ్ గ్రహించుకున్నాడు, మళ్ళీ బెల్ నొక్కాడు. ఇక

లాభం లేదనుకొని రమేశ్ ఆంతర్యం తెలిసిన సరోజ త్వరత్వరగా శరీరాన్ని అర్ధనగ్నం చేసి తలుపు తీసి లోనికి పోయింది.

బజారు నుండి తెచ్చిన మల్లెలు టేబులుపైపెట్టి సరోజను వెతుక్కుంటూ పడకగదిలోకి పోయాడు రమేశ్. గదిలోకి వచ్చిన రమేశ్‌ను చూడకనే అద్దం ముందు నిలుచుని చీర, జాకెట్టు కట్టుకుంటోంది సరోజ.

భార్య అర్ధనగ్న సౌందర్యాన్ని చూసి పులకించిపోయాడు రమేశ్. ఏదో ఒక కొత్తదనాన్ని అనుభవించాడు. విరిసీ విరియని మొగ్గల్లోనే అందం వుంది అనుకున్నాడు. అలాగే అచేతనంగా నిలుచుండిపోయాడు.

రమేశ్ వాలకం కనిపెట్టిన సరోజ, "మీ డ్రెస్ విడువండీ, ముఖం కడుక్కొని ఫలహారం చేద్దురుగాని" అంది. ఈలోగా రమేశ్ తెచ్చిన మల్లెలు కురులలో పెట్టుకొంది. ఎర్రచీర, ఎర్ర జాకెట్టు, పసినిమ్మపండు శరీరచ్ఛాయ అప్సరసలా తయారైంది సరోజ.

ఫలహారం పూర్తిచేసిన రమేశ్ సరోజను పిలిచాడు ఏదో పనివున్నవాడిలాగ. సరోజ గదిలోకి ప్రవేశించింది.

"సరోజా ! ఎంత అందంగా వున్నావ్, ప్రకృతిలాంటి తోటలో పవిత్రమైన పువ్వులా వున్నావ్. నిన్ను, నీ అందాన్ని చూస్తుంటే జీవితమంతా ఇలాగే నీ ముందు కూర్చోవాలని పిస్తున్నది. ఏదో నిగూఢ శక్తి నా నరాల్లో జివ్వుమంటున్నది."

"ఏదోలెండి, కనీసం ఇప్పుడైనా మెచ్చుకున్నారు నా అందాన్ని".

"ఓహో దొరసానిగారికి కోపం వచ్చిందేమిటి ?"

"ఏ కోపం లేదంతే !" అంది చిలిపిగా నవ్వుతూ.

ఆ నవ్వు రమేశ్‌ను రెచ్చగొట్టింది. అందమైనదాన్ని చూసి సంతోషపడి తృప్తి చెందలేని మానవుడు దాని అందాలను నలిపి, అసలు రూపును మార్చి సంతోషిస్తున్నాడు. సంతృప్తి పడుతున్నాడు. ప్రకృతిలో కనిపించే పెద్ద లోపమే సృష్టిలో శాశ్వతస్థానం ఆక్రమించుకుంది.

"నాకు తెలుసు, నా సరోజకు కోపం రాదని" అంటూ రమేశ్ తన రెండు చేతులను సరోజ నడుం చుట్టూ పెనవేసి గట్టిగా కౌగలించుకొని, పెదాలను, బుగ్గలను చుంబించాడు. ఆ మధుర సమయంలో మాటలు రాలేదు, సైగలే సామ్రాజ్యాన్ని పాలించాయి. పూర్తిగా వంగిన సరోజను తనవైపు లాగుకొని "ఇలాంటి సౌఖ్యం ఎంత మందికి దొరుకుతుందంటావు సరోజా" అన్నాడు. మత్తులో తేలిపోయే శరీరంతో, సలసలకాగే వేడి, వాడి కోర్కెలతో ఏమీ మాట్లాడలేక కౌగిల్లో వొదిగిపోయింది సరోజ.

ప్రణయ మందిరంలో గణ గణ గంటలు మ్రోగినవి. కల చెదిరిపోయింది. కాలం పరుగెత్తింది. తెల్లవారింది. ఎక్కవలసిన రైలుబండి తప్పిపోయింది. ❑



**రేగులపాటి కిషన్‌రావు,**

గ్రా॥ చింతలఠాణా,

సిరిసిల్ల, జి॥ కరీంనగరం - 505 405

# మూగబోయిన ప్రేమ

"సుందరీ ! నువ్వు నింగిలో కనిపించే చందమామలా వున్నావు. వెన్నెల వలె వున్నావు. వెలుగును అందించే సుందర దేవతలా వున్నావు".

"కవీ ! నన్ను చందమామతో పోల్చుతావెందుకు ? వాడు తరుగుతాడు, పెరుగుతాడు, పైగా ఆకాశంలో అందకుండా తిరుగుతాడు".

"అయితే నువ్వు చక్కనిచుక్కలా వున్నావు అంటాను, నువ్వే చుక్కలరాణివి అంటాను".

"చుక్కలు దూరంగా ఉంటాయి. ఎప్పుడూ చేతికి చిక్కకుండా ఉంటాయి. అయినా నేను నీకు దగ్గరకావాలని తపిస్తూ ఉంటే నువ్వు నన్ను చుక్కతో పోల్చడం ఏమైనా బాగుందా కవీశ్వరా !"

"మహిళామణీ ! నీ కళ్ళల్లో వెన్నెల వుంది. అది నాకు నచ్చింది. నీ మనస్సులో మమ కారం ఉంది. అది మరింత నచ్చింది. నీ వ్యక్తిత్వం ఎంతో ఎంతో నచ్చింది".

సుందరి నవ్వింది, సుందరంగా సుకుమారంగా.

"సుకుమారీ ! నీ నవ్వు ఎంతోఅందంగా ఉంది. దేవతలుకూడా నీలాగా నవ్వలేరేమో ! నవ్వితే నీలాగే నవ్వాలి. నువ్వు నవ్వితే నీ మోములో మెరుపులు ఉదయిస్తున్నాయి. నీ మనస్సులోని ప్రేమాభిమానాలు నీ మాటల ప్రవాహంలో పరుగెత్తి వస్తున్నాయి".

"కవివర్యా ! నీ మాటలు ఆపకు, నువ్వు చెప్పే కబుర్లు తనివితీరా వినాలనే ఈ తోట లోకి వచ్చాను. కాదు కాదు నీ మనస్సులో ప్రవేశించాలని వచ్చాను".

"గాయనీమణీ ! నేను నీ సుందర మనోమందిరంలో ప్రవేశించి నివసించడానికి వచ్చాను".

"కవిరాజా ! ఎంత అందంగా మాట్లాడుతావు నువ్వు. అందుకే నేనో సిరా చుక్కనై నీ కలంలో ప్రవేశించి కవితలా ఉదయించాలని వుంది".

"నాట్య మయూరీ ! నువ్వు గంధర్వ కన్యలా పాడుతూ దేవకన్యలా నాట్యమాడుతూ వుంటే చూడాలని తపనపడి వచ్చాను. నా కోరిక మన్నించు, నీ కళలను ప్రదర్శించు".

"కవీశ్వరా ! నా గానం నీ కవితను మెప్పించగలిగితే నా నాట్యం నీ మనసును ఒప్పించగలిగితే... అంతకంటే ఆనందం నాకేముంటుంది".

సుందరి పాటపాడుతూ నాట్యం చేయసాగింది. మయూరాలు, మరాళాలు ఆమె నాట్యం చూడవచ్చెను. ఆమె గానమునాలకించగ శుక, పికాదులు చేరవచ్చెను. నవయువ కవి రవిబాబు ఆమె నాట్యచాతుర్యాన్ని తిలకిస్తూ, గాన మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు. ఆ సమయములో తోటలోకి వచ్చిన పనిమనిషి పాపమ్మ గులాబీ చెట్టు వద్ద నిలబడి అంది "అమ్మాయిగారూ ! దొరగారు మిమ్మల్ని రమ్మన్నారు". దొరగారంటే యం.పి. రాజేంద్రవర్మ, సుందరి తండ్రి. సుందరి అతనికి ఒక్కగానొక్క కూతురు.



సుందరి మేడమీదికి వచ్చి సోఫాలో కూర్చుండి లా బుక్స్ తిరగవేయసాగింది. ఇంతలో రాజేంద్రవర్మ కూతురు దగ్గరకు వచ్చి "ఎక్కడకు వెళ్లావమ్మా ?"అన్నాడు.

"తోటలోకి"

"ఇక్కడే కూర్చుండి చదువుకోవచ్చుకదమ్మా"

"చదువుకోవడానికి కాదు నాన్నగారు. రవిబాబును తోటలోకి రమ్మంటే వచ్చాడు. అయన రాసిన పాట ఆయనకు పాడి వినిపిద్దామని వెళ్లాను".

రాజేంద్రవర్మ కొంచెంసేపు మౌనం వహించి తర్వాత మెత్తని స్వరంతో అన్నాడు "మాధవ వర్మతో నీ పెళ్లి నిశ్చయం చేశానమ్మా".

"మాధవ వర్మ ఎవరు ?" సుందరి తన ముఖములో ఏ భావమూ కనబడకుండా జాగ్రత్తపడుతూ అంది.

"తెలియనట్లు మాట్లాడకమ్మా".

"మన బంధు వర్గంలోనే ఎంతో మంది మాధవ వర్మలు ఉన్నారు కదా నాన్నా !"

"ఉండవచ్చు కాని మినిష్టర్ మహేంద్రవర్మగారి కుమారునివలె తెలివి కలవాడు, రాజకీయాల్లో గొప్ప స్థాయికి ఎదిగే లక్షణాలు ఉన్నవాడు ప్రస్తుత మన సమాజంలో ఎవరూ లేరని నా అభిప్రాయం. ఈ మాధవ వర్మ పట్టుదల, కార్యదీక్ష, సమయోచిత ప్రజ్ఞ ఉన్నవాడు. మన ఇంటికి ఈమధ్య చాలాసార్లు వస్తున్నవాడు, నీకు బాగా తెలిసినవాడు".

"నా అభిప్రాయం అడక్కుండానే నా పెళ్లి నిశ్చయం చేశారా నాన్నగారూ !"

"నీ అభిప్రాయం నాకు తెలిసి పోయిందమ్మా, అందుకే నీ క్షేమం కోరి యోగ్యుడైన మాధవ వర్మతో నీ పెళ్లి నిశ్చయం చేశాను".

"జర్నలిస్టు జయశంకర్ గారి కుమారుడు రవిబాబును నేను ప్రేమించానని, ఈ విషయం మీకు చెప్పమని అమ్మతో చెప్పాను. అమ్మ మీకు చెప్పలేదా ?" సుందరి తల్లి వైపు చూసింది. ఆమె నవల చదువుకుంటూ మౌనంగానే ఉండిపోయింది.

"చెప్పింది, రవిబాబు నాకు తెలుసు. అతడు లలిత గేయకవి అనీ తెలుసు. అతని గీతాలు రేడియోలో ప్రసారం అయ్యాయనీ తెలుసు. పత్రికల్లో అతని కథలు, నవలలు వస్తున్నాయనీ తెలుసు. ఈ మధ్య కాలంలో విప్లవ గీతాలు రాస్తూ పాలక వర్గాలను విమర్శిస్తూ కథలు, నవలలు రాస్తూ, పెద్ద సంచలనం సృష్టిస్తున్నాడనీ తెలుసు, వాళ్ళ నాన్న అదే జర్నలిస్టు జయశంకర్ మా పార్టీని విమర్శించినవాడు. మా పాలనా విధానాలను విమర్శించినవాడు, నక్సలైట్లను ఎన్నెన్నో సందర్భాలలో సమర్ధించినవాడు..."

"చివరికి హత్య చేయబడ్డాడు కదా నాన్నా".

"కాదు ఆత్మహత్య చేసుకున్నాడు"

"అబద్ధం".

"సరే అలాగే అనుకో అది నీ ఇష్టం. మాధవ వర్మకు ఫోన్ చేసి రమ్మన్నాను. అతడు ఇప్పుడే వస్తానన్నాడు" అని చెప్పి రాజేంద్రవర్మ ముందున్న వరండాలోకి వచ్చాడు. అతని దృష్టి గేటువైపు వేళ్లేసరికి కారుదిగుతూ మాధవ వర్మ కనిపించాడు.

"రా బాబూ !" అని ఆప్యాయంగా ఆహ్వానించాడు రాజేంద్రవర్మ. దిగి వచ్చిన తర్వాత రాజేంద్రవర్మ, మాధవ వర్మ ఒకరితర్వాత ఒకరు సుందరి గదిలోకి వచ్చారు. ఆ ముగ్గురి మధ్య చాలా విషయాలు చర్చలోకి వచ్చాయి. చివరికి మాధవ వర్మ చిరునవ్వులు చింది స్తూనే సుందరితో వెళ్తానని చెప్పి, వెళ్ళబోతూ రాజేంద్రవర్మతో అన్నాడు "అంకుల్ ! పెళ్లి విషయంలో నేను సుందరినే సమర్థిస్తున్నాను, మీరుకూడా ఆమె కోరికను మన్నించండి. ఇష్టపడిన వ్యక్తితో పెళ్లి చేయడం న్యాయం".

రాజేంద్రవర్మ మాధవ వర్మ ముఖములోకి చూశాడు. అతని ముఖంలో కనిపించని భావాన్ని పసిగట్టి "సరే అలాగే" అన్నాడు.



"అప్పుడే వచ్చిన మహేంద్రవర్మ అన్నాడు "సుందరీ ! నీకొక విషాద విషయం చెప్ప వలసి వచ్చినందుకు చింతిస్తున్నానమ్మా".

"విషాద విషయమా !... అదేమిటో వివరంగా చెప్పండి అంకుల్".

"నేను నీ శ్రేయస్సును కాంక్షించేవాడినే కదమ్మా ! అందుకే రవిబాబు జాతకం, నీ జాతకం మనరాష్ట్రంలో జాతకచక్రవర్తిగా పేరుపొందిన జయానందశర్మగారికి చూపించాను. రవిబాబుకు ఈ నెల రోజుల్లోనే రెండు గండాలున్నాయన్నాడు. మొదటి గండములో బ్రతికి బయటపడ్డా రెండవ గండములో బ్రతకడం అసాధ్యమన్నాడు.

సుందరి మహేంద్రవర్మ ముఖములోకి సూటిగా చూస్తూ అంది "గండాల నుండి రవి బాబును రక్షించుకునే శక్తి నాకు లేదంటారా అంకుల్".

"ఏమోనమ్మా, అది కాలమే నిర్ణయించాలి. నువ్వు సౌభాగ్యవతిగా, నిండుగా నూరేళ్ళు సుఖసంతోషాలతో జీవించాలని మాత్రం నేను హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను".

"అంకుల్ ఇప్పుడు మీకు హృదయపూర్వకముగా థాంక్స్ చెప్తున్నాను".



ఆ తోటలో మామిడి చెట్టు క్రింద ఎదురెదురుగానున్న రెండు సిమెంటు బెంచీల మీద రవిబాబు, అతని మిమిక్రీ మిత్రుడు నిరంజన్ కూర్చుండియున్నారు.

నిరంజన్ అప్పటికే వివిధరకాల పక్షులకూతలు, జంతువుల అరుపులు, వాహనాల శబ్దాలు, వివిధరంగాలలో పేరుగాంచిన ప్రముఖ వ్యక్తుల స్వరాలను అనుకరించి విని పించాడు. తర్వాత రవిబాబు మిమిక్రీ కళ గురించి అనేక విషయాలు అడిగి తెలుసుకొని నోటు రాసుకున్నాడు.

రవిబాబు ఒక మిమిక్రీ కళాకారుణ్ని కథానాయకునిగా ప్రవేశ పెట్టి కథ వ్రాయ దలచాడు. అందుకే అతడు నిరంజన్‌ను ఆ తోటలోకి పిలిపించాడు. ఇంటర్వ్యూ అయిన తర్వాత నిరంజన్ తనకేదో ప్రోగ్రామ్ ఉందని చెప్పి వెళ్ళిపోయాడు. గాలివీచినప్పుడు మామిడి కాయలు రాలి పడుతున్నాయి. ఈ రోజే పోస్టు ద్వారా వచ్చి, అతని ప్రక్కనే ఉన్న అతని కథలు, కవితలు అచ్చయిన పత్రికలు గాలికి అటూఇటూ కదులు తున్నాయి. రవి బాబు అదేమీపట్టించుకోకుండా కథకు ప్రణాళిక సిద్ధపరచుకోవడంలో నిమగ్నమయ్యాడు.

రవిబాబు తోటలో ఉన్నాడని తెలుసుకొని కొంతసేపు అతనితో కాలక్షేపం చేసి సాయం కాలము వరకు ఇంటికి చేరుకోవచ్చునని సుందరి ఆ తోటలోకి వచ్చింది. ఆమె ఈరోజు ఉదయమే ఫ్రెండు మ్యారేజీకి వెళ్తున్నానని, సాయంత్రం అయితేగాని ఇంటికి రానని, తన కోసం ఎవరూ ఎదురుచూడవద్దని ఇంట్లో తల్లికి చెప్పి వెళ్లిపోయింది. మ్యారేజి అయిందో లేదో పెళ్లికూతురు నాయనమ్మ హార్టు అటాక్‌తో కళ్యాణమండపములోనే కన్నుమూసింది. భోజనాలు చేసినవాళ్లు చేశారు. చేయనివాళ్ళు అక్కడ వెళ్లిపోయారు. సుందరి రవిబాబు వైపు వస్తూ ఉండగా అతడు కూర్చున్న సిమెంటు బెంచీ వెనుక భాగాన గుబురుగా పెరిగిన గులాబీ చెట్ల వెనుక నుండి ఒక పులి వస్తూ కనిపించింది. వెంటనే ఆమెకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. తోటమాలి గుడిసెలోకి వెళ్ళింది. అతడప్పుడు అక్కడ లేడు కాని అతడు కూరగాయలు కోసుకోవడానికి ఉపయోగించే కత్తి కనిపించింది. ఆమె ఆ కత్తి పట్టుకొని క్షణాలమీద పులి ముందుకు పరుగెత్తివచ్చి గురి చూచి కత్తి విసరింది. కత్తి పులి గొంతులోకి చొచ్చుకుపోయింది. అది అరుస్తూ నేలకొరిగింది.

రవిబాబు బెంచీమీద నిలబడి చూశాడు. పొదలకు అటువైపున పులి నేలమీద పడి ఉంది. సుందరి అతనికి మరింత దగ్గరకు వచ్చేసి అంది "ప్రమాదం తప్పింది".

"ఎవరికి ?"

"నీకే రవిబాబు".

"అలాగా ! ఈ పులి ఇక్కడికి ఎలా వచ్చినట్టు ? నువ్వు ఇక్కడికి ఎప్పుడు వచ్చినట్లు ? ఈ పులి ఇక్కడకు వస్తుందని తెలిసి నన్ను రక్షించడానికి వచ్చిన దేవతవా నువ్వు ? పులిని చంపాలనే ఆలోచన నీకెలా వచ్చింది సుందరీ ? ఎలా చంపగలిగావు ? నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇదంతా కలా ? నిజమా ? నేను నమ్మలేక పోతున్నాను, సుందరీ !" అన్నాడు గబగబా.

ఇద్దరూ ఎదురెదురుగా సిమెంటుబెంచీలమీద కూర్చున్నారు. సుందరి తను మ్యారేజికి వెళ్లినప్పటి నుండి ఇప్పటివరకు జరిగిన విషయాలు ఆసక్తికరంగా చెప్పి చివరికి అంది "మొగలిపువ్వులను పొందాలనుకునేవారు ఆ పూలచెట్ల చెంత తిరిగే విష నాగుల ఉనికిని గమనించక తప్పదు. కాటు వేయబోయే విష నాగులను చంపక తప్పదు. అహింస గొప్ప ధర్మమే అయినా హింస అనివార్యమైనప్పుడు దానిని పాటించక తప్పదు. నేనే చూడు, ఆ పులిని చంపేశాను. కొద్ది క్షణాల్లో అది నీమీదపడి నీ ప్రాణాలు తీస్తుందని గ్రహించి సమయ స్ఫూర్తితో దానివైపు కత్తి విసిరాను. గురి తప్పకుండా కత్తి దాని కంఠములో దిగడం నా అదృష్టం అనుకో...".

"చెట్టు క్రింద కూర్చుండి రాళ్లతో మామిడికాయలను గురి తప్పకుండా పడగొట్టగలిగే నీ నేర్పు ఈ రోజు నా ప్రాణాలను కాపాడగలిగిందన్నమాట. నీ 'గురి విద్యకు' నా అభి నందనలు... ఈ ప్రాంతాలలో పదిసంవత్సరాల నుండి పులులు లేవంటున్నారు కదా ! మరి ఈ పులి ఎక్కడి నుండి వచ్చినట్లు ?" సందేహంతో మూతి బిగించాడు రవిబాబు.

"నన్ను కుయుక్తులతో పొందాలనుకునేవారు, నేను నీదాన నవుతూ ఉంటే చూచి ఓర్వ లేక క్రూరబుద్ధితో క్రూరజంతువులను, నీవు ఒంటరిగా ఉండడం గమనించి వదలి ఉంటారు. ప్రమాద సమయానికి నేనే గనుక రాకపోయి ఉంటే నువ్వు... నువ్వు ఏమైపోయే వాడివో తర్వాత నేను... నేను మాత్రం ఈ లోకంలో మిగిలేదాననా..." ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"సుందరీ ! నీ కళ్లలో నీళ్ళు చూడలేకపోతున్నాను, నవ్వు సుందరీ నవ్వు".

సుందరి కన్నీళ్ళు తుడుచుకొని నవ్వింది. అప్పుడు గాలి ఒయ్యారంగా సాగిపోతూ నవ్వింది. చెట్లు ఊగిపోతూ నవ్వాయి. చెట్లమీద పూలన్నీ పరిమళిస్తూ నవ్వాయి.



"ఎంత అందంగా, ఎంత అమాయకంగా నవ్వుతావు సుందరీ ! నవ్వితే నీలాగే నవ్వాలి. నవ్వుతూ నవ్వించే వాళ్ళంటే మా అమ్మకు ఎంతో ఇష్టం".

"రవీ ! మీ అమ్మకు మన విషయం చెప్పేశావా ?"

"చెప్పాను"

"ఏమన్నారు ?"

"నిన్ను కోడలుగా పొందితే తనకన్న అదృష్టవంతురాలు ఈ లోకంలో ఎవ్వరూ ఉండ రంది. కాని అది సాధ్యమయ్యే పనేనా ?" అని అనుమానపడింది.

సుందరి ఏదో చెప్పబోయింది. అదే సమయములో పులికోసం జంతు ప్రదర్శనశాల ఉద్యోగి ఒకడు అక్కడకు వచ్చాడు.



ఆరోజు సుందరి, రవిబాబు చెరువు కట్టమీద కూర్చుండి మాట్లాడుకొంటున్నారు. అప్పుడు రవిబాబు ఫ్రెండు అక్కడకు స్కూటర్‌మీద వచ్చి చెప్పాడు.

"మీ ఇంటికి నిప్పంటు కొంది".

"మా అమ్మ..."

"మంటల్లో చిక్కుకుపోయిన మీ అమ్మను మన మిత్రుడు పరమేశం చాలా సాహసం చేసి రక్షించాడు".

"రవీ ! మీరిద్దరూ తొందరగా వెళ్లండి. నేను ఆటో తీసుకొని వస్తాను" అంది సుందరి. మిత్రులిద్దరూ స్కూటరు మీద వెళ్లిపోయారు. ఇరవై నిమిషాల తర్వాత సుందరి రవిబాబు ఇంటికి వచ్చేసింది. ఇల్లు చాలా భాగం కాలిపోయింది. మంటలను ఆర్పడానికి ప్రయత్నం చేసినవాళ్ళు తమ పని అయిపోయాక వెళ్లిపోవడానికి సిద్ధపడుతున్నారు.

సుందరిని చూడగానే కొందరు గౌరవపూర్వకంగా నమస్కరించారు. ఎవరో ఒక కుర్చీ తెచ్చివేసి కూర్చుండమన్నారు. సుందరి అక్కడ కూర్చోకుండా రవిబాబు తల్లి సావిత్రమ్మ వద్దకు వచ్చింది. ఆమెకు ఎలాంటి కాలినగాయాలు లేకపోయినా మానసికంగా చాలా కృంగిపోయినట్టు కనిపించింది. సుందరి ఆమెను ఓదార్చుతూ మాటల్లోకి దింపింది.



"సావిత్రమ్మ ఇల్లు చాలా భాగం కాలిపోయింది. ఆమె కుటుంబానికి అవసరమైన సహాయం చేసి వచ్చాను" సోఫాలో కూర్చుంటూ అన్నాడు మహేంద్రవర్మ.

"సహాయమా !..." రాజేంద్రవర్మ వివరాలు అడక్కుండానే అంతా గ్రహించానన్నట్టు నవ్వేశాడు.

"పోలేరమ్మ గుడి దగ్గరఉన్న మీ తాతగారి బంగ్లాను మీరు చెప్పినట్లుగానే సావిత్రమ్మ వాళ్లకు ఇచ్చి వచ్చాను. ఆ బంగ్లాను చూచిన తర్వాత సావిత్రమ్మ ముఖములో సంతృప్తిని గమనించాను. మీకు కృతజ్ఞతలు చెప్పమంది".

"రవిని యుక్తితో తుదముట్టించే ఏర్పాట్లు మీరు చెయ్యండి. ఎలాంటి ఏర్పాట్లు చేస్తారో, ఏ పద్ధతితో తుదముట్టిస్తారో అది మీ ఇష్టం. ఎటొచ్చీ మన ఇమేజీ మరింత పెరగాలే తప్ప తగ్గకుండా చూడండి. సుందరి విషయం మీకు తెలుసు కదా ! పట్టిన పట్టు వదలని మనిషి. రవిబాబు బ్రతికుండగా స్వర్గానికి పంపే ఏర్పాట్లు మీరు చూడండి, పిదప సుందరిని ఒప్పించి మీ కోడలుగా మీ ఇంటికి పంపించే ఏర్పాట్లు నేను చేస్తాను".

"అదే ప్రయత్నంలో ఉంటాను" అని చెప్పి మహేంద్రవర్మ వెళ్లిపోయాడు.



మహేంద్రవర్మ సావిత్రమ్మ ఇంటికి వచ్చాడు. ఆమె అతనికి నమస్కరించి కుర్చీ చూపించి కూర్చుండమంది. అతను కుర్చీలో కూర్చుండి నెమ్మదిగా ఆమెను మాటల్లోకి దింపాడు. "రవిబాబు, సుందరి ప్రేమించుకున్న విషయం అందరికీ తెలిసిపోయింది. సుందరి వివాహంచేసేసి రాజేంద్రవర్మగారు ఉత్తరదేశ యాత్రచేసి రావడానికి నిశ్చయించు కున్నారు. శుక్రవారం అర్ధరాత్రి దాటిన తర్వాత మంచి ముహూర్తం ఉంది. ఆ ముహూర్తానికే వివాహం జరిపిస్తే బాగుంటుందని అనుకొంటున్నారు. మీరు దీనికి అంగీకారం తెలిపితే తర్వాత జరగవలసిన కార్యక్రమాలు మొదలుపెట్టవచ్చునని చెప్పారు".

"రాజేంద్రవర్మగారు నా కుమారునికి తన కుమార్తెనివ్వడానికి అంగీకరిస్తున్నారంటే నమ్మలేకపోతున్నాను".

"ఇందులో నమ్మలేకపోవడాని కేముందమ్మా, రవిబాబు మీ కుమారుడై పుట్టడమే మీ అదృష్టం అనుకోండి. రచయితగా రవిబాబు ఇప్పటికే ఎన్నో బహుమతులు గెలుచు కున్నాడు కదా ! ఇంత చిన్నవయసులో ఎంత మంది ఇన్ని బహుమతులు పొందగలిగారు. రవిబాబు అదృష్టవంతుడమ్మా. అతడు బ్రతికినంతకాలం సంతోషంగా బ్రతకాలని నేను మనసారా దీవిస్తున్నానమ్మా...". సావిత్రమ్మ ఏమీ మాట్లాడకుండా మౌనంగానే ఉండి పోయింది.

మహేంద్రవర్మ మళ్లీ అన్నాడు "ఇక పెళ్లి విషయాలు చెప్తాను వినండి. రాజేంద్రవర్మ గారి వంశాచారం ప్రకారం పెళ్లిరోజు రవి అస్తమించాక వధువు లక్ష జ్యోతుల ప్రజ్వలన కార్యక్రమం చేపడుతుంది. అదే సమయంలో పురోహితుడు మంత్రాలు చదువుతుండగా వరుడు కొలనులో స్నానం చేస్తాడు. అనంతరం పూజా కార్యక్రమం పూర్తిచేసి పురోహితుని ఆశీస్సులు, తల్లిగా మీ ఆశీస్సులు పొంది పెళ్లికుమారునిగా ముస్తాబు చేసుకోవాలి..." అని చెప్పేసి తర్వాత రాజేంద్రవర్మ తన కూతురుకు ఇవ్వబోయే బంగారు నగలు, బట్టలు, వస్తువులు, వాహనాలు మొదలగు విషయాలను గురించి వినడానికి చాలా ఆసక్తికరంగా గంటకుపైగా చెప్పేసి చివరకు సావిత్రమ్మ దగ్గర సెలవు తీసుకొని వెళ్లిపోయాడు.



ఆ రోజు సూర్యుడు అస్తమించాక సుందరి లక్ష దీపాలు వెలిగించే కార్యక్రమం ప్రారంభించింది. ఎక్కడి వాళ్ళక్కడ పెళ్లిపనులు చేసుకు పోతున్నారు, మహేంద్రవర్మ కూతురు మణిమాల సుందరి వెంట ఉంటూ దీపాలు వెలిగించడంలో సహకరిస్తూ ఉంది. ఎంతో జాగ్రత్తగా దీపాలు వెలిగిస్తున్నప్పటికీ సుందరి చీరెకు నిప్పంటుకుంది.

మణిమాల "సుందూ ! నీ చీరెకు నిప్పంటుకొంది, ఆగు ! నేను తీసేస్తాను" అని ఆమె ఒంటి మీది చీరె బరబరా లాగేసింది. ఆ లాగడంలో ఆ చీరే ఓ దివ్వెమీద పడడంతో మంటలు చెలరేగాయి. అక్కడ పనిచేస్తూ తిరుగుతున్న పనివాళ్లు ఎలాగో ఆ మంటలను ఆర్పేశారు. మణిమాల చెప్పగానే ఎవరో వెళ్లి ఓ మంచి చీరెను తెచ్చి ఇచ్చారు. మళ్ళీ దీపాలు వెలిగించడం ప్రారంభమయింది.

అప్పటికి గంట క్రితమే రవిబాబు పురోహితుని వెంట కొలను వద్దకు వచ్చాడు. పురోహితుడు చెప్పినట్టుగానే పూలు, కుంకుమ, సుగంధ ద్రవ్యాలు కొలనులో వెలజల్లాడు. తర్వాత కొలనులో దిగి కళ్లుమూసుకొని చేతులెత్తి నమస్కరిస్తూ పురోహితుడు చెప్పిన మంత్రాలు తిరిగి చెప్పుతూ ఉన్నాడు. కొన్ని నిమిషాల తర్వాత "అబ్బా" అంటూ కేకేశాడు.

"ఏమిటి బాబూ ! ఏమయింది ?" అన్నాడు పురోహితుడు.

"మొసలి... రవిబాబు శరీరం నీటిలో మునిగిపోయింది. పురోహితుడు దేవాలయం వైపు పరుగెత్తి వచ్చి "రవిబాబుగారిని మొసలి పట్టేసింది" అని చెప్పేశాడు.

దీపాలు వెలిగిస్తున్న సుందరికి ఈ విషయం తెలిసింది. వెంటనే ఆమె కొలనువద్దకు పరుగెత్తి వచ్చింది. క్షణంలో బంధువులు, మిత్రులు అక్కడకు పరుగెత్తి వచ్చారు.

రాజేంద్రవర్మ, మహేంద్రవర్మ క్షణాలలో గజ ఈతగాళ్ళను పిలిపించాడు. గజ ఈత గాళ్లు కొలనులో దిగి మొసలిని చంపేసి రవిబాబును బయటకు తీసుకువచ్చారు.

సుందరి రవిబాబు చేయిపట్టుకొని చూచింది. జరిగిన మోసం గ్రహించింది. పొంగి వస్తున్న దుఃఖాన్ని ఎలాగో ఆపుకొని బంధుమిత్రులనుద్దేశించి అంది "నేను రవిబాబును ప్రేమించాను. అతడు నన్ను ప్రేమించాడు. కాని జరుగుతుందనుకున్న పెళ్లి విషయంలోనే కుట్ర జరిగిపోయింది. రవిబాబుకు రెండు గండాలున్నాయన్నాయని పెద్దలు ఇది వరకే సెలవిచ్చారు. వారి మాటలు ఎలా అబద్ధమవుతాయి. రవిబాబు చనిపోయింది ఎంత నిజమో నేను కూడా అతనితోపాటే చనిపోతున్నానన్నది కూడా అంతే నిజం అవుతుంది".

"కాదమ్మా నువ్వు తప్పకుండా బ్రతుకుతావు. నువ్వు మాధవ వర్మను పెళ్లిచేసుకొని నిండుగా నూరేళ్లు సుఖసంతోషాలతో జీవిస్తావు. ఈ జాతక చక్రవర్తి చెప్పే మాటలు అబద్ధం కావు" అన్నాడు జాతక చక్రవర్తి.

"నువ్వు జాతక చక్రవర్తివా ? రాజకీయవేత్తలు ఆడించినట్లు ఆడే గుంటనక్కవి. అసలు నువ్వు మనిషివేనా ! రవిబాబుకు రెండు గండాలున్నాయని చెప్పిన వాడివి నువ్వేగా, కాని అవి గండాలు కావు. రాజకీయకుట్రలు. రాజకీయకుట్ర అంటే ఏమిటో చెప్పనా, మంచి నటిస్తూ చెడునుచేయడం. రవిబాబు రాజకీయకుట్రతో చనిపోయాడు. రవిబాబు చనిపోతే నేను మాధవ వర్మను పెళ్లిచేసుకుంటానని మీరు ఊహించి ఉంటారు, కాని అలా జరగదు. నా జాతకం మీరనుకున్నట్టు లేదు. నా జాతకం నాకు తెలుసు. నేను మరి కొద్ది క్షణాలలో చనిపోతాను" అని ఇంకా ఏదో చెప్పబోయింది. కాని చెప్పలేక వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది. తల్లిదండ్రులు ఆమె దగ్గరకు రాబోతే రావద్దని కేకలు వేసింది. "రవి బాబూ ! నువ్వు లేని లోకంలో నేనూ ఉండలేను" అని ఆమె రవిబాబు ప్రక్కన కూర్చుండ బోయింది. కాని శరీరంమీద స్వాధీనం తప్పి అతనిమీద పడిపోయింది. ఎవరో ఆమె చేయి పట్టుకుని లేవనెత్తబోయారు. కాని అప్పటికే ఆమె ప్రాణాలు గాలిలో కలిసి పోయాయి.

"సుందరి ఎలా చనిపోయింది ?" ❑

ఇ. అయిలయ్య, M.A., M.Ed., LL.B., VIH., DIK., (Ph.D.)
టీచర్, మేజీషియన్, హిప్నాటిస్ట్, & వెంట్రిలాక్విస్ట్
Z.P. సెకండరీ స్కూల్ (బాలురు)-చేర్యాల,
మం॥ చేర్యాల, జి॥ వరంగల్.



# ఆదర్శానికి అన్నీ... కష్టాలే !

'మంచి ముత్యాలు' అనే గ్రామంలో అంబరీష్, మహాలక్ష్మి అనే దంపతులు, వారికి వరాలుగా ముగ్గురు సంతానం. పెద్దపిల్లవాడికి మహేంద్రవర్మ, రెండవ పిల్లవాడికి అమరేంద్రవర్మ, కూతురికి రేణుకాదేవి అని పేరు పెట్టుకొన్నారు. వారిది మధ్య తరగతి, వ్యవసాయ కుటుంబమైనప్పటికీ పిల్లలను అల్లారుముద్దుగా పెంచసాగారు. పిల్లలకు ఏ లోటు లేకుండా పెంచినప్పటికిని ఆడపిల్లను అంతగా చదివించకపోయినా ఓ మంచి సంబంధం చూచి వివాహము చేసినారు. రేణుకాదేవికి నల్గురు మగసంతానం, పెద్ద కుమారుడైన మహేంద్రవర్మను పదవ తరగతి చదివించి వ్యవసాయ పనిలోకి తీసుకున్నాడు. అదృష్టవశాత్తు మహేంద్రవర్మకు రెవెన్యూశాఖలో చిరుద్యోగం లభించింది. ఈయన వివాహం మేనమామ కూతురితో జరిపించారు. మహేంద్రవర్మ తన చిరుద్యోగం చేసుకుంటూ వ్యవసాయం కూడా చేస్తూ తనకు కల్గిన ముగ్గురు మగ సంతానంతో స్వగ్రామంలో సుఖసంతోషాలతో జీవనయానం కొనసాగిస్తూ ఉన్నాడు.

రెండవ కుమారుడైన అమరేంద్రవర్మ చిన్ననాటి నుండి ఆదర్శభావాలు కల్గివుండేవాడు. ఈ పిల్లవాడికి బాగా చదివి మంచి ప్రయోజకుడిని కావాలనే కోరిక బలిష్టంగా ఉండేది. ఆయనలో దేశభక్తిభావాలు బాగా కనిపించేవి. ఒకనాడు తాను విద్యాభ్యాసం చేస్తున్న పాఠశాలలోని తరగతి గదిలో ఉపాధ్యాయుడు "మీరు జీవితంలో ఏమి కావాలని ఊహిస్తున్నారని" విద్యార్థులను ప్రశ్నించినపుడు తనవంతురాగానే ఏ మాత్రం తడబడకుండా చక్కగా నిలబడి "నేను సైనికుడను కావాలనో లేదా స్కూల్ టీచర్ అవ్వాలనో కోరుకుంటున్నాను సార్" అని జవాబిచ్చాడు. "సైనికుడనై దేశాన్ని రక్షిస్తూ భరతమాత ఋణాన్ని తీర్చుకుంటాను, ఉపాధ్యాయుడనైతే తల్లిదండ్రులను పోషిస్తూ, ఎంతోమంది సైనికులను తయారు చేస్తానన్నాడు". ఈ మాటలకు ఉపాధ్యాయుడు ఆశ్చర్యపడి "ఇలాంటి శిష్యున్ని కల్గివున్నందుకు గర్విస్తున్నాను" అని అన్నాడు.

అమరేంద్రవర్మ తన మొదటి కోర్కెను తీర్చుకోవడానికి ఇంటర్మీడియట్ పూర్తవ్వగానే మిలటరీలో చేరడానికి ప్రయత్నాలు మొదలెట్టాడు. నాల్గుమార్లు ఆర్మీ రిక్రూట్‌మెంట్‌కు ఒకమారు బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్ ఎంపికకు వెళ్ళినా, ఎత్తుఉన్నప్పటికీ సన్నగా ఉన్నందున సెలెక్ట్ కాలేకపోయాడు. నిరాశ చెంది తన రెండవ కోర్కెను తీర్చుకోవడానికి డిగ్రీలో చేరాడు. ప్రథమ సంవత్సరం పూర్తికాగానే టి.టి.సి., ఎంట్రన్స్‌లో రాష్ట్రస్థాయి ర్యాంక్ సంపాదించు కొని శిక్షణను పూర్తి చేసుకున్నాడు. తిరిగి డిగ్రీలో చేరి ఎన్.సి.సి.లో మంచి ప్రావీణ్యతను చూపెడుతుండేవాడు. డిగ్రీ తృతీయ సంవత్సరం పూర్తికాకుండానే రెండు జిల్లాలలో జర్గిన డి.ఎస్.సి. ఎంపికలో సెలెక్ట్ అయినప్పకీ కూడా తన స్వంత జిల్లాలోనే ఉపాధ్యాయ వృత్తిలో చేరాడు.

ఉపాధ్యాయవృత్తిలో చేరగానే తన ఆదర్శభావాలు శాపంగా పరిణమించి చట్టపరమైన ఇబ్బందులను ఎదుర్కొన్నాడు. తన ఉద్యోగ నిర్వహణలో మంచి పేరు తెచ్చుకుంటున్న తరుణంలో చాలా పెళ్ళిసంబంధాలు వచ్చాయి. కాని, బ్రహ్మచారిగా వుండి సమాజానికి సేవలు చేయాలన్న తలంపుతో తిరస్కరించాడు. అనివార్య కారణాలవల్ల, అందరి ఒత్తిడి వల్ల పెళ్లిచేసుకోవడానికి ఒప్పుకోక తప్పలేదు. కాని తన తల్లిదండ్రులను గౌరవించే వారి కుటుంబాల నుండియే వివాహము చేసుకోవాలన్న తపనతో అన్నిరకాల కలిసొచ్చిన సంబంధాలను కాదని ఒక పేద కుటుంబమునకు న్యాయం చేయాలన్న తన ఆదర్శ భావానికి కట్టుబడ్డాడు అమరేంద్రవర్మ.

ఆ లక్ష్యముతోనే ఒక కుగ్రామంలోని పేద కుటుంబమునకు చెందిన అమ్మాయిని అన్ని రకాల ఎదురు సహాయంచేసి వివాహమాడాడు. మధ్యలో విద్యాభ్యాసం కుంటుపడ్డా వారిద్దరు కష్టపడి ప్రైవేటుగా పరీక్షలు వ్రాసి మంచి మార్కులు సాధించారు. కలిసి ఉండగానే వేరు కుంపటి పెట్టుకోవాలన్న తన తల్లిదండ్రుల కోరిక మేరకు అన్నదమ్ము లిద్దరు వేరుపడ్డారు. తన (తండ్రి) పిత్రార్జితమైన రెండిళ్ళలో కొత్తది అమరేంద్రవర్మకు, పాత ఇల్లు మహేంద్రవర్మకు వచ్చాయి. కొత్తగా తనకు వచ్చిన ఇంటిలోకి అమరేంద్రవర్మ దంపతులు గృహప్రవేశం చేశారు.

ఆ కొత్త ఇల్లే తన పాలిటశాపంగా మారింది. గృహప్రవేశం చేసిన నెలలోపే తన అర్ధాంగి శ్రీలక్ష్మి అగ్నిప్రమాదానికి గురై భాగ్యనగరంలోని ఒక వైద్యశాలలో చేర్చబడింది. గాయపడ్డ 12 గంటలలోపే పుట్టింటివారు రాకముందే శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచి వెళ్లింది. తన జీవిత భాగస్వామి దూరమయినందుకు అమరేంద్రవర్మ దుఃఖానికి అంతులేకుండా

పోయింది. ఆ అగ్నిప్రమాదంలో తానూ గాయపడ్డాడు. తన కూతురు మరణ వార్తనందు కున్న శ్రీలక్ష్మి తల్లిదండ్రులు భాగ్యనగరం వచ్చి తమ ఏకైక కూతురు శవాన్ని చూచి చాలా దుఃఖించారు. కూతురు మరణానికి మెట్టినింటి వారెవరూ కారకులు కారని చట్టం ముందు సాక్ష్యమిచ్చారు.

కాని శ్రీలక్ష్మి రెండవ సోదరుడు నాందేవ్, ఒక న్యాయవాది మాయ మాటలు నమ్మి వరకట్నపు హత్యగా తన బావ అమరేంద్రవర్మపై కేసు పెట్టాడు. అంతే కాకుండా లోగడ తన అవసరానికి (విద్య, వైద్య ఖర్చులకై) తీసుకొన్న డబ్బులు బావకు తిరిగి ఇవ్వలేదు సరికదా ! తల్లి లేని రెండేళ్ల తన మేనల్లుడు శ్రీరామవర్మను అడ్డంపెట్టుకొని (పోషణకని) వేలాది రూపాయలు లాగాడు. బావపై మంచి అభిప్రాయమున్న తన కుటుంబ సభ్యులను తప్పుదారి పట్టించడమేకాక అజ్ఞాత వ్యక్తులచే అమరేంద్రవర్మను శారీరకంగా, మానసికంగా హింసించాడు. లాగుకున్న వేలాది రూపాయలను మేనల్లుడి పోషణకు వినియోగించ కుండా జల్సాలకువాడి తన తండ్రినుండి తనయుడైన శ్రీరామవర్మను ఆరుసంవత్సరాలుగా చూపించకుండా కడుపుతీపికి దూరం చేశాడు.

చట్టం అమరేంద్రవర్మను తన భార్య శ్రీలక్ష్మి ఇచ్చిన మరణవాంగ్మూలం ఆధారంగా నిర్దోషిగా గుర్తించింది. ఇప్పటికీ అమరేంద్రవర్మ మానసికంగా క్రుంగిపోతూ వుంటాడు. మదిలో ఎన్ని బాధలున్నా బడిలో బాలలకు తన నవ్వులు అందిస్తూ, తన వృత్తిలో ఇంకా రాణించడానికి బోధన మరియు బోధనేతర కార్యక్రమాలెన్నో చేపడుతూ తృప్తి పొందు తుంటాడు.

వరకట్నం తీసుకోకపోగా, కన్యాశుల్కంలాగా ఆర్థిక సహాయం అందించి తాను వివాహము చేసుకున్న ఆదర్శానికి అన్నీ... కష్టాలేనని సృష్టికర్తను నిందించడం తప్ప మరో దారి లేదంటాడు. కాలమే తన సమస్యను పరిష్కరిస్తుందని, భవిష్యత్తును కూడా నిర్ణయిస్తుందని ఊహిస్తూ, అమరేంద్రవర్మ ఆశోపహతుడై జీవనం సాగిస్తున్నాడు. ❑





**డా॥ డి. భిక్షపతి,** M.A., M.Phil., Ph.D.
గ్రా॥ నారాయణగిరి,
మం॥ ధర్మసాగర్, జి॥ వరంగల్.

# సంస్కారం

కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు డిపార్ట్‌మెంట్ మెట్లపై వరుసగా కూర్చొని ఫోటోలు దిగుతున్నారు ద్వితీయ సంవత్సరం ఎం.ఏ. విద్యార్థులకు వీడుకోలు సమావేశం కొన్ని క్షణాల క్రితమే తీయని స్వీట్లు పంచుకొన్నారు. ఆ సందడిలో-విడిపోతున్న సహ విద్యార్థుల ఆరాటం-గుండెలు విడిపోతున్నట్లు మధుర స్మృతులకు చిహ్నంగా దాచుకొనే ఫోటోలు రకరకాలుగా క్లిక్ క్లిక్‌మనిపిస్తున్న శబ్దం. అరగంట నుండి ఆటోగ్రాఫ్‌లు రంగు రంగులవి ఎవరెవరికి నచ్చిన డిజైన్లతో తెచ్చుకున్నారు. స్నేహానికి చిహ్నంగా చివరిపలుకులు చిరస్థాయిగా ఉండేందుకు వ్రాయించుకొంటున్నారు. గిరిధర్ ముందుకు ఓ చేయి చాచుతూ వచ్చింది. ఊహించని సన్నివేశం. ఆమె తరగతిలో చాలా సిన్సియర్ విద్యార్థి పేరు శ్రీవిద్య, ఎవరితోనూ ఫ్రీగా మాట్లాడినా సభ్యత, గంభీరత ఆమెకు ఆభరణాలు. అబ్బాయి లను ఎవరినీ వ్రాయమని అడుగలేదు, అదీ-కొందరితోనే వ్రాయించింది. గిరిధర్ గ్రూపులో కొంతమంది అల్లరిమూకలు ఉండడంచేత ఆ మూకలో ఎవరితోనూ ఆమె వ్రాయించదని నిశ్చయించుకున్నారు.

గిరిధర్ సిన్సియర్ విద్యార్థి-ఎలెక్టివ్ సబ్జెక్టులలో ఆమెను ప్రోత్సహించి తీసుకోమన్న అలంకారశాస్త్రమే తీసుకొన్నది. ఎప్పుడూ అందరితో సమానంగా మాట్లాడుకునే సంభాషణే తప్ప ఆమెతో స్పెషల్‌గా మరీ సన్నిహితంగా ప్రవర్తించిన సందర్భాలు లేవు. రామప్పగుడికి విహారయాత్రకు పోయినపుడు అక్కడ కనిపించే ప్రకృతి అందాలు, గుడిశిల్ప సౌందర్యంతో పాటు, యువకులను ఆకర్షించే నగ్నశిల్పాలు, కొందరికి ఇష్టం, మరికొందరికి అయిష్టం. కొందరిది భక్తి దృష్టి, మరికొందరిది ప్రేమదృష్టి, ఇంకొందరిది కేవలం అందరితో కలిసి తిరిగే అనుభూతి.

అందరితో గుడిచుట్టూ తిరుగుతూపోయే గిరిధర్ ఎక్కడో ఒక చెట్టుకు పూసిన మల్లెపూలు దాచుకొని శివలింగాలు కనిపించిన చోట రెండు పూలు శివునిపై వేయడం

చేస్తున్నాడు. మూడోచోట వేస్తుండగా "ఏం గిరిధర్ భక్తిని గుప్తనిధిగా దాచుకొన్నావా ?" అన్నది శ్రీవిద్య . గిరిధర్ నవ్వుతూ "ఏదో పూలు వేయాలనిపించింది, వేస్తున్నాను" అన్నాడు.

ఎన్నడూ నుదుటిపై బొట్టు కనిపించని గిరిధర్‌కు శివభక్తి నిగూఢంగా ఉన్నదని గ్రహించింది. తనూ శివభక్తురాలే ఎప్పుడూ నుదుటిపై విభూతి దాని క్రింద కుంకుమ ధరించి వచ్చేది. అదే విషయం గిరిధర్‌పట్ల ఆమెకు కలిగిన ఆకర్షణ.

ఇప్పుడు ఎదురుగావచ్చి "మీరు ఆటోగ్రాఫ్ వ్రాయండి" అన్నది. గిరిధర్ తీసుకొని "ఒక మంచి మిత్రులుగా విద్యనభ్యసించి విడిపోతున్న మీకు మేం మంచి స్నేహితులుగా, మంచి భవిష్యత్తు ఉండాలని కోరుకుంటున్నాం" అని వ్రాసి ఇచ్చాడు. అది చూచి ఊహించని విధంగా ఆమె కనుకొలుకుల నుండి రాలిపడిన కన్నీళ్ళు గిరిధర్ పాదాలపై బడినవి. ఒకరిద్దరు స్నేహితులు చూచి నిశ్చేష్టులైపోయారు. గిరిధర్‌కు నోటమాట రాలేదు. "సారీ" అని అందామనుకున్నాడు. కాని అంతలోనే ఆమె వెక్కివెక్కి ఏడుస్తున్నట్లుగా పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక కొంగుతో తుడుచుకొంటూ వెళ్ళిపోయింది. అందరూ ఆమెవైపే చూస్తూ వున్నారు. కాసేపటికి ఆమె నించున్నచోట ఒక చీటీ కనిపించంది. స్నేహితులెవరికి కనిపించకుండా మెల్లగా జేబులో వేసికొన్నాడు గిరిధర్. ఆరోజు రాత్రి ఇంటికి వెళ్ళి చీటీ విప్పాడు.

"నీలోని నిర్మలమైన భక్తి నన్ను ఆకర్షించింది. నీ నిర్మలమైన మనస్సుతో జీవితం పంచుకోవాలని ఆశించాను. మా ఇంట్లో నేను మా వాళ్ళతో లవ్ మ్యారేజ్ చేసుకొంటానని చెప్పినప్పుడల్లా ఖండిస్తూ వచ్చారు. మీరే నా గుండెలో నిలిచి ఉండేవారు. కాని మీ నుండి ఒక రోజైనా నాపై ప్రేమపూర్వకమాట వినాలని, మీ నోట ఐలవ్‌యూ అనిపించుకోవాలని ఎదురుచూశాను. నేను ఎన్నోసార్లు ఐలవ్‌యూ అందామని పెదవి మీదికి తెచ్చుకొన్న సందర్భాలెన్నో ఉన్నవి. కాని ఎందుకో ధైర్యం చాలలేదు. నిజంగా ఐలవ్‌యూ గిరిధర్-ఐ లైక్‌యూ" అన్న మాటలు గిరిధర్ గుండెను కదిలించింది. విచిత్రం ఆమె అడ్రస్ తెలీదు. ఆ ప్రయత్నంలో ఉండగా ఓ మిత్రుడు తెచ్చిన శ్రీవిద్య వెడ్డింగ్ కార్డ్ చూచి గిరిధర్ ఆశ్చర్య పోయాడు. *"నిజంగా ప్రేమ గుడ్డిది-సంస్కారవంతులు దానిని సంస్కరిస్తారు"* అని అను కున్నాడు గిరిధర్. ❑





**నెల్లుట్ల రమాదేవి,**

*ఆఫీసర్, ఆంధ్రా బ్యాంక్, నక్కలగుట్ట బ్రాంచ్, వరంగల్.*

నివాసము : ఇ.నెం. 4-66,

ఘన్‌పూర్(స్టే), జి॥ వరంగల్.

ఫోన్ : 08711-20494

# నిర్ణయం

మనసంతా చికాగ్గా ఉంది, మధ్యాహ్నామే ఊర్నించి వచ్చాను. ఇప్పుడప్పుడే ఊర్లోఉన్న పొలం అమ్మేయడానికి వీలయ్యేట్టు లేదు. బయల్దేరేముందు అమ్మ అన్నమాటలు గుర్తొచ్చాయి.

"ఒరే పెద్దోడా ! నాకు నువ్వు తక్కువా, సూర్యం ఎక్కువా కాదురా ! కానీ మీ నాన్న గారు పోయినప్పటినుంచీ ఆ పొలాన్ని వాడు రెక్కలుముక్కలు చేసుకొని కాపాడుకొంటూ వచ్చాడు. నీకా ఒక్కడే పిల్లాడు. పైగా నువ్వూ, సుజాతా ఇద్దరూ ఉద్యోగాలు చేసు కుంటున్నారు. వాడికి ఇద్దరూ ఆడపిల్లలే. వేరే ఆధారం లేదు. నువ్వు ఆ పొలం వాడికి వది లేసినా హాయిగా బతగ్గలవు. ఇలా అంటున్నానని మరోలా అనుకోకు. కానీ ఒకతల్లి కడుపున పుట్టిన వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు ఆదుకోవాలిరా ! పెద్దదాన్ని నేనెన్నాళ్ళుంటాను చెప్పు !" అమ్మ కంఠం రుద్ధమవడంతో అక్కడి నుండి వచ్చేసాను.

నేను ఇంజనీరింగ్‌లో ఉండగా నాన్నగారు పోయారు. ఒక సంవత్సరం పొలం కౌలుకు ఇచ్చి వారితో నానాబాధలుపడింది అమ్మ. అప్పటికి తమ్ముడికి ఇంటర్‌మీడియట్ అయి పోయింది. ఇక ఆ తర్వాత ఎంత బతిమిలాడినా వాడు ససేమిరా కాలేజికి వెళ్ళనన్నాడు. తనే స్వయంగా వ్యవసాయం ప్రారంభించాడు. మంచి పంట తీయడమే కాదు, ఈ మధ్య కొంతమేర తోటకూడా పెట్టాడు.

నా చదువుకు ఏ రోజూ ఆటంకం లేకుండా ఠంచనుగా డబ్బులొచ్చేవి. చదువయి పోయాక ఈ ఉద్యోగంరావడమూ, బ్యాంకులో జాబ్ చేస్తున్న సుజాతను పెళ్ళి చేసు కోవడమూ, బాబు పుట్టడమూ వెంటవెంటనే జరిగిపోయాయి. రెండు మూడేళ్ళ వ్యవధిలో తమ్ముడికి పెళ్ళయి ఇద్దరు అమ్మాయిలు పుట్టారు. అమ్మ నా దగ్గరికి ఎప్పుడు వచ్చినా ఈ పట్టణ వాతావరణంలో ఇమడలేదు. అయినా నేనూ, సుజాత వెళ్ళిపోతే ఒక్కతే బిక్కుబిక్కు మంటూ ఎలా ఉంటుందనుకొని నేను ఎప్పుడూ బలవంతం చేయలేదు.

ఈ మధ్యే సుజాత స్వంత ఇల్లు కట్టుకోవాలని తెగ పోరుపెడ్తోంది. ఈ పదేళ్ళుగా వెనకేసిన డబ్బుతో ఓ ప్లాటుకొన్నాం. ఇల్లు కట్టడానికి లోనూ అదీ తీసుకున్నా, ఇంకా కొంత డబ్బు అవసరం ఉంటుంది. ఊరికెళ్ళి నావంతు పొలం తెమ్మంటుంది సుజాత. తన పోరు పడలేక కొంత, ఎప్పటికైనా ఆ ఊరువెళ్ళి వ్యవసాయం చేయలేను గనుకా, పొలం అమ్మే యాలనే నిశ్చయించుకున్నాను. తీరా వెళితే తమ్ముడేమో రెండు మూడేళ్ళు ఆగమంటాడు. అమ్మయితే ఆ ఆలోచనే వద్దంటోంది.

"అరె ! వూర్నుండి ఎప్పుడొచ్చారు ? వెళ్ళిన పనేమయింది ?" చెప్పలు టకటకలాడిస్తూ దగ్గరగా వచ్చింది సుజాత. "మధ్యాహ్నమే వచ్చాను. తర్వాత చెప్తాలే" అన్నాను. అలసటగా ఉన్నాననుకుందేమో, మరి తర్కించకుండా టీ తెస్తానని లోపలికి వెళ్ళింది.

ఈజీ ఛైర్‌లోనే కునుకు పట్టింది. మెలకువ వచ్చేసరికి బాబీగాడితో హోమ్ వర్క్ చేయిస్తోంది సుజాత. నేను లేవడం చూసి "కాస్త వీడికి లెక్కలు చెప్పండి, నేను వంటపని చూసు కుంటాను" అంటూ లోపలికి వెళ్లింది.

దగ్గరికి వెళ్ళే సరికి చిన్న పెన్సిలు ముక్కను దీక్షగా చెక్కుతున్నాడు వాడు. "అదేమిట్రా అంత చిన్న పెన్సిలేమిటీ ? మొన్ననేగా కొత్త పెన్సిలు కొన్నావు" అన్నాను. వాడు మౌనంగా వుండి పోయాడు.

"ఏమిటీ మాట్లాడవు ? మళ్ళీ పొగోట్టావా ?" నాకు చిరెత్తుకొచ్చింది. ఇప్పటి చదువులు కాదుగానీ, ఎన్ని పెన్నులు, పెన్సిళ్ళు, నోట్‌బుక్‌లు కొన్నా సరిపోవు. బోలెడు డబ్బు వీటికే అవుతోంది.

"కాదు నాన్నా ! మరి... మరి" నీళ్ళు నములుతున్నాడు. "ఏంటి చెప్పు నసగక !" గద్దించాను. "మరి... మా క్లాసులో రాజులేడూ... చాలా ఇంటలిజెంట్ డాడీ ! నాకు ఎన్నోసార్లు మాథ్స్‌లో ప్రాబ్లెమ్స్ చెప్పాడు. అన్నింటిలో హెల్ప్ చేస్తాడు. వాళ్ళకు డబ్బుల్లేవు. చాలా పూర్, వాళ్ళ నాన్న రిక్షాపుల్లర్. చాలా కష్టపడి ఫీజులు కడుతుంటాడు. నిన్న.. స్లిప్‌టెస్ట్ రాయడానికి వాడికి పెన్సిల్ లేదు. నాకు రెండున్నాయి కదా ! పోనీ పాపం అని వాడికి ఒకటిచ్చాను. అప్పటికీ స్కూల్ అయిపోగానే మళ్ళీ ఇవ్వబోయాడు... నేను వద్దన్నాను. మనం ఇంకో పెన్సిల్ కొనుక్కోగలం కదా డాడీ ! వాడు మాటిమాటికీ అడిగితే వాళ్ళ నాన్న తిడతాడట" భయం భయంగా చెప్పాడు.

నేను నిరుత్తరుడ్నయ్యాను. "మనం ఇంకో పెన్సిల్ కొనుక్కోవచ్చు కదా డాడీ !" అన్న బాబీగాడి మాటలే నా చెవుల్లో ప్రతి ధ్వనించసాగాయి.

"చిన్నపిల్లలకు ఏం తెల్సులే" అని మనం అనుకుంటాం కానీ, వాళ్ళ పరిధిలో వాళ్ళెంత దూరం ఆలోచిస్తారు ! ఉన్నదాంట్లో తోటివారికి సహాయపడాలనే చిన్నపిల్లల ఆలోచనల్ని మొగ్గలోనే తుంచేస్తే మనం పెద్దవాళ్ళం ఎలా అవుతాం ?

పొలం చూపిస్తానని తీస్కెళ్ళి తమ్ముడన్న మాటలు గుర్తుకువచ్చాయి నాకు.

"ఈ పొలం అమ్మాలి అంటేనే నా శరీరంలో ఒక భాగాన్ని తీసేసినట్లు అనిపించింది అన్నయ్యా ! మొత్తానికి ఒకటే బావి. బావి లేని భాగం అమ్మితే ధర తక్కువ గిడుతుంది. బావి ఉన్నవైపు అమ్మితే, మిగతా పొలానికి నీరు వుండదు. నువ్వు కాదూ అంటే అమ్మేద్దాం గానీ, వీలైతే నాకొక రెండేళ్ళు టైమివ్వు అన్నయ్యా ! నేను ఆ డబ్బు ఎలాగోలా సమకూర్చు కొని నీ వాటా కొంటాను. దీన్ని అమ్మడానికి నాకు మనసొప్పడం లేదు".

అప్పుడు ఏమీ అనలేక లోపల్లోపల తమ్ముడ్ని తిట్టుకున్నానుగానీ, ఇప్పుడు ఆలోచిస్తే చాలా గిల్టీగా అనిపిస్తోంది. ఇంటర్మీడియట్‌తో చదువు ఆపేసి కుటుంబ భారాన్ని భుజాల కెత్తుకున్న తమ్ముడు నా ఇంజనీరింగ్ చదువయిపోయేదాకా ఏం కష్టాలుపడ్డాడో తెలియదు. ఆ తోటలో ఒక్కొక్క చెట్టు చిగుళ్ళువేస్తూ పెరిగినట్లుగా వాడి అనుబంధం వాటితో పెరిగి ఉండవచ్చు. ఈనాటికి అవసరం ఉన్నప్పుడల్లా ఊరికెళ్ళి బియ్యం తెచ్చుకోవడం తప్ప అవి ఎలా వస్తున్నాయో నాకు తెలియదు. ఆత్మవిమర్శ చేసుకొంటే, నాన్నకు కొడుకునైనా ఆ పొలంపై నాకు ఏ హక్కులేదు. అయినా వాడు నా దగ్గర్నుంచి దాన్ని కొంటానంటున్నాడు.

నేను ఇల్లు ఈ సంవత్సరం కాకపోతే వచ్చే సంవత్సరం కట్టగలను. కానీ సగం పొలం పోతే వాడి పరిస్థితి ఏమిటి ? తోటి వాడికి పెన్సిల్ లేకపోతే, ఇంట్లో మేము తిడుతామన్న భయాన్ని కూడా ఎదిరించి తన పెన్సిల్ ఇచ్చిన పదేళ్ళ బాబీగాడిలాగా నేను ఇన్నాళ్ళూ ఎందుకాలోచించ లేకపోయాను ? నాకొక జీవనాధారం ఉండి, నా భార్య ఉద్యోగస్తురాలై ఉండి కూడా నా తమ్ముడి నోటి దగ్గర కూడు లాక్కొనగలిగే నేను, పరాయివాళ్ళకు ఏం సాయం చేస్తాను ? మనసు అంత సంకుచితమై జీవితాలు వ్యాపారమయ్యే నాకు అను బంధాలు ఎలా నిలిచి ఉంటాయి ? నేను నిజంగా ఇలా ఆలోచించి ఉంటే సుజాతకు సర్ది చెప్పలేక పోయేవాడినా ?

"డాడీ ! కావాలంటే రేపు రాజునడిగి తీసుకొస్తాను"నా ఆలోచనచూసి కోపంవచ్చిందేమో అని భయపడుతూ చెప్పాడు బాబీ. "వద్దులేరా బాబీ !" వాడ్ని ముద్దుపెట్టుకుని తమ్ముడికి ఉత్తరం రాయడానికి లేచాను. ❑

**ఎ.వి. అనిల్ ప్రసాద్,**

ఇ.నెం. 11-18-243,
కె.సి.హెచ్. కాలనీ,
వరంగల్ - 506 013
ఫోన్ : 444051




# పరివర్తన

మా అన్నయ్య కొడుకు బారసాలకని ఖమ్మం వెళ్లొస్తూ లింక్ ఎక్స్‌ప్రెస్ ఎక్కాను. రైలు ఖమ్మం నుంచి కదిలింది. పల్లీలు, బఠానీలు అమ్మే కుర్రాళ్ళ అరుపులు రైలు శబ్దంలో కలిసి లయ విన్యాసంలా వినిపిస్తున్నై.

నా దగ్గర పుస్తకాలూ, న్యూస్ పేపర్లూ లేకపోవటంతో చూపులు వీధి దీపాల్నీ, ఆకాశ దీపాల్నీ పోల్చి చూస్తున్నై. అప్పుడప్పుడూ ఆకాశం మెరుస్తోంది, ఉరుముతోంది కూడా. నా ఆలోచనలు మాత్రం రైలుకంటే వేగంగా పరుగెడుతున్నై.

రైలు బహుశా డోర్నకల్ స్టేషన్ దాటినట్టుంది. పరుగెట్టే రైలు కాసేపాగి మళ్ళీ పరుగెడుతోంది. నేను కూచున్న సీటు వెనకాలనుంచి ఎవరో పాడటం వినిపిస్తోంది. వినటం మొదలు పెట్టాను. ఇందాక పల్లీ, బఠానీ అంటూ అరిచిన గొంతులే అవి. కాసేపటికి అందులో ఓ పిల్లాడు డాన్స్‌కూడా మొదలుపెట్టాడు.

పొడుగ్గా పెరిగిన ఉంగరాల జుట్టుకి దస్తీ కట్టుకున్నాడు. వయస్సు పదిహేనేళ్ళ లోపలే ఉన్నట్టు వాడి ముఖం చెపుతోంది. అందమైన కనుముక్కు తీరు, డాన్స్ చేస్తుంటే వాడినే చూడాలనిపిస్తోంది. వాణ్ణి వాడు మరిచిపోయి, సినిమా హీరోని ఊహించుకుంటూ చిందు లేస్తున్నాడు. నేను వాణ్ణి గమనించటం చూసి డాన్స్ ఆపేసి సిగ్గుపడటం మొదలుపెట్టాడు.

ఒక్కసారి ఆ కంపార్ట్‌మెంట్ అంతా కలియచూశాను. వాడి ఈడున్న పిల్లలు కనీసం ఓ డజనుమందున్నారు. అమ్మానాన్నల్తో కులాసాగా కబుర్లు చెబుతున్నారు. కొంతమంది అంత్యాక్షరి ఆడుతున్నారు, కొంతమంది నాలా కిటికీ పక్క సీట్లో కూచుని బయటికి చూస్తున్నారు. కొందరు రాత్రై పోయిందని అమ్మఒళ్ళో తలపెట్టుకుని హాయిగా నిదుర పోతున్నారు.

ఆ కుర్రాణ్ణి పిలిచి వివరాలడిగాను, పేరు వీరన్నట, వరంగల్ జిల్లాలో ఓ పల్లెటూరట. తండ్రి జీపు డ్రైవరుగా, తల్లి ఇళ్ళలో పాచి పనులు చేసుకుంటూ పొట్టగడుపుతున్నారట. ఇక వీరన్నని చిన్నప్పుడే చదువుమానిపించి ఓ హోటల్లో సర్వర్‌గా ఉంచాట్ట, కానీ వీరన్నకి ఆ

ఉద్యోగం ఇష్టం లేక ఇట్లా రైల్లో పల్లీలమ్ముతూ స్వంతంగా సంపాదిస్తున్నాట్ట. రోజూ పల్లీలు అమ్ముతూ విజయవాడ వరకూ వెళ్ళి అదే రైల్లో సాయంత్రానికి ఇల్లు చేరుకుంటాట్ట.

కానీ ఈరోజు ఓ చదువుకున్న బాబు తనో రైల్వే అధికారిని అని చెప్పి, ఈ వీరన్నని టిక్కెట్ లేకుండా రైల్లో ప్రయాణం చేస్తున్నావని బెదిరించి ఇరవై రూపాయలు వసూలు చేశాట్ట. మరిపోయిన ఆ ఇరవై రూపాయలూ సంపాదించాలనే పట్టుదలతో రాత్రిపూట కూడా రైల్లో అమ్మటానికి బయలుదేరాడు.

ఇంతలోనే తనుదిగాల్సిన స్టేషన్ రావటంతో, హడావిడిగా దిగిపోయాడు వీరన్న. ఇంకా నేనడుగుదామనుకున్న మరిన్ని ప్రశ్నలు అడక్కుండానే.

రైలు మళ్ళీ బయలుదేరింది. నా మనస్సు మళ్ళీ వీరన్న గురించే ఆలోచిస్తోంది. వరంగల్ స్టేషనొచ్చి నేనూ రైలు దిగిపోయాను. రైల్వే ప్లాట్‌ఫాం మీద మరెందరో వీరన్నలు ఆదమరిచి నిద్దురపోతున్నారు. ఆ ప్లాట్‌ఫామే ఓ ఫోం బెడ్‌లా భావిస్తూ. వాళ్ళందర్నీ దాటుకుంటూనే స్టేషన్ బైటికొచ్చాను. అక్కడా కొందరు వీరన్నలు కనిపించారు... ఆ అర్ధరాత్రి వేళ "రిక్షా కావాలా సార్" అనడుగుతున్నారు. గుండెల్లో గుండు సూదులు గుచ్చుకుంటున్న భావం. ఇంటికొచ్చి వీరన్న గురించే ఆలోచిస్తూపడుకున్నా.



తలుపు చప్పుడవుతుంటే మెలకువొచ్చింది. తలుపు తీశా, ఎదురుగ్గా ఎనిమిదేళ్ళ శీను. మా ఆఫీసులో అటెండర్ చంద్రయ్య కొడుకు. మా ఇంట్లో అంట్లు తోమటానికి, పిల్లల్ని ఆడించుకోవటానికి పెట్టుకున్నాం. వీరన్న గుర్తొచ్చాడు. కాస్త సిగ్గనిపించింది.



ఆఫీసుకి వెళ్ళగానే చంద్రయ్యని కలిశాను. "చూడు చంద్రయ్యా నువ్వూ, నీ భార్యా ఇద్దరూ చిన్నపనో, పెద్దపనో చేసుకుంటూ సంపాదిస్తున్నారు కదా, ఇంత చిన్నతనం నుంచి శీనుని ఈ సంపాదనా వ్యాపకంలో పెట్టారెందుకు ? చక్కగా బడికి పంపించవచ్చుగా" అని అడిగాను. చంద్రయ్య నన్ను వింతగా చూశాడు.

"అం సారూ ! బి.ఏ.,లు ఎం.ఏ.,లు సదివినోల్లకే ఇయ్యాల్రేపు నౌకర్లు దొరుకత్తలేవు. గందుకే సీనుగాన్ని ఆరోది సదివిపిచ్చి బంజేపిచ్చా. వాన్కిసుత సదువుమీద ఇంట్రస్టు లేద్సారూ. చిన్నప్పట్కెల్లి సంపాయించే తెల్వినేర్పితే ఒక లైన్లబడ్తడు"అంటూ ఓ లెక్చరిచ్చాడు.

"చూడు చంద్రయ్యా చదువనేది కేవలం ఉద్యోగం చేయడానికేనా ? కాస్త తెలివి కూడా అవసరం కదా మనిషికి", ఇంకా నేనేదో చెబుతాననుకుని చంద్రయ్య నా మాటలకు అడ్డుతగిలి "సారూ ! సీనుగాన్ని బల్లెకి తోల్న. ఆరోద్దన్క సదివిండుగని వాన్కి బల్లెకు పోయేదాన్కి ఇంట్రస్టు లేద్సారూ. గంద్కే బడిమాన్పించి పన్లెకు తోల్తాన్న".

"చూడు చంద్రయ్యాఅన్ని పూలూపుట్టగానే పరిమళించవు. మీ శీనుకి పట్టుదలుంది. ఒళ్ళొంచి పనిచేసే ఉత్సాహం, స్వతంత్ర భావాలూ ఉన్నై, వాడి ధ్యాసని మెల్లిగా చదువు పైకి మళ్ళేలా చేస్తే బాగా రాణిస్తాడు. అసలు నాలాంటి వాళ్ళకు యాడాదిలో వచ్చేది, శీను లాంటి వాళ్ళకి ఆర్నెల్లలోనే వస్తుంది" నచ్చచెప్పే ప్రయత్నం చేశాను.

"సారూ ! నువ్వు చెప్పేది రైటే కాదంట లేను. నాకూ. నా భార్య కొచ్చే సంపాదన ఆడి కాడ్కి సరిపోద్ది. ఇగ నాల్గురాల్లెన్కెయాల్నంటే సీనుగాన్ని పన్లెకు తోలకనడ్వదు" అంటూ నా మాటలకు చంద్రయ్య అడ్డు తగిలాడు.

"అయ్యో చంద్రయ్యా, పసితనంలోనే వాడు సంపాదించాలనే నీ ఆరాటం శీను బతుకుని నాశనం చేస్తోందనుకోవట్లా. ఒక విరిసీ విరియని మొగ్గని, మొగ్గగా ఉండగానే పూవై, పిందై, కాయై పండు పండాలనీ నీ ఆరాటం, ఆ మొగ్గ మొగ్గగానే రాలుతున్నా, నీకది సహజంగా అనిపిస్తోంది. శీను తోటిపిల్లల్ని చూడు, చదువుతోపాటు ఆటలు. పాటలు ఇంకెన్నో విధాలుగా ఎదుగుతుంటే నీ కొడుకేమో బావిలో కప్పలాగా ఇదే జీవితం అనుకుంటున్నాడు".

"మీ శీనుకి పట్టుదలే కాదు, చక్కటి గొంతున్నది, ఆటల్లోకూడా మంచి నేర్పున్నది.వాడి తెలివిని సరైన దారిలో పెడితే ఎంతో పైకొస్తాడు" అని చంద్రయ్యవంక చూశా. చంద్రయ్య కళ్ళు శూన్యంలోకి చూస్తున్నై, బహుశా గతస్మృతులు నెమరేసుకుంటున్నట్టున్నాడు.

"నిజం సారూ ! నా చిన్నప్పుడు నేన్సూత బడికిపోయే పిల్లగాండ్లను చూసి నేనూ బల్లెకు పోతే మంచిగుండు అన్కునెటోన్ని. పిల్లగాండ్లందరూ ఒక్కదగ్గర జమై లేడి పిల్లల్తీర్గ ఆట లాడ్తుంటే, నేన్సూత వాల్లల్ల జమైతే మంచిగుండు గదా అన్కకునేటోన్ని. కానీ యాడ... నా కోర్కె ఒక్కటి దీరకపాయె...".

నా కళ్ళల్లో నీటిపొర. "మరి శీను జీవితం కూడా నీలాగే అయిపోతుంది కదా...".

"లేద్సారూ ! సీనుగాన్ని బల్లెకి తోల్త. అంతలైతే నేనే ఈ సారా పొట్లాల తాగుడు బంజేస్త. అక్కర్రాని ఖర్చులు తగ్గిస్త. కానీ, సీనుగాని బత్కు నా బత్కుతీర్గ కాకుండా సూస్కుంట" చంద్రయ్య గొంతులో విశ్వాసం, కృతజ్ఞత, ఆశ... కలగలిపి వినిపిస్తున్నై.



నేను ప్రతినెలా జీతం తీసుకోగానే నా ఇష్టదైవానికి మనీ ఆర్డరు పంపిస్తుంటా. ఈసారి పంపించేప్పుడు క్రింది భాగంలో "TOWARDS EDUCATION FUND" అని రాసి మరీ పంపించా. ఇక నుంచీ ప్రతీనెలా అట్లాగే పంపిస్తా. వీరన్నా, చంద్రయ్య, శీను అందర్లో దేవుడున్నాడు. ❑



**వై. (నిమ్మటూరి) విజయలక్ష్మి,** M.A., M.Phil., M.Ed.
ఇ.నెం. 2-7-309,
ఎక్సైజ్ కాలనీ, హన్మకొండ - 506 010
ఫోన్ : 553637

# విషాదోదయం

న్యూయార్క్ నగర అందాలు తిలకిస్తు, ఆలోచిస్తు కారులో వస్తున్న రాధిక ఆలోచనలు ఒక్కసారి అమ్మచుట్టు తిరిగాయి. స్నేహితులు వచ్చారు. అందరు ఎంతో ప్రేమగా చూసు కుంటున్నారు, అయినా ఏదో వెలితి కనబడుతుంది. అమ్మనవుతున్న సమయంలో అమ్మ దగ్గరుండాలని ఎన్నోసార్లు అనుకున్నాను, ఇదంతా నేను చేసుకున్న స్వయంకృతాపరాధమే. అన్నయ్య, అక్కయ్యలిద్దరి తరువాత చిన్న కూతురునని నాన్న అమ్మ ఎంతో గారాబం చేసే వారు. ఏ విషయంలోనైన నాకే ప్రాధాన్యత ఇచ్చేవారు. ఇద్దరు అక్కయ్యల పెళ్ళిళ్ళు, పేరంటాలు, అన్నయ్య ఇంజనీరింగ్ చదువు, "నేను మామూలు క్లర్క్‌ను, నాకు ఓపికలేదు, ఇన్ని కార్యాలు చేసి అలసిపోయాను" అని నాన్న నాకు ఇంజనీరింగ్‌లో సీటు వచ్చినప్పుడు చదివించనన్నారు. మా ఫ్రెండ్స్ అంతా రాధిక చాలా తెలివిగలదని, ఎడ్యుకేషన్ లోన్ తీసు కోవచ్చని నాన్నకు నచ్చచెప్పి నన్ను చదివించేలా నాన్నను ఒప్పించారు.

ఇంజినీరింగ్ సెకండ్ ఇయర్‌లోనే రేవంత్ పరిచయమయ్యాడు. రేవంత్ వాళ్ళ అమ్మ నాన్నలకు ఒక్కగానొక్క కొడుకు, ఒక కూతురు. డిగ్రీకాగానే మారేజ్‌అయి స్టేట్స్‌లో ఉంటుంది. రేవంత్‌పై ఎన్నో ఆశలు పెట్టుకొని పెంచారు. ఇటు అమ్మ నాన్నలు నాపై ఎన్నో ఆశలు పెట్టుకొని చదివించారు. నేను ఫైనల్ ఇయర్‌లో ఉండగానే అమ్మనాన్నలకు ఎన్నో ఫోన్స్ వచ్చేవి "మీ చిన్నమ్మాయి చాలా తెలివిగలదని" మధ్యవర్తులతో వాళ్ళ అబ్బాయిల కోసం చెప్పించేవారు. కాని అందరు కట్నాలు జాస్తిగానే అడిగేవారు. నాన్న నా చదువు అయ్యేంత వరకు ఏది మాట్లాడనని, నా బంగారుతల్లి రాధిక నాకు రెండవ కొడుకని చెప్పేవారు.

అమ్మానాన్నల ప్రేమ, ఆ ఇల్లు వాతావరణం తలచుకుంటేనే ఎంతో హాయిగా ఉంటుంది. ఏ పండగ వచ్చిన అమ్మ అన్ని పిండివంటలు నన్నే అడిగిచేసేది. నాకు నచ్చిన బట్టలు కొనిచ్చేది. నాన్న సరేసరి "తల్లీ రాధా !" అని ప్రేమగా పిలిచేవారు. నాన్నతో కూర్చొని వినాయకచవితి పూజలు, అమ్మతో కలిసి సంక్రాంతి బొమ్మల కొలువు పెట్టడం, నోములు

హడావిడి అంతాఇంతా కాదు. ఏ అచ్చటముచ్చట లేని మెకానికల్ లైఫ్ ఇక్కడ, అమ్మ నాన్నల ఆశలు అడియాశలు చేస్తానని అనుకోలేదు. అటు రేవంత్ తల్లిదండ్రులు (మాధవి, రామారావ్ గార్లు) ఎంతో ఉన్నతమైన డబ్బు, హోదాగల నాయుడ్స్ కుటుంబం. కాని అమ్మ వాళ్ళది చాలా ఆర్థోడాక్స్ బ్రాహ్మణ కుటుంబం, రెండు కుటుంబాలకు చుక్కెదురు. తెలిస్తే అమ్మనాన్న ఈ పెళ్ళికి ఒప్పుకోరు. మా పెళ్ళి ఒక'కల'లాగా జరిగిపోయింది. అమ్మనాన్నలు, అటు రేవంత్ తల్లిదండ్రులు దుమ్మెత్తిపోశారు. ఇద్దరు మమ్మల్ని ఆహ్వానించలేదు. అంతకు ముందే రేవంత్‌కు అమెరికాలో జాబ్ ఉంది. ఫ్రెండ్స్ దగ్గరుండి అన్నీ సమకూర్చి అమెరికా పంపారు. అలా గడిచిపోతున్నాయి రోజులు.



అదొక పెద్ద హాస్పిటల్ న్యూయార్క్‌లో, ఉదయమే రాధికను హాస్పిటల్‌లో జాయిన్ చేశారు. ఫ్రెండ్స్ అందరికి ఫోన్ చేశాడు రేవంత్. రాధిక పరిస్థితి ఏమీ బాగాలేదు. కడుపులో బిడ్డ అడ్డం తిరిగిందని డాక్టర్స్ అంతా హడావిడిగా పరిగిడుతుంటే ఏమీ తోచలేదు. ఒకవైపు రాధిక ఆలోచనలు, రాధిక అన్నమాటలు "ఒక్కసారి అమ్మను చూడాలనిఉంది. మా అమ్మ వాళ్ళకు ఫోన్ చేయమని చెప్పింది. రేవంత్ ఎంత ట్రై చేసినా కలవలేదు. కొందరు వారు ఊరు వదలి వెళ్ళారని చెప్పారు. రాధిక పరిస్థితి చాలా అయోమయంగా ఉంది. చాలా బ్లడ్ పోవడం జరిగింది. చివరకు ఆపరేషన్‌చేసి బిడ్డను తీశారు. ఆడపిల్ల పుట్టిందని ఎంతో మురిసిపోయారు రేవంత్, రాధికలు. తమ తొలిసంతానం చూసుకొని ఫ్రెండ్స్‌కు వర్ణిస్తు చెప్పుకొన్నారు. అదే ఇండియాలో అయితే అమ్మనాన్న, బంధువులు, అటు రేవంత్ అమ్మ నాన్నలు మురిపెంగా పుట్టబోయే మనవరాలి కోసం ఎంత ఆరాట పడిపోయేవారో ! వాళ్ళంత ఎత్తుకొని మురిసిపోతుంటే చూసే ఆనందం 'మాకు' లేదని రాధిక రేవంత్‌లు ఎన్నోసార్లు బాధపడ్డారు.



ఆ రోజు సెప్టెంబర్ 11 అందరికిలాగానే అమెరికాలో తెల్లవారింది, కాని ఇంత ఘోరం జరుగుతుందని ఎవరు ఊహించలేదు. ఉదయం వాషింగ్టన్‌లోని న్యూయార్క్ నగరంలో ఆకాశంలోకి దట్టంగా ఎగిసిపడుతున్న మంటలు, పొగలు అలుముకొని కాలిపోతున్న వంద అంతస్తుల W.T.C. భవనం. దాదాపు 32 దేశాల ప్రజలకు, అమెరికా ప్రజల జీవితాలలో చీకటినింపిన రోజు. ఉగ్రవాద శక్తులకు బలిఅయిపోయిన ఆ భవనం రేపిన మంటలు ఎందరి హృదయాల్లోనో ఘోర మంటలు సృష్టించాయి.

రాధిక ఉదయమే లేచి పాప హారికనులేపి తయారుచేసి, ఇంపార్టెంట్ కాగితాలు, ఫైలు పట్టుకొని హడావిడిగా W.T.C. బిల్డింగ్‌లో విప్రో కంపెనీ ఏర్పాటు చేసిన తన ఆఫీస్ మీటింగ్‌కు బయలుదేరింది. వెళ్తున్నంతసేపు రేవంత్, హారిక(పాప)ల గురించి ఆలోచిస్తూనే వెళ్ళింది. వెళ్ళిన పదినిమిషాలకే ఫోన్ చేసి హారికకు జ్వరంగా ఉంది మందు వేయమని చెప్పింది రేవంత్‌కు. ఫోన్ పెట్టిన కాసేపటికే ఆకాశంలో దట్టమైన పొగలు. ఇటు పాప ఏడుపు అంతా అయోమయం ఉదయం నుండి ఫోన్స్ మ్రోగుతూనే ఉన్నాయి. రేవంత్‌ను ధైర్యంగా ఉండమని, మేమంతా వస్తున్నామని ఫ్రెండ్స్, రేవంత్ శిలా ప్రతిమలా అయి పోయాడు. ఏదో జీవశ్చవంలా జవాబులు చెబుతూనే ఉన్నాడు. అమ్మనాన్న జ్ఞాపకంవచ్చి 'పాపను' గుండెల కదుముకొని ఏడుస్తూనే ఉన్నాడు. వచ్చిన ఫ్రెండ్స్ అమ్మనాన్నలకు ఫోన్ చేశామని చెప్పారు. రాధిక అమ్మనాన్నలకే ఫోన్ కలవలేదని చెప్పారు.



తల్లిదండ్రులు కన్నవాళ్ళ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంటారు. తమ ఆశయాలకు అనుగుణంగా పెరగాలని, తమ పేరు ప్రతిష్టలు నిలబెట్టాలని, బంధువర్గంలో, సమాజంలో మంచి పేరు తెచ్చుకోవాలని చిన్నప్పటి నుండి కోటి కోరికలతో పెంచుతారు. అవి చెల్లా చెదురైనప్పుడే కొంత అలజడి రేగుతుంది. తమకు నచ్చిన విధంగా డ్రెస్ చేసుకోవడం, చదువుకోవడం, చివరకు జీవిత భాగస్వామిని ఎన్నుకోవడం, 'మీట్ మై వైఫ్', 'మీట్ మై హజ్బెండ్' అని ఏరోడ్రోమ్‌లో, బస్‌స్టాప్‌లో, రైల్వే స్టేషన్‌లో కన్నవారికి పరిచయం చేస్తే ఆశీర్వదించి ఊరుకోవడమే కన్నతల్లిదండ్రుల వంతు అయింది. ఇంతగా భారతదేశ సంస్కృతి, సమాజం ఎదిగింది. అమెరికా వెళ్ళే ఫ్లైట్ అనౌన్స్‌మెంట్ ఇవ్వడంతో రాధిక తండ్రి రాజశేఖరం గారు, రేవంత్ తల్లిదండ్రులు మాధవి-రామారావ్‌లు ఈలోకంలోకి వచ్చిపడ్డారు. ఆకాశంలో ఎగురుతున్న విమానంలో ఉన్నమాటేగాని ఏ ఆనందం లేదు. అనుక్షణం రాధిక, రేవంత్‌లు కళ్ళముందు మెదులుతున్నారు. "ఆ రోజు అలా జరిగి ఉండకపోతే పరిస్థితి ఎంతో వేరుగా ఉండేది. ఆస్తులు, అంతస్తులు, కులాలు అడ్డురాకుండా తల్లిదండ్రులకు ఇష్టమైన మారేజీ చేసుకుంటే ఈరోజు నా కూతురు ఇంత దూరంగా ఇలాఅయి ఉండేదా ! తల్లి బెంగపడి అనారోగ్యంతో మంచంలో పడి ఉంది. అందరితో అవమానాలు, సాటి వారి ఈసడింపులు నన్ను ఎంతో కృంగదీశాయి. నా చిట్టి తల్లి రాధిక ఎంత నరకం అనుభవించిందో !" అని తల్లడిల్లిపోతూంది రాజశేఖరంగారి హృదయం.

మరోవైపు "వాడు చేయరాని తప్పు ఏం చేశాడు ? తనకు నచ్చిన అమ్మాయిని చేసుకున్నాడు. మూర్ఖత్వంతో మేమే రేవంత్‌ను, కోడల్ని దూరం చేసుకున్నాం, అన్ని సవ్యంగా జరిగి ఉంటే ఇలా అయిఉండకపోయేదేమో. సంతోషంగా అమెరికా పంపేవాళ్ళం. అర్థం

లేని కోపాలతో రెండు ఏళ్ళుగా కన్నకొడుకును దూరం చేసుకొని, ఏ సంబంధాలు లేకుండా ఎంతో కుమిలిపోయాం, ఏం సాధించాం ?" అని రేవంత్ తల్లిదండ్రులు ఒక్కసారి వెనక ఒంటరిగా కూర్చున్న రాధిక తండ్రి రాజశేఖరం వైపు చూశారు. ఎలా ఊరడించాలో తెలియని పరిస్థితి, వారితో ఏ సంబంధాలు లేవు. అసలు కలుసుకున్నదే లేదు. భగవంతుడు ఆ శిక్ష ఏదో మాకు వేస్తే బాగుండేది. మా రేవంత్ జీవితంలో ఇంత చీకటి చేయాలా ? ఆ చిన్న పాపతో వాడు ఎలా తల్లడిల్లిపోతున్నాడో !".

అక్కడ మంచంలోఉన్న రాధిక తల్లి ఇందిర మనసులో ఎన్నో ఆలోచనలు. నిన్న ఉదయం నుండి ఫోన్స్ అంతా విషాదంగా ఉన్నారు. "నా చిట్టితల్లి రాధికకు ఏమీ కాలేదు కదా ! ఒక్కరోజు కూడా నన్ను వదలి, నా పొట్టమీద చేయివేసి పడుకోనిదే నిద్రపోని నా రాధమ్మ అంత దూరంలో ఎలాఉందో ? ఎన్నిసార్లు ఫోన్ చేయమని చెప్పినా ఆయన మొండి పట్టుదలతో, మూర్ఖత్వంతో ఒక్కసారి కూడా ఈ రెండేళ్ళలో దానితో మాట్లాడనే లేదు. దాని మొహం కూడా చూడలేదు. రాధిక వెళ్ళిన తరువాత ఇల్లంతా శ్మశాన నిశ్శబ్దమే అయింది. ఏ పండుగలు, సరదాలు, హడావిడి లేదు" అని ఆలోచిస్తూ ఏడుస్తూనే ఉంది ఆమె.

ఫ్లైట్ అమెరికా చేరడంతో ఆలోచనల నుండి తేరుకున్నారు మాధవి-రామారావ్, రాజశేఖరం గార్లు. రేవంత్ ఫ్రెండ్స్ రిసీవ్ చేసుకొని తీసుకెళ్ళారు. రేవంత్ చిన్నపాప హారికతో తిరిగి వారిని ఇండియా వచ్చారు. మనవరాలు చేతిలోఉన్నా ఎవరి మొహంలో సంతోషమే లేదు. అంత దూరం వెళ్ళిన కూతురును చూసుకోలేక పోయాననేబాధ రాజశేఖరంను ఎంతో క్రుంగదీసింది. అందరికి ఇండియాలో ఫ్లైట్ దిగగానే 'విషాద ఉదయమే' అయ్యింది. ❑






**శంకర్‌రావు శెంకేసి,**

జర్నలిస్టు (సబ్ ఎడిటర్, వార్త),

ఇ.నెం. 19-9-313,

రంగశాయిపేట, వరంగల్ - 506 002

ఫోన్ : 422735


# మావయ్యా మెయిల్

సాయంకాలాన్ని ఆస్వాదించడం అంటే నాకెంతో ఇష్టం. ఆ సమయంలో సన్నటి చల్ల గాలి శరీరాన్ని స్పృశిస్తుండగా చెవులకు వాక్‌మెన్ అమర్చుకొని సినారె 'ప్రపంచపదులు' గజల్స్ వింటుంటే నాకు మరో ప్రపంచం పట్టదు. సాయంకాలం... మనిషిని జీవనసమరం నుండి తమదైన జీవితంలోకి ఆహ్వానిస్తుంది. సాయంకాలం... మనిషికి ఆప్యాయతా, అనురాగాల మకరందాలను అద్దుతుంది కదా. అందుకే సాయంకాలం నన్నెప్పుడూ ముగ్ధుణ్ని చేస్తుంది. ఆరుగంటల వరకు గార్డెన్‌లో ఏకాంతంగా గడిపిన తర్వాత బైక్‌పై సైబర్‌కేఫ్‌కు బయలుదేరాను. ప్రతిరోజు ఓ గంటసేపు ఇంటర్‌నెట్ బ్రౌజింగ్ చేయడం నాకు అలవాటు. కేఫ్‌లోకి వెళ్ళగానే రిసెప్షనిస్టు చిరునవ్వుతో పలకరిస్తూ స్వాగతం పలికింది. ఉల్లాసంగా, ఉత్సాహంగా మానిటర్‌ముందు కూర్చొని బ్రౌజింగ్ మొదలెట్టి నా ఈ-మెయిల్ అక్కౌంట్‌ను ఓపెన్‌చేసి చూడగానే రెండు మెయిల్స్ కనిపించాయి. 'ఎవరు పంపించి వుంటారు ?' ఆతృత ఎగదోస్తుండగా మొదటి మెయిల్‌ను ఓపెన్ చేశాను. గ్వాలియర్ నుండి నా మిత్రుడు శశి 'ఎలా వున్నావ్' అంటూ అక్షరాల్లో పలకరించాడు. శశి నాకు ఇంటర్ నుండి డిగ్రీ వరకు క్లాస్‌మేట్. అద్భుతమైన తెలివితేటలను సొంతం చేసుకున్న జెమ్ వాడు. అగ్ర వర్ణంలో పుట్టినా కడుపేదరికంలో బతికి ఆత్మబలంతో ఎదిగినవ్యక్తి వాడు. డిగ్రీ పూర్తికాగానే ఎయిర్‌ఫోర్స్‌లో గ్రౌండ్‌డ్యూటీ ఆఫీసర్‌గా ఎంపికై తనేమిటో నిరూపించుకున్న బ్రిలియంట్. అందుకే వాడంటే నాకు విపరీతమైన అభిమానం. వారానికి రెండు రోజులు మెయిల్స్‌లో పలకరించుకోవడం మా ఇద్దరికీ మామూలు. పర్సనల్ నుండి ప్రపంచం వరకు ఏదో ఒక అంశం మా మెయిల్స్‌లో చర్చకు వస్తూనే వుంటుంది. ఈసారి మెయిల్‌లో మా వాడు 'ఆఫ్ఘనిస్తాన్‌పై యుద్ధం' గురించి చర్చపెట్టాడు. మొత్తం చదివేసి 'ఈ ఉగ్రవాదానికి, సామ్రాజ్యవాదానికి అంతం లేదా ?' అని దీర్ఘంగా నిట్టూర్చి మౌజ్‌ని మరో మెయిల్ మీదకు మూవ్ చేశాను.

సంభ్రమాశ్చర్యం... !? కాలిఫోర్నియా నుండి అభిరాం మావయ్యా పంపించిన మెయిల్ అది. అప్రయత్నంగా నా కళ్ళు అక్షరాల వెంట పరుగెత్తాయి. రెండు నిమిషాల్లో మెయిల్‌ను

చదివేశానో లేదో ఒక్కసారిగా నేను స్థాణువునైపోయాను. నేను చదువుతున్నది కలా ? నిజమా ? అన్నది అర్థం కావడంలేదు. మళ్ళీ చదివాను. మెయిల్‌లోవున్న సారాంశం నాలో ఊహించని ఉత్పాతాన్ని సృష్టిస్తోంది. మెయిల్‌ను ఎంత వేగంగా ఎన్నిసార్లు చదివానో అంత కంటే వేగంగా నా మనసు కల్లోలభరితంగా మారింది. పరిస్థితుల పర్యవసానాలకు సంబంధించి గజిబిజి ఊహలు చుట్టుముట్టి, నాకు ఊపిరి సలపనివ్వడం లేదు. ఈ విషయం తాతయ్యకు ఎలా చెప్పాలి ? వయస్సు పైబడ్డ ఆయన ఈ విషయాన్ని జీర్ణించు కోగలుగుతాడా ? అయినా మావయ్యకు అన్నీ తెలిసి, ఇంత నిర్ణయం ఎలా తీసుకో గలిగాడు. నా మనసు అస్తవ్యస్తంగా మారిపోయింది.

ఐదేళ్ళ క్రితం ఇంజనీరింగ్ పూర్తయిన వెంటనే తన జీవిత స్వప్నాన్ని నెరవేర్చు కునేందుకు మావయ్య స్టేట్స్ కెళ్ళడానికి సిద్ధమయ్యాడు. ఒక్కగానొక్క కొడుకైనందున తన కళ్ళముందే వుండమని తాతయ్య అంటే తాను రెండు మూడేళ్ళు మాత్రమే అక్కడ వుండి తిరిగి ఇండియా వస్తానని తాతయ్యను మావయ్య ఒప్పించగలిగాడు. అప్పటి నుండి తాతయ్య క్షేమసమాచారాల్ని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ మావయ్య మా మధ్య వున్నట్లే వ్యవహరించేవాడు. మెయిల్స్‌లో ఎప్పుడూ నన్ను పలకరిస్తూ, తన అనుభవాలు రాస్తూ కుటుంబ విశేషాలు తెలుసుకునేవాడు. ఎప్పటికప్పుడు ఇక్కడికి ఫోన్లు, మెయిల్స్ ద్వారా టచ్‌లో వుండే మావయ్య ఈ వారం రోజుల నుండి ఎందుకు గ్యాప్ ఇచ్చాడో నాకిప్పుడు అవగతమవుతోంది.

తాతయ్యకు ఇద్దరు పిల్లలు. మా మమ్మీ తర్వాత చాలాకాలానికి మావయ్య పుట్టాడట. అందుకే వయస్సులో మావయ్య నాకన్నా పదేళ్ళు మాత్రమే పెద్ద. ఎంత తిన్నా తరగని ఆస్తి తాతయ్యకు వారసత్వంగా వచ్చింది. మావయ్య పసివాడుగా వుండగానే అంతుబట్టని అనారోగ్యానికిగురై కళ్ళముందే తన భార్య శుష్కించి తిరిగిరాని తీరాలకు వెళ్ళిపోయినా, తాతయ్య దుఃఖాన్ని దిగమింగుకున్నాడేగాని తల్లిలేని లోటును కనిపించనివ్వలేదు. తరాలకు సరిపడా ఆస్తి, ఐశ్వర్యంవున్నా తన పిల్లలకు తల్లి ప్రేమ దక్కలేదే అని తాతయ్య ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపాడో... ?

ఇంటర్‌పూర్తయిన వెంటనే నాకు వరంగల్ ఆర్.ఇ.సి.లో ఇంజనీరింగ్ సీటు రావడంతో గత ఏడాదిగా నేను తాతయ్య వద్దే వుంటూ చదువుకుంటున్నాను.

మావయ్య మెయిల్ విషయం తాతయ్యకు ఎలా చెప్పాలి. పోని ముందు అమ్మకు తెలియపరిస్తే ? అమ్మ ద్వారా ఈ సంగతి తాతయ్యకు తెలిస్తే... నువ్వెందుకు చెప్పలేదని తాతయ్య నన్ను నిలదీయడూ !? తాతయ్యకు నేను డైరెక్టుగా చెబితే పాలుపోవడం లేదు. కంప్యూటర్ ముందు కూర్చున్నానేగాని నాకు కాళ్ళు చేతులు ఆడటం లేదు. అంతః

స్సంఘర్షణతో నా మనసు అతలాకుతల మవుతోంది. పరిష్కారం చెప్పమని శశికి ఫోన్ చేస్తే... ముందు అమ్మకే చెప్పమని వాడి సలహా. ఇక మరో ఆలోచన లేకుండా అమ్మకే ఈ విషయం చెప్పాలని నిర్ణయానికొచ్చాను. అనుకున్నదే తడవుగా ఓ మనిషి ద్వారా అమ్మకు కాగితంపై మావయ్య విషయం రాసి వెంటనే బయలుదేరి రమ్మని సమాచారం పంపించాను. నాపై సగం భారం దిగినట్లయింది. అయినా రేపు ఏం జరుగబోతోందోనన్న ఉత్కంఠ నాలో టెన్షన్‌ను పెంచుతోంది. ఇంటికెళ్ళగానే తాతయ్య ఒక పక్కకు ఒరిగి నిద్రపోతూ కనిపించాడు. ఒంట్లో జ్వరంగా వుందని తాతయ్య భోజనం చేయకుండానే పడుకున్నాడని పనివాడి ద్వారా తెలుసుకున్నంతనే నా మనస్సు మరింత అప్‌సెట్ అయింది. భోజనం అయిందనిపించి రాత్రంతా ఆలోచిస్తూ తెలీకుండానే నిద్రలోకి జారుకున్నాను.



అగమేఘాల మీద బయలుదేరిందనుకుంటాను ఉదయం 8 గంటలకల్లా అమ్మ రానే వచ్చింది. న్యూస్ పేపర్ చదవడంలో నిమగ్నమైన తాతయ్య అకస్మాత్తుగా వచ్చిన అమ్మను చూసి సంభ్రమాశ్చర్యం చెందాడు. వస్తున్నట్లు ఒక్కమాటైనా చెప్పలేదంటూ ఆప్యాయంగా పలకరించాడు. కుశల ప్రశ్నల తర్వాత అమ్మ సేదదీరింది. రీడింగ్ రూమ్ లోకి వచ్చి మెయిల్‌లో ఏం వచ్చిందో నన్ను వివరంగా చెప్పమంది. మెయిల్‌ను మరోసారి చదివి వినిపించాను. అమ్మ దీర్ఘాలోచనలో పడిపోయింది. 'ఎలా చెప్పాలి' అంటూ సతమత మవుతోంది. ఇంతలోనే 'భోజనాలు సిద్ధం' అని పనివాడు చెప్పడంతో తాతయ్య, అమ్మ, నేను కలసి భోజనానికి ఉపక్రమించాం. కుటుంబ వ్యవహారాలు, నా చదువు, భవిష్యత్తు, వ్యవసాయం భూముల్లో నక్సలైట్లు పాతిన జెండాల విషయం, గత జ్ఞాపకాలు... ఎన్నో అంశాలు మా ముగ్గురి మధ్య చర్చలోకొచ్చాయి. మావయ్య మెయిల్ విషయం చెబితే తాతయ్య హతాశుడై భోజనం చేయకుండానే లేస్తాడనుకుందో ఏమో, అమ్మ ఆ టాపిక్ తీయలేదు. భోజనం పూర్తవ్వగానే తాతయ్య తనకు ఇష్టమైన ఈజీ చైర్‌లో అలా మేను వాల్చాడు. ఎదురుగా సోఫాలో అమ్మ, పక్కన నేను కూర్చున్నాను.

"నాన్నా... అభి ఎలా వున్నాడట ?" అమ్మ మెల్లగా పలకరించింది.

తాతయ్య ముఖంలో నవ్వూ, ఆవేదన ఏకకాలంలో మిళితమైన స్పందన. "వాడికేం బాగానే వున్నాడట, తనుంటున్నది అమెరికాలో కదా... మనమెలా గుర్తొస్తాం" తాతయ్య నిర్వేదంతో మాట్లాడాడు. మూడేళ్ళకే తిరిగొస్తానన్న మావయ్య ఐదు ఏళ్ళయినా రాకపోయే సరికి తనలో పెరుగుతున్న అసహనానికి ప్రతిబింబంగా కనిపించాడు తాతయ్య.

తాతయ్య స్పందనను చూసి అమ్మ కాస్త ఇబ్బందికిలోనైనా మళ్ళీ సర్దుకొంది.

"నాన్నా... అభి గురించి మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి" అమ్మ డైరెక్టుగా పాయింటు కొచ్చేస్తోంది. తాతయ్య నొసలు చిట్లించి ప్రశ్నార్థకంగా చూశాడు.

"అభి నిన్న మధ్యాహ్నం నివాస్‌కు మెయిల్ పంపాడట" అమ్మ విషయాన్ని దారిలోకితెస్తోంది.

తాంబూలం నోట్లో వేసుకునే వాడల్లా ఆగి ఓ క్షణం నన్ను చూసి తిరిగి అమ్మవైపు చూస్తూ "ఏం రాశాడమ్మా అందులో..." అన్నాడు.

ఎలాచెప్పాలో అమ్మకు తోచడం లేనట్లుంది. మాటలు బయటకు చెప్పలేక, పెదవులు కదపలేక తటపటాయిస్తోంది. తాతయ్య అమ్మ పరిస్థితిని గమనించినట్లున్నాడు.

"అభి మెయిల్‌లో ఏమని రాశాడమ్మా ? తనిక ఇండియా రావడం కుదరదు అంటున్నాడా ?" తాతయ్య మాటల్లో ఎందుకో వ్యంగ్యం ధ్వనించినట్లు అన్పించింది.

నాలో క్షణక్షణం ఉత్కంఠ తీవ్రమవుతోంది. 'కథ' క్లయిమాక్స్‌లోకి రావడంతో ఏం జరగబోతోందోననే ఆతృత నన్ను స్థిమితంగా కూర్చోనివ్వడం లేదు.

"నాన్నా... మన అభి, స్టేట్స్‌లో పెళ్ళి చేసుకున్నాడట. అమ్మాయి కూడా ఆ దేశపు మనిషేనట" ఎట్టకేలకు అమ్మ విషయాన్ని చెప్పేసింది.

అమ్మ మాటలు విన్నంతనే తాతయ్య దిగ్భ్రమకు గురై కంపించిపోలేదు. స్థిరంగా, స్థిమితంగా చూస్తూ.. "తెలుసు" అన్నాడు. అనూహ్య సమాధానంతో నేను నివ్వెరపోయాను. అమ్మ అయోమయంగా చూస్తోంది.

"వారంరోజుల తర్వాత అభి నిన్న పొద్దున్నే ఫోన్‌చేసి తను పెళ్ళి చేసుకున్నట్లు చెప్పాడు. ఎందుకలా చేశావని ప్రశ్నించాను. తప్పనిసరి పరిస్థితుల్లో అంటూ ఏదో చెప్పబోయాడు. వాడు చేసిన పనితో నా మనసు విరిగింది... నా గుండె పగిలింది. నువ్విక నా కొడుకువే కాదని ఒకే ఒక్క మాట చెప్పేసి ఫోన్ పెట్టేశాను" తాతయ్య కళ్ళు ఎరుపెక్కాయి. నుదిటిపై స్వేదబిందువులు అలుముకున్నాయి.

"తల్లి లేని లోటును తెలీకుండా, కంటికి రెప్పలా పెంచి పెద్దచేసినందుకు వాడు నా కిచ్చిన విలువా, గౌరవం చూశావా లక్ష్మీ..." అమ్మను చూస్తూ కంటనీరు పెట్టుకున్నాడు.

నాకు ఊహ తెలిసిన దగ్గరనుండి తాతయ్య కళ్ళల్లో మొదటిసారిగా కన్నీళ్ళను చూశాను. ఆయన కంటనీరు పెట్టుకున్నంతనే అమ్మ కళ్ళల్లో నీళ్ళు ఉబికివచ్చాయి. దుఃఖం పెల్లుబుకుతుండగా ఆమె కళ్ళు సజలాలయ్యాయి. ఆ క్షణంలో అప్రయత్నంగానే నా కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి.

"ఒక్కగానొక్క కొడుకు పెళ్ళిని ఈ చేతుల మీదుగా అంగరంగ వైభవంగా చేయాలని కలలు కన్నాను. చలపతి కూతురును నా కోడలిగా చేసుకుంటానని మాటిచ్చాను. ఈ విషయం. ఈ విషయం తెలిసీ, వాడు ఎవరో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు చలపతికి నా ముఖాన్ని ఎలా చూపించను ? కృష్ణయ్య కొడుకు ఎవరికీ చెప్పకుండా

పరాయిదేశపు పిల్లను పెళ్ళాడట అని ఊరంతా చెప్పుకుంటుంటే నేను ఎలా తలెత్తుకో గలను ?" పొంగుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నాడు తాతయ్య.

"సావిత్రీ... చనిపోయి ఏ స్వర్గాన వున్నావోగాని నీ కొడుకు ఏం చేశాడో చూస్తున్నావా ? ఇవన్నీ భరించడానికేనా నన్నిక్కడ వదిలేసి నువ్వెళ్ళింది" అమ్మమ్మను తలుచుకుంటూ తాతయ్య దుఃఖ సాగరంలో మునిగిపోయాడు. గత జ్ఞాపకాలను, అనుభవాలను గుర్తుకు తెచ్చుకుంటూ పొరలి పొరలి ఏడ్చాడు.

తనే పరిస్థితుల్లో పెళ్ళి చేసుకున్నాడో వివరిస్తూ అభి మెయిల్ రాసిన విషయాలు తాతయ్యకు తెలియలేదని అమ్మ గ్రహించింది. దుఃఖాన్ని ఆపుకొని తనను స్థిమిత పరుచుకొంది.

"నాన్నా... అభి మాటల్ని వినకుండానే, వాడలా ఎందుకు చేశాడో తెలుసుకోకుండానే మీరు ఫోన్ పెట్టేశారు. కానీ, నాన్నా... ఆ అమ్మాయేగనక లేకపోతే మన అభి మనకు ఈ రోజు వుండేవాడు కాదు".

అమ్మ మాటలు విన్నంతనే తాతయ్య హతాశుడయ్యాడు. "ఏమిటమ్మా నువ్వనేది..." వణుకుతున్న స్వరంతో ప్రశ్నించాడు.

"న్యూయార్క్ టవర్స్‌పై ఉగ్రవాదులు చేసిన దాడిలో మన అభి తీవ్రంగా గాయ పడ్డాడట. అంతా అల్లకల్లోలంగా మారిన ఆ రోజున, వాడి సహోద్యోగిగా పనిచేసే ఆ అమ్మాయి మానవత్వంతో అభిని ఆసుపత్రిలో చేర్పించి కంటికి రెప్పలా చూసుకొని ప్రాణాల్ని కాపాడిందట. ఆ సమయంలో వాళ్ళిద్దరి మధ్య ఏర్పడిన అనుబంధం పెళ్ళికి దారి తీసిందేగాని, మీరంటే విలువా, గౌరవం లేక కాదు నాన్నా...".

అమ్మ మాటలు పూర్తికాగానే తాతయ్య నిశ్చేష్టుడయ్యాడు. తనెంత తొందరపడింది గ్రహించి పశ్చాత్తాప హృదయంతో విచలితుడయ్యాడు.

"తను తీవ్రంగా గాయపడిన విషయం తెలిస్తే మీరు ఏమవుతారోననే భయంతో అభి కనీసం ఆ మాట కూడా మీకు చెప్పలేదు. జరిగిన విషయాన్ని చలపతి మావయ్యకు చెప్పి ఆయన నుండి మీకు మాట రాకుండా ఒప్పించాడట. నాన్నా... అభికి మీరంటే ఎంత గౌరవమో మీ ఆత్మసాక్షికి తెలుసు. వాడు ఏనాడూ తప్పుచేసి ఎరుగడు. మీరు వాడిని ఆశీర్వదించలేకపోతే వాడు మనశ్శాంతితో వుండలేడు. వాడు బాగా లేకపోతే మీరు తట్టు కోలేరు. పెద్దమనసుతో వాడిని క్షమించండి నాన్నా...". అమ్మ ప్రాధేయపడినట్లుగా అంది.

అప్పటివరకు నిశ్శబ్ద సముద్రంలా వున్న తాతయ్య బావురుమని ఒక్క ఉదుటన లేచి "అభీ... అభి..." అంటూ ఫోన్‌వైపు దూసుకెళ్ళాడు. ❑

డా॥ టి. శ్రీరంగస్వామి, M.A., Ph.D.
ఇ.నెం. 5-11-481,
విద్యారణ్యపురి, హన్మకొండ - 506 009
జి॥ వరంగల్.



# వేరు

ఆఫీసు నుండి ఇంటికి రాగానే ఉత్తరాలను వేదుక్కోవడం గత 20 సంవత్సరాలుగా అలవాటు. ఆ రోజు కూడా వెతుకుతుంటే లక్ష్మణ్ ఉత్తరం ఎదురయింది. ఆత్రుతగా విప్పాను. సాహిత్య సమావేశమును ఏర్పరచాము, మీరు అధ్యక్షులుగాను, కనకయ్య గారు ముఖ్యఅతిథి. మీరు ఇద్దరు కలిసి రండని దాని సారాంశము. కనకయ్యగారు అంటే మంచి పేరున్న రచయిత. ఆయన వ్రాసిన ఒక నవల చాలా పేరు తెచ్చుకున్నది. అది ఇప్పటికీ సాహిత్య చర్చల్లోకి వస్తున్నది కూడా. ఇంత వరకు నేను అధ్యక్షస్థానాన్ని వహించ లేదు. ఈ అనుభము కూడా చూద్దామని ఒప్పుకున్నాను. కనకయ్య గారితో సమస్థాయిలో కూడా వెళుతున్నాను కదా అని ఒక ఆనందం. ఆయన రచయిత మాత్రమే కాకుండా, ఉద్యోగరీత్యా నాలుగంకెల జీతాన్ని అందుకుంటున్నవాడు కూడ. నేను సాహితీ సంస్థలతో అనుబంధము ఉన్నవాడిని కాబట్టి కలిసి వెళ్ళడానికి ఇబ్బంది ఏముందిలేననుకుని, నా అంగీకారమును లక్ష్మణ్‌కు రాసాను. కనకయ్యగారిని సంప్రదించాను "నాకు కూడా లక్ష్మణ్ గారి దగ్గరినుండి ఉత్తరము వచ్చింది, నేను కూడా సరేనని అన్నానని" చెప్పారు.

కనకయ్యగారు కోరినట్లుగానే తెల్లవారుగట్లుగా లేచి, ఆయన ఇంటికి వెళ్ళి, అటు నుండి ఇద్దరం కలిసి రైల్వే స్టేషన్‌కు వెళ్ళాము. స్టేషన్‌లో ఇద్దరమూ టీ తాగాము. పేపరు కొనుక్కున్నాము. డబ్బులు నేనే ఇచ్చాను. పేరున్నవాడు, కాస్త పెద్దవాడుగా అనే మర్యాదతో ట్రేన్ టిక్కెట్లుకూడా నేనే తీసుకున్నాను. ఎందుకంటే లక్ష్మణ్ దగ్గర కనకయ్యగారి టికెట్ డబ్బులు తీసుకోవచ్చునులేనని. ట్రేన్ దిగగానే లక్ష్మణ్ పంపించిన మిత్రులు వచ్చి మమ్మల వేదిక దగ్గరకు తీసుకువెళ్ళారు. కార్యక్రమములో నా అధ్యక్షత బాధ్యతను బాగుగానే నిర్వహించాను. అప్పుడు నాకు అనిపించింది, నేను కూడా సాహిత్య సభలకు అధ్యక్షత వహించగలనని. మనసులో మాత్రం రైలులో కనకయ్యగారు ప్రవర్తించిన తీరు కొద్దిగా ఇబ్బంది పెట్టడం ప్రారంభించింది. ఆయన జీతానికి తక్కువ లేదు కదా ! మర్యాదకు నేను స్టేషనులో ఆటో డబ్బులు ఇచ్చాను, చాయ్ తాగించాను. పేపరు కొనుక్కోవడానికి, మళ్ళీ చాయ్ తాగడానికి నన్నే డబ్బులు ఇవ్వమంటాడేమిటని ? ఆయన చాయ్ తాగడానికి రెండు రూపాయలు ఖర్చు పెట్టలేడా ! మరీ ఆయనే ఆఫర్ చేశాడు కదా ! అని.

సభ అయిపోయాక కనకయ్యగారి అభిమాని ఒకరు వచ్చి, మీరు మా ఇంటికి రావాలని ఆహ్వానించారు. సాయంత్రం ట్రేనుకు తిరిగిపోవాలనే ఆలోచన మాది. సభలో ఒకతను వచ్చి ఆయన రచనలు మాకిరువురికి ఇచ్చాడు. కనకయ్యగారు తన పుస్తకమును కూడా నా చేతికే ఇచ్చాడు. కనకయ్యగారు తన అభిమాని ఇంటికి పోవడానికి సిద్ధమయ్యాడు. అప్పుడు నేను "సరే మీరు వెళ్ళండి. నేను ఈ ఊళ్ళోవున్న మా తమ్ముడింటికి వెళతాను, తరువాత నేను వస్తాను, మీరు నా కొరకు ఎదురుచూడకండి" అని చెప్పాను.

"నేను సార్‌ను (కనకయ్య గారిని) ట్రేన్ ఎక్కిస్తాను, మీరేమి కంగారుపడకండి" అని చెప్పాడు ఆ అభిమాని.

అప్పటివరకు కనకయ్య గారి ప్రవర్తనతో విసిగివున్న నేను ఇదే సందు అనుకొని "మీరు నా కొరకు ఎదురుచూడకండి, నేను రాత్రి బస్సులో వస్తానని చెప్పాను". ఆయన తన అభిమానితో వెళ్ళిపోయారు.

సమావేశం ఉదయం కావడం మూలాన రెండు గంటల వరకు అయిపోయింది. సాయంత్రం ఐదు గంటలకు ఆ అభిమాని, లక్ష్మణ్ వచ్చి "కనకయ్య గారిని ట్రేన్ ఎక్కించి వచ్చామని చెప్పారు". నా మనసులోని సందేహం తీర్చడం కొరకు అన్నట్టుగా "ట్రేన్ టికెట్ కొనిచ్చాను, యాభై రూపాయలు కూడా చేతికిచ్చి వచ్చామని" చెప్పారు. "మంచి పని చేశారని" నేను అన్నాను.

నేను రాత్రి పదిగంటల వరకు ఇంటికి చేరుకున్నాను. మనసులో మాత్రం కనకయ్య గారి ప్రవర్తన, ప్రఖ్యాత రచయిత-ఆయన రచనలలోని ఆదర్శాలు, అభిప్రాయాలు ముల్లులా నన్ను గుచ్చుతూనే వున్నాయి. ఆయనకు ఆ ఊళ్ళో అభిమాని ఇచ్చిన పుస్తకం నా దగ్గరే వున్నది. ఆయనకు అది ఎలా అందచేయడం. ఆయన దగ్గరకు వెళ్ళడానికి మనసు ఒప్పడం లేదు. ఎందుకంటే ఆ సమావేశానికి ఇద్దరమూ సమానస్థాయిలోనే వెళ్ళాము. అటువంటప్పుడు ఇద్దరము సమానులమే కదా ! నేను ఏదో కార్యకర్తను అయినట్టుగాను, ఆయన గొప్పవాడు అయినట్టుగాను ఫీల్ అవడము నాకు ఏ మాత్రము నచ్చలేదు. కనీస మర్యాదలు లేనివాడుగా ప్రవర్తించడం ఇబ్బందిగానే వుంది. పేపరు కొనుక్కోవడానికి ఆయన దగ్గర అర్ధరూపాయి లేదా... ? నేను ఎందుకు పెట్టాలి అన్నప్పుడు, ఆయనలోని ఆదర్శాలు, పుస్తకాల్లోని ఉన్నతమైన భావాలు ఎక్కడకు వెళ్ళాయని ఆలోచనలు సాగుతున్నాయి.

ఆఫీసుకు వెళ్ళాను, నాకెందుకులే అన్నట్టుగా అటెండర్‌కు అడ్రస్ చెప్పి, ఆయన పుస్తకాలను ఆయనకు పంపించాను. అటెండర్‌ను ఆఫీస్ ఫోన్ నెంబర్ అడిగాడట, అతను చెప్పి వచ్చాడట. సరేలే అనుకున్నాను.

నాలుగంటల ప్రాంతంలో ఫోన్ వచ్చింది. ఎవరబ్బా ! అనుకుంటూ వెళ్ళాను. ఫోన్‌లో కనకయ్యగారే. అంతవరకు ఆయన గురించి ఆలోచిస్తున్న ఆలోచనలను లోపలకు నెట్టేసి, "హలో" అన్నాను.

"రామారావుగారూ, ఇదేమీ న్యాయమండీ... నన్ను మధ్యలో వదిలేసారేమని" అన్నారు.

"మీరు, మీ అభిమాని పిలిస్తే వెళ్ళారుగా... అటు నుండి ట్రేనుకు వెళ్తానని అన్నారుగా. నేను మా తమ్ముడి దగ్గరకు వెళ్ళొస్తానని చెప్పాగా. నా కొరకు ఎదురుచూడవద్దని చెప్పాను కదా" అని అన్నాను.

"ఆఁ ! వాళ్ళు స్టేషనుకు వచ్చారు. నా జేబులో డబ్బులు లేవు. స్టేషనులో మా ఫ్రెండ్ కనపడితే అతని దగ్గర డబ్బులు తీసుకొని టికెట్ తీసుకున్నాను. లేకపోతే చాలా ఇబ్బంది పడేవాడిని" అన్నాడు ప్రఖ్యాత రచయిత కనకయ్య.

"అలా అంటారేమిటండీ... అయినా వారు మీకు టికెట్ కొనిచ్చానని అన్నారు కదా. మీ ట్రేన్ వెళ్ళాకనే వచ్చామని చెప్పారు కదా" అని అన్నాను.

"మీరు ఇలా చేయడం నాకు నచ్చలేదు...".

"మీరేమో మీ అభిమానితో వెళితిరి కదా... మరి నాతో వచ్చినపుడు, నాతోనే వుండాలి కదా... నేను కూడా మీలాగే వారి ఆహ్వానం అందుకొని వచ్చాను కదా ! మీరు... "

"నన్ను ఇబ్బంది పెట్టారు" అంటూ ఫోన్ పెట్టేసారు కనకయ్య.

ఏమిటీ ఈ పెద్దమనిషి. నా వృత్తిపరంగా నేనేమో మూడంకెల జీతంవాడిని, ఆయనేమో నాలుగంకెలవాడు. అదీగాక పరాయి ఊరు వెల్తున్నప్పుడు జేబులో ఓ యాభై రూపాయలు లేకుండా ఎలా వస్తాడు ? అదీగాక వారేమో టికెట్ కొనిచ్చి, డబ్బులు కూడా చేతికిచ్చామని అన్నారు. లక్ష్మణ్ నాకు గత ఐదారు సంవత్సరాలుగా పరిచయమున్న వ్యక్తి ఆయన సంగతి తెలిసికూడా. అందులో అభిమానులు ఎలా ప్రవర్తిస్తారో తెలిసినవాడిని కదా... ఆ అభిమాని టికెట్ కొనిచ్చానని చెప్పాడు కదా. అయినా రైలు టికెట్ ఎంత ? ఎనిమిది రూపాయలు. ఎంత పేరుంటే ఏమిటీ ? ఎంత డబ్బు సంపాదిస్తే ఏమిటి ? మనిషి సహజంగా ఉన్నతుడు కావాలికానీ. ప్రఖ్యాత రచయిత కంటే ఉన్నతుడైన మామూలు రచయితే మేలు. వేల జీతం సంపాయించే వాడికంటే, రోజుకో రూపాయి సంపాయించుకునే కూలే సంస్కారంలో ధనికుడనిపించింది.

కనకయ్య ఎన్ని రచనలు ప్రచురించినా, ఆయన తొలిరచన రజతోత్సవము చేసుకొనిన ఈ సంఘటనే నాకు గుర్తుకు వస్తుంది. మొన్నొక మిత్రుడు వచ్చి "నేను ఒక కథల సంపుటి

వేసుకుంటున్నాను. కనకయ్యగారితో ముందుమాట వ్రాయించుకోవాలి, మీరు నావెంట రండి అంటే'', ఆ మిత్రుని మాట కాదనలేక వెంట వెళ్ళాను. కనకయ్యగారికి తన కథల ప్రతి ఇచ్చి ముందుమాట రాయమని అడిగాడు. ఆయన ఎప్పటిలోగా కావాలె అని అడిగాడు. వారం రోజులు అని చెప్పాడు. ఒక్క నిమిషం అంటూ లోపలికి వెళ్లి మూడు కాగితాలు తెచ్చి మాకిచ్చాడు. ఆ కరపత్రాలలో వున్నది ఏమిటంటే తను షష్టిపూర్తి చేసుకుంటున్నాను, ఈ సందర్భముగా ఒక ప్రత్యేక సంచిక తెస్తున్నట్టుగాను, రెండు రచనలు ప్రచురిస్తున్నాను, దానికి మమ్ములను ప్రకటనలు ఇప్పించమని కోరాడు. మేము విని బయటకు వచ్చాము.

కొంత దూరం వచ్చాక ఆ మిత్రుడు ఇలా అన్నాడు "ఏమిటీ ఈయన కథల సంపుటికి ముందుమాట రాయమంటే, డబ్బులడుగుతున్నాడని..." (ప్రకటనల రూపంలో).

ఇరువై ఏండ్లు గడిచినా కనకయ్యగారి ప్రవర్తనలో ఏ మాత్రము మార్పు రాలేదని అనిపించింది. ఆయన సంకుచితత్వము మారదేమో.

అందుకే రచయిత వేరు, మనిషి వేరు. 






**మరింగంటి యాదగిరాచార్యులు,**

లెక్చరర్,

ఇ.నెం. 4-17, గోపాలపురం

హన్మకొండ - 506 015 ఫోన్ : 438683


# రాలిన సుమాలు

మొండి గోడల వెనుక నుంచి మూడు జతల కళ్ళు భయం భయంగా వీధివైపు చూస్తున్నాయి. అప్పుడే తెలవారుతోంది. కాస్తంత ఊపిరి పీల్చుకోవచ్చు ననుకుంటున్నారు వాళ్ళంతా. రాత్రనగ వెళ్ళిన తండ్రి కోసం ఆదుర్దాగా ఎదురుచూస్తున్న తల్లి కళ్ళల్లోకి చూసే ధైర్యం లేకపోయింది. ఏదో ఒక రోజయితే సర్దుకపోవచ్చు. గత కొన్నిదినాలుగ, ఆమాటకొస్తే కొన్ని సంవత్సరాలుగ ఇదే తంతు. ఎప్పటికప్పుడు మరణాన్ని వాయిదా వేయించుకోవటం, జీవితాన్ని పొడిగించుకోవటం ఒక రివాజు అయింది. ఇది ఏ ఒక్క కుటుంబానికో కాదు, మృత్యు క్రీడ ఒక సరదాగ భావించే ఉగ్రవాద తండాల స్వర్గధామంగా మారినప్పటి నుంచి అఫ్ఘాన్‌లో సాధారణ పౌరకుటుంబాల పరిస్థితి ఇదే. రియాజ్ కుటుంబం ఒకప్పుడు బాగా బతికిన కుటుంబమే. తన బాల్యంనాటి ఏవో కొన్ని తీపిగుర్తులు జ్ఞాపకం వున్నమాట నిజమే. కనీసం తనలాంటి బాల్యాన్నయిన తన పిల్లలకు ఇవ్వలేకపోవటం రియాజ్‌ను ఎప్పుడు వేధిస్తూనేవున్నది. విభిన్నజాతుల, సంస్కృతుల సమ్మేళనంతో చారిత్రకంగా, సాంస్కృతికంగా సుసంపన్నమైన దేశం ప్రపంచానికి కంటగింపుకావటం ఒక్క రియాజ్‌నే కాదు ఎందరో దేశభక్తులను కలవరపరుస్తున్న విషయం. ఎవరెవరో ఎక్కడనుంచో వచ్చి తమ స్వాధికారాన్ని హరించి పెత్తనం చెలాయిస్తుంటే, స్వాభిమానం తాకట్టుపెట్టలేక తుపాకీరాజ్యాలకుఎదురు నిలవలేక జీవచ్ఛవాల్లా గడుపుతున్న తనలాంటి వేల కుటుంబాలను పట్టించుకునేదెవరు ? సోవియట్ సేనల పద ఘట్టనల కింద కొన్నాళ్ళు, తాలిబన్ల నిరంకుశ పాలనలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కరువై నేడు కట్టుబానిసల్లా బతుకు నెట్టుకొస్తున్న వాళ్ళగతేంటి ? మతాన్ని అడ్డుపెట్టుకొని మారణహోమం చేయమని వీళ్ళకు అధికారం ఎవరిచ్చారు ? పరమత సహనాన్ని బోధించే ఇస్లాంను వక్రీకరిస్తున్న ఉన్మాదులు ఉగ్రవాదులుగామారి మతానికే మచ్చ తెస్తున్నారు. శాంతికాముకులై హేతుదృక్పథంతో ఆలోచించే తనలాంటి వాళ్ళను గుర్తించేదెవరు ? ఇట్లాంటి ప్రశ్నలు వేధించని క్షణం లేదు. వీటికి అసలు జవాబు దొరుకుతుందా ?

ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. వేడి వేడి చాయ తాగితే బాగుండు ననిపించింది రియాజ్‌కు. రాత్రంతా తాలిబన్లకు నిర్బంధ చాకిరి, పగలు రక్షణకు సిద్ధంగా ఉండటం, విసుగనిపించింది. ఇంకాస్త ఓపికపడితే ఇంటికి చేరవచ్చు ప్చ్... ఇల్లు ! ఒకనాడు అది నిజం కావచ్చునేమో, కాని నేడది మొండి గోడల మధ్య నిలబడ్డ తాత్కాలిక గుడారం. అసలే ఎముకలు కొరికే చలి ప్రారంభమయ్యే రోజులు. కాలం ఎట్లా వెళ్ళదీయాలో కూడా తోచటం లేదు. పిల్లల పరిస్థితి తలుచుకుంటే గుండె పిండినట్లవు తున్నది. కడుపునిండా తిండిపెట్టే స్థితికూడా లేదు. తను, తన తరానికి చెందిన ఆడ, మగ అనుభవించిన స్వేచ్ఛ వీళ్ళకేది. మరీ ఆడపిల్లల పరిస్థితి దయనీయంగా వున్నది. చదువుకోటానికి, బయటకు వెళ్ళటానికి ఇష్టమైన దుస్తులు వేసుకోటానికి, కనీసం మనసు విప్పి మాట్లాడుకునేందుకైన స్వతంత్రం లేదు. బందీఖానాలో జీవచ్ఛవాల్లా బ్రతుకీడుస్తున్నారు.

తన అక్క, చెల్లెళ్ళు చదువుకున్నవారే. తమ కుటుంబం స్త్రీ విద్యకు ఎంతో ప్రాధాన్యం ఇచ్చేది. అంతెందుకు పెళ్ళయినాక భార్యను చదువుకొమ్మని తానెంత ప్రోత్సహించాడు. ఎంత తెలివయినది, అప్పుడప్పుడు కవితలు వ్రాస్తుండేది. అవి ఎంత సృజనాత్మకంగా వుండేవి. ఇప్పటి ఆమె స్థితిని ఆలోచిస్తే ఉబికివస్తున్న కన్నీళ్ళు ఆగటం లేదు. ఎంతో ధైర్యవంతమైన తమ జాతి ఇంత వేదనకు, నైరాశ్యానికి గురికావటానికి, తమ జీవితాలు ఇంతటి మలుపు తిరగటానికి, చరిత్ర తమ జాతిని ద్వేషించటానికి ఎంత మాత్రం కారణం కాని తాము ఎంత కాలం ఇలా బ్రతకాలి ? మళ్ళీ ప్రశ్నల పరంపర మొదలవుతున్నదను కున్నాడు. ఇక లాభం లేదు... నీరసం ఆవహిస్తున్నది. త్వరగా ఇల్లు చేరటానికి అడుగుల వడి పెరిగింది.

భార్య చేతి చాయ తాగిం తర్వాత మనసు కాస్త కుదుటపడింది. "యుద్ధ పరిస్థితి ఎట్లా వుంది" భర్తను అడిగింది రజియ. నీకు తెలియందేముంది. మొదట రాత్రిళ్ళు మాత్రమే బాంబులు పడేవి. ఇప్పుడు పగలు, రాత్రి తేడా లేదు. ఇంకా ఎంత కాలం జరుగుతుందో కూడా ఎవరికి తెలియదు. అల్లాకు మన జాతి మీద దయలేనట్లుంది. ఎన్ని తెలివి తేటలున్నా పరాయివాళ్ళ ముందు మన బ్రతుకులు బలాదూర్‌కదా !" ఇద్దరి నిట్టూర్పులతో అక్కడి వాతావరణం మరింత గంభీరమయింది.

హఠాత్తుగ రజియ ఆలోచనలు భర్తవైపు మళ్ళాయి. ఎంత హుషారుగ ఉండేవాడు. తన తెలివితేటలతో వ్యాపారాన్ని ఎంత వృద్ధిలోకి తెచ్చాడు. బంధువులు పదిమంది ఎక్కడ కలిసినా తన భర్త గురించి చెప్పుకుంటుంటే ఎంత గర్వపడేది. తనంత అదృష్టవంతురాలు లేదని సంబరపడేది. కొలుకుల్లోకి రాని కన్నీటిని అద్దుకొనే ప్రయత్నం చేసింది రజియ. ఎన్నాళ్ళుంటాయి ఒంట్లో నీళ్ళు... కంట్లోకి రావటానికి హృదయం ద్రవించని రోజేదైనా

వుందా. తీపి గుర్తుల కాలం కనుమరుగయిన తర్వాత ప్రతిరోజూ నరకయాతనే. ఒకటి తర్వాత ఒకటిగ జరిగిన అంతర్యుద్ధాలు తమ ఉనికిని చిన్నాభిన్నం చేసాయి. పుట్టింటి ముఖం చూడక ఎన్ని సంవత్సరాలయింది. తామున్నది తాలిబన్ల పాలనలో, పుట్టినిల్లు రబ్బానీల అధీనంలో. ఆ రాకపోకలు, వాణిజ్యసంబంధాలు, విందులు, వినోదాలు, ఆప్యాయతలు, అనురాగాలు... ఇంకా ఒంట్లో ఎక్కడ శక్తివుందో కట్టలు తెంచుకున్న కన్నీటి చుక్కల్ని ఆపే ప్రయత్నం కూడా చేయలేదు. ఇంతలో పిల్లలు గుర్తుకు వచ్చారు. కాస్త తెరిపిపడటంతో నిత్యకృత్యాలు తీర్చుకుంటున్నట్లున్నారు. గత కొద్ది రోజులుగా భార్యాభర్త లిద్దరికి మరో భయం పట్టుకున్నది. ఎదిగీఎదగని వయసున్న తమ ఇద్దరు కొడుకులను ఎట్లా కాపాడుకోవాలి. ఇప్పటికే చాలా కుటుంబాల్లో పిల్లలను బలవంతంగా సైన్యంలోకి లాక్కుపోతున్నారు. వాళ్ళను మళ్ళీ కళ్ల చూడగలమా ! ఒక్కచోట వుంటే కలిసయినా చావొచ్చు. నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తు ఎక్కడో ఓ బాంబుపడిన శబ్దం. ఉలిక్కిపడటం కూడా మరచిపోయాయి వాళ్ళ శరీరాలు. "మగపిల్లలిద్దరిని ఎట్లాగయినా మీ అమ్మగారింటికి పంపిద్దామా" అడిగాడు రియాజ్ అనుమానంగానే. ఆ మాట వినటంతోనే ఆమె హృదయం బాధతో మెలితిరిగింది. గోడకు చేరగిలబడింది. కాసేపు పిచ్చిచూపులు చూసింది. వెంటనే తేరుకొని, కంఠంలో ప్రాణం ఉన్నంత వరకు కలసే ఉందాం, ఇక్కడే ఉందాం. ఆమె నోటి వెంట ఎన్నిసార్లు విన్నాడో ఈ మాట. పిల్లల్ని, భార్యను సురక్షిత (?) ప్రాంతానికి చేర్చాలని ఎన్నిసార్లు ఆరాటపడ్డాడు. ఆ మాటకొస్తే ఎన్ని కుటుంబాలు వలసపోలేదు. ఎంతమంది సరిహద్దులు దాటలేదు. యుద్ధం నీడలు పరుచుకోవటానికి ముందు నుంచే ఎంతో ప్రయత్నించాడు. తనకూ, ఈ నేలను వదిలి వెళ్ళాలని ఉందా, తన భార్యాపిల్లల ప్రాణాలు కాపాడుకోవాలనే ఆరాటం ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూనే వున్నది. పూలమ్మిన చోటనే కట్టెలయినా అమ్ముకుందాం, కానీ ఇక్కడినుంచి కదిలేది లేదు. చావయిన, బ్రతుకయినా ఇక్కడే అంటుంది రజియా. తమ దాంపత్యం అట్లాంటిది. వలస బ్రతుకులో దుర్భరత్వం, ప్రయాణంలో ఉండే అష్టకష్టాలు, చెట్టుకొకరు పుట్టకొకరు అవుతామేమోనన్న భయం ఆమెను ఇంత నిక్కచ్చిగా ఉండటానికి కారణమనుకున్నాడు రియాజ్. ఆలోచనల్లోపడి అవసరాలను మరిచినట్లనిపించింది. పొద్దున్నే నాస్తా చేయనిదే ఏమీ తోచదు తనకు. బాగా బ్రతికిన రోజుల్లో నాస్తా కోసమే రజియ ఎన్ని వంటకాలు చేసేది. ఎంత హైరాన పడేది తలచుకుంటే నవ్వొస్తున్నది. ఇప్పుడా కోరికలేదు, ఉన్నా తీరేది కాదు.

ఓసారి భార్య వైపు చూసాడు. తనలో తానే ఏదో గొణుక్కుంటున్నది. దగ్గరికి వెళ్ళి పరి శీలనగా చూసాడు. ఎముకల గూడయింది శరీరం. తమ పెళ్ళయిన రోజుల్లో ఎంత నాజూకుగా వుండేది. పిల్లలు పుట్టిన తర్వాత ఆమెలో ఎంత పరిపూర్ణత వచ్చింది. ఆమె అందం చూస్తే తన దృష్టే తగులుతుందేమో అనిపించేది. కాలం ఆమెను ఎన్నో విధాలుగ

పరీక్షించింది. తమ సంతానంలో అనారోగ్యంతో ఇద్దరు చనిపోవటం, తన తల్లి, తండ్రి అకాలమరణం ఆమెను బాగా కృంగదీసాయి. వారిపట్ల ఆమె పెంచుకొన్న అనుబంధం తనకే ఆశ్చర్యమనిపించేది. ఆమె తీరే అంత. కొత్తవారిని సయితం అన ఆప్యాయత, అను రాగంతో  ఆకట్టుకొనే మనిషి. వ్యక్తులతో, పరిసరాలతో ఆమె ఎంత త్వరగా, ఎంత బలీయంగా బంధాన్ని ఏర్పరచుకుంటుందో !

అన్ని సంఘటనలకు అంతర్యుద్ధాలే నేపథ్యం. తమ ఆర్థిక పరిస్థితిని దిగజార్చింది, ఇతరులపై ఆధారపడేస్థితికి తెచ్చిందికూడా అవే. ప్రధాన వృత్తినుంచి ఎన్ని వృత్తులుమారినా వేడెక్కిన రాజకీయ, సామాజిక పరిస్థితులు తమలాంటి అనేక కుటుంబాల పతనాన్ని శాసించాయి. ఇవి తట్టుకోలేని సున్నిత మనస్కురాలు, అన్యమనస్కురాలై ఎన్నాళ్ళయింది. చైతన్యంతో ఉన్నట్లే కన్పిస్తుంది. అంతలోనే తన లోకంలోకి జారుకుంటుంది. విచిత్రం... తను కూడా ఈ మధ్య అట్లాగే తయారయ్యాడు. వ్యాపారం మూలనపడి, జరుగుబాటు కష్టమై రేయింబవళ్ళు యుద్ధ ఛాయలో బ్రతుకు గడపాల్సిరావటం ఎంతటి వారినైనా నిస్స హాయులను చేస్తుంది. "ఆహార పొట్లాలేవో పడేస్తున్నారటగదా అమెరికావాళ్ళు" అర్థోక్తిగా అంది రజియ. ఆ మాటలతో ఈ లోకంలోకి వచ్చిన రియాజ్... "ఆ... ఆ... అవును. కాని మనదాక రానిచ్చేవాళ్ళెవరు. తాలిబన్లు వాటినికూడా స్వాధీనపరచుకుంటున్నారట. అయినా బానిస కూడు తినేదెలా", సరసరాల్లో ఆత్మాభిమానం నింపుకున్న నిజమైన అఫ్ఘాన్‌లకు ప్రతినిధి రియాజ్. ప్రాణాలైన అర్పిస్తారుగాని స్వాభిమానాన్ని తాకట్టుపెట్టరు. భార్యబిడ్డలపై మమకారం, వారినిసజీవంగా చూసుకోవటంకోసమే మనసు అంగీకరించకున్నా తాలిబన్లకు తలూపక తప్పటం లేదు. ఒక్కోసారి తన జీవితం మీద తనకే అసహ్యం వేస్తుంది. ఏమి చేయలేని అశక్తత హృదయాన్ని తొలిచివేస్తున్నది. ఎప్పుడు యుద్ధం ముగుస్తుంది, ఎప్పుడు రబ్బాని ప్రభుత్వం మళ్ళీ ఏర్పడుతుంది. తమకు మళ్ళీ మంచిరోజులు వస్తాయా, జవాబు దొరకని ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరయ్యాడు రియాజ్. కొంతలో కొంత వాళ్ళ ప్రభుత్వమే నయ మనిపించింది. వ్యాపారంకాస్త గాడిలోపడి, నాలుగు కాసులు చేతిలోకి వస్తున్నాయనుకొనే తరుణంలో తాలిబన్లు వచ్చిపడ్డారు.

ఎండ చురుక్కుమని తగలటంతో ఆలోచనల్లోంచి బయటపడ్డాడు. తన భార్య ఏదో అడిగినట్లు, తానేదో సమాధానమిచ్చినట్లు లీలగా తోచింది. ఇంట్లో ఉన్న ఆస్తి, ఒంట్లోని సత్తా రెండూ కరిగి పోయాయి. ఇక ఎక్కువ కాలం ఇట్లా వెళ్లదీయటం అసాధ్యమని పించింది. జనావాసాల మీద కూడా బాంబులు పడుతున్నాయి. ఎందరో సజీవసమాధి అయ్యారు. గత వారం రోజులుగా ఎంత మందిని తన చేతుల్లో సమాధి చెయ్యలేదు. యుద్ధం మొదలయిన నాటినుంచి అందుబాటులో ఉన్నదేదో ఒక్క పూటయిన కలిసే

తింటున్నాం. మళ్ళీ అట్లాంటి అవకాశం ఉండదేమోనని ఎప్పటికప్పుడు చింతే. ఎందుకో ఈ రోజు ఆవేదన మరింత ఎక్కువవుతున్నది. ఆవేదనలోంచి అతీతమైన, నిర్వికారమైన ఆనందం కట్టలు తెంచుకుంటున్నది. బిగ్గరగా... ఇంకా బిగ్గరగా నవ్వాలనిపిస్తున్నది. అంతలోనే ఆగని దుఃఖం పొంగుతున్నది. బలవంతాన శరీరాన్ని, మనస్సుని అదుపులోకి తెచ్చుకున్నాడు. చిన్నతనంలో తండ్రి బహుమతిగా ఇచ్చిన గడియారం నమాజు సమయం దగ్గర పడుతున్నదని హెచ్చరిస్తున్నది. ఆ గడియారం అంటే తనకెంత ఇష్టమో, జ్ఞాపకాల్ని తనతో పాటు మోసుకొస్తున్నది... ఇంక ఆలోచనలు వదిలించు కోవాలనుకున్నాడు. చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కొని మనస్సును ప్రశాంతం చేసుకొని నమాజ్ పూర్తి చేసాడు. పిల్లలను ఆప్యాయంగా దగ్గర కూర్చోబెట్టుకున్నాడు. సహజంగా వాళ్ళకు తల్లి దగ్గర ఉన్నంత చనువు తన దగ్గర లేదు. వాళ్ళతో మాట్లాడే, వాళ్ళు వేసే ప్రశ్నలకు సమాధానం చెప్పే ధైర్యం తనకు లేదనిపించింది. వాళ్ళను పరిశీలనగా చూడగానే తానేదైన పొరపాటు చేసాడా అనే భావం కలవరపెట్టింది. ఈరోజు ఎందుకో వాళ్ళతోటి ఏవోమాట్లాడాలని, ఏవేవో చెప్పాలని, దగ్గరగా తీసుకొని ఒళ్ళో పడుకోబెట్టుకోవాలని అనిపిస్తున్నది. భార్యను, పిల్లలను తనకు మరింత దగ్గరగావచ్చి కూర్చోమన్నాడు. పిల్లల సాయంతో రజియ ఆ పూటకు తయారుచేసిన వంటకాలను కలిసి తిన్నారు. "రాత్రంతా చాకిరితో రెక్కలుముక్కలు చేసుకున్నావ్ కాస్తంతా కునుకు తీయరాదా" అన్న భార్య మాటలు పట్టించుకోలేదు రియాజ్. "ఈ రోజు నిదుర, అలసట ఏమీ లేవు. మీతోటి మాట్లాడుతూ అన్నీ మరచి పోవాలనిపిస్తున్నది" అన్నాడు. పిల్లలక్కూడ ఆశ్చర్యంగాఉంది. ఈమధ్య ఒకరికొకరు మాట్లాడుకోవటమే కరువైపోయింది. ఎప్పుడు ఏదో ఆందోళన, నైరాశ్యంతో స్మశాన నిశ్శబ్దం రాజ్యమేలుతున్నట్లున్నది.

"మనకు మంచిరోజులు వస్తాయి, పవిత్ర రంజాన్ మొదలయ్యేసరికి మన బతుకుల్లో మార్పు వస్తుందని నాకు నమ్మకంగా అనిపిస్తున్నది. నేనేమయిపోయిన మీ భవిష్యత్తును చెదరనీయను..." వాళ్ళందరికి హామీ ఇస్తున్నట్లుగా భుజాలమీద తట్టాడు రియాజ్. ఎన్నాళ్ళుగానో మరచిపోయిన నవ్వొకటి రజియ పెదాలమీద నాట్యం చేసింది... హఠాత్తుగ ఆకాశం తెగిపడ్డదా అన్నట్లు భారీ విస్ఫోటనం. దారితప్పిన అమెరికన్ మిస్సైల్ రియాజ్ 'ఇంటిని' ఢీకొన్నది. ఎవరిసాయం అక్కర్లేకుండ నిలువెత్తు గోతులు వారికోసం ఏర్పడ్డాయి. వారి ఆశలు... ఆశయాలు... ఆలోచనలు... సజీవ సమాధి అయ్యాయి. ❑





**అన్నవరం దేవేందర్,**
17-4/5, ఆనంద భవన్,
టీచర్స్ కాలనీ, హుస్నాబాద్,
జి॥ కరీంనగర్ - 505 467

# నేమ్ ప్లేట్

సాయంత్రం పూట చివరి పీరియడ్ నడుస్తుంది. అటెండర్ 'చుట్టీ' గంట మ్రోగించే ముందు ఆకాశంలో వాన మబ్బులు అటూఇటూ తిరుగుతున్నాయి. రోడ్డుపై మనుషులు, వాహనాలుకూడా తొందరగా ఇంటికి చేరాలని తహతహతో పరుగెడుతున్నారు. 'సిపాయిల తిరుగుబాటు' పాఠం శ్రద్ధగావిన్న విద్యార్థులు 'అయ్యో వర్షం వస్తుంది ఉరుకుండ్రి మేడం' అంటూ నేను వర్షంలో తడుస్తానేమో... అని తొందరగా ఇంటికి చేరమంటున్నారు. నేను తడవ కూడదనే విద్యార్థుల తపన చూసి ఉపాధ్యాయురాలిగా ఈ వృత్తి ఎంత అప్యాయ మైనదని పులకించిపోయాను.

వర్షం మొదలైంది... స్టాఫ్ రూంలోకి వెళ్ళికూర్చున్నాను. కోరుకున్న అధ్యాపక వృత్తిలోకి వచ్చినందుకు ఆత్మవిశ్వాసంగా ఆనందంగానే ఉన్నా... కాని మగవాదపు మాటలతో నాలో నేనే ఈసడింపులకు గురవుతున్నాను. బయటవర్షం కురుస్తుండటంవల్ల ప్రోగ్రెస్ రిపోర్ట్లో మార్కులు వేస్తూ "మేడం ఈ అనిల్‌కు సోషల్‌లో 85 మార్కులు వచ్చినయి, ఫస్ట్‌క్లాస్ విద్యార్థి హిందీలో మాత్రం 10 మార్కులే ఎట్లావచ్చాయో చూడు" అంటూ నా సహోద్యోగి రుక్మిణిని అడిగాను. ఆమె నాకంటే సీనియర్ టీచర్.. నేను చేరి నాలుగు నెలలే అవుతుంది "ఈ స్కూల్‌లో ఆ హిందీ సార్ క్లాసుకు వెళ్ళడు, ప్రశ్నాపత్రాలు దిద్దడు, ఇష్టం వచ్చినట్లు మార్కులు వేస్తాడు" అని రుక్మిణి మేడం బదులివ్వడంతో ప్రభుత్వ పాఠశాలలో విద్యపట్ల ఉపాధ్యాయుల బాధ్యత ఇంత చులకనగా ఉందని నాలో నేనే నవ్వుకున్నాను.

రూములో కొందరు ఉపాధ్యాయులు వార్తలపై కామెంట్స్ చేస్తున్నారు. 'భర్తను చంపిన భార్య' అనే శీర్షికతోవచ్చిన వార్తపై వెటకారపు వాఖ్యలు వెగటు పుట్టిస్తున్నాయి. "ఆడదానికి అలుసిత్తే గిట్లనే అయితది... ఆడదాన్ని ఎక్కడ ఉంచాలో అక్కడే... ఉంచాలె" అని తెలుగు పండితుడైన ఓ ఆచార్యుడు అంటున్నాడు. "మన చంద్రబాబే చెప్పె ఆడవాల్లను ఊల్లేల మని, మగాల్లను వంట చేయమని... ఇక మొగల్ని చంపకుంటే ఏం చేస్తరు ?" అంటూ మరోసార్ కామెంట్ కంటిన్యూ చేస్తున్నాడు. స్త్రీపట్ల కించపర్చినట్లు ప్రతి రోజు చులకనగా

ప్రతి రోజు మాట్లాడుతున్నారు. కాని నేనేం చేయను అన్పిస్తుంది. కోర్ట్ తీర్పుతో దిగిపోయిన జయలలితపై, జయ కాళ్ళకు దండంపెట్టే పన్నీర్‌సెల్వం ఫోటోకు ఇలా రబ్రీదేవి, మాయావతి... ఇంకా మహిళా అధికార్లపై కూడా చీప్‌గా కామెంట్ చేయడం మగజాతి లక్షణమా ? అన్పించే విధంగా ఉంది. స్టాఫ్ రూంలో ఎక్కువమంది మగటీచర్లే, ఇద్దరమే మహిళా టీచర్లం ఉన్నాం. మగహంకారపు వెకిలితనం కన్పిస్తుంది... సమాజానికి మార్గ దర్శకులైన ఉపాధ్యాయుల గదేనా ఇది అన్నట్లుగా ఉన్నా... "నాకెందుకులే" అన్నట్లు ఉంటున్నారు. నాలుగు నెలల క్రితం డియస్‌సి ద్వారా ఎంపికై ఈ హైస్కూల్‌లో చేరాను. అంతకు ముందు విద్యార్థిదశలో ఉన్నప్పుడు విద్యార్థి ఉద్యమాల్లో తిరిగిన అనుభవము, స్త్రీవాద సభల్లో పాల్గొన్న ఆలోచనలూ ఉన్నాయి. కాని సహచర స్త్రీ ఉపాధ్యాయిని కూడా మగ వాదనలే సరైనవన్నట్లు స్త్రీలను అవమానపరుస్తుంటే వారి నవ్వులతో శ్రుతి కల్పుతుంది.

మహిళా అధికారుల ధైర్యసాహసాలుగాని, మహిళా రాజకీయ నాయకులనుగాని, యం.పి.టి.సి., సర్పంచ్‌లుగా మండలస్థాయిలో గెలిచిన వారినిగూడా నిందాపూర్వకంగా కడిగేస్తున్నారు. బాధగానే ఉంది ఈ ఆలోచనలతోనే ప్రోగ్రెస్‌లలో మార్కులు వేసాను.

వర్షం బంద్ అయ్యింది. ఇంతలోనే స్టాఫ్‌రూంకు "నేమ్‌ప్లేట్ చేసిస్తాం ఆర్డరివ్వండి" అంటూ ఒక గడ్డం వ్యక్తివచ్చి ఉపాధ్యాయ సోదరులవద్ద ఆర్డర్ తీసుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు ఉపాధ్యాయులు ఆర్డర్ ఇచ్చారు. తర్వాత ఆ వ్యక్తి మా వద్దకువచ్చి "మేడం మీ సార్‌కు నేమ్‌ప్లేట్ చేయించరా ?" అని అడుగుతున్నాడు. నాకు అయన ప్రశ్నలోనే వివక్ష కన్పించింది. "ఆ సార్లకేమో నేమ్‌ప్లేట్ వాళ్ల పేర్లతో ఆర్డర్ తీసుకున్నావ్... మేం వాళ్లలాగే బి.యస్సీ. చేశాం, బి.ఇడి. చేశాము, సేమ్ ఉద్యోగం చేస్తున్నాం, మాకేమో మా సార్‌కు కావల్సిన నేమ్‌ప్లేట్ అడుగుతున్నావ్" అని నేను కొంచెం కోపంగానే అడిగాను.

"లేదు మేడం నేమ్‌ప్లేట్‌లు మగాళ్లకే ఉంటయ్ కదా ! అందుకే మీసార్లకోసం అడుగు తున్నాం" అని సమాధానం చెప్పి సముదాయిస్తున్నాడు.

వస్తువులు అమ్మేవాడికి కూడా మగ దృక్పథమే, అమ్ముడుపోవడం లాభం రావడంకన్నా మగవాళ్ల పేర్ల మీదనే ఆర్డర్ తీసికోవాలను కుంటున్నాడు...

వర్షం పూర్తిగా వెలిసింది. బయటకు వెళ్ళి బస్‌స్టాండ్‌కు నడుస్తున్నాను. మధ్యలో స్టీల్ సామాను షాప్‌కు వెళ్ళి ఒక టిఫిన్ క్యారేజి, మరొక ఇడ్లీ పాత్ర తీసికొన్నాను. రెండువందల ఇరవై అయిదు అంటే ఇరవై అయిదు తగ్గించి రెండు వందలే తీసుకున్నాడు.

"మేడం సార్ పేరేంది ?" అంటూ స్టీల్‌పాత్రపై పేర్లురాసే మిషన్ ఆన్‌చేసి నిల్చున్నాడు. నేను ఇక్కడ ఆశ్చర్యపోలేదు. "సార్ పేరే రాయాలా, సంపాదించింది నేనే, వాటితో వంట ఇంట్లో పని చేసేది నేనే, వీటిపై ఆయన పేరెందుకు ?" అని అందామా అని నోట్లోకి వస్తూండగానే... "ఎంతైనా సంపాదించేది మీరైనా పేరు సార్‌ది కదా !" అంటూ తప్పును తెల్సుకొని నాలిక కర్చుకున్నాడు షాపు యజమాని. పేరు రాయించి, రెండు పాలిథిన్ కవర్లో వేసికొని బస్సెక్కి ఇంటికి చేరేసరికి సాయంత్రం ఏడు అయ్యింది.

అప్పటికే మరో స్కూల్‌లో పనిచేస్తున్న మావారు వచ్చి వాలు కుర్చీలో తీరుబడిగా పేపర్‌లో సంపాదకీయ పేజీని నమిలేస్తున్నాడు. నేను ఉదయమే లేచి ఇంటి, వంట పనులన్నీ పూర్తిచేసి, ఇద్దరికీ టిఫిన్ సర్దుకొని వెళ్ళిపోయాను.

ఆయన నాకన్నా మూడేళ్ల సీనియర్ టీచర్, ఇద్దరం బస్సులోనే ప్రయాణం కాని వేరు వేరు బస్సులు, వేరువేరు ఊర్లలో ఉద్యోగాలు.

ఉద్యోగాలు ఇద్దరివీ ఒక్కటే. ఉదయం పేపర్‌రాగానే పేపర్లో తలపెట్టి గంటదాకా తీయడు, అన్ని పనులు నేనే, మళ్ళీ సాయంత్రం. ఇలాగే వీక్లీలు, బయట పచార్లు. నేనేమో ఇంటిపనులు అన్నీ చేసి స్కూల్‌కు వెళ్ళడంతో పత్రిక చదవడం లేదు. స్టాఫ్ రూంలో దిన పత్రికకు వాటా చెల్లిస్తున్నా... అక్కడా లీజర్ పీరియడ్‌లో పేపర్ దొరకదు. దొరికినా ఇక్కడో పేజీ అక్కడో పేజీ ఉంటుంది. దీంతో పొలిటికల్ నాలెడ్జ్ అప్‌టుడేట్‌గా ఉండటం లేదు. అఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్ల ప్రభుత్వం, నార్తర్న్ అలయెన్స్ రెండు ఎట్లా ఉన్నాయో, రష్యాకు శత్రువు ఎలా అయ్యిందో చదువుదామంటే టైం లేదు ? బస్సు ప్రయాణంలోను గొడవలే, స్త్రీల సీట్లలో కూర్చొని లేవరు, లేపితే "మేం స్టార్టింగ్ నుంచి వస్తున్నాం, లేదా ముందుగా వాళ్లను లేపు" అని వెకిలి సమాధానాలు.

ఇద్దరికి ఉద్యోగం కదా! వంటపనిలో సహాయం చేస్తామని ముందేఅన్నారు. అన్నట్లుగా కూరగాయలు తరగడం, పచ్చి మిరపకాయలు తరగడం, ఉల్లిగడ్డ మొదలుపెడతారో లేదో ఎవరో ఒకరు ఇంటికిరావడం, ఈయన వెళ్ళి మాట్లాడటం, మధ్య మధ్యలో ఫోన్లు, ఇంకా వచ్చిన వాళ్ళకు చాయలు పెట్టడం అదనపు పని.

తెల్లవారింది రెండో శనివారం బట్టలన్ని ఉతకడం, ఇంటి బూజు దులపడంతోనే గడిచి పోతుంది. బూజు దులపడంలో సహాయం చేస్తాడనుకుంటే "బూజు ఎలర్జీ" అని తప్పించు కుంటాడు. ఇలాంటివన్నీ గుర్తుకస్తూ మనసంతా చికాకుగా ఉంది.

"పోస్ట్" ఆ కేక విన్పించి గేట్‌వైపు వెళ్ళాను. లెటర్ నాకే వెనకవైపు 'విమల, కరీంనగర్' అని ఉండేసరికి నా క్లాస్‌మేట్ విమల అని ఆనందంతో చింపాను

"ప్రియమైన అరుణా....

ఎలా ఉన్నావే ? నేను క్షేమం... నీకేం మంచిగా టీచర్ ఉద్యోగం వచ్చింది. టీచర్ మొగున్ని చేసుకున్నావ్... చాలా ఆనందంగా ఉన్నావనుకుంటాను. స్కూల్ లైఫ్ నుంచి పురుషాధిక్యాన్ని ఈసడించుకునే దానివి ? ఇప్పుడూ ధిక్కారధోరణేనా ? అడ్జస్ట్ అయ్యావా?

పల్లెటూర్లో పాఠశాల బాగుందనుకుంటాను. నీకు పల్లెలన్నా, పాఠాలన్నా, పాటలన్నా, ప్రాణం కదా ! ఈ మధ్య కవిత్వమేమైనా రాసావా ? నేను కరీంనగర్‌లో ఉంటున్నా. మావారు కాలేజిలో లెక్చరర్, నేను ప్రైవేట్ కంపెనీలో కంప్యూటర్ ఆపరేటర్ని, నేను కథలు, కవిత్వం రాయడం లేదు. నాలో సృజనాత్మకత చచ్చి పోయిందే. రొటీన్ లైఫ్, యాంత్రికత ఉద్యోగం, అంతా వెరసి గానుగెద్దు జీవితం. ఇదివరకు ఆడది వంటపని, ఇంటిపని చేసేది. ఇప్పుడు రెండు పనులు చేస్తూ మగాల్లతో సమానంగా సంపాదించాల్సి వస్తున్నది. జీవన విధానం పెరిగింది. ఖర్చులు, ఆదాయం పెరిగింది. కాని మన గౌరవం పెరగలేదు. మన చిన్ననాటి ఫోటో కన్పించి వెంటనే లేఖ రాస్తున్నాను. ఈసారి కరీంనగర్‌కు వచ్చినప్పుడు రాగలవు, గణేష్‌నగర్‌లో మా ఇల్లు.

ఉంటానే అరూ...

నీ ప్రాణ నేస్తం...
విమల"

విమల లేఖ చదివి సొమ్మసిల్ల లేదు కాని, వాలు కుర్చీలో చాలాసేపు కూర్చుండి పోయాను. తను రాసినట్లు క్రియేటివిటీ లేకుండా పోయింది. నిజంగా గానుగెద్దు జీవితమా... ? ఇంటిపని, వంటపనికి తోడు ఉద్యోగం అదనమైనా ఆర్థిక స్వేచ్ఛ పెరిగింది తప్ప ప్రజాస్వామికత లేదు. చదువుకున్న స్త్రీలపట్ల కనపడీ కనపడని వివక్ష లీలగా అంతటా కనిపిస్తుంది. ❑






**కొలకలూరి (నడకుర్తి) స్వరూపరాణి,**

విద్యాసదనం, ఇ.నెం. 35-3-80/సి,

జకర్యా హాస్పిటల్‌కు తూర్పు వైపు,

కేశవస్వామిపేట, ఒంగోలు - 523 001

ఫోన్ : 08592-30996


# మహాప్రసాదం

"ఏయ్, ఉండవే వరం ! బస్సు పూర్తిగా ఆగనీయ్" అంటూ చేయి అందించింది, ముందుగా... చలాకీగా దిగేసిన పద్మ. నెలలు క్రమంగా దగ్గర పడుతున్నట్లగుపడుతున్న వరలక్ష్మి నెమ్మదిగా దిగ్గానే బస్సు రయ్...న వెళ్ళిపోయింది.

అది పొన్నూరు-చెరుకుపల్లి బస్సు రూట్ మధ్యలో గోవాడ అనే ఊరి అడ్డ రోడ్డు. శిలువ వలె మూడువైపుల రోడ్లు ఊళ్లలోకి చీలుతుంటే నాలుగోవైపున వరిచేలు పచ్చగా పరుచుకుని ఉన్నాయి. రోడ్ల కూడలిలో చెరువుంది. గట్టుదాకా ద్వీపంలా చుట్టూ ఆవరించిన చెరువుకు మధ్య దిబ్బమీద బావి చేద ఉంటాయి, దానిని జనం 'తాళ్ళ చెరువు' అని అంటుంటారు. అల వచ్చి తాకి చల్లగా జారుకొంటుంటే నిస్సహాయంగా చూస్తూ ఊరుకొన్న గట్టుకు, అండగా నిలబడ్డట్టున్న మర్రిచెట్టు. అది బాటసారులకు వెయ్యాని పందిరిలా ఉంటుంది. రోడ్డుకిరువైపుల పొన్నచెట్లు గాలిని సువాసనతో నింపటమేగాక పొన్నపూలు, సన్నాయి వాద్యాలకు తెల్లటి రంగువేశాయా అన్నట్లుంటాయి.

ఆ తాళ్ళ చెరువు ఉత్తరంగా ఇంచుమించు రెండు కిలోమీటర్లలో గోవాడ ఊరు ఉంటుంది. నడవగల వాళ్ళకది కాలిదారే. చెరుకుపల్లి నుంచి తెనాలి వెళ్ళే బస్సులు ఆ రోడ్డునసే గోవాడలోంచి వెళ్తాయి. ఆ లెక్కన ఊళ్ళోకి బస్సు సౌకర్యమూ ఉన్నట్లే. ఐనా అక్కడి వరకూ రైతుల పొలాల్లోకి బళ్ళు తిరుగాడుతూ ఉండటాన బళ్ళమీద ఊరు చేరు తుంటారు కొందరు. అలా తన కోసం నాన్నగారు బండీ ఏమైనా పంపారేమో అని పార జూచింది పద్మ. అంతలో ఆమె కళ్ళు మెరిసినయ్.

"ఏయ్ వరం ! అడుగోనే మా బండీఅబ్బాయి ప్రసాదరావు" అని అంటూండగానే పొన్న చెట్ల నీడన బండి విడుచుక్కూచున్న ప్రసాదరావు ఒక్క ఉదుటున లేచొచ్చాడు. బ్యాగ్‌లూ అవీ అందుకున్నాడు. కుశల ప్రశ్నల మధ్య పద్మ "నా క్లాస్‌మేట్ వరలక్ష్మి" అంది పరిచయపూర్వకంగా, అతను వినయంగా చేతులు కట్టుకున్నాడు. వరలక్ష్మివైపు తిరిగి పద్మ "చెప్పాను కదే... మా పాలేరు కొడుకు. మా మాగాట్లో పనులు చూసుకుంటుంటాడు వాళ్ళ నాన్నకు సాయంగా" అంది.

వరలక్ష్మి తన స్థబ్దతలోంచి తను బైటపడ్డట్లు లేదు, పరధ్యానంగా తల ఊగించింది. ఈలోగా వస్తువులు ఒక్కొక్కటే బండిలో సర్దివచ్చిన ప్రసాదరావు "బెలెల్లండమ్మాయిగోరూ... పొద్దెక్కుతాంది" అన్నాడు. తలగుడ్డ సర్దుకున్నాడు, కాడిమాకు పైకెత్తిపట్టి "చ్చొ.. చ్చొ.. ఉ... వ్వ..." అంటూ యెద్దుల్ని జరుపుకొని మెడల మీదికి నెమ్మదిగా కాడిని మోపాడు. పద్మ, వరలక్ష్మి జల్లలోకెక్కి కూర్చున్నారు. అతడు తొట్లోకెక్కి కూర్చొని చర్నాకోల ఛెళ్ మని పించాడు. ఎడ్లు పరుగందుకొన్నాయి. బండి ఆగమేఘాల మీద దూసుకుపోతుంటే స్నేహితురాళ్ళిద్దరూ ఆలోచనల్లో కొట్టుకుపోతున్నారు.



వేరువేరు ఊళ్ల నుంచి చదువుకోసం వచ్చి చేరిన వీళ్ళిద్దరినీ బోర్డింగు సహజీవనం స్నేహంతో పెనవేసింది. ఆ మధ్య సెలవులకు ఊరెళ్ళి వచ్చిన తర్వాత క్రమంగా స్నేహితురాలి వైఖరిలో యేదో మార్పు కనబడుతోంది. చదువుపట్లనేగాక రోజువారీ పనుల్లోనూ ఉదాసీనంగా ఉంటోంది. దానికితోడు మాటల సందర్భంలో ఆత్మహత్యల ఉదంతాల మీద శ్రద్ధగా చర్చించడం చేస్తోంది. ఏమైంది... వరలక్ష్మికి, నిలదీసింది పద్మ. తన అనుమానమే నిజమైంది. క్లాస్‌మేట్ అనే అమాయక బాల్యస్నేహం తాలూకు చనువుని బలప్రయోగంతో దుర్వినియోగం చేసిన నీచుణ్ని తాను అసహ్యించుకొని చెంపదెబ్బకొట్టి వదిలించుకొంది. కానీ... ఆ... సర్ప విషాన్ని గర్భకోశం వదిలించు కోలేకపోయింది. అదన్న మాట సంగతి. కానీ తల్చుకొంటే పరిస్థితి ఎంతో ప్రమాదకరంగా కనబడుతుంది.

ఇంట్లో చెప్దామే అంటే "అమ్మో చంపేస్తారే... వరం".

"చంపరు లేవే, ఐతే వాళ్ళే చనిపోతారు". యెలా, యేం చేయాలి ఈ విద్యార్థిని జీవిత ప్పరిధిలో వాళ్ళెన్నడూ ఆలోచించని ఈ సరిక్రొత్త విషయంలోని ఆపద విశ్వరూపంలో దర్శనమిస్తోంది. భవిష్యత్తు అంధకారబంధురంగా కనబడుతోంది. రోజులు గడిచి, నెలలు నిండితే జరగబోయే ప్రమాదం, అది వచ్చేలోగా తనేం అఘాయిత్యానికి పాల్పడుతుందో అనే స్ఫురణ ఒక్కసారిగా గుండె గుబగుబలాడించింది. చివరికి ఉభయులూ ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. పద్మ వాళ్ళ అమ్మ-నాన్నకు తెల్పితే యేదైనా దారి చూపుతారేమో అని ఆశించారు. వాళ్ళు పరోపకార బుద్ధిగల సాత్విక దంపతులని ప్రతీతి.

గ్రామంలో పెద్దలన్న గౌరవంతో వారి సలహాలను పాటిస్తారు జనం. వీరి ప్రమేయంతో కుటుంబ కలహాలు సద్దుమణిగిన దాఖలాలున్నాయి. కనుక ఇదే తరుణోపాయం అనుకొంది పద్మ. గోవాడ తిరునాళ్ళ మహోత్సవాల గూర్చి చెప్తుంటే గతంలో వరలక్ష్మి చాలా ఆసక్తిగా వినేది. ఒకటి రెండుమార్లు ఉత్సాహపడుతూ వరలక్ష్మి "ఏయ్, పద్దూ పద్దూ మీ

ఊరి తిరునాళ్ళకు నన్నూ తీసుకెళ్ళవా చూడాలి..." అన్నది. ప్రతి దఫా ఏదో ఆటంకంతో ఈ రెండేళ్ళబట్టీ కుదరలేదు. ఇప్పుడదే ఒక సాకుగా పనికొచ్చేటట్లయింది. తక్షణం ఇంటికి జాబు రాసింది పద్మం.

"ఈ యేడు శివరాత్రికి నాతోబాటు నా స్నేహితురాలు వరలక్ష్మి వస్తుంది మన ఊరికి" అని. చుట్టుపట్ల ఊళ్ళ నుంచి వచ్చిన యాత్రికులు బంధుమిత్రుల ఇళ్ళలో ఒకటి రెండు రోజులపాటు ఉండి తిరునాళ్ళు చూచుకుపోవడం ఆ ఊరికి ఆనవాయితీయే. ఆ లెక్కన స్నేహితురాల్ని తోడ్కొని వస్తానంటే అమ్మ, నాన్న సుముఖత వ్యక్తం చేశారు, పైగా తమ బిడ్డల స్నేహితులను, మిత్రులను సాదరంగా ఆహ్వానించి అతిథి సత్కారాలు చేసే సంస్కారం ఆ ఇంట పుట్టింది. కానీ వీళ్ళరాకలోని రహస్యాన్ని ఉత్తరంలో రాయలేదు కదా, అది తెలిస్తే యేమంటారో అన్న భయం పట్టుకొంది పద్మకు. ఇల్లు దగ్గరపడుతున్నకొద్దీ పులుకు పులుకు చూపులు పడ్డాయామెకు.



ప్రహారీ లోతట్టు భవంతి, దాన్నానుకొని గొడ్ల చావడి విశాలంగా ఉంది. ఇంటిముందు వడ్లపురి. ఆవరణ అనదగ్గ పెద్ద స్థలంలో చెట్లు. మొత్తం మీద గాలివెల్తురుతో వసతిగా అగుపడుతున్న ఇంటిముందు బండి దిగారు స్నేహితురాళ్ళిద్దరూ. గడప ఇవతలకు వచ్చి మాణిక్యమ్మగారు నవ్వు ముఖంతో ఆహ్వానపూర్వకంగా చూస్తూ నిలబడింది. ఆమె పల్చని ఆకృతితోను, చేమంతి ఛాయతోనూ సౌమ్యంగా కనబడుతోంది. వరలక్ష్మికి కాళ్ళకి నీళ్ళు ఇచ్చి కూతురుతోబాటు సాదరంగా లోనికి తీసుకువెళ్ళింది. "రండమ్మా" అంటూ దారి ఇస్తున్న రాజారత్నంగారు ఖద్దరు దుస్తులతో స్వచ్ఛంగా కన్పిస్తున్నారు.

వరలక్ష్మి గుండెల్లో గుబులు యెలా ఉన్నా ఆ కుటుంబసభ్యుల కలుపుగోలుతనంవల్ల తేలిగ్గా వారిలో ఒకర్తుగా కలిసిపోయింది. భోజనాదికాలు, పిచ్చాపాటి ఐనాక జరగబోయే తిరునాళ్ళ వేడుకలు గూర్చి తల్చుకొంటూ సద్దుమణిగింది యిల్లు. అమ్మాయిలిద్దరూ ఎవరి మానసిక యుద్ధంలో వాళ్ళు బిగుసుకుపోయారు.

తెల్లవారింది, అమ్మాయిలతో ఆనందం పంచుకొని, బాధ్యతలకు ముఖం చాటు చేసుకు పోయే అల్లుడిలా చీకటి ఉషఃకాంతిరాకతో పలాయనం చిత్తగించింది. చీకటి మూకులు వేళ్ళూనిన ఆ కొండల్లోనే వికసించే వెలుగుపువ్వులూ అక్కడక్కడా ఉంటాయా అన్నట్లు తూర్పున సూర్యుడు ఉదయించాడు. గుడివద్దకు సన్నద్ధమౌతున్న నిలువెత్తు ప్రభలు, వాటి చుట్టూ "జెక్కినిక్క..." తప్పెట దరువులూ, పశువుల పందేలకు తరలుతున్న

యెడ్ల మందలు వీటి సందడి నిన్నటినుండే మొదలైంది. జనం ఈ సందర్భంగా యెదురు పడి ఒకళ్ళనొకళ్ళు పలకరించుకోవడము, గుడివద్దకు ప్రయాణ సన్నాహాలు గూర్చి ప్రశ్నలు పరామర్శలు కోలాహలం ఇళ్ళలోనికే చొచ్చుకొస్తోంది.

రాజారత్నంగారి యింటివద్ద వసారాలో నల్లకళ్ళ తెల్ల యెద్దు శ్రమకు పూచీపడిన "నాలుగు కాళ్ళ మౌనదేవతల్లాగా" యెదురు చూస్తున్నాయి. ఇంకా తమను బండికాడికి పూన్చటం లేదే అన్నట్లున్నాయి వాటి చూపులు. ఏటా కొమ్ములదాకా షోకు చేసుకుని మువ్వల గలగలల్తో యెగురుకుంటూ గుడికి వెళ్ళడానికి అలవాటుపడిన యెడ్లను మిత్రుల్ని చూసినట్లుచూస్తూ వాటి సారధికూడా సిద్ధంగానే ఉన్నాడు. అతనూ పిలుపుకోసమే కాచుకొన్నాడు. ఆలస్యం యేమిటి చెప్మా అనుకొంటూ గుమ్మందాకా వచ్చాడు. లోపల నుంచి మాటలు వినిపిస్తుండడంతో అక్కడే ఆగిపోయాడు.

వంటపనుల్లో మాణిక్యమ్మగార్కి సాయంచేస్తూ అటూ ఇటూ తిరుగుతోంది వరలక్ష్మి. మాణిక్యమ్మగారు నిన్న పరాకుగా చూసి "ఆఁ... ఒళ్ళుగల్ల పిల్ల లే" అని అనుకొన్నదా... ఇప్పుడు నింపాదిగా చూస్తుంటే ఆమెకేదో అనుమానంగా ఉంది.

కన్నెపిల్ల ఒంటిమీద కాని చిన్నెలేవో కనిపించినట్లయింది. ఏమో పెండ్లయిందేమో... ఉహూ... అంటూ తటపటాయించింది. దేనికో తాళింపు వేయబోతున్న ఆమె చేతిలోని గరిటను స్టౌ పక్కన ఉంచేసి దగ్గరగా వచ్చింది. "అమ్మాయ్ ! ఇది డాలరు చైను కదూ !" అంది పైట మడతల మీంచి గొలుసుపైకి తీస్తూ. "మంగళసూత్రం కాదన్నమాట !" అని అన్నట్లే ఉన్నాయి ఆ మాటలు. అమ్మాయి గుండె గుభేలుమన్నట్లయింది. జవాబు కోసం ఆగకుండా మాణిక్యమ్మగారు వాళ్ళాయన కోసం వెతుకుతోంది కళ్ళతోనే. ఏదో కొంత జనాంతికంగా మాట్లాడాలన్నట్లు. పిల్లలిద్దరూ గుంభనంగా ఉన్నా వారిలో యేదో చెప్పలేని కంగారు దాగి ఉన్నట్లు మాణిక్యమ్మగారు గమనిస్తూనే ఉంది. వాళ్ళు వచ్చిన క్షణం నుంచీ. ఈ ప్రసక్తి పెద్దవాళ్ళ దగ్గర యెప్పుడు యెలా తేవాలా అని పద్మ బేరీజు వేస్తున్నా. ఈ హఠాత్పరిణామానికి మాత్రం హడిలి పోయింది. ఏదో పని ఉన్నట్లు అక్కడి నుండి హడావుడిగా జారుకొంది. ఒంటరిగా చిక్కిపోయిన వరలక్ష్మి ఇదీ ఒకందుకు మంచిదేలే అనుకొంది గోడు పూర్తిగా వెళ్ళబోసుకోవడానికి. కానీ తీరా చెప్పబోయే సరికి నోరుపెగలక బావురుమంది.

అనుకోని విధంగా ఉద్రిక్తత యేదో ఉత్పన్నమై గాలి స్థంభిస్తున్నట్లుంది రాజారత్నం గారికి. చదువుతున్న పేపరును అరుగుమీదనే ఉంచి లేచి అటుగా వచ్చారు. ఇంతకు మునుపే మాణిక్యమ్మగారు పిట్టగోడ మీంచి పక్కింటి విజయమ్మ కోసం కేకపెట్టటం, కాసేపట్లో "అక్కయ్య యెందుకో అర్జంటుగా రమ్మంది" అని స్వగతంగా అనుకొన్నట్లు

రత్నంగారికి తన రాకపై వివరణ పూర్వకంగానూ చెప్పుకొంటూ విజయమ్మ లోనికి వెళ్ళటమూ అంతా పేపరులోంచే గమనిస్తూన్నారాయన. ఆడవాళ్ళంతా గుట్టబడి గుభగుభ లాడటం చూచి అలా యెడంగా నిలబడ్డారు.

"అంతెందుకూ... ఆ... జాతకాల పంతులుగారమ్మాయిని పెండ్లి చేసుకుంటానని నమ్మించి కరణంగారి తమ్ముడు ఆ.. స్థితికి తెచ్చాడా, తీరా బట్టబయలైం తర్వాత తప్పు కొన్నాడు".

"ఎంతో వ్యక్తిత్వంతో అమ్మాయి మహిళా మండలి, ప్రజా సంఘాల వరకూ మద్దతు కూడగట్టుకొన్నా, చివరకు కంప్లెయింట్ చేసి, లోపలకేపించినా యేం మొండికెత్తాడో యేమో, ధైర్యం సడలిన అమ్మాయి తెల్లారే పాటికి పాడుబావిలో శవమై తేలింది".

ఆడవాళ్ళు తలా ఒక చెయ్యేసి వంటపూర్తి చేస్తుండటంతోబాటు నోటిని ఖాళీగా ఉంచక ఉదంతాలూ త్రవ్వి పోస్తున్నారు.

"ఔనౌను, ఇప్పుడొక యింటికి ఇల్లాలై పిల్లాపాపలతో గౌరవంగా కాపురం దిద్దు కొంటోంది. అదిగో అప్పుడు నచ్చజెప్పి ఆ కాస్త ఆపదా గడిపి... తీసేయించబట్టి కదా!".

ఈసారి పేరు గుచ్చలేదుగాని పక్క ఊళ్ళో జరిగిన యదార్థగాధ ఒకటి స్ఫురింప జేసాయా మాటలు.

"మరొకర్ని మోసగించినట్లౌతుందని పెండ్లిమాని బిడ్డను ధైర్యంగా కనడానికే సిద్ధ పడింది. పిచ్చిదానా ! అలా ఐనా పెండ్లికాని తల్లి కన్నబిడ్డ అక్రమ సంతానం. ఎక్కడ పెంచుతావ్ అని సత పోరితేగదా అది ముగ్గులోకి వచ్చింది" ఇలా సాగిన సంభాషణ అంతా వాళ్ళూహిస్తున్న పరిష్కారం దిశగా సాగుతోంది. ఇదంతా రాజారత్నంగారిలో అసహనాన్ని రేకెత్తిస్తోంది. ఇది వింటున్న అమ్మాయి యేమౌతుందో అని ఆలోచించరేం అను కొన్నారాయన.

ప్రకృతి సిద్ధమైన శరీర ధర్మాలకీ మనుషులు ఏర్పరచుకొన్న నిబంధనలకీ మధ్య అగాధం పూడ్చరానిదౌతోంది. అలనాటి శకుంతల నుంచీ ఈనాటి వరకూ ప్రతి యుగం లోనూ ఈ అంశం సమస్యగానే ఉంది. పురుషుల ఈ విధమైన పిరికితనం మారటమే లేదు. ఆ పరిస్థితిలో సంతానాన్ని 'అక్రమం' అనే నిందకు గురిచేయడమేమిటి. తల్లో తండ్రో అక్రమంగా ప్రవర్తించి ఉంటారు అని మథనపడుతున్నారు. తన ఉనికిని తెలియజేస్తూ గొంతుసవరించుకొన్న ఆయన "సంతానం యెప్పుడూ సక్రమమైనదే" అన్నారు. విజయమ్మ నాలిక్కరుచుకొని ఊర్కుండే సరికి మాణిక్యమ్మ గారు వెలుపలికి వచ్చి ఈ మాటలు అర్థంకాక చూస్తూ ఉండిపోయింది.

"ఏముంది అణువుల సక్రమ సమ్మేళనమే సంతానం" అన్నారు. మాణిక్యమ్మగారు సీరియస్‌గా ముఖంపెట్టి నవ్వులాటకిది సమయం కాదండీ... మన వరలక్ష్మి...".

"తెలుస్తూనే ఉంది !"

"పోనీ... మనంగా వాడి కోసం వాకబ్ చేసి..." ఇది మరీ అసంబద్ధంగా అన్పించిందా యనకు. పాత నీతి ఒకటి ఉందిలే 'స్త్రీకి ఒకే పురుషుడు' అనేది. వాడు మోసగించి తప్పుకు పోతే వాడినే వెతికిపట్టి అమ్మాయిని వాడికే కట్టబెట్టటమనేది. ఆ నీతికి వత్తాసు పల్కేదే మరొక వింత సామెత కూడా జ్ఞప్తికి వచ్చిందాయనికి 'కుక్క ముట్టిన కుండ' జాతీయం, ఆ పదార్థాన్ని ఆ కుక్కకే కట్టబెట్టాలన్నదే దాని అంతరార్థం. స్త్రీని ఒక పదార్థం క్రిందనో ఆలోచనలు, ఆశయాలు, ఇష్టాయిష్టాలులేని వస్తువు క్రిందనో జమగట్టిన అంచనా, మగాడిని నిలదీయటం, మళ్ళీ తిరిగి వాడికే అమ్మాయిని సమకూర్చిపెట్టడం అంతా ఆ పాత నీతిని పరిరక్షించటమే అని ఆయన అభిప్రాయం. ఏం మరొక పురుషుడిని ఆమె వివాహం చేసుకోగూడదా ? స్త్రీ అందుకు అయోగ్యురాలై పోతుందా అని ఆలోచిస్తున్నారు. తల త్రిప్పి వరలక్ష్మి కోసం చూశారు. ఆమె పనుల్లో నిమగ్నమైనట్టు దూరంగా వెళ్ళి ఉంది. ఫరవాలేదు ఆమె విని అపార్థం చేసుకొనే ప్రమాదం లేదులే అనుకొని "ఏం ఆ కుక్కకే సమర్పించాలనా వాడి కోసం వాకబ్ ?" అన్నారు. క్లిష్టసమయమైనా ఆ హాస్య ప్రసంగానికి నవ్వి. "ఐతే అబార్షన్ చేయిద్దామా" అంది. పరిస్థితి ఒక కొలిక్కి వచ్చినట్లే అన్న ఆశతో. ఇప్పుడాయన పూర్తిగా హాస్య ధోరణినవలంబిస్తూ "ఏం... పెండ్లికి ముందు అమ్మాయిలకి అబార్షన్లు చేయించి సంప్రదాయాలు కాపాడటానికి నడుం కట్టుకున్నావా".

"మరి యెలాగండీ ఆడపిల్ల బ్రతుకేంగాను ?"

రాజారత్నంగారు గదిలోకి, వసారాలోకి పచార్లుచేయసాగారు. హద్దులు అతిక్రమించిన యువకుడికి చెంపపెట్టుగా ఉండాలంటే యిలా రహస్యాలు కప్పెట్టడంకాదు జరగాల్సింది. వాడినొక చచ్చినవాడికింద జమకట్టి స్త్రీలు ఏ అనుచితం జరగనంత సహజంగా జీవించాలి అనుకొంటున్నారు. తన భావాలకు వారిని సుముఖుల్ని చేయాలన్న తలంపుతో.

"అబార్షన్ దేనికోసం ?"

ఇంతమాత్రం తెలియదా అన్నట్లు నుదురుకేసి చేతితో తట్టుకొంటు "అయ్యో పెండ్లి కోసమండీ". కాలం యేమాత్రం గడిచిన కడుపులో బిడ్డదొచ్చి ఒడిలోపడి అమ్మాయి బ్రతుకు బండలౌతుందని ఆమె తొందర. తక్షణ పరిష్కారం పెండ్లియేనన్నది ఆమె ధృఢ విశ్వాసం అలాంటప్పుడు పెండ్లియే జరిపిస్తే సమస్య తీరిపోతుంది కదా, అనుకొంటున్నారు ఆయన.

కానీ ఎలా పరిస్థితిని దాచకూడదు. తెలిసిన సహృదయుడే ఆమెను వివాహం చేసుకోవాలి. ఇది జరిగేదేనా, ఎందుకు జరగ కూడదు. సమాజంలో జరగకూడని సంఘటన అంటూ యేముంటుంది ? సమస్యలనేకమైనట్లే పరిష్కారాలూ అసంఖ్యాకాలుగానే ఉంటాయి. ఇంతకూ ఆడవాళ్ళ మీద నిబంధన లేవీ లేవన్నంత సహజంగా ఉండకూడదన్నంత స్వేచ్ఛాప్రియత్వం స్వప్నిస్తూ ఉద్వేగంతో యిలా అన్నారు "అమ్మాయి తప్పటడుగు మనసు పొరల్లోకి కూడా రానివ్వక ఆమెని ఆమెగా మన్నించి జీవితపర్యంతం ఆమెకి భర్తగా ఉండే దమ్ముగల కుర్రాడు..." అర్ధోక్తిలోనే, ఆయన మాటలు ఇంకా పూర్తి కాలేదు. విడ్డూరంగా వింటున్నారు. మాణిక్యమ్మ-పక్క గదిలోంచి పద్మ అల్లంత దూరాన వరలక్ష్మి ఆగంతకురాలితోబాటు గుమ్మానికి ఆనుకొని కూర్చున్న ప్రసాదరావు సైతం ఊపిరి బిగబట్టి వింటున్నారు. మాణిక్యమ్మ గారు రెట్టిస్తూ "ఊ... దమ్ముగల కుర్రాడు... ?".

"ఆమెని ఇప్పటికిప్పుడు మూడు ముళ్ళువేసి పెండ్లాడాలి" ఇదే సిద్ధాంతమైనట్లు స్ఫుటంగా చెప్పి ముగించారు. ఆయన ఉద్రేకస్థాయిని నూటికి నూరుపాళ్ళు అంది పుచ్చుకొన్న కంఠం "ఇప్పటికిప్పుడే నేను వరలక్ష్మిని పెండ్లిచేసుకుంటాను అయ్‌గోరూ" అంది. ఎవరూ.. అతన్ని విస్మయంగాచూస్తూ దంపతులు "ప్రసాద్ !" అన్నారు. తాము విన్నదేమిటి అని అర్థాన్ని అనువదించుకొన్నారంతా, వినదగిందే విన్నారు. అసంభవమేదీ లేదు అనుకొన్నారు. అంతలోనే రాజారత్నంగారి ముఖమండలంలో యేదో సందేహం మేఘశకలంలా కమ్ముకొన్నట్లుంది. అతడికేసి గుచ్చి చూడసాగారు.

ఇది తాత్కాలికమైన ఆదర్శాల మోజులో తీసుకున్న తొందరపాటు నిర్ణయమా లేక పటిష్టమైన పునాదిమీద స్థిరంగా నిల్చేకట్టడమా అన్నది ఆయన అన్వేషణ. అది అతడూ గుర్తించాడు కాబోలు. ప్రతిజ్ఞ చేస్తున్నవాడై తన బలిష్టమైన చేయి పైకెత్తి పిడికిలి బిగించబోతున్నాడు. ఇంతలో రాజారత్నంగారు మెరుపులా ముందుకు ఉరికి వారిస్తూ చేయి యెత్తారు. ఇరువురి చేతులూ గాలిలో కరచాలనమైనాయి. తృప్తినిండిన కంఠంతో "చేతలే ఆకారందాల్చిన ధీరుడివి, నీకు మాటలతోపనియేముంది. నిన్ను శీలపరీక్షకు గురిచేస్తానా" అన్నారు. ఒక్కమారుగా నవ్వులు మారుమోగినవి.

కలలోని వ్యక్తుల్లా ఎప్పుడు పనులు ముగించి సన్నద్ధులైనారో మంగళసూత్రాలూ, మధుపర్కాలు తగుమాత్రపు పెండ్లి సంబరాలు ఎప్పుడు సమకూర్చుకున్నారో, ఎప్పుడు బండి యెక్కారో నిమిషాలమీద వచ్చి గుడిముందు వాలారు.

"ఆలయ ప్రాంగణంలో కాస్త రద్దీ తక్కువగా ఉన్నచోట ఓ క్షణంపాటు ఆగండి" అంటూ అందర్నీ ఆపారు రత్నంగారు. ఇంతవరకూ వరుడివైపు నుంచే ఆలోచిస్తున్నారుగానీ అమ్మాయి అభిప్రాయంగూర్చి ఆలోచించలేదన్న స్ఫురహలో ఉన్నారాయన. "చూడమ్మాయ్

వరలక్ష్మీ..." అన్నారు సాభిప్రాయంగా. ఆయన ముఖంకేసి చూసింది. స్వచ్ఛంగా నిర్మలంగా ఉందది. వరాలతో ఒడి నింపిన ఈ మానవ దైవతం యింకా యేమి చెప్పబోతున్నారో అనుకుందామె.

ఆమెతో "ఒక్క చదువు విషయంలో లొంగదీయలేకపోయి అతని మాండలికానికి అతన్ని వదిలేశామేగాని మాకు భిన్నంగా, పరాయివాడిగా యెప్పుడూ భావించలేదు.. ఏం ప్రసాద్ !" అన్నారు. వీరిద్దరినీ కలిపి మాట్లాడుతూ అతను మొహమాటంగా చూశాడు.

"అంతమాత్రాన నీవీ ముక్కూ మొహం తెలియని వాడిని..." ఆయన మాటలను పూర్తి చేయనివ్వలేదు. "బాబాయ్ !" అనే కేక. ఇది మరింత ఆత్మీయంగా విన్పించిందందరికీ. "ఐనా ! నీకు మరో ముఖ్యవిషయం కూడా తెల్పాలమ్మా..." కొంచెం ఆగారాయన, అతని వైపు మెప్పుగా చూస్తూ "ఈ పుంస్కోకిలది పంచమ స్వరం" అన్నారు. ఇప్పుడు అంతరి చూపులూ వరలక్ష్మివైపు మళ్ళాయి. అందరిలో ఉత్కంఠ నిండిపోయింది. రాజారత్నంగారు "ఎమ్మా నీకు అభ్యంతరం లేకపోతేనే...".

వరలక్ష్మి నొచ్చుకొన్నంత ఇదైపోయింది. నట్టేట్లో నావలాంటి తన బ్రతుక్కు తీరం చూపిన కుటుంబం ఒకవైపున, అభాసుపాలు కాకుండా తన ప్రక్కన అండగా నిలబడిన సహృదయ యువకుడు మరోవైపున. అప్రయత్నంగా ఆమె కళ్ళు చెమరించాయి. చేతులు జోడించింది. "అభ్యంతరమా... మహాప్రసాదం" అంది.

రత్నంగారి బాహువుల మధ్య వరలక్ష్మి ప్రసాదరావు ఇరుక్కుని ఉన్నారు.

గోవాడ బాలకోటీశ్వరస్వామి మూడుముళ్ళ బంధాలకు అండగా వుంటాడని అభయమిస్తున్నట్లు గుడిగంటలు గణగణ మ్రోగాయి. ❑





**దార్ల రామచంద్ర,** M.A., B.Ed.
*తెలుగు జూనియర్ లెక్చరర్,*
A.P.S.W.R.S. జూనియర్ కాలేజి,
పో॥ హుస్నాబాద్, జి॥ కరీంనగర్ - 505 467

# అమ్మ చెప్పిన కథ

ఆకాశం మీది నుంచి కిందికి పాముని వేలాడదీసినట్టు ఒకటే వాన. తుప్పర-తుప్పర మొదలై ఐదు రోజులుగా ఎడతెరిపి లేకుండా కురుస్తున్నది. ఒకవేళ తుఫానై ఉండవచ్చు. ఆరోజు మబ్బులు విడిపోయి, వాన తగ్గిపోయి, సూర్యుడు జైలులోంచి విడుదలై బైటి కొచ్చిండు. సరిగ్గా రెండు జాములవుతుంది. అతలాకుతలమైన జనం గాలి పీల్చుకొంౘ్రు.

"అవ్వ.. అవ్వా.. ఆ డప్పుల చప్పుడేందమ్మ, గోలగోలగా ఏడుపు బొబ్బలు విని పిస్తున్నాయి" అడిగిండు తల్లిని, కొంగు పట్టుకొని వెంట తిరుగుతున్న ఆ పిల్లవాడు. "అయ్యో బాంచెన్ చిన్నోడా ! ఈశ్వరయ్య చచ్చిపోయిండు బిడ్డా !?" విచారంగా మొగం పెట్టి, కండ్లల్లో నీళ్ళు జల-జల రాలుతుండగా అంది తల్లి. "ఈశ్వరయ్యంటే ఎవరవ్వ జరచెప్పు ?". "నువ్వు మొన్న పీట తేలే, ఆ ఇంట్లో ఒక ముసలి తాతయ్యని చూడలే ! చూసినవు కదా ? అవ్‌నా" "అవ్... చూసిన ! ఆ... చూస్తేనే... చూసిన." "ఆ ముసలి తాతరా అయ్యా !" "ఆహా... ఆ ముసలి తాతేనా !" గుర్తు చేసుకొని యాదికొచ్చినట్లుగా తలాడించిండు చిన్నపిల్లవాడు లక్ష్మన్.

"అక్కా ఈశ్వరయ్యని దానం చేస్తుండ్రంటగా, సూసొద్దామా అత్తవా ?" అడిగింది పక్కింటి యారాలు ఈరమ్మ. "పోదాం పా" అంది ముత్తిలింగమ్మ. ఇద్దరు కలిసి చూడనీకి పోయిండ్రు ఈశ్వరయ్య శవాన్ని.

శవం మీదపడి ముగ్గురు బిడ్డలు ఆలగోడు బాలగోడుగా ఏడుస్తుండ్రు. "అయ్యా... పోయినవా అయ్యా ! మమ్మల్ని వదిలి వెళ్ళిపోయినవా అయ్యా ! మాకుదిక్కెవరు అయ్యా !' అంటూ శవంమీదపడి చేతులుచాచి ఏడుస్తుండ్రు. "అయ్యా... ఇక మమ్మల్ని పండుగలకు ఎవరు తీసుకొస్తరయ్యా ! ఇగ మాకు మంచి చెడులు ఎవరు చూస్తరు అయ్యా" అంటూ ఏడుస్తుండగానే చుట్టాలందరూ చేరిండ్రు. ఊరి జనమంతా చిన్నా, పెద్దా, ముసలి ముతక, అమ్మలక్కలు వచ్చిండ్రు. చుట్టూ గుంపులుగుంపులుగా జనం.

నలుగురు కొడుకులు నాలుగు పక్కల, ఇద్దరు ముందు ఇద్దరు వెనకాలా పాడె పట్టిండ్రు. బొంగురు పేలాలు, చిల్లర పైసలు కలిపి శవంపై చల్లుకుంటూ శవంను పైకి

లేపింద్రు. శవం సాగిపోతుంది. చేతిలో కొర్రాయినిప్పు, తలగొరివి చిప్ప కుండపట్టుకొని పెద్దకొడుకు శవం ముందు నడుస్తుంద్రు. చెరువు దగ్గర బొందపెట్టి, అందరు చెరువులో ఒళ్ళు కడుక్కొని ఇల్లు చేరింద్రు.

మా ఊల్లో ఎప్పుడైనా కథ చెప్పినా, సర్పంచ్ గడీ దగ్గర చావిడిలోనే కథ చెప్పాలి. అది సర్‌పంచ్ కట్టడి. ఈసారి ఈశ్వరయ్య తాత ఇంటిముందు కథ చెప్పటం ఇదే మొదటిసారి. నేలమీదనే స్టేజీ, పెట్రోమాక్స్ లైట్లు రెండు పెట్టారు. పట్నం నుంచి కిరాయికి తెచ్చింద్రు ఆ లైట్లు.

మా ఊరిలో ఎవరు చనిపోయినా వాళ్ళ పేరుమీదుగా కథ చెప్పించడం ఆ కులాల ఆచారంగా జరుగుద్ది. అల్లుల్లు, బిడ్డలు, కొడుకులు, బంధువులు తలా ఓ చెయ్యేసి కథకుల్ని రప్పించింద్రు. కథకులు వేశధారులైన ముగ్గురు వ్యక్తులు, స్టేజీమీదికొచ్చి కథ చెప్పటానికి సిద్ధంగా ఉంద్రు. తందాన... తందాన... తందానతానే... తందానా ! కథకుడు మధ్య వ్యక్తి, అటు ఇటు కడవ్యక్తులు వంతలు పాడగా కథ చెప్పటం ప్రారంభమైంది.

"అక్కా ! బ్రహ్మం గారి కథ చెప్పుతుంద్రంటగా, మన గూడెపోళ్ళందరు వినటానికి పోయింద్రు. అక్కడెక్కడి దూరం నుంచి చెప్పెటోళ్ళని తోలుకొచ్చిండంటా" ఈరమ్మ యారాలు చెప్పింది ముత్తిలింగమ్మతో !

"అవ్.. గట్లనా ! మరి మనంకూడా పోదాం రావే". ఈ చిన్నోడు లక్ష్మన్ నిద్రపోయిండు, వీడెట్ల, పెద్దకొడుకు మంచంలో పండబెట్టి, మూలనున్న ఈత సాప చంకన పెట్టుకొని ఇద్దరు కథకాడికి బిరబిరపోయి కూర్చుంద్రు.

"అవ్వ... అవ్వ... నాకు నిద్దరరావటం లేదవ్వా ! ఒక చాత్రం చెప్పవా ? నువ్వు నిన్న రాత్రి కథకాడికి పోతివిగదా ! గది చెప్పవా అన్నాడు లక్ష్మన్. "పొద్దాక కూలికిపోయి రెక్కలు బొక్కలు నలిగి, నొప్పులు పెడుతుంటే, పెయ్యంత ఊనమై నేనుంటే కథట-కథ" ఇసుక్కుంది తల్లి. ఏడుపు మొగంపెట్టి ఏడ్వటం సురువు చేసిండు లక్ష్మన్. ఈశ్వరయ్య కథ చెప్పితే ఎలా ఉంటుంది, మనసులోనే అనుకుంది. కథ చెప్పటం సురువు చేసింది. లక్ష్మన్ మొగం సంతోషంగా వెలిగిపోయింది, ఆనందం ఉప్పొంగింది.

ముత్తిలింగమ్మ ఈశ్వరయ్య కథ చెప్పటం, కొడుకు ఊకొట్టడం మొదలైంది. ఈశ్వరయ్య మబ్బులో నిద్రలేచి, కొలిమిలో బొగ్గువేసి తిత్తి ఊది కొలిమంటుపెట్టెటోడు. పెద్దకొడుకు తిత్తి ఊదేవాడు. తండ్రి కమ్మరిపని మొదలు పెట్టెటోడు. "హూ... హూ..." అంటూ ఊ... కొడుతుండు చంటోడు తల్లి ఒడిలోపడుకొని.

గ్రామంలో కమ్మరి, వడ్రంగి ఇంటిముందు కోసడంత లైన్ కట్టింద్రు జనం. వరికోతలు వరికోతలు శివాంట పట్టేరోజులొచ్చినయి. నా కొడవండ్లు నూరమని ఓ రైతు, నా కొడవండ్లు

చరచమని మరో కూలీ ! నా కొడవండ్లు చరిచియ్యమని ముఠామనిషి, కరణం, పటేలు, దొరజీతగాళ్ళు ! పెద్దకాపు పెద్దకొడుకు ఇలా అందరూ కోలాహలంగా గలబ గలబగా ఉండేది ఈశ్వరయ్య ఇల్లంతా ! పగలనకా రేయనకా ఊరిజనాభాకు కొడవండ్లు, చరిచి, నూరి, పిడిలేసి ఇచ్చేవాడు.

వడ్డేరోళ్ళకు గన్నుకు కర్ర, సుత్తికి కర్ర, పారకు కర్ర, గడ్డపారకు మొన చేసిచ్చెటోడు. ఎరుకల వాళ్ళకు పెద్దకొడవలి, మందులోల్లకు పందుల పొడిచె బరిసె. చిల్ల, గౌడులకు కత్తులు, మాదిగలకు కత్తి, ఆరె, మంగళికి ఆకురాయి, కత్తులు ఇచ్చేటోడు బిడ్డా ఈశ్వరయ్య!

తొలకరి మెరిసింది, వానకురిసింది ఏరువాక మొదలైంది. ఊరిజనం ఎగ[illegible] పనులకు ఉరుకులు పరుగులు తీసెటోళ్ళు. సర్పంచ్ దొరకు నాగళ్ళు చెక[illegible]గుమాస్తా వచ్చే టోడు. పెద్దబాడిసతో పట్వారి దొర నాగళ్ళు, మా నాగళ్ళకు కర్రులు సానపట్టమని, మేడి చెక్కమని, కాడిచెయ్యమని మాలి పటేల్‌దొరగారి జీతగాడొచ్చెటోడు. ఇలా మంచినీళ్ళు తాగటానికి కూడా తీరిక లేకుండా గొడ్డు చాకిరి పొద్దల్లే పనిచేసినా ఈశ్వరయ్యకు పొయ్యిలో పిల్లి లేచేదికాదు. "అంటే ఏందవ్వా ?" అడిగిండు లక్ష్మన్. "అప్పుడప్పుడు పస్తులుండేవాళ్ళు అని అర్థం బిడ్డా" అంది తల్లి. "ఇంకా జరచెప్పవ్వా ?" అండు చిన్నోడు లక్ష్మణ్.

ఊరిపెద్దల ఇంటి బంగ్లాలకు ద్వారబంధాలు, తలుపులు, కిటికీలు, ఇంటికి దూలాలు, మొగరాలు, వాసాలు, అడ్డపట్టెలు, గుజ్జులు చెక్కి సరిచేసి, బర్మాతో వాసాలు తొలులు కొట్టి, ఉలితో తొలిచి ఇంటికివాసాలు ఎక్కించి, చీలలునాటి వాటిపై ఎదురు బద్దలు పరచి చీలలు కొట్టి ఇల్లు పైకప్పు తయారు చేసేటోడురా ఈశ్వరయ్య తాత.

ఇన్ని పనులుచేసినా రైతుల, కాపుల, దొరల, పటేళ్ళ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి అడుక్కున్నట్లుగా గింజలు, డబ్బులు, కొసరి కొసరి, ఇసరి ఇసరి కసిరి ఇచ్చేటోళ్ళు బిడ్డా ! ఏంచేయ్యాలే రోజులు వాళ్ళవి. మనస్సులోనే ఆవేదన బరువుదించుకున్నాడు తాత ఈశ్వరయ్య, ఉస్సురుమంటూ కాలం గడుపుతుండేవాడు.

ఈశ్వరయ్య తాత కుటుంబం ఉమ్మడికుటుంబం. ముసలి తల్లితండ్రి, భార్యపిల్లలు, అన్నదమ్ములు, అక్కచెల్లెల్లు, గంపంత బరువు. పూట పూటకు తిండిగింజలు చాలక, గడియ గడియ ఓ గండంగా ఉండేది. భార్య కూలిపనులకుపోయి అంతోఇంతో కూలి గింజలు చేదోడువాదోడుగా కాలం గడిచేది. "ఊ... ఊ..." అంటూ ఊ కొడుతుండు చిన్నోడు శ్రద్ధగా వింటూనే !

ఉన్నట్టుండి ఒకనాడు ఈశ్వరయ్య బిడ్డకు వంట్లోనలతగ ఉందని చెప్పింద్రు, బిడ్డని తోల్కరావటానికి పోయిండు. అంతే ఎక్కడ పని అక్కడ ఇంజన్ లేకుండా పల్లె రైలు కదలటం ఆగిపోయింది.

మోటబిల్ల గిరక పగిలిపోయిందని, మోట ఆగి తోట ఎండిపోయిందని జరమోట బిల్ల గిరక చెయ్యమని సర్పంచ్‌దొర గుమాస్తా రానే వచ్చిండు. "ఈశ్వరయ్యా... ఈశ్వరయ్య లేడా ! ఎటు పోయిండు ?" ఊరికి పోయిండని మారు చెప్పింది భార్య. పది ఎకరాల పొగాకు తోట ఎండిపోతది. వర్జీనియా గుంటూరురకం, 'దొరకోప్పడతండు' అన్నాడు గుమాస్తా బాబు. సుబ్బిపెండ్లి ఎంకి చావుకొచ్చినట్లుందేమి వరుస అనుకుంది ఈశ్వరయ్య భార్య. "ఈశ్వరయ్యా... ఓ ఈశ్వరయ్య లేడా ?" లేడని ఇంట్లోనుంచి సమాధానం. నీళ్ళ తొట్టి పగిలిపోయింది, మెరపతోట ఎండిపోతది, లక్షరూపాయల పంట నాశనమౌతది. నీళ్ళ తొట్టి చెక్కాలే ఎట్లా ! అంటూ విచారంతోపోయిండు పెద్దకాపు. "పటేల్ సాబ్ కచ్చడం బండి కుయ్యపోయిందని నన్ను బిన్న చేయించుక రమ్మన్నడు పటేలు, ఈశ్వరయ్య ఏడి ?" అంటూ వచ్చిండు పటేలు పాలేరు పాపయ్య.

మన గ్రామంలో ఎడ్లబండ్లు చెయ్యటంలో ఈశ్వరయ్య టెక్నికల్‌గా చక్కటి ప్రతిభ కల్గినవాడు. ఆకులు, ముంతలు, పోలు, చట్టం, అడ్డనిలువులు, పట్టెలు, కుయ్యాలు, తొట్టి, సాయశీలలు, బండికి కావలసిన వస్తువులన్ని ఒక్కొక్కటిగా రడీచేసి, ఈ సామాను లతో బండిని బిగించేవాడు. ఈ బండి చేయటానికి పదిరోజులు పట్టేది తాతకు.

"తాత కచ్చడంకూడా తయారు చేసేటోడురా చిన్నా !" అంది తల్లి. "కచ్చడమా అదేంటి అవ్వా ?"అడిగిండు లక్ష్మన్. "ఆనాడు తెలంగాణా ఊలల్లో కచ్చడం బండి ఊరికి కొన్ని చొప్పున ఉండేవి బిడ్డా ! దొరలు, పటేల్లు, పట్వారీలు, కాపులు, దొరల భార్యలు దొర సానులు దానిపై కూలబడి ప్రయాణం చేసేటోళ్లురయ్యా !"

"అవ్.. గట్లయితే ఆ కచ్చడం ఎట్లా చేసిండో జరచెప్పు ?" అడిగిండు లక్ష్మన్. చత్రాలు, ఆకులు, ముంత, కాని, తొట్టి, చిర్రలు, చీల వీటితో కచ్చడం బిగించి, ఎండకు, వానకు తడవకుండా కచ్చడం పైకప్పుతో అల్లెటోడు. రంగులువేసి అందంగా కనపడేటట్లు కచ్చడం తయారు చేసిచ్చెటోడురా తాత !

ఈశ్వరయ్య తాత ఐదుగురు కొడుకులు పెండ్లీలు చేసుకుంద్రు, లగ్గం ఐనాక పెద్దోడు బ్రహ్మయ్య కంసాలి పని నేర్చిండు. పట్నంలో ఉంటుండు. చిన్నోడు కంచరిపని నేర్చి అత్త గారింటి దగ్గర పనిచేస్తుండు. మూడొకడు బైటి కమ్మరిపనితో డోర్నకల్‌లో బతుకుతుండు. చిన్నోలిద్దరు ఒకడు కమ్మరి, ఒకడు వడ్రంగి పని నేర్చింద్రు. ఐదవవాడు ఏ పనిచెయ్యక మిగిలిండు.

ఏదోపనిమీద పట్నం నుంచి బ్రహ్మయ్య ఇంటికి వచ్చిండు. బాగోగులు, పలకరింపులు తరువాత అందరు కూర్చుంద్రు. టీలు అందించింది చిన్నోడి భార్య. "పని మంచిగా నడుస్తుందిరా చిన్నోడా" అడిగిండు బ్రహ్మయ్య. "లేదన్నా ! పని లేదు పాడు లేదు". "ఏం

ఎందుకురా చిన్నా ?" తిరిగి అడిగిండు అన్న. "ఈ గ్రామాలల్లో ఇప్పుడేముందన్న, సమాజంలో ఎన్నో మార్పులొచ్చినయి. మోటకు బదులు ఆయిల్ ఇంజన్ తరువాత కరంటు ఇంజన్, నాగలికి బదులుగా ఇనుప నాగళ్ళు, ట్రాక్టర్లు దున్నుతున్నాయి. ఇనుప సామానులు, కట్టె సామానులు కుప్పకూలి, ఫ్యాక్టరీలల్లో రడీమేడ్‌గా వచ్చి దుకాణంలో ఎక్కడబడితే అక్కడ దొరుకుతున్నాయి.

"గట్లనా ! నేనురాక 20 ఏండ్లు గడిచింది" అన్నాడు బ్రహ్మయ్య తమ్ముళ్ళతో. ఎడ్లబండ్ల స్థానంలో కచ్చడం స్థానంలో ట్రాక్టర్లు, జీబులు, కార్లు, సైకిల్ మోటార్లు, స్కూటర్లు ఇలా సమాజంలో ఎన్నోమార్పులు జరిగినయి" అన్నాడు మరో తమ్ముడు పెద్దన్న బ్రహ్మంతో ఆవేదనగా ! "కట్టెమంచాలు, కుర్చీలుపోయి ఇనుపకుర్చీలు, మంచాలు, బల్లలు, బల్ల పీటలు ఎక్కడబడితే అక్కడ దర్శనమిస్తున్నాయి. బల్లల్లో, హాస్టల్లో, సినిమా హాలల్లో, దవాఖానలల్లో ఇనుప ఫర్నీచర్ వాడుతున్నారు" అన్నాడు చిన్నోడు సత్యం.

"ఇండ్లకట్టడ నిర్మాణంలోసుత ఎన్నోమార్పులు జరిగినాయన్నా ! ఇంటి వాసాలకు, దూలాలకు, మొగరాలకు బదులుగా సిమెంటుని వాడుతుండ్రు. చివరకు కిటికి ద్వార బందాలకు సుత సిమెంటునే, డాబాలు కట్టడం, స్లాబ్‌లు పొయ్యడం మాకు రవ్వంత పని లేకుండా పోయిందన్న" అన్నాడు మూడవ వాడు.

"ఔ.. ఐతే గిట్లయిపోయిందా మన కులవృత్తి పరిస్థితి ! ఇల్లెట్ల గడుస్తుందిరా ! పిల్లా జెల్లా ఎట్లా మరి, ఎట్లా బతుకుతుండ్రు దీనంగా అడిగిండు" తమ్ముల్ని అన్న బ్రహ్మయ్య.

"చేతి వృత్తులపైనే అధారపడిన మా జీవనంపై ఆధునిక ఉత్పత్తులు శాపంలా దాపు రించాయన్నా ! తాతలముత్తాతల నుంచి నమ్ముకొని జీవించినా ఇప్పుడు పూట గడవలేని పరిస్థితి అన్నా !" అన్నాడు రెండవవాడు. "మా ఆడోళ్ళు కూలీనాలిచేసి అనోఇన్నో తిండి గింజలు తెస్తుండ్రు. వాటితో పూటలెల్లదీస్తుంటిమి" అన్నాడు కిట్టయ్య. "ఏదన్న పని ఆధారం చూపన్న మీ పట్నంలో..." అడిగిండు చిన్నోడు సత్యం.

బీడి వెలిగించి తాగుతూ ఆలోచనలో పడ్డాడు పెద్దోడు బ్రహ్మయ్య. నేను కంసాలి వృత్తిలో గొప్ప పనివాన్నే, కాని నా దగ్గర డబ్బులేక, జ్యూలరీ షాపులో రోజు కూలిగా పని చేస్తుంటిని. ఆ షాపు యజమాని వృత్తితో సంబంధంలేని డబ్బున్న ఒకవ్యాపారి. వీళ్ళకేడా పని చూపించేది. ఇలా కొనసాగుతుంది మనస్సులోనే ఆలోచన.

"ఏందన్న ఏదో ఆలోచనలో పడ్డవు, పని గురించేనా !" అడిగిండు నాలుగవ వాడు కిట్టయ్య. తలగోక్కుంటూ, "ఏం లేదురా ! అదే మీకు పని ఎక్కడ చూపించాలా అని !" అన్నాడు బ్రహ్మయ్య గొణుక్కుంటూ.

"ఒకప్పుడు మన అయ్యా ఈ ఊరికి ఎంతో సేవ చేసిండు. అయ్యా నేను పని చెయ్యకుంటే ఈ గ్రామ ప్రజలకు జీవితం గడపడం కష్టంగా ఉండేది. మా చుట్టూ తిరిగి తిరిగి పనులు చేయించుకోకపోతే ఈ పల్లెకు పూట గడిచేది కాదు. ఒక్కపూట అయ్యకు జ్వరం వచ్చి మంచాన పడితే ఎన్నో పనులు ఆగిపోయేవి. మారెక్కాడితే, వాళ్ళ బతుకులు ముందుకు సాగేవి. రాత్రనక, పగలనకా నడుం వాల్చకుండా కొలిమి పెట్టి పని చేస్తిమి. గిప్పుడు చూడు మన బతుకులు ఎట్లా ఐపోయినవో" ఆవేదనగా, దీనంగా తన గాథను, బాధను తమ్ముళ్ళతో చెప్పాడు బ్రహ్మయ్య.

"ఒరేయ్... చిన్నోడా ! రెండో అన్నకాడికి పోయితివా ? పనిగురించి చెప్పినవా ? ఏదైనా పని ఇప్పించమని అడిగినవా ?" ప్రశ్నించిండు బ్రహ్మయ్య చిన్నతమ్ముడిని. "లేదన్న... లే... ఆయన స్గుత ఒక షాపులోనే కుదిరిండు. ఇత్తడి బిందెలు, తట్లు, రాగి చెంబులు, రాగి గిలాసలు ఇప్పుడెవరు కొనటం లేదటగా ?! అన్నీ స్టీలు సామానులే, ప్లాస్టిక్ వస్తువులే వచ్చినయట, కంచరి పని మూలన పడింది. చిన్న పనిచేసే షాపు యజమాని షాపు బంద్ పెట్టిండు, పని లేకుండా పోయిందని నెట్టుడు బండిపై స్టీలు సామానులు అమ్ముతుండు, మనవోడు". "అవ్... గట్లనా... ఐతే మూడో అన్నకాడికి పోయినవా". "ఆ... పోయిన, ఆ అన్న పరిస్థితికూడా పొయ్యి మీద మంగలం పెంకులోంచి పొయ్యిలోపడ్డ పేలపు గింజలా ఉంది. అన్న నవభారత్ ఫ్యాక్టరీలో కూలీపనికి పోతండు. కార్పెంటర్‌పని దొరకటం లేదట" విచారంగా చెప్పిండు చిన్నోడు.

"నువ్వె మాకేదన్న పనిచూపాలన్నా" అన్నారు ఆ ఇద్దరు తమ్ముళ్ళు అన్నతో ! "మా బజారులో ఈ మధ్యనే ఒక కొత్త షాపు పెట్టబోతున్నారు. ఒక పెట్టుబడి ఉన్న ఆసామి కార్పెంటర్ షాపు పెట్టిండు, డైనింగ్‌టేబుల్స్, కుర్చీలు, బల్లలు, సోఫాలు, టీపాయ్, డబుల్ కాట్, సింగిల్ కాట్ మంచాలు వర్కర్సునిపెట్టి తయారుచేయించి ఫర్నీచర్ అమ్ముతుండు. రోజుకు యాభై రూపాయల వరకు కూలీ ఇవ్వవచ్చు. అతన్ని అడిగితే మీకు తప్పక పని ఇస్తాడని నా నమ్మకం" అన్నాడు బ్రహ్మం తమ్ముళ్ళతో, తమ్ముళ్ళకు ఆశ కల్గింది.

"తెల్లారి అన్నదమ్ములు ముగ్గురు కలిసి డోర్నకల్‌లో రైలుఎక్కి వరంగల్ చేరుకుండ్రు. కార్పెంటర్ కూలితో కాలం ఎల్లదీస్తుండ్రు బిడ్డా పట్టణంలో" అంది ముత్తిలింగమ్మ కొడుకుతో.

"కథ అయిపోయింది బిడ్డా !" అని కొడుకువైపు చూసింది. ఊ... కొడుతున్న చిన్నోడు నిద్రలోకి జారుకుండు. వాడిలోంచి తీసి, బొంతపరచి బొంతలో పండబెట్టింది తల్లి కొడుకు పక్కనే తల్లి నడుంవాల్చి నిద్రలోకి జారుకుంది. □




**ఎమ్మెస్సార్ (మండవ సుబ్బారావు),**

M.A., B.Ed., M.Phil., LL.B.

వివేకవర్ధని కాలేజి,

లక్ష్మీదేవిపల్లె, కొత్తగూడెం - 507 101

జి॥ ఖమ్మం. ఫోన్ : 08743-47886


# తేజ

ఆ రోజు విజయదశమి.

సమయం రాత్రి 9 గంటలు అయింది. ఆకాశంలో దట్టమైన మేఘాలు. పగలంతా వర్షం పడింది. నేలంతా తడిసి చిత్తడిగా ఉంది. ఎక్కడో దూరంగా మెరుపు. కరంటు పోయింది. దసరా సెలవులవటం వలన క్యాంపస్‌లో ఎవరూ లేదు. తేజ ఒక్కడే తన రూములో ఏదో రాసుకుంటున్నాడు. కరంటు పోగానే నడుంవిరుస్తూ ఆవలింత తీశాడు. నెమ్మదిగా లేచి అగ్గిపెట్టె కోసం గదిలో వెతుకుతున్నాడు. అగ్గిపెట్టె తొందరగానే దొరికింది. ఒకపుల్ల తీసి క్యాండిల్ వెలిగించాడు. ఆ చీకట్లో ఎవరిదో నీడ ? "ఎవరది ?" అన్నాడు తేజ. సమాధానం రాలేదు. "ఏయ్ ప్రకాశ్‌రావ్" అంటూ బిగ్గరగా వాచ్‌మ్యాన్‌ను పిలిచాడు. సమాధానం లేదు. రెండు మూడుసార్లు పిలిచాడు, లేదు. బదులులేదు. చీకట్లో నీడ తనని సమీపించింది. "మిమ్మల్నే ? ఎవరు ?" విసుగ్గా అన్నాడు తేజ.

"అన్నా ! నీతో పనివుండి వొచ్చినా జర బయటికిరా" అన్నాడా వ్యక్తి.

"ఎవరు నువ్వు ? నాతో ఏంటి పని ? చెప్పు" తేజ ప్రశ్నలు. "నేనెవరైతే నీకేంది. రామన్న వచ్చిండు నీకోసం. నిన్ను పిలుచుకు రమ్మండు పోదాం రా".

"అలాగా రమ్మను. ఇంట్లో నేనొక్కడ్నే ఉన్నాను. ఎవరూ లేరు. అక్కడ ఆ చీకట్లో ఎందుకు. ఇక్కడకే రమ్మను మాట్లాడుకుందాం".

"లేదన్నా నిన్నే తీసుకురమ్మండు". "నువ్వు కొత్తవాడివా ? నన్ను రామన్న కూడ అన్నా అని పిలవడు, సార్ అంటాడే" అన్నాడు ఏదో అనుమానంగా తేజ కుర్చీలోనుంచి లేచి ఆ వ్యక్తిని సమీపించబోయాడు. ఆ వచ్చిన వ్యక్తి చటుక్కున వెనక్కు తిరిగి "నా ఎన్కరండి" అంటూ ముందుకు కదిలాడు.

తేజ లుంగీమీదే ఉన్నాడు. బట్టలు మార్చుకోలేదు. వెంటనే చెప్పులు తొడుక్కొని ఆ వచ్చిన వాడివెంట రూము నుండి బయటకు వచ్చాడు. బయట బాగా చీకటిగా వుంది. ఒక్కో చినుకు పడుతోంది. అలా తేజ ఆ వచ్చిన వాడివెంట నడుస్తూ క్యాంపస్ గేటు

దాటాడు. వెంటనే వో పదిమంది తేజ చుట్టుముట్టారు. అందరి చేతుల్లో ఆయుధాలు ఉన్నాయి. Z ఫోర్స్ కమెండోలలా తేజ ముందు వెనక నడుస్తూ ఓ కి.మీ. తీసుకువెళ్ళారు. అక్కడ ఓ చెరువు వుంది. దాని గట్టుమీద ఒకచోట ఆగిపోయారు. తేజ "ఏడి ? రామారావు ఏడి ?" అని వాళ్ల ను ప్రశ్నించాడు. వాళ్ళలో ఒకడు చాప వేసి కూర్చోమన్నాడు. తేజ చుట్టూ కలియచూశాడు. సరిగ్గా పదిమంది వున్నారు. కాసేపు చీకటికి అలవాటు పడిపోవడంతో కొద్దికొద్దిగా సీను అర్థమవుతూంది.

అంతా నిశ్శబ్దం, ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. ఇంతలో "నమస్తే సార్, ఎలా ఉన్నారు ?" అంటూ రామన్న అక్కడకు వచ్చాడు.

"ఏంటి రామారావు ? నా రూంకు రావచ్చుగా, ఈ చీకట్లో ఏమిటి ?" అన్నాడు తేజ. రామన్న వచ్చి తేజ ప్రక్కనే కూర్చుంటూ "పండుగ గదా ! ఎవరైనా వచ్చారేమో, వాళ్ళ కెందుకీ రాజకీయం అని ఇక్కడకు రమ్మన్నా సార్. ఎలా వున్నారు ? కవిత్వం రాస్తున్నారా ? ఈ మధ్య ఏదో కవితకు బహుమతి వచ్చిందని విన్నాను. అమెరికా వాళ్ళు ఎందుకు బహుమతులిస్తారో, కమ్యూనిష్టుల్ని కూడా అవార్డులతో ఎందుకు సత్కరిస్తారో మీకు తెలీదా? ఆ బహుమతి తీసుకుంటున్నారా ?" అంటూ ప్రశ్నమీద ప్రశ్నలు వేశాడు.

"నా సంగతి నీకు తెలీదా ? ఏమిటా ప్రశ్నలు. అసలు మీరు చేస్తున్నది ఏమిటి ? నిన్నకాక మొన్న ఉద్యమంలోకి వచ్చినవాడివి, వెనకాముందూ ఆలోచించి మాట్లాడు. ఉద్యమంలో పెరిగి ఉద్యమమే ఊపిరిగా జీవిస్తున్నవాడ్ని. మన సీనియర్లను ఎవరినడిగినా నాగురించి చెపుతారు. నీకూ ఎంతోకొంత తెలుసుననే ఇన్ని రోజులూ అనుకుంటున్నాను".

"అది సరే సార్ ! మీ గురించి శ్యామన్న చాలా చెప్పిండు. ఈ ప్రాంతంలో నన్ను నియమించిన దగ్గరనుండి మీకు చెప్పే కదా ఏ పనైనా చేస్తున్నాం. ఇప్పుడు నా దగ్గర పది మంది ఉన్నారు. వీళ్ళకు ఉద్యమం గురించి ఈ రోజు మీతో నాలుగుమాటలు చెప్పిద్దామని తీసుకొని వచ్చాను. నాలుగు మాటలు చెప్పండి సార్" అంటూ అందరిని కూర్చోమని సైగ చేశాడు.

"అది సరే రామారావు, ఆ మల్లయ్యను ఎందుకు చంపేశారు ?" తేజ ప్రశ్న.

"వాడా ! వాడ్నిగురించి మీకు తెలియదు సార్. వాడు ఈమధ్య వో పోర్నీ గుంజిండు" "అని నీకెవరు చెప్పారు ? ఆ నారిగాడు చెప్పింది నమ్మడమేనా ? వాడు పరమ దుర్మార్గుడు కదా !" "లేదు సారు. నారిగాడు చాలా మంచోడు, మారిపోయిండు. వాడిప్పుడు చక్కగా వ్యాపారం చేసుకుంటున్నాడు కదా !"

"లేదు రామారావు, లేదు ఆ నారిగాడు మారినట్లు కనిపిస్తున్నాడు. వాడు చేసేది ఏం వ్యాపారం, చిట్‌ఫండ్ పెట్టి జనాన్ని ముంచాడు. జనం సొమ్ముతో సినిమాహాలు, రైసుమిల్లు కట్టించాడు. మల్లయ్య పొలం అమ్మి వాడిదగ్గర దాచుకున్న సొమ్ముకూడా మింగేశాడు కదా! ఈ విషయాలు నీకు తెలియవా ? సరే నువ్వు ఈ ప్రాంతానికి కొత్త, నన్ను అడుగవచ్చు కదా !"

"నేను కొత్తవాడ్నే కావచ్చు, కాని కొరియర్స్ కొత్త కాదు కదా ! ఆ ఊళ్లో మన కొరియర్స్ అందరూ తెలుసుకున్నారు మల్లయ్యదే తప్పని, నారిగాడు మల్లయ్యా దోస్తులని, నారిగాడు బాగుపడటం మల్లిగానికి గిట్టక పుకార్లు పుట్టిస్తుండనిచెప్పారు".

"ఏం మాట్లాడుతున్నావు రామారావు ? బాగుపడటం - ఈ పదం నువ్వు వాడవలసిందేనా. ఇది నిన్ను కలవడం మూడోసారో లేక నాలుగోసారో. నీ పద్ధతి ఏం బాగాలేదు. నువ్వు వచ్చిన ఈ మూడు నెలల్లో ముగ్గురిని అన్యాయంగా చంపేశావ్, పైగా సమర్థించుకుంటున్నావ్" కఠినంగానే అన్నాడు.

రామన్న చుట్టూవున్న పదిమంది కుర్రవాళ్ళు ఒకరిమొఖాలొకరు చూసుకుంటున్నారు. దూరంగా ఊళ్ళో లైట్లు వెలుగుతున్నాయి. "కరంటు వచ్చినట్లుంది ఇంటికివెళ్దాం పదండి, ఏదైనా తింటూ మాట్లాడుకుందాం" అన్నాడు తేజ.

"ఆకలి దంచేస్తుంది. పోదాం పద సార్ !" అంటూ లేచి నిల్చున్నాడు రామన్న. అందరూ లేచి నిల్చున్నారు. తేజ ముందు వెళ్తుంటే అందరూ వెనకాలే వచ్చారు.

వాచ్‌మెన్ ప్రకాశరావు ఎదురొచ్చాడు "సార్, సార్ పోలీసు జీపు వచ్చింది. మిమ్మల్ని అడిగారు. బయటకు వెళ్ళారని చెప్పాను. వచ్చే వరకు ఉంటామన్నారు" అంటూ చెప్పాడు. అందరూ వేగంగా చీకట్లో అదృశ్యమైపోయారు. తేజ వాచ్‌మ్యాన్‌తో కలిసి క్యాంపస్‌కు వచ్చాడు.

"హల్లో సార్ ! ఎలా ఉన్నారు ?" అంటూ పలుకరించాడు ఎస్.ఐ. హనుమంతరావు. "హలో ! బాగున్నాను. ఏంటి ఇంత రాత్రివేళ వచ్చారు ?" అంటూనే గేట్ తీసి రూంలోకి తీసుకువెళ్ళాడు. కరంటు వచ్చింది లైట్లు వెలుగుతున్నాయి. టేబుల్ మీద ఉన్న కాగితాలు చూస్తూ నిలబడ్డాడు ఎస్.ఐ.

"కూర్చోండి ! టీ ఇస్తాను".

"నో, నో ఫార్మాలిటీస్, మీతో ఓ ముఖ్యమైన పనివుండి వచ్చాను !"

"ఫోన్ చేస్తే సరిపోయేదిగా !".

"చేశాను ఫోను పనిచేయడం లేదనుకుంటా".

"కావచ్చు, సాయంత్రం వచ్చిన గాలికి లైనుపోయి ఉంటుంది".

"ఆఁ ఈ వర్షం కురిసింది కాదు, పోయింది కాదు, ఒక్కో చినుకు చిరాగ్గా వుంది".

"వేడివేడిగా టీ తాగండి" అంటూ మాటల్లోనే టీ తెచ్చి ఇచ్చాడు ఎస్.ఐ. హనుమంత రావుకు. "ఏం సార్ ? ఇంకా ఇలాంటి పుస్తకాలు చదవడం మానుకోలేదా ?" అన్నాడు ఎస్.ఐ. వో పుస్తకం చూపిస్తూ. "ఏమిటా పుస్తకం ?".

"చైనా విప్లవంలో రైతాంగం - వి.ఐ. గ్లునిన్, ఎ.ఎస్. ముగ్రుజిన్".

"ఓ అదా ! ఏదో రెఫరెన్సు అవసరమై ఇవ్వాలే బయటకుతీశా-అది సరే ఇంతకు మీరు వచ్చిన పని చెప్పనేలేదు" అన్నాడు మార్పుకోసం.

"మా సార్-సాయంత్రం ఫోన్ చేశారు. మీకు వో ముఖ్యమైన విషయం చెప్పమన్నారు. ఇప్పుడు మన ప్రాంతాలకు వచ్చి వార్ దళసభ్యుడు రామన్న చాలా ప్రమాదకరమైనవాడు. మూర్ఖుడు, సిద్ధాంతంలేదు, పోరాటంలేదు, ఎవరు డబ్బులిస్తే వాడికి పనిచేస్తాడు. ఇప్పటికే వో పాతిక లక్షల విలువచేసే బంగళా కొన్నాడట బెంగుళూరులో...".

"సార్"-కోపంగా అన్నాడు తేజ. "ఇది చెప్పటానికా ఇంత రాత్రివేళ వచ్చారు. మీపనే ఇదిగా. ఏదో నెపంతో, ఏదో చేస్తుంటారు. వాళ్లు చెప్పింది చేస్తారు. మరి మీరో... చెప్పేదొకటి చేసేదొకటి. సారీ సార్, ఇకమీరు వెళ్ళవచ్చు" అన్నాడు తేజ.

"సార్ మీగురించి మా ఎస్.పి.గారు అంతాచెప్పారు. 1969లో మీరు ఈ ఉద్యమంలో పాల్గొన్నారటగా, లేకపోతే ఈపాటికి మీరు ఎస్.పి. అయి వుండేవారని అనవసరంగా జీవితాన్ని పాడుచేసుకున్నారని చెప్పారు. ప్రేమించిన అమ్మాయి కూడా మీ సిద్ధాంతాలు నచ్చక మిమ్మల్ని వదిలిపెట్టి అమెరికా వెళ్లిపోయిందని, నమ్మిన సిద్ధాంతం కోసం మీ ఫాదర్ ఇచ్చిన ఏభై ఎకరాల భూమికూడా నిరుపేదలకు పంచిపెట్టి ఇవ్వాళ ఓ వ్యాపారి దగ్గర కాలేజి లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నారని....".

"స్టాప్ ఇట్... దయచేసి ఇంకా మీరు ఏమి మాట్లాడవద్దు. ఇక వెళ్లిపొండి!" కోపంగా అరచినంత పనిచేశాడు తేజ.

"ఓ.కే. అసలు వచ్చిన విషయం చెప్పి వెళ్తాను. రామన్న సినిమాహాల్ ఓనర్ నారాయణ రావు దగ్గర చాలా డబ్బు తీసుకున్నాడట, మీరు పంచి ఇచ్చిన భూమి వాడికి అప్పగించ డానికి".

"సార్ ! ఇక మీరు వెళ్ళండి. నాకేమి చెప్పవద్దు. నా భూమి నేను పంచాను. దానికి ఆ నారిగాడికి ఏ సంబంధంలేదు. ఇవి ఒకదానికొకటి పొంతనలేని విషయాలు ఇకవెళ్లండి".

"సరే వెళ్తాను. సార్ చెప్పిన విషయం ఏమిటంటే, వాడు, ఆ రామన్న ఇవ్వాళ రేపటిలో మీ దగ్గరకు రావచ్చు. మీ ప్రాణాలకు ముప్పుతల పెట్టవచ్చు. సో మీరు ఈ క్యాంపస్ వదిలి పెట్టి ఇంటికి వెళ్లిపోండి".

"ఇదే నా యిల్లు, ఇంకెక్కడికి వెళ్లాలి ? "సార్ మీరు మళ్లీ కాలేజి తెరిచినాక రావచ్చు. మీ నాన్నగారి దగ్గరికి వెళ్లండి. ఈ విషయమే సార్ మీకు చెప్పమన్నారు, రండి మా జీపులో డ్రాపు చేస్తాం !" అంటూ లేచి నిల్చున్నాడు.

"లేదు, నేనురాను, నన్నెవరూ ఏమీ చేయరు. ఇక మీరు వెళ్ళవచ్చు" సాగనంపటాని కన్నట్లు లేచి నాలుగడుగులు ముందుకు వేశాడు తేజ.

"లేదు సార్, మీరు మామాట..." "నో, నో ఇక మీరు ఏమీ చెప్పకండి, వెళ్ళండి" అంటూ గేటుదాకా సాగనంపి రూంలోకి వచ్చాడు తేజ. మరో పదినిమిషాల్లో రామన్న దళం వచ్చింది.

"ఏయ్ వీరన్న ఫోను కట్ చెయ్, ఓ సార్, ఇలా రండి. పోలీసుల్ని ఎందుకు పిలిపించారు ? అసలు ఏమిటి మీ సంగతి ?" అంటూ ఎ.కె.47 గురిచేస్తున్నాడు రామన్న.

"ఏయ్ ! రామారావ్, ఏం మాట్లాడుతున్నావ్ ? నేను పోలీసుల్ని పిలిపించడ మేమిటీ ? "ఇక నీతో మాటలు అనవసరం నేను అంతా విన్నాను. ఎస్.పి. నీకు కబురు పంపించడం, అంతా... ".

"చాల్లే... ఎస్.పి. ఎవరో నీకు తెలుసా ? నా క్లాసుమేట్, మేమిద్దరం ఐ.పి.యస్.కు ఒకే సారి అప్పియర్ అయ్యాం. నా బెస్ట్ ఫ్రెండ్. వాడేదో కబురు చేస్తే..." ఇంకా ఏదో చెప్పాలని తపన కానీ.... "వాడితో ఏందన్నా లేపేయ్ !" ఓ కార్యకర్త సలహా. "ఢాం.. ఢాం" అంటూ ఎ.కె.47 రెండుసార్లు పేలింది. "కామ్రేడ్.. ఆగండి..." అంటూ తేజ నేలమీదకు పడి పోయాడు. చటుక్కున కరంటుపోయింది.



కాలచక్రం గిరుక్కున తిరిగిపోయింది. పదిహేను సంవత్సరాలు గడిచిపోయాయి. తేజ ఆనాటి కాల్పుల్లో కాలు పోగొట్టుకున్నాడు. అయినా ఎవరు ఎంత చెప్పినా వినకుండా పల్లెటూరు జనాన్ని బాగు చేస్తానంటూ వో చిన్న పల్లెటూళ్లో స్కూలు పెట్టి పేద ప్రజలకు, పిల్లలకు చదువు, ఆరోగ్యం గురించి బోధిస్తూ జీవితం గడుపుతున్నాడు.

రామన్న - రామారావు అయ్యాడు, లక్షలు గడించాడు, అధికార పార్టీలో చేరాడు ఈ మధ్యనే. పార్టీ టికెట్టు సంపాదించాడు. రాజకీయాలలో దిట్ట, ఎం.ఎల్.ఏ.గా గెలిచాడు. ఏం చేశాడో ఏమోగానీ హోమ్ మినిష్టరు పదవి సాధించాడు.

రామారావు హోం మినిష్టరు కాగానే వరంగల్ ఎస్.పి.ని పిలిపించాడు. తేజను గురించి వివరాలు సేకరించమన్నాడు. వారం రోజుల్లో తెలిసింది. తేజ ఓ పల్లెటూళ్లో, ఓ స్కూలు నడుపుతున్నాడని, వెంటనే అక్కడకు హోమ్ మినిష్టరు తేజను చూడటానికి వచ్చాడు. ఊరంతా ఓ చిత్రంగా చెప్పుకున్నారు. చిన్ననాటి స్నేహితుడ్ని కలువడానికి వచ్చిన మినిష్టర్ని మెచ్చుకుంటూ పత్రికలు వార్తలు రాశాయి.

"ఏం తేజా ! చూశావా ? సిద్ధాంతమంటూ 1969లో యు.జి.కి వెళ్ళావు. ప్రియురాల్ని పోగొట్టుకునావ్, ఐ.పి.యస్. కావలసినవాడివి, కుంటి వాడివయ్యావ్. నన్ను చూడు, రాజకీయాల్ని నాకు అనుకూలంగా మార్చుకున్నాను, నీ ముందు పుట్టి పెరిగిన వాడ్ని, నీ ముందే ఎంతవాడ్ని అయ్యానో ! నువ్వు నాకెంతో మేలు చేశావ్. ఆ రోజు నువ్వు బ్రతికి బయటపడి నాపై నాయకత్వానికి, నాపై చెప్పిన మాటల వలన వాళ్ళు నన్ను పార్టీ నుండి బయటకు పంపించారు. అదే మంచిదయింది. అధికార పార్టీ వాళ్ళను పట్టుకొని కేసులన్ని వదిలించు కున్నాను. ఇవ్వాళ నేను మంత్రిని. ఆ రోజు నువ్వు తప్పించుకొని వుండవచ్చు, ఇవ్వాళ తప్పించుకోలేవు" అంటూ ఓ ఉపన్యాసమే ఇస్తున్నాడు తేజకు మంత్రి రామారావు.

"అయ్యా ! మంత్రిగారూ ! మీలాంటివాళ్లు, నాలాంటివాళ్లు వస్తూ పోతూ ఉంటారు. వ్యక్తిగత ప్రయోజనాలు ముఖ్యం కాదు. నీలాంటి వారి వలన పార్టీకి అంతర్గత పోరాటాల వలన తీవ్రమైన నష్టం జరుగవచ్చు. కానీ ప్రజలు చైతన్యవంతమైన రోజు నీ ఆటలు సాగవు. ఇప్పుడు పార్టీ చేయవలసింది పోరాటాలు కాదు, ప్రజల్ని చైతన్యపరచడం, వాళ్ల సమస్యలకు పరిష్కారం వాళ్ళే కనుక్కొని తిరగబడిన రోజు, మిమ్మల్ని మీ అధికారాల్ని ప్రశ్నించిన రోజు, మీ ఆటలు సాగవు. ఆ మార్గంగా ప్రయాణం చేయడానికి ప్రజలకు చదువు అవసరం, ఆ చదువుకోసం నావంతు కర్తవ్యం నేను చేస్తున్నాను" తేజ ధోరణి.

అంతలో...... "ఢాం... ఢాం" అంటూ ఓ పోలీసు తుపాకి పేలింది. తేజ రక్తం మడుగులో ! "హోమ్ మినిష్టరుపై తిరగబడిన తేజ ఎన్‌కౌంటర్‌లో మృతి" పతాక శీర్షికలో వార్త. ❑





**పోడూరి కృష్ణకుమారి,**
ఫ్లాట్ నెం. 501, హై-లైట్ హవేలి,
వీధి నెం. 6, హబ్సిగూడ,
హైద్రాబాద్ - 500 007
ఫోన్ : 7156867

# మెర్సీ కిల్లింగ్

లింగరాజుగారు మంచానపడి పదిరోజుల్దాటింది. "ఇక లాభం లేదు, ఇవాళో రేపో" అనేసాడు డాక్టరు.

"ఇంకొక్క రెండేళ్ళాగితే సెంచరీ కొట్టేస్తారు నాన్నగారు. ఈ గండం గడిస్తే బావుణ్ను" అన్నాడు పెద్దకొడుకు సుందరం మాటిమాటికీ ఆర్ద్రమవుతున్న కళ్ళని రుమాలుతో అదుపు చేస్తూ.

"అబ్బ ! ఇంకెన్నేళ్ళూ ఈయన నిరంకుశత్వం ? అన్నయ్య మరీ అమాయకుడు. జీవితాంతం ఈ హిట్లరు నీడలోనే గడుపుదామను కుంటాడు !" అనుకున్నారు చిన్న కొడుకులు సత్యం, శంకరం.

మావగారి మంచం పక్కనే కూచుని చేతనైన సేవ చేస్తున్న పార్వతమ్మకి ఆయన పడుతున్న బాధ చూస్తుంటే గుండె చేరువైపోతోంది. మనిషి మన స్పృహలో లేడు. ఆ అపస్మారక స్థితిలోనే ఎంతో బాధపడుతున్నట్టు నిలువునా కొంకర్లు తిరిగిపోతాడు. ఒకోసారి ఊపిరి అందనట్టు తెగ ఆయాస పడతాడు. మరోసారి వింటున్న వాళ్ళ కడుపు దేవేసేలా గట్టిగా మూలుగుతాడు. బాధేమిటో తెలియదు, స్పృహ రాదు, ప్రాణం పోదు. ఇది కోమా కాదన్నాడు డాక్టరు. మరేం మాయో ఈ స్థితి !

పార్వతమ్మకి తన పెళ్ళినాటి మావగారు గుర్తొస్తున్నారు. "పార్వతికీ నాకూ పెళ్ళి చెయ్యకపోతే నేన్నిజంగానే దేవదాసునై పోతా మావయ్యా !" ఎలాగూ జరిగేదేగా అన్న ధైర్యంతో బెదిరించాడప్పట్లో సుందరం. పిల్లనిస్తానని అడగడానికన్జెప్పి భార్య, 'పిల్ల'తో సహా అక్కగారింటికొచ్చి కూచుని, లింగరాజు బావగారంటే ఉన్న చాలా భయం, కొంచెం భక్తివల్ల నోట మాట రాక నీళ్ళు నములుతున్న పార్వతమ్మ తండ్రి మేనల్లుడి మాటలకి ధైర్యం వచ్చినా, లింగరాజెలా రియాక్టవుతాడోనని కంగారుపడి పోయాడు.

"ముందు నేను చంద్రముఖింట్లో కాపరం పెట్టేస్తాన్రా బామ్మర్దీ, నీ కూతుర్ని నా కొడుక్కిచ్చి చెయ్యకపోతే !" అంటూ అందర్నీ నవ్వించాడు లింగరాజు. అలా నవ్వుల జల్లుల మధ్య బావ భర్తయ్యాడు, మావయ్య మామగారయ్యాడు.

ఎంత నవ్వించేవాడో మావయ్య ! డబ్బు దగ్గర మాత్రం అంతకంతా ఏడ్పించేసేవాడు, గతం తలుచుకుని తనలోతనే నవ్వుకుంది పార్వతమ్మ. కొడుకులూ, కూతుళ్ళే కాదు అయినవాళ్ళు, కానివాళ్ళు ఆఖరికి పెళ్ళాం కూడా ఆయనకి 'పీనాసి' అని ముద్ర వేసేసారు. ఆయన మాత్రం "నాదంతా పొదుపరితనంరా, డబ్బు విలువ తెలిసిన వాడ్నిరా కుర్ర కాకుల్లారా" అని కసిరేసే వాడందర్నీ.

నిజమే, పొదుపరితనంతోనే ఆస్తిని నాలుగురెట్లు చేసాడు. పిల్లలందరికీ ఆడ,మగ తేడా లేకుండా సమానంగా పంచిచ్చాడు. తనకీ వాటా వేసుకుని తన వాటా తనట్టేబెట్టుకున్నాడు. అయితే ఆయన తన వాటాగా ఏమాత్రం ఉంచుకున్నాడన్నది మాత్రం దేవరహస్యం.

ఆ దేవరహస్యాలకి సంబంధించిన కాయితాలన్నీ ఒక లావుపాటి ఫైల్లోపెట్టి, దాన్ని దిండు కింద పెట్టుకుని పడుకోడం అలవాటు చేసుకున్నాడు లింగరాజు. ఆయన భార్య పోయిన మర్నాడే పార్వతిని పిలిచి, "నా పక్క దులిపి, దుప్పట్లు వారం వారం మార్చే హక్కు నీకొక్కదానికే ఇస్తున్నాను. ఇంకే పుండాకోరైనా నా గదిలోకొచ్చి నా మంచం ముట్టుకున్నాడో చచ్చాడే" అన్నాడు పెద్ద గొంతుతో. అవతల హాల్లో కూర్చున్న కూతుళ్ళు, అల్లుళ్ళు, కొడుకులూ, కోడళ్ళూ స్పష్టంగా విన్నారు.

ముసలాయన చాదస్తంతో తనని ఇరికించాడే అని బాధపడింది పార్వతమ్మ. "అమ్మని ఆఖరుసారిగా చూసుకోడానికొచ్చాంగానీ ఈయన దాచిన మూటల కోసం వచ్చామా ?" అని ఏడ్చేసారు కూతుళ్ళిద్దరూ. వాళ్ళని ఓదార్చి ఓ దారిలోకి తీసుకురావడానికి రెండ్రోజులు పట్టింది పార్వతమ్మకి.

సణిగిన సణుగుడు సణక్కుండా రకరకాలుగా సణుక్కున్నారు చిన్నకొడుకులు సత్యం, శంకరం. "మనకెవ్వరికీ ఛాన్సివ్వకుండా ముసలాళ్ళిద్దర్నీ తనింట్లోనే కట్టి పడేసుకుని సేవల్చేసి మురిపించేసింది. ఇంకేం వుందీ ? ముసలాయన మొత్తం అంతా పెద్ద కోడలికే పట్టాభిషేకం చేసేస్తాడు" మూతులు ముడుచుకుని చెవులు కొరుక్కున్నారు తోడికోడళ్ళు.

పార్వతమ్మ ఎవరేమన్నా దులిపేసుకుని నిమిత్తమాత్రంగా తన బాధ్యత తను నెర వేర్చుకుపోవడం అలవాటు చేసేసుకుంది. ఎప్పుడైనా మిగతా వాళ్ళ అసంతృప్తి సంగతి సుందరం దగ్గర ఎత్తితే, "ఎవరికి కావలసినంత వాళ్ళకుంది. ఇంక ఆయన తన కోసం ఎంత దాచుకుంటే ఏం ? ఆయన తన డబ్బుని తను ఏ గంగలో కలుపుకుంటే ఎవడిక్కావాలి ? మనిషీ, ఆపేక్షా ముఖ్యంగానీ" అనేవాడు సుందరం.

"అంతేలెండి పెద్దాయన ఆశీస్సులు ముఖ్యం ఆస్తికాదు.." ఒప్పేసుకునేది పార్వతమ్మ.

వీళ్ళిద్దరి మంచితనం మీదా నమ్మకం కుదిరి పోబట్టే భార్యపోయాక పెద్దకొడుకింటి కొచ్చి సెటిలయిపోయాడు ముసలాయన. ఏనాడూ ఇంకే కొడుకింటికీ పోలా.

"అత్తగారుపోయి ఎన్నేళ్ళయిందీ ? పాతికేళ్ళుకాలా ?" తనలో తనే ఆలోచించుకుంటూ పైకే అనేసింది పార్వతమ్మ. తండ్రికాళ్ళు రాస్తూ చిన్న కునుకు తీస్తున్న సుందరం ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. "ఏవిటీ ? అమ్మా ? ఆ... అవకేం దగ్గిర దగ్గిర పాతికేళ్ళు గడుస్తున్నాయి. అరవై ఏళ్ళయినా పూర్తిగాలేదావిడకి పోయేనాటికి" అన్నాడు తండ్రిక్కప్పిన దుప్పటి సవరిస్తూ.

"పుణ్యాత్మురాలు, పువ్వులా రాలి పోయింది" ఏదో తల్చుకుని దణ్ణం పెట్టుకుంది పార్వతి. "నాన్నగారు అమ్మకంటే బాగా పెద్ద ! అప్పటికే నాన్నగారికి డెభ్బై వచ్చేసాయి. ఈ పాతికేళ్ళుగా పిల్లలతోపాటు పిల్లాడిగా సాక్కొచ్చావు చాలా ఓర్పుగా. అందుకే నాన్నగారికి నువ్వంటేనే ఆపేక్ష" అన్నాడు భార్యకేసి కొంచెం మెచ్చుకోలుగా చూస్తూ.

"ఏదోలెండి మాట పడకుండా జీవితం వెళ్లిపోతే అంతే చాలు" వేదాంత ధోరణిలో అంది పార్వతమ్మ, "అంతేలే" ఒప్పేసుకున్నాడు సుందరం.

"అయినా తమ్ముళ్ళు వాళ్ళు ఉడుక్కున్నారంటే అర్థం లేక పోలేదులే. పొదుపు పొదుప న్జెప్పి వాళ్ళు చదువుకునే రోజుల్లో వాళ్ళని ఉక్కు హస్తంతో అణిచి పెట్టేసేవారు నాన్నగారు. కుర్రాళ్ళ అవసరాలు ఆయనకర్థమయ్యేవి కావు", తమ్ముళ్ళ ఉడుకుమోత్తన్నాలు గుర్తు కొచ్చి చిన్నగా నవ్వుకున్నాడు సుందరం.

"ఆయన అలా నయాన్నో భయాన్నో వాళ్ళని అదుపులో పెట్టారు గనకనే వాళ్ళు బాగు పడ్డారు. పెద్ద చదువుల్చదివి ఇవాళ పెద్ద పదవులేలుతున్నారంటే మరదంతా ఆయన చలవేగా ?" అంది పార్వతమ్మ.

"వాళ్ళలా అనుకోట్లేదు. అంతా వాళ్ళ నిర్వాహకమే అనుకుంటున్నారు" నవ్వాడు సుందరం. "అయినా వయసుపైబడే కొద్దీ ఆయన పొదుపరితనం మరీ డబ్బు కాపీనంలోకి దిగిపోయింది. అందుకే వాళ్ళకోపం" పార్వతమ్మ కూడా నవ్వింది.

చివరి చివరికి ఆ డబ్బు కాపీనం ఓ పిచ్చిగా తయారైంది ముసలాయనకి. తన మంచం వైపు కొడుకులూ కూతుళ్ళే కాదు మనవలొచ్చినా సరే వాళ్ళననుమానించి తిట్టి పోసేవాడు లింగరాజు. అదంతా ఒక వినోదంగా ఎంజాయ్ చేసేవారు పార్వతమ్మ సుందరం. మిగతా పిల్లలు కోపగించుకుని అసలు ఆయన్ని చూడ్డానికి రావడమే మానుకున్నారు.

ఇదిగో ఇప్పుడు ముసలాయనకి వచ్చే ప్రాణం, పోయే ప్రాణంగా ఉందని తెలిసి ఇప్పుడ వచ్చారు. పది రోజులుగా ఇల్లంతా ఒకటే సందడి.

"పాపం ! ఏవిఁటో ఈ జీవుడి బాధ. దేహాన్ని వదల్లేకుండా ఉన్నాడు. ఇంకెన్నాళ్ళకో ఈయనకీ దేహబాధల్నుంచి విముక్తి" నిట్టూర్చింది పార్వతమ్మ. సావిట్లో సందడిగా అందరూ గొంతులు పెంచి మాటాడ్తున్న కలకలంవిని "ఎవరో వచ్చినట్టున్నారు, చూసొస్తా" అంటూ లేచింది.

లాయరు మావయ్యగా అందరిచేతా పిలవబడే రామం మావయ్య ఎదురుగా నిలబడ్డారు. ఫ్లైట్లో దిగినట్టున్నాడు అన్నగారి ఆఖరు చూపులకోసం.

"ఏవేఁ అమ్మాయ్ ! ఎప్పుడు పోతానంటున్నాడు మీ మావ ?" పార్వతమ్మని పలకరిస్తూ మంచం మీద కూచున్నాడు.

"ఎన్నేళ్ళొచ్చినా మాటమాత్రం దారుణాఖండల శస్త్రతుల్యమే రామం మావయ్యది. ఏం మావయ్యా ఎనభై దాటలా నీకు ?" చిన్నగా నవ్వుతూ అడిగింది పార్వతమ్మ. "మనసు మాత్రం నవనీతంలే బాబాయిది" అన్నాడు సుందరం.

లింగరాజుకున్న ఎనిమిది మంది అన్నదమ్ముల్లోనూ ఈ రామంగారే అఖండుడని పేరు. ప్లీడరు వృత్తిలో కోట్లు గడించాడని చెప్పుకుంటుంటారు. ఎనభైదాటినా ఉక్కుకడ్డీలాంటి శరీరంతో కంచులా మోగే కంఠంతో స్వపర భేదాల్లేకుండా అందర్నీ అదరగొట్టేస్తుంటా డిప్పటికీ.

చిన్న చిరునవ్వు ముఖానికి తగుల్చుకుని అన్నగారి ముఖంలోకి చూస్తూ దిండుకింద చెయ్యిపెట్టి తడిమి, చివాలున లేచి నుంచున్నాడు రామం. "ఏమయింది మావయ్యా ?" అంటున్న పార్వతమ్మకి జవాబు చెప్పకుండా గది గుమ్మం దగ్గరకెళ్ళి నిలబడ్డాడు.

"సత్యం, శంకరం !" గర్జించినట్టు పిల్చాడు. పార్వతమ్మ మరుదులిద్దరూ పరుగున వచ్చారు. ఏం కొంప మునిగిందోనని అదిరిపోతూ.

"ఏదిరా అన్నయ్య దిండుకింద ఫైలు ? ప్రాణం ఉండగానే ఫైలు కాజేస్తారా సన్నాసుల్లారా ?" కేకలు పెట్టాడు రామం మావయ్య. ముసలిదైనా సింహగర్జనే ! సత్యం, శంకరం పిల్లుల్లా వెళ్ళి ఫైలు తెచ్చి, అలిగిన పిల్లిపిల్లల్లా ఫైలు రామం చేతికివ్వకుండా పార్వతమ్మ చేతుల్లో పెట్టి చడీచప్పుడు లేకుండా మాయమయ్యారు. సుందరం, పార్వతీ నిర్ఘాంత పోయారు.

"రోజంతా మంచ పక్కన అఘోరిస్తూనే ఉన్నాను, వీళ్ళు ఫైలెప్పుడు లాగేసారూ ?" గొణుక్కున్నాడు సుందరం.

తలుపులు ఓరగావేసి పార్వతమ్మ చేతుల్లోంచి ఫైలు తీసుకుని దాన్ని అన్నగారి దిండు కింద పెట్టాడు. రామం మావయ్య ఫైలు స్టడీ చేస్తాడేమోననుకున్న పార్వతమ్మ విస్తు బోయింది. చిన్నగా నవ్వుకుంటూ అన్నగారి చేతిని ఫైలు కింద పెట్టి. చేతివేళ్ళని ఫైలు గట్టిగా పట్టుకున్నట్టుగా అమర్చాడు రామం.

"ఓరే సుందరం ! ఇవాళ రాత్రికి మీ నాన్న దగ్గర నేనుంటాలేగానీ నువ్వు పోయి హాయిగా నీ గదిలో పడుకో పో" అన్నాడు రామం. సుందరం నెమ్మదిగా వెళ్ళాడు.

స్పృహలేని అన్నగారి చేత ఫైలు పట్టించిన ఈ తమ్ముడి ఉద్దేశం ఏమయ్యుంటుంద అని గుడ్లప్పగించి చూస్తోంది పార్వతమ్మ. "ఏవిఁటే అలా నుంచుండిపోయావ్ ? వెర్రిపిల్లా పో, పోయి పడుకో అర్ధరాత్రయింది. పడ్డ శ్రమ చాల్లే. కాసేపు నడుం వాల్చు" అన్నాడు.

అలసి ఉన్న పార్వతమ్మ ఆ మాత్రం ఆపేక్షకే వెర్రిపిల్లే కాదు ఏకంగా చిన్నపిల్లే అయి పోయింది. ఇన్నాళ్ళకి తనని చిన్నపిల్లని చేసి, ఆపేక్ష చూపే పెద్దాయన వచ్చేసరికి ముసలాయనకి భారమంతా అప్పగించేసి పడుకోవాలనిపించింది.

మావగారి మంచానికి అవతలవైపు చాపేసుకుని తడితడి కళ్ళు మూసిన పార్వతమ్మకి కలత నిద్రలో కూడా కలల కలకలమే ! ఏదో కోలాహలం వినబడి చటుక్కున లేచిన పార్వతమ్మకి తెలిసిందల్లా ఒకటే. మావగారి ప్రాణం పోయిందని ! అదుర్తున్న గుండెల్తో గదిలోంచి సావిట్లోకొచ్చి కూలబడిపోయింది.

పెద్దాడబడుచు పెద్ద గొంతుకేసుకుని చుట్టూ చేరిన చుట్టాలకి వివరిస్తోంది "నాలు గింటికి నాన్నెలా ఉన్నారో చూద్దామని అటెళ్ళాను, చూద్దును గదా మనిషిలో చలనమే లేదు. మంచానికిటు రామం బాబాయ్, అటు వదినా నిద్రపోతూనే ఉన్నారు. వాళ్ళకి తెలీనే లేదు. గబగబా అన్నయ్యలందర్నీ పిల్చుకొచ్చాను" కళ్ళుతుడుచుకుంటూ ముక్కు చీదేసిందావిడ.

ఆ రోజు నుంచీ పదిరోజులపాటు ఇంటి పెద్దకోడలుగా విధి నిర్వహణలో ఊపిరి కూడా పీల్చుకునే తీరిక లేనిదైపోయింది పార్వతమ్మ.

పన్నెండో రోజు కాస్త తీరిక చిక్కడంతో తలార బెట్టుకుంటూ డాబా మీద నుంచుంది పార్వతమ్మ. మావగారి సుదీర్ఘమైన జీవితకాలాన్నీ, ఆ జీవితంలో తన పాత్రనీ తలపోస్తూ నుంచున్న పార్వతమ్మకి మెట్లెక్కి వస్తున్న రామం మావయ్య కనిపించాడు.

"ఆ రోజు ఒంటిమీద స్పృహలేని అన్నయ్య చేత ఫైలు పట్టించానని నువ్వు ఆశ్చర్య పోయావు కదూ ?" అన్నాడు నవ్వుతూ.

"ఆశ్చర్యపోనా మరి ? అలాంటి స్థితిలో ఆయనకింత తులసి తీర్థం పోసుంటే సంతోషించే దాన్నిగానీ, ఆ ఫైలు పట్టించడమేవిఁటి మరీనూ ?" తన పెద్ద వయసు తన కన్నా పెద్దవాళ్ళని మందలించడానికి ధైర్యాన్నిస్తుంటే.

"అన్నయ్య డబ్బు కాపీనం ఎవరికి తెలీన్ది ? తెలిసి తెలిసీ ఎలాగూ ఆయన పోతాడని తెలిసీ, ఒక్క రెండ్రోజులోపిక పట్టలేక ఫైలు కాజేసారు నీ మరుదులు, గాడిదలు ! ముసలాడు చస్తే మాకెంతొస్తుందన్న ఆత్రమేగానీ ఆ జీవుడు ప్రయాణంకట్టే మార్గం ఏవిటన్న ఆలోచన లేదు వాళ్ళకి. ప్రాణం కంటే ఎక్కువైన ఫైలు పోతే అన్నయ్య ప్రాణం ఎలా వదుల్తాడు ? శరీర బాధలెన్నైనా భరిస్తాడుగానీ కావల్సింది దొరికేదాకా ప్రాణం వదల్లేడు. స్పృహ లేదనుకుంటామేగానీ దేహంలో జీవుడికి అన్నీ తెలుస్తూనే ఉంటాయి. ఏ కోరికతో ఆ ప్రాణం కొట్టుకుంటుందో ఆ కోరిక తీరకుండా ఎలా పోతాడు ? యుథనేషియా నా బొందేషియా అంటూ వెస్టర్న్స్ తలకాయలు బద్దలు కొట్టుకుంటారుగానీ మన మహర్షుల కున్న జ్ఞానం వాళ్ళకెక్కడేడిసింది ? చూశావా చిన్న చిట్కాతో చిలక ఎంత సునాయాసంగా ఎగిరిపోయిందో ?" అన్నాడు రామం మావయ్య పార్వతికి జ్ఞానబోధ చేస్తూ.

"నువ్వా ఫైలుని మావగారి చేతిలో పెట్టడం వల్లే ఆయన ప్రాణం సునాయాసంగా పోయిందంటావ్ అంతేనా ? అయితే ఆయన చావుకి నువ్వే కారణం అన్నమాట. నీ మీద మర్డర్ కేసు పెడ్తా మావయ్యా" అల్లరిగా అంది పార్వతమ్మ ఇంకా తడారని వెండి తీగల్ని వెనక్కితోసి ముడేసుకుంటూ.

"పెట్టుకోవే కోడలు పిల్లా. ఆ ఫైలుమీద నీ వేలిముద్రలూ పడ్డాయిలే. ప్రాణం పోయినప్పుడు మంచానికటు నేను, ఇటు నువ్వునూ. నాతోపాటు నువ్వు కూడా తింటావులే జైల్లో దేవతా పులుసు" అంటూ డాబా మెట్లు దిగి చక్కాపోయాడు రామం మావయ్య.

ఫక్కుమని నవ్విన పార్వతమ్మ కళ్ళనిండా నీళ్ళే. ❑






## కె. సూర్యముఖి, M.A.

*రిటైర్డ్ లెక్చరర్,*

ఇ.నెం. 1-7-1223, 1224, రోడ్ నెం. 2,

అడ్వకేట్స్ కాలనీ, హనుమకొండ - 506 001

ఫోన్ : 577355


# అగ్గి

కోడలు పిచ్చమ్మ పొత్తిళ్లలో ఉన్న పసికందును చూసుకుంటూ మురిసిపోవడం లచ్చవ్వకు కండ్లు కుట్టినట్టయింది.

"ఒరే సాంబిగా, గిట్లరారా !" తల్లి లచ్చవ్వ వేసిన పాలికేకకు ప్రొద్దుటే పొలం వెడుతున్న సాంబయ్య లోపలికి వచ్చాడు.

"చూశావురా, దీని సంబడం ! ఇప్పుడూ ఆడపోరినే కని మన కొంప ముంచిందిరా, కొడకా !" అంటూ లచ్చవ్వ దీర్ఘాలు తీసింది.

"ఇది ఆడపిల్లల్నే కంటూ ఇల్లు నింపేస్తున్నది" అంటూ ఈసడించేడు సాంబయ్య, అది ఆమె అపరాధమే అయినట్లు.

పిచ్చమ్మ వాళ్ళ మాటను లెక్కచేయకుండా, పసిదాని నల్లని ఒత్తైన జుట్టును సవరిస్తూ "మీ ఇష్టం వచ్చినట్లు వాక్కోండి" అనుకొంది మనసులో.

"దాని జుట్టునుచూసి మా మురుస్తున్నావు. నేను దాని తలకు నూనైనా తేలేను" అంటూ సాంబయ్య బయటకు బయలుదేరబోయాడు.

"ఒకందుకు ఇదీ మంచిదేలేరా, కొడకా ! మగనలుసైతే చదువు, ఇస్కూలు అంటారు. నిన్ను ఇస్కూలుకు పంపనందుకు మీ సచ్చినయ్యాను ఇప్పటికీ తిడుతూనే వున్నావు కదా ! ఒక్క నాలుగైదేళ్ళు, మనం కళ్ళు మూసుకుంటే దాని బతుకదే బతుకుతుంది. పైగా ఎంత లేదన్నా నాలుగైదు వేలు మన చేతిలో పడతాయ్. ఇబ్బందులు నుంచి బయటపడతాం" అంటూ కొడుకును ఓదార్చింది తల్లి లచ్చమ్మ.

భీమారానికి, కొత్తగా బడి వచ్చిన రోజుల్లో సాంబయ్య పెద్ద కూతురు అగ్గి అటుగా వెడుతూ, వీలైనపుడల్లా బడి గుమ్మంలోకి వెళ్లి, చదువుకునే పిల్లల్నీ, పాఠాలు చెప్పే టీచర్లనూ కన్నార్పకుండా చూస్తూ, చంకనుండి క్రిందికి జారుతున్న చెల్లెల్ని పైకిలాక్కుంటూ నిలబడేది.

ఈలోగా లచ్చమ్మ వచ్చి "పని మాని, ఇక్కడ నిల్సొని సోద్దెం సూస్తన్నవా" అంటూ అగ్గికి నాలుగు తగిలించి, ఇంటికి లాక్కుపోయేది.



కట్నం తక్కువ కదా అని, తన చుట్టాలింటికి వెళ్ళిన లచ్చమ్మ, తన బంధువుల పిల్లాడు రవితో అగ్గికి ఏకంగా పెళ్ళి నిశ్చయం చేసుకుని మరీ వచ్చింది. అత్తా, భర్తా, ఎన్నన్నా, తిట్టినా, కొట్టినా, పెదవి మెదపని పిచ్చమ్మ పదేళ్ళ అగ్గి పెళ్ళికి అంగీకరించ లేదు. ఏడ్చింది, గోల చేసింది, సాంబయ్య కాళ్ళు పట్టుకుంది. ఒక్క తన్ను తన్ని భార్యను నెట్టేశాడు.

"మొగోణ్ణి నేను, మనింటికి పెద్ద తల మా అమ్మ ఉండగా నీకే తెలిసినట్టు మా లొల్లి బెడుతున్నవే" అంటూ జుట్టు పట్టుకుని భార్యను లేవదీశాడు. కన్నీరు మున్నీరుగా ఏడ్వడం తప్ప, పిచ్చమ్మ ఏమీ చేయలేకపోయింది. ఇప్పటికైనా, నా సత్తా తెలిసిందా అన్నట్లుగా, కోడలివైపు విజయగర్వంతో చూసింది లచ్చమ్మ. అగ్గి పెళ్ళి జరిగిపోయింది.

బంగారు బొమ్మలాంటి అగ్గిని చూసి సాంబయ్య ఇస్తానన్న కట్నం పైసలు ఇయ్యక పోయినా, అగ్గిని, అత్త కాంతమ్మ తనతో వరంగల్‌కు తీసుకుపోయింది.

అగ్గి చలాకీతనం, మాటతీరు చూసి కాంతమ్మ మురిసిపోయింది. ఆమె అగ్గిని కన్న కూతురిలా పెంచింది, కొడుకుతో సమానంగా.

నాలుగైదు సంవత్సరాలు గడిచాయోలేదో, అమ్మలక్కలు చెవులు కొరుక్కోవడం మొదలెట్టేరు, ఇంకా అగ్గి నీళ్ళు పోసుకోలేదని.

"ఏందమ్మో ! పదియేనేళ్ళయినా నిండని పసిదానికి ఏం తొందరొచ్చింది ?" అని కాంతమ్మ కసురుకుంది. కాంతమ్మ ఎదురు ప్రశ్నకు ఇరుగు పొరుగులు గింజుకుపోయేరు.

"ఏదో లొసుగుండే వుంటుంది. ఆ మాట తప్పించడానికి కాంతమ్మ మాట మారుస్తోంది' అంటూ అగ్గికి గొడ్రాలనే ముద్ర వేయనే వేశారు. మరికొందరు తమ పిల్లలను రవికి ఇస్తామంటూ ఇంకా ముందుకొచ్చారు.



"చిన్నదానికి ముక్కూ, చెవులూ కుట్టించవా పిచ్చమ్మా ?" ఇరుగు పొరుగులవారి ఆరాటం. ఊళ్ళోవాళ్లకు పనేం వుంది ? ఎవరేం చేస్తున్నారో గద్ద కళ్ళతో చూసి కనిపెడుతూ, వాళ్ల లోటు పాట్లు ఎత్తి చూపడమే వారి తపనంతా.

"చెయ్యి కాలూ కూడదీసుకోవాలంటూ" సాంబయ్య కొంత కాలం జరుపుకొచ్చేడు. చివరకు, ఏమైతేనేం వేములవాడకు ప్రయాణం పెట్టుకున్నారు.

దగ్గర చుట్టాలను, అగ్గిని, అల్లుణ్ణి, వియ్యాలవారిని పిలిచేరు. "అప్పు చేసి పప్పు కూడన్నట్లు ఎందుకయ్యా ఈ ప్రయాణం" అంది కాంతమ్మ చనువుగా సాంబయ్యతో.

"నేనూ మొక్కుకున్నాను, వదినా !"అంది పిచ్చమ్మ.

"నేను, నా కొడుకు వుండగా మధ్య నువ్వు మొక్కు కోవడమేమిటేవ్ ?" అంటూ లచ్చమ్మ కోడలిపై ఎగబడింది.

"ఈ ఆరోసారైనా నాకు మగ నలుసునీయి సామీ, నీ కొండకొచ్చి నీ పేరెట్టుకుంటానని మొక్కుకున్నానత్తా !" అంది పిచ్చమ్మ సిగ్గుతో సగం చచ్చి. దాంతో, గొణుక్కుంటూ అక్కడి నుండి వెళ్ళిపోయింది లచ్చమ్మ.

అందరూ వేములవాడ చేరేరు. చిన్నదానికి ముక్కూ చెవులు కుట్టించి, పుట్టు వెంట్రుకలు తీయించేరు. తన వాళ్ళెవరూ లేకుండా చూసి పిచ్చమ్మ చంటిదాన్ని చంకనేసు కుని పూజారిని సమీపించింది.

బిత్తర చూపులతో నిల్చున్న ఆమెను చూసి "రామ్మా ! ఏం కావాలి ?"అని అడిగేడు.

"ఈ పసిదానికేదైనా మంచిపేరు పెట్టయ్యా" అని పూజారి కాళ్లకు మొక్కింది పిచ్చమ్మ.

"గౌరి అని పేరు పెట్టుకో అన్ని విధాల నీ బిడ్డ సుఖంగా బ్రతుకుతుంది" అని నవ్వుతూ శంకు తలమీద పెట్టి హారతి అందించేడు పూజారి.

తిరుగు ప్రయాణమయేరంతా.

తండ్రీ, నాయనమ్మా, దాన్ని 'బోడి'అని పిలుస్తూ, అది కనిపించినపుడల్లా దాని నెత్తిన మొట్టికాయలు వేయటం మొదలెట్టారు. దాన్ని చూస్తేనేవాళ్లు చిర్రు బుర్రులాడుతున్నారు.

వాళ్ళు కొట్టినపుడల్లా ఏడుస్తూ తల్లి దగ్గరకు చేరేది.

'గౌరీ' అంటూ ఆ పసిదాన్ని పిచ్చమ్మ రెండు చేతులతో దగ్గరకు తీసుకునేది.

'గౌరీ' అనగానే తల్లి పమిట చాటున చేరి కిలకిలా నవ్వేది.

అప్పుడా తల్లీకూతుళ్ళ ఆనందం చూసి తీరాల్సిందే.



ఒక రోజు ప్రొద్దుటే పనిలోకి వెడుతున్న కాంతమ్మ దగ్గరకొచ్చి నిలబడింది అగ్గి. "ఏవిటే బిడ్డా ?" అంది కోడల్ని చూస్తూ.

"అత్తా, మరీ..." అని నసిగింది అగ్గి.

"నేను కూడా నీకు పనిలోకి సాయం వస్తానత్తా". కాంతమ్మ కోడలి బుగ్గలు పుణికింది. "మీ అమ్మగారు చానా మంచిదంటావు కదత్తా". "సరేనంటూ" అగ్గిని వెంట తీసుకుని కాంతమ్మ పనికి వెళ్ళింది.

కాంతమ్మ యజమానురాలు రాధిక, చదువరేకాక, మానవి కూడా.

"ఎవరీ అమ్మాయి కాంతమ్మా ?"అనడిగింది రాధిక. తనవెనుక ఒదిగి ఒదిగి నిలబడిన అగ్గిని ముందుకు తీసుకువచ్చి "నా కోడలమ్మా" అంది.

"నీ పేరేమిటి ?"

"అగ్గి" బెరుకుతో, సిగ్గుతో తలవంచుకుని సమాధానమిచ్చింది.

"అదేం పేరే ? అందరూ దేవుళ్ళ పేరు పెట్టుకుంటారుగా ? ఈ పేరెవరు పెట్టారే" అంది నవ్వుతూ రాధిక.

యజమానురాలడిగిన తీరుతో ధైర్యం వచ్చిన అగ్గి "ఇదీ దేవుడి పేరేనమ్మా ! మా దేవుడు అగ్గి" అంది.

ఆ సమాధానంతో సంతోషపడిన రాధిక "కాంతమ్మా నీ కోడలు భలే గడుగ్గాయే"అంది.

స్కూల్ టైమవుతూండడంవల్ల పిల్లలిద్దరిని తయారు చేయటానికి రాధిక వరండాలోకి వచ్చింది. తలదువ్వి రిబ్బను కట్టడం, డ్రెస్సులు వేసి సాక్సు, బూట్లు వేయడం, రాధిక చేస్తూంటే రెప్పవాల్చకుండా శ్రద్ధగా గమనించింది అగ్గి. ఇంతలో పిల్లల తండ్రి వచ్చి, వాళ్ళను స్కూటరుపై తీసుకెళ్ళి దిగబెట్టి వచ్చేడు. రెండు మూడు రోజులుగా అగ్గి అత్త వెంటనే వెళ్ళి ఆమెకు పనిలో సాయం చేస్తూంది.

"అమ్మా ! అగ్గిని మీ దగ్గర వుంచుతానమ్మా. పది రోజులు దాని పని చూసుకోండి మీకు నచ్చితే వుంచుకొందురుగాని" అందొక రోజు కాంతమ్మ.

అగ్గి చురుకుతనం, ఏ పనైనా ఇట్టే అల్లుకుపోవడం గమనించి, తృప్తిపడిన రాధిక కాంతమ్మ ప్రతిపాదనకు సునాయాసంగానే అంగీకరించింది.

పిల్లల్ని స్కూలుకు తయారుచేయడం, తీసుకెళ్ళిరావడం, వగైరా పనులన్నీ ఇప్పుడు అగ్గే చేస్తుంది.



మధ్యాహ్నం వాళ్ళను ఇతర పిల్లలతో కూర్చోపెట్టి అన్నం తినిపించేది. పిల్లలు క్లాసులోకి వెళ్ళిం తరువాత అగ్గి ఏ చెట్టు నీడనో కూర్చుని అక్షరాలు నేర్చుకోవడం మొదలు పెట్టింది.

సాయంత్రం ఇంటికి వెళ్లిం తరువాత, పిల్లలు చందమామ, బాలమిత్రలు చదివి కథలు చెప్పేవారు. అగ్గికి చదువుమీద ఉన్న ఆసక్తిని చూసిన రాధిక దానికి ఒక పలకా బలపం కొనిపెట్టింది. ఆమె చదువుకునేందుకు తానూ సహాయ పడసాగింది.

ఆ కుటుంబ సభ్యులందరూ తనపట్ల చూపుతన్న ఆదరణ, అభిమానాలతో అగ్గి కట్టు బొట్టు, మాటతీరులోనేకాక మానసికంగా కూడా ఎంతో ఎదగసాగింది. దాని భావ ప్రపంచం సువిశాలం కావడం మొదలైంది.

అగ్గికి నాలుగేండ్లు తిరగకుండానే ఇద్దరాడ పిల్లలు పుట్టేరు.

"అగ్గి ! మీ అయ్యగాని, అమ్మగాని ఎవరూ రాలేదు, చూశావా ?" అంది కాంతమ్మ.

"పోనిలే అత్తా ! రాకపోతే ఏమైంది ? మా అయ్య, బాపమ్మ ఆడపిల్లల్ని కన్నతల్లినీ, ఆ పిల్లల్నీ కూడా చూడరు. మా అవ్వకు రావాలని ఉన్నా రానీయరు".

ఇంకా ఏదో చెప్పబోతున్న అగ్గి దగ్గరకు వెళ్ళి కాంతమ్మ "ఏమిటే ?" అంది. ఇద్దరి మనస్సులలోనూ ఆపరేషను విషయమే మెదుల్తోంది. ఎవరూ ముందు బయటపడలేదు.

"అత్తా ! మనకీ ఇద్దరు పిల్లలు చాలరా ?" అని తలవంచుకుంది అగ్గి.

"మా అమ్మగారు కూడా ఇదే అంటూందే, పసివాళ్ళను, నిన్నూ చూడటానికి నాకు సెలవిస్తాననీ, తనకు తెలిసిన డాక్టరమ్మతో ఆపరేషను చేయిస్తాననీ చెప్పిందాయమ్మ. సర్కారు డబ్బిస్తుందిట కూడా. ఆపరేషనంటే నువ్వు భయపడతావేమోనని నీకింకా చెప్ప లేదు". అత్త చెప్పిన మాటకు అగ్గి ముఖం కళకళలాడింది.

"నాకేం భయం లేదు, కాని మగవాళ్ళకైతే ఈ ఆపరేషను చానా తేలిగ్గా అయిపోద్దంట కదా ?"

"అవునే అగ్గీ అదే బాగుంటుంది. రవినే చేయించుకోమందాం". తల్లి మాట కాదన లేదు రవి. మగాడు రవి ఆపరేషను చేయించుకోవడం ఇరుగు పొరుగులకు కడుపుబ్బు అయింది. ఒకామె పనిగట్టుకొని భీమారం వెళ్ళి సాంబయ్యకు, అతని తల్లికి ఈ సంగతి ఉప్పందించి వచ్చింది.

ఏదో మహాపరాధం జరిగినట్లు లచ్చమ్మ, సాంబయ్యలు మర్నాటికల్లా వరంగల్లులో ఊడిపడ్డారు.

"మా పిల్లకు ఇంక పిల్లలు లేకుండా చేశావటే, కాంతమ్మా అంతా నీ ఇట్టమేనా ?" అంటూ లచ్చమ్మ రావడం రావటమే కాంతమ్మ మీద నిష్టూరాలాడటం మొదలుపెట్టింది.

"మాట మాత్రం చెప్పకుండా చేసిన్రు కదా సెల్లెమ్మా" శృతి కలిపాడు సాంబయ్య.

"ఈ రోజుల్లో ఇద్దరు పిల్లలు చాలనుకున్నాం పిన్నీ" అంటూ లచ్చమ్మను సమాధాన పరచజూసింది కాంతమ్మ.

"మగ నలుసు లేకుండా జేసేవు కదే, కాంతమ్మా !" తప్పించింది లచ్చమ్మ.

"మగ పిల్లలు పుడతారని కలగంటామా ? కన్నపిల్లలను పెంచి పోషించటమే చేతకాని మనకు మగ పిల్లగాడే కావాలని పట్టెందుకు ? ఆడో, మగో ఇద్దరు చాలనుకున్నాం మేమంతా. అగ్గికి కూడా మగపోరడి కోసం ఎదురుచూడటం ఇష్టం లేదు. నువ్వు జెప్పినట్లు

మగ నలుసుకోసం ఎదురుచూస్తు కూచుంటే, నీ కోడలికైనట్లే ఐదారుగురూ ఆడపిల్లలే పుడితే, అప్పుడేం సేద్దాం ?" అంది కాంతమ్మ. దానితో లచ్చుమ్మ అవాక్కై తెల్లమొహం వేసింది. ఇంకా వాదన పెంచడానికి లచ్చమ్మకు అవకాశం యివ్వకుండా కాంతమ్మ అక్కడ నుంచి తప్పుకుంది.

ఈ సంభాషణంతా వింటూన్న అగ్గి, విసవిసా బయటకు వచ్చింది.

"ఏంటవ్వా, మా అత్తమీద ఎగిరెగిరి పడుతున్నారు ? పిల్లల్ని కనేది నేను, మా ఆయన ఇష్టం, నా ఇష్టం. మధ్యలో మీకెందుకు ? మా చేసిండు గదా, అయ్య ! ఐదుగురాడ పిల్లల్ని కని అందర్ని తలొక చోటా పనుల్లో కుదిర్చి. ఆ డబ్బుతో తాగి తందనాలాడుతున్నాడుగా ? మా ఆయనకు పెండ్లప్పుడిస్తానన్న డబ్బు ఒక్కపైస కూడా ఇవ్వలేదు కదా ! సైకిలు, వాచీ సంగతి సరేసరి. నేను అత్తగారింటికి వచ్చి ఇన్నేళ్ళైనా ఇద్దరుపిల్లల తల్లినైనా ఇటు ఎన్నడైనా చూడటానికి వచ్చారా ? నా పిల్లలకి యింత గౌను గుడ్డయినా తెచ్చారా ? అసలు, నేను బతికున్నానో, చచ్చానో అక్కరబట్టని మీరు, మేము మగ నలుసు లేకుండా చేశామని గోల చేస్తున్నారా ?" దుమ్ము తూర్పారబట్టింది అగ్గి.

"అగ్గీ, నీకు వరంగల్లు నీళ్ళు బాగా వంటబట్టినాయే" అన్నాడు సాంబయ్య.

"ఎన్నడైనా మీ అవ్వ, నోరెత్తిందా ? దానికి నేను, మా అవ్వ ఎంత సెపితే అంత".

"ఔనౌను మా అవ్వకు నోరూ, వాయీ లేదు. గోవుమాలచ్చిమి. అందుకే మీ ఆటలు సాగుతున్నాయి. మేము పిల్లల్ని కనే విషయంలో మీ జోలి, జోక్యం ఏమిటి ? ఒకవేళ నేను మగనలుసు కంటే, ఎవరి దగ్గరైనా జీతానికి కుదిర్చి వేల రూపాయలు నొల్లుకుందామనా ? సారాలో తాగి పొర్లొచ్చని ఆశపడుతున్నావా ? నా పిల్లలమీద నీ నీడకూడా పడనియ్యను" భగ్గుమన్న అగ్గి తండ్రి మీద నిప్పులు చెరిగింది.

తల్లీ, కొడుకులిద్దరూ చేష్టలు దక్కి నిలబడి,

"అన్నా బుక్కెడన్నం తినిపోండని" కాంతమ్మ బలవంతం చేసినా తెల్లె మొహాలేసుకుని వచ్చిన దారే పట్టేరు. ❑





"అన్వేషి"
శ్రీమతి చందనాల సుమిత్రాదేవి,
ఇ.నెం. 5-11-1125, హనుమాన్ నగర్,
హన్మకొండ - 506 009 వరంగల్లు.
ఫోన్ : 552119

# సాధికారత

"అమ్మా ఏంటీ అలా చూస్తున్నావ్ ?" అంది పాపాయి.

"ఏం లేదు నిన్నే చూస్తున్నాను. యన్.సి.సి. (N.C.C.) డ్రెస్‌లో నువ్వు ఎంత బావున్నావో, ఎంత హుందాగా కనబడుతున్నావో చూస్తున్నాను".

"అలాగా నువ్వూ బావున్నావు" అంటూ దగ్గరిగావచ్చి ఓ ముద్దిచ్చి "నే వెళుతున్నానమ్మా' అంటూ సైకిల్‌పై గాలిలో తేలుతూ గాలిలాగా వెళ్ళింది.

ఒక్కసారిగా నేను నా గత స్మృతుల్లోకెళ్ళిపోయాను. అన్నయ్య N.C.C. క్యాప్, క్యాప్‌పై ఎర్రతురాయి నాకెంత ఇష్టంగా ఉండేవో, దాన్ని నాతలపైపెట్టుకొని నేను మార్చ్ చేసేదాన్ని. ఓ అద్భుతంగా, గర్వంగా అనిపించేది ఆ క్యాప్. దానిపట్ల నా ఆరాధనాభావం నాతోపాటుగా పెరిగింది. మా ఆడపిల్లల స్కూల్లో N.C.C. కోర్స్ లేదని తెలిసిన రోజు నేనెంత నిరుత్సాహ పడ్డానో మరే ఆడపిల్లల స్కూల్లోలేదని తెలిసి మరింత నీరుగారిపోయాను. ఆ నిరుత్సాహాన్ని గైడ్‌క్యాంపుల ద్వారా తీర్చుకొని తృప్తిచెందాను. ఒక్క N.C.C.యే కాదు ఏ ఆడపిల్లల బళ్ళో కాంపోజిట్ మాథ్స్ సబ్జెక్టు లేదు. దాని కారణంగా మాలో తెలివికలవాళ్ళున్నప్పటికి ఎవ్వరూ కాలేజిల్లో M.P.C. గ్రూపు తీసుకోలేకపోయారు.

అసలెందుకిలా జరిగింది ? ఇంకా ఏదో ఓ రూపంలో జరుగుతూనే ఉంది. ప్రపంచ మంతటా అన్ని విషయాల్లో జరిగే వివక్ష ఒక ఎత్తు, స్త్రీలపట్లగల వివక్ష మరో ఎత్తు అనుకొంటాను.

నా ఆలోచనల్లోంచి ఒక్కసారిగా ఉలికి పడ్డాను. కథ వ్రాయాలి కదూ. ఏం కథ వ్రాయాలి ? అందులో ఏం ఉండాలి, కథాంశం దేన్ని ప్రతిబింబించాలి, కథ తానుగా ఏం చెప్పాలి ? ఏ అంశాన్నిపట్టి ఏ హృదయాన్ని తట్టి లేపాలి ? ఓహ్ చాలా గజిబిజిగా ఉంది. ఏదో ఒకటి వ్రాయాలా ? ఏదైనా రాయాలా ? రాయగలనా ? ఎన్నో ప్రశ్నలు అక్షయ తూణీరాల్లా అన్ని నా వైపే.

జీవితాన్ని దర్శింపచేసేది, జీవన మార్గాన్ని సూచించేది, సరిచూపేది, సరిదిద్దేది అయిన కథాంశం కావాలి. అది ఒక ప్రశ్ననో లేక ఒక సమాధానాన్నో ఇవ్వాలి కదా ! సముద్రంలో సూది కోసం వెతికినట్టుగా ఉంది నా పరిస్థితి.

ఈ లోగా... "ఏం చేస్తున్నారు" అంటూ పిలిచింది మా పక్కావిడ.

"ఓ... రమా మీరా రండి, రండి. ఏంటిలా... వచ్చారు".

"అబ్బే ఏం లేదండి, ఒకసారి బజారుకెళదాం వస్తారా, చీరలు అవి కొనాలి. మా మరిది గారి పెళ్ళికోసం".

"ఏమి అనుకోకండేం నాకు వీలుగా ఉండేట్లు లేదు. ఇంకెవరినయినా తోడుగా తీసుకువెళ్ళండి..." అంటూండగానే సరేనంటూ వెళ్ళిపోయింది రమ.

హమ్మయ్య అంటూ నిట్టూర్చి, పెద్ద బాధ తప్పింది. ఈవిడతో వెడితే ఇవ్వాళ నచ్చిందంటూ తీసుకువెళ్ళి, రేపు మా వారికి ఈ రంగు నచ్చలేదండీ, ఈ డిజైన్ బావులేదట మార్చుకోమన్నారు, ప్లీజ్ రండీ అంటూ మళ్ళీ తయారవుతుంది.

నిన్న మీకు ఇష్టమని తీసుకెళ్ళారుగా... అంటే అవును నాకు నచ్చింది, కాని మా వారికి నచ్చలేదు అంటుంది.

అలాంటపుడు తనతోనే వెళ్ళొచ్చుగా అంటే తను రారండీ అంటుంది. ఏంటో ఈ గందరగోళం ఆవిడ కట్టుకొనే చీర ఆవిడకు నచ్చాలి, లేదా తనకు నచ్చిన చీర ఆయన తేవాలి. కాని ఆవిడ తెచ్చుకోవాలి, అది ఆయనకు నచ్చాలి కష్టమే మరి.

ఆలోచనల్లోంచి తేరుకొని గబగబా తయారయి ఆఫీస్ కెళ్ళాను. లంచ్ అవర్‌లో మాధురి వచ్చింది తన పెళ్ళికార్డ్ పట్టుకొని.

"అదేంటి మాధురి పెళ్ళికూతురు మొహం కళకళలాడుతూ సంతోషంగా ఉండాలి.. నువ్వేంటి అలా ఉన్నావ్ ?"

"అబ్బే అదేం లేదండి" అంటున్నా తన కళ్ళలో కనీ కనిపించని కన్నీటి తెర, ఆ గొంతుకలో ఏదో ఒక నిస్పృహ, నిరాసక్తత.

"ఏం మాధురి నీకు నచ్చని సంబంధమా..."అంటూ తన చేతిని నా చేతిలోకి తీసుకొన్నా అనునయంగా...

"అలాగని కాదు, కాదని కాదు, కాని పెళ్ళి తరువాత నా ఉద్యోగం మానేయ్యాలట అదే చాలాబాధగా ఉంది. వాళ్ళు ఎంత ధనవంతులైనా, అతనిది ఎంత పెద్ద ఉద్యోగమైనా కష్టపడి చదివి సంపాదించుకొన్న ఉద్యోగం, నా వ్యక్తిత్వం, నా స్వాతంత్ర్యం వదలు

కోవటమే కదా ! సగం చచ్చినట్లుగా ఉంది" అంటూ ఉంటే పెద్ద పెద్ద అందమైన ఆశలు నిండి, కలలుగనే ఆ కళ్ళలోంచి కరిగిన కలల మేఘం తాలూకు బొట్లు టపటపా జారి మా చేతుల్ని తడిపాయి. హృదయాల్ని తడిమాయి.

"కన్విన్స్ చేయలేకపోయావా, అదే ఖచ్చితమైన షరతు అయితే ఆ సంబంధం కాక మరొకటి దొరక్కపోయేదా, నీకేం తక్కువని. అయినా మీవాళ్ళు మంచి ఆలోచనాపరులు కదా, నీ ఇష్టాఇష్టాల్ని, అభిరుచుల్ని గౌరవించే వాళ్ళే కదా...".

"అవునండి... కాని ఈ విషయంలో నాకు ఏమాత్రం కో-ఆపరేటివ్‌గా లేరు. కనీసం అక్కా, అన్నా వీళ్ళు కూడా నన్ను అర్థం చేసుకోవటం లేదు. నాకంటూ ఓ హృదయం, నాదంటూ ఓ జీవితం, జీవనవిధానం ఉందనే ఆలోచనే లేదు వీళ్ళకి. పైగా నా సుఖం కోరే ఈ సంబంధం చేస్తున్నారట. ఇపుడు కాస్త బాధపడినా ఆపై తేరుకొని మహారాణిలాగా దర్జాగా కార్లలో తిరుగుతూ గడిపేస్తానట. నా బాధతో మిమ్మల్ని బాధపెట్టినట్లుగా ఉన్నాను వస్తానండీ, ఇంకా అందరికీ ఇవ్వాలి" అంటూ వెళ్ళింది.

బహుశా కథలన్నీ జీవితాల్ని ప్రతిబింబిస్తాయేమో. అందుకనే సినిమాల్లో అమ్మాయిల్ని అపురూపంగా పెంచుతూ, అడిగినవన్నీ అమర్చి పెళ్ళనగానే అన్నీమరచి కఠినంగా, కసాయి వాళ్ళుగా మారే కన్నవాళ్ళు చేసే బలవంతపు పెళ్ళిళ్ళను చూపుతారు. అమ్మాయిలు వాళ్ళ అంతస్తుల్ని, దర్పాల్ని ప్రదర్శించే అందమైన వస్తువులనుకుంటారేమొ.



"హాయ్ ఇక్కడే ఉన్నారా ?" అంటూ పలకరిస్తూ వచ్చింది కృష్ణవేణి. కృష్ణవేణి నిజంగా నదిలాగే ఉరకలూ, పరుగులూ, ఉత్సాహాలతో గలగలా మాట్లాడుతూ సందడిగా నవ్వుతూ నవ్విస్తుంది. తను వచ్చిందంటే చాలు అందరిని ఒక ఆనందపు అలలో ముంచి వేస్తుంది.

"హాయ్ ఏంటీ నది గారు రూట్ మారింది, ముంచెత్తడమా, తేల్చడమా" అంటూ నేను పలకరించా.

"అబ్బా ! మీరు నా పేరుతో ఎప్పుడు పిలిచారుగనక, సరేగాని సాయంత్రం అలా అలా షికారు కెళదామా మన లెవన్‌నెంబర్ కారులో... ఏదో హస్తకళా ప్రదర్శన ఉందట కొన్ని గిఫ్ట్స్ కొనాలి... వస్తారా ?"

"మీరు ఆహ్వానించడం మేం మన్నించకపోవడమా.. తప్పకుండా. నేనూ కొన్ని కొనాలి" అన్నాను. నేను కృష్ణానది కలసి వెడుతుండగా దార్లో మంజీర కనిపించింది. "ఏమోయ్ నువ్వూ వస్తావా సరదాగా అంతా కలసెలదాం" అన్నాను.

"అబ్బా నేను రాను బాబు. మీరు వెళ్ళండి. అయినా ఏం కావాలన్నా మావారే తెస్తారు. ప్రత్యేకంగా నేను పనికట్టుకు వెళ్ళను" అంది మంజీర.

"తను ఎప్పుడూ ఇంతే. జీతమంతా తీసుకెళ్ళి భర్తకిచ్చేయడం. ఏది కావాలన్నా అతనే తేవడం, ఆఖరికి తనకు కావలసిన గాజులు, బొట్టుబిళ్ళలతో సహా రోజువారీ చార్జీ డబ్బులు కూడా అతనే బ్యాగులో పెడతాడు" అంది కృష్ణవేణి.

తనదంటూ, తనకంటూ ఓ నిర్దిష్టత ఏర్పరచుకోలేక పోయిందా ? లేక అలా ఏర్పరచుకోవడంవల్ల ఏర్పడే యుద్ధరంగానికి వెరసి అలా ఉండిపోయిందా ? నిజంగా తనంటూ, తనకంటూ కొంతైనా తన జీవితాన్ని అనుభవించాలని ఎవరికుండదూ... తను లోలోపల లోతుల్లో అసంతృప్తిని కలిగి ఉండదా... ?

"ఏయ్ అంత పరధ్యానమా, కాస్తయితే ఆ స్కూటర్ తగిలేది తెలుసా" అంటూ నన్ను ప్రక్కకు లాగింది కృష్ణవేణి.

"ఆ ఏం లేదు మంజీర గూర్చే ఆలోచిస్తున్నా".

"ఇంకా తను నయం. పద్మిని గూర్చి ఆలోచిస్తేనే నాకు మరి రోతగా అనిపిస్తుంది. చక్కగా చదివింది, ఉద్యోగం చేస్తుంది. అయినా ఏం లాభం. ఎప్పుడన్నా ఆలోచించిందా ? కనీసం ఎవరైనా ఏమనుకొంటారని, అబ్బే ఏం లేదు, మనలాంటివారు ఏమన్నా... నిర్వికారంగా 'అదంతే' అంటుంది" అంది కృష్ణవేణి.

"ఎవరూ, నీతో పనిచేస్తుంది ఆ పద్మిని గూర్చేనా ? పిల్లల్ని కనడంలోనే స్వతంత్రం లేదాయే. కొడుకుకోసం వాళ్ళాయన కోర్కెతీర్చడంకోసం ప్రాణంమీదకు తెచ్చుకొని మూడు సిజేరియన్లు, ఐదుగురి పిల్లల తల్లి అయ్యింది కదూ ? ఇంకా ఏంచేయాలి తను" అన్నాను నేను.

"అది జరిగిన కర్మ. మొన్న బస్టాపులో మనం నిలబడతామే అక్కడి హోటల్ ఆవిడ ఆదిలక్ష్మి లేదూ... ఆమె నాతో ఏమందో తెలుసా ?"

"ఏమంది... !"

"ఏమండీ మీతో పనిచేస్తుందే ఆవిడ పర్స్‌లో డబ్బులు తెచ్చుకోదాండీ" అంటూ ఆరా తీసింది. ఎందుకంటే మొన్న డబ్బుల్లేవంటూ బస్‌చార్జీకి డబ్బులడిగింది" అంది ఆదిలక్ష్మి.

"అదేంటి తను వాళ్ళాయన బండిమీద వెడుతుంది కదా !"

"అతని బండి పాడయ్యిందట అందుకని బస్‌లో వెళ్ళాలని" అడిగిందది.

"బహుశా మర్చిపోయిందేమో, అప్పుడప్పుడు అలా అవుతుందిలే. నేను మరిచి పోతాను ఒక్కోసారి'' అన్నాను కాస్త తీవ్రంగా.

"అదేం కాదండీ ఇలాగే రెండు మూడుమార్లు జరిగింది. ఉద్యోగం చేస్తుంది కదా... తప్పుగా అనుకోకండమ్మా వెళుతూ, వచ్చేవాళ్ళవద్ద కాసిన్ని డబ్బులుండాలి కదమ్మా'' అంది ఆదిలక్ష్మి.

ఆ రోజే నే పద్మినిని అడిగితే "అబ్బా ఇంత చిన్న విషయానికేనా... నువ్వు కోపంగా ఉంటే... మరేంటో అనుకున్నా. అయినా తనే తీసుకువెళతాడు ఇంటిదగ్గర దింపుతాడు గదా... డబ్బుతో నాకేం పని'' అంది పద్మిని.

"అరే మాటల్లోనే వచ్చేసామే. త్వరత్వరగా సెలక్షన్ కానివ్వాలి. ఇంతకీ ఎవరి కోసమేంటి'' అన్నాను నేను.

"ఇంకెవరి కోసం మా శ్రీవారి కోసమే తన బర్త్ డే కోసం తనలాగే సర్ప్రైజ్ గిఫ్ట్ ఇవ్వాలని' అంది కృష్ణవేణి.

"మీ ఇద్దరిని చూస్తే ఈర్ష్యగా ఉందోయ్'' అన్నాను నేను. తన కళ్ళలో ఓ కాంతిరేఖ తళుక్కున మెరిసి మాయమైయ్యింది.

"నిజమేనండీ అర్థం చేసుకోవడంవల్లనే కదా అనురాగం పెరిగి ఆత్మీయత గాఢమై బంధం మరింత ధృఢమయ్యేది''.



గేట్ తాళం తీసి ఇంట్లోకాలు పెట్టానో లేదో "తొందరగా గిన్నె లెయ్యండమ్మగారు'' అంటూ ఊడిపడింది పనావిడ.

"అదేంటి సమ్మక్క ఇవేళ ఇంత తొందరగా వచ్చావు ? అయినా ప్రొద్దున రాలేదేంటి ? నాకెంత ఇబ్బందో నీకు తెలియదా ?'' అన్నాను కాస్తతీవ్రంగా. ఏ సమాధానం రాకపోవడంతో ఇంటి వెనక్కి వెళ్ళేసరికి నిశ్శబ్దంగా ఏడుస్తున్న సమ్మక్క కనిపించింది.

"ఏంటీ ఎందుకేడుస్తున్నావ్ ? మళ్ళీ గొడవపడ్డారా ? అయినా ఇది మామూలేగా'' అన్నాను కాస్త ఈసడింపుగా.

"ఏం చేసేదమ్మా మీలాగ చేసేవాళ్ళ నాలుగిళ్ళల్లోంచి అప్పుతీసికెళ్ళి, ఆడ ఈడ తెచ్చి ఆటో తెచ్చామా, అదీ అమ్మేసాడమ్మా. ఎందుకమ్మావు అంటే నా ఇష్టం అంటాడు. అప్పెలా తీరుస్తావు అంటే నువ్వు తెచ్చావు, నువ్వే తీర్చుకో అన్నాడమ్మా''.

"ఆటో అమ్మేసాడా ? అంత అవసరమేమొచ్చింది ? ఏం చెప్పేదమ్మా ? తాగుడు, తినుడు, తిరుగడం అంతే. నా బ్రతుకంతా ఇంతే".

"ఆ... నువ్వు భరించినంత కాలం ఇంతే !"

"ఏం చేసేదమ్మా వదిలేద్దామన్నా విడిచిపెట్టడు, కోపం పట్టలేక ఈ రోజు వాడు కట్టిన తాడు తెంపి వాని మోహనకొట్టినా... వెళ్ళిపొమ్మంటూ అయినా నన్నే నాలుగు తన్ని, తిట్టి మళ్ళీ నా మెళ్ళో కట్టాడు. ఆపై నే చేసేదేముంది. నే చచ్చేదాకా వాడు నన్ను వదలడు. నలుగురి పిల్లల్ని వదిలి నే చావలేను. ఏ పాపం చేసిన్నో ఏమో నా కర్మమిట్లా కాలింది".

"సరే సరే నీ పనేదో కాని, మా అప్పులు మాత్రం ఇబ్బంది పెట్టక తీర్చు..." అంటూ ఇంట్లోకెళ్ళి పనిచేసుకుంటున్నా అన్యమనస్కంగానే ఉంది. తన సమస్యకు సమాధానం ఏమిటి ?

"అమ్మా ఎవరొచ్చారో చూడు ?" అన్నాడు బాబు. ఎవరబ్బా... అని చూస్తే మా ఆడ బడుచు కొడుకు.

"అత్తమ్మా బావున్నారా" అంటూ పలకరించాడు శ్రీకర్.

"ఆ బానే ఉన్నాం, మీ అమ్మవాళ్ళంతా బావున్నారా ? ఏంటీ విశేషం" అన్నాను.

"అబ్బే ఏం లేదత్తమ్మా, మొన్న మనం చూసి వచ్చామే ఆ అమ్మాయి శ్రీలత లేదు, వాళ్ళకంటే వేరేవాళ్ళు ఎక్కువ కట్నం ఇస్తామని వచ్చారు అందుకని...".

"ఆ అందుకని..."

"ఈ అమ్మాయి వాళ్ళు అంత ఇవ్వగలిగితే..." అంటూ నాన్చాడు శ్రీకర్.

"ఏం పిల్లాడివయ్యా ? అమ్మాయి నీలా ఉద్యోగం చేస్తుంది. అయినా నీకు కట్నం ఇవ్వాలా ? నీకు అమ్మాయి గుణగణాలు, చదువు ముఖ్యమా ? డబ్బు ముఖ్యమా ? ఇలాంటి విషయాలయితే నాతో మాట్లాడొద్దు, నాకు బావుండదు, నా సమాధానం మీకు బావుండదు".

"అది కాదత్తమ్మా ఒక్కసారి ఆలోచించమంది అమ్మ, లక్ష రూపాయలు అంటే మాటలా..."

"చూడబ్బాయి నీకు, మీ అమ్మకు ఆలోచనల్లో తేడాలేకపోవడం ఆశ్చర్యంగా ఉంది ! లక్షణాల్ని లక్షలతో పోల్చే నీ ఎకనామిక్స్ జీవితంలో డబ్బును పెంచుతుందేమో కాని.. పోనీలే... మీకెలా తోచితే అలా చెయ్యండి" అన్నాను నేను.

"మామయ్య వచ్చేలోగా మళ్ళీ వస్తానండీ" అంటూ వెళ్ళాడు శ్రీకర్.

"అమ్మా నీ పెళ్ళికి కూడా కట్నం ఇచ్చారా ? ఎంతిచ్చారమ్మా ?" అన్నాడు మావాడు.

అసలే మంటగా ఉంటే అగ్నికి ఆజ్యంలా వీడు, వీడి ప్రశ్నలు, "వాళ్ళెలా ఉందిరా... ? నాలుగు తగిలించానంటే..." అన్నాను.

"అది కాదమ్మా... అంటూ ముందు జాగ్రత్తగా నాకు కాస్త దూరం జరిగి మా సోషల్ బుక్‌లో కట్నం ఇవ్వటం, తీసుకోవటం నేరమని, జైలుశిక్ష, జరిమాన పడతాయని ఉంది అందుకని...".

"చట్టాల్ని పాటించే మనుష్యులు లేనంతకాలం, వాళ్ళు ఎదగనంతకాలం ఇంతే... పో పోయి చదువుకో తీరిగ్గా ఉన్నప్పుడు చెబుతాలే...".

"నువ్వెప్పుడూ ఇంతే" సణుగుతూ వెళ్ళాడు బాబు. నాలో నే అనుకొన్న చట్టాలపట్ల వీడికున్న ఈ పసితనపు గౌరవాన్ని ఎలా నిలబెట్టేది ?



విసుగ్గా ఉందని కాస్త రిఫ్రెష్ అవుదామని టి.వి. ఆన్ చేసా. టి.వి.లో ఏదో ప్రకటనో, నినాదమో మహిళా సాధికార సంవత్సరం, ఈ సంవత్సరం, ప్రతి సంవత్సరం. నాకు మరింత తిక్కగా అనిపించింది. నా అశాంతి మరింతగా పెరిగింది. ఉదయం నుండి జరిగిన సంఘటనలన్నింటి రివ్యూను ఈ ప్రకటనతో పోల్చితే...

సాధికారత అనేది విద్య, ఉద్యోగం(ఆర్థికత)వల్ల పొందపచ్చా ? అనే ప్రశ్నాభూతం నన్ను వెక్కిరిస్తున్నట్లుగా తోచింది.

నా ముందు తరం వాళ్ళకు చాలామందికి విద్య, ఉద్యోగం రెండూ లేవు. అంటే వాళ్ళ కున్న (తెలిసిన) పరిజ్ఞానం విద్య కాదా ? పుస్తకాల్లోదే విద్యా ? వారు ఇంటిలో చేసే శ్రమకు అంటే ఆర్థికరూపం లేని శ్రమకు విలువ లేదా ?

ప్రస్తుతం విద్యా, ఉద్యోగం రెండూ ఉన్న మా తరం సాధికారంగా, సగర్వంగా, స్వశక్తిని కలిగి ఉన్నామా ? యుగయుగాలుగా ఓ ప్రక్కన అణచివేత జరుగుతూనే ఉన్నా మరో ప్రక్క లేవనెత్తాలనే ప్రయత్నమూ ఉంది. ఏది సమర్థవంతంగా జరిగిందో జగమెరిగిన సత్యం... !

నా స్థితి మార్పులో, నా ఆర్థికపర్వంలో, నా ఎదుగుదల సహకారాలతో తన్ను లేవ నెత్తుకోవాలని, తాను మరింత సౌకర్యం పొందాలని, నన్ను మరింతగా ఉపయోగించుకోవా లన్నదే ప్రపంచ తత్వం అని తెలియనంత అజ్ఞానిని కాను. అనివార్యంగానో, అవసరార్థమో

తప్పనిసరిగా ప్రపంచానికీ నేను మరింత ప్రగతి సాధించాల్సిన అగత్యం ఏర్పడింది. వారి ఈ అవసరం కనీసం నన్ను కాస్త కళ్ళు తెరవనిస్తుంది కదా, నా గాఢాంధకార జీవితంలో ఓ జ్ఞాన జ్యోతి కిరణాన్ని ఆహ్వానించాలని ఆ వెలుగును స్పృశించాలనే తపన నాకు లేకపోలేదు.

అయినా నా సమస్యకు అంతం అనేది లేదు. నా ఉద్ధరణ అనేది ప్రపంచానికి ఒక సజీవ యక్షప్రశ్న అయికూర్చుంది. ప్రపంచానికి నా ప్రగతి ఒక ప్రశ్నగా, తాను జవాబుదారిగా ఎందుకు మారాల్సి వచ్చిందో ?

ప్రశ్నకి మూలం ఎక్కడో ఎవ్వరైనా కనుగొన్నారా ? కనీసం నేనైనా నా కోసం నేను ప్రశ్న మూలాన్ని స్పృశించే ప్రయత్నం చేశానా ?

సాధికారత ఎలా వస్తుంది ? ఎవరికి వస్తుంది ? అది వాయినం ఇస్తే పుచ్చుకొనేదా ? దానికి అధికారత ఉందా ? అధికారం వ్యక్తులకు, వ్యక్తిత్వాల కూర్పుకు, మెరుగైన ఆలోచనలకు, మెలకువ నేర్పుకు ఉంటుంది.

అసలు నన్ను నేను వ్యక్తిగా భావించుకొంటే నా భావనకు బలాన్ని, నా ఇష్టాల్ని నేను ఏర్పరచుకొంటే, నా లోపాల్ని సవరించి, బలహీనతల్ని జయించి, నా సామర్థ్యాన్ని గుర్తించి నా తలను నేను ఎత్తగలిగితే, నా జెనిటిక్ కోడ్‌ను సంపూర్ణంగా నేను మార్చుకోగలిగితే ...

ఎందుకంటే యుగయుగాలుగా నేను అదేశింపబడ్డాను, అణచబడ్డాను. ఎంతగా అంటే నేనొక స్త్రీగానే మిగిలాను. ఒక సుషుప్తిలోంచి, ఒక సజీవ సమాధి నిద్రలోంచి నన్ను నేను లేవనెత్తుకొని, నన్ను నేను ఒక స్త్రీగా... ఒక ఛాయగా కాక ఒక వ్యక్తిగా, ఒక మనిషిగా మార్చుకొని గుర్తించగలిగితేనే అది సాధ్యం. నన్ను నేను గౌరవించుకొని నా విలువను నేను గుర్తెరగనంత కాలం నాకు గౌరవం, విలువ ఎలా లభిస్తాయి.

యుగ యుగాల నా మూస స్వరూపాన్ని, మూర్తిమత్వాన్ని నేను ప్రస్తుతం ధిక్కరించ గలిగితే నాతో నేను నా పరాధీనతపై పోరాడగలిగితే, స్వావలంబన దిశగా, స్వశక్తి తేజో రూపంగా మారితే *'నా నూత్న జీవన శిల్పానికి శిలను, ఉలిని, శిల్పిని నేనైతే'* మార్పు అనివార్యం. ఒక ప్రళయాన్ని అనుభవిస్తేనే కదా ఒక ప్రణవరాగం పరిఢవిల్లేది. భూమి పొరల్ని ఛేదించే కష్టానికి ఓరిస్తేనే కదా విత్తు విశాల ప్రపంచాన్ని స్పృశించేది, వెలుతురు కిరణాల్ని అనుభవించేది... ❑



# About "Srilekha Sahiti"

A poet or writer needs a forum to present his ideas and display his artistry with words. Srilekha Sahiti has been providing the much needed forum to the amateur poets in and around Warangal, for the last 25 years.

Srilekha Sahiti was established in the year 1977. Apart from conducting literary programmes, Srilekha Sahiti took the responsibility of publishing Anthologies of poetry also on its shoulders. This is a boon to many an aspiring writer.

Srilekha Sahiti has been bringing out one volume of poems by different writers on Ugadi, the Telugu New Year day. Till date, eight such volumes were published by Srilekha Sahiti. They are Prabhava (1987), Shukla (1989), Pramodhootha (1990), Prajotpathi (1991), Eeshwara (1997), Pramadi (1999), Vikrama (2000) and Vrusha (2001). Besides Ugadi poetry collections, Srilekha Sahiti has also published Ekashila Vythalikulu (1991) Essays and Srilekha anthology of Stories (2002) alongwith 22 other publications also to its credit.

The countless literary meets and conferences organized by Srilekha Sahiti were successfully bringing together writers, readers and other intellectuals. They set the stage for exchange of ideas and discussions on literature.

Srilekha Sahiti organised "Ashtavadhana Saptaham" in the year 1996.

Ashtavadhanam is a mind bending literary and intellectual feat exclusive to the Telugu language and literature. There are many stalwarts in the present day literature who are experts in Ashtavadhanam. Srilekha Sahiti's efforts were highly successfull in bringing out the best in the experts Ashtavadhanam's and displaying their skills to the humble lovers of literature.

The present endeavours of Srilekha Sahiti to bring out a collection of short stories is quite laudable. This volume will certainly be another sparkling gem in its glittering crown.

- D. Krishna Kumari

Hyderabad





అనిశెట్టి రజిత
శ్రీదాస్యం లక్ష్మయ్య
"కిషోర్"
నంబూరి పరిపూర్ణ
జి. విజయలక్ష్మి
ధపూ్వారి శ్రీధరాచార్య
డా॥ నల్ల యాదగిరి
వరిగొండ కాంతారావు
డా॥ కె.యల్.వి. ప్రసాద్
శ్రీగిరిరాజు విజయలక్ష్మి
మేడిచర్ల సూర్యప్రకాశరావు
గుండెబోయిన శ్రీనివాస్
రంగు చక్రపాణి
రాపాక పవన్‌స్వరూప్
ఇనపకుర్తి చినసత్యనారాయణ
ఎ. నాగేశ్వరరావు
నామని (క్యాతం) సుజనాదేవి
కురిమిండ్ల సృజన
మండువ వెంకట ప్రసన్న
రేగులపాటి కిషన్‌రావు
ఇ. అయిలయ్య
డా॥ డి. భిక్షపతి
నెల్లుట్ల రమాదేవి
ఎ.వి. అనిల్ ప్రసాద్
వై. (నిమ్మటూరి) విజయలక్ష్మి
శంకర్‌రావు శెంకెసి
డా॥ టి. శ్రీరంగస్వామి
మరింగంటి యాదగిరాచార్యులు
అన్నవరం దేవేందర్
కొలకలూరి (నడకుర్తి) స్వరూపరాణి
దార్ల రామచంద్ర
"ఎమ్మెస్సార్"
పోడూరి కృష్ణకుమారి
కె. సూర్యముఖి
"అన్వేషి"